ఓం
శ్రీ లక్ష్మీ హయగ్రీవాయ నమః.

# అపరప్రయోగచన్ద్రికా

సంకలనకర్త

డా. తిరుమల కృష్ణదేశికాచార్యులు

శ్రీజయలక్ష్మి పబ్లికేషన్స్
ప్లాట్ నం: 97 & 98 c, వెస్టర్న్ హిల్స్, జలవాయు విహార్
రోడ్, కూకట్ పల్లి, హైదరాబాదు- 500072

అపరప్రయోగచన్ద్రికా
ప్రథమముద్రణ - 2005, ప్రతులు: 500
మూల్యము - 180 రూపాయలు


ప్రకాశకులు
శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్స్
ప్లాట్ నం: 97 & 98c, వెస్టర్న్ హిల్స్
జలవాయు విహార్ రోడ్, Opp. KPHB
కూకట్ పల్లి, హైదరాబాదు - 500072

డిస్ట్రిబ్యూటర్స్
శ్రీ గోపాల్ పబ్లికేషన్స్
3-3-860, ఆర్యసమాజ్ ఎదురు సందులో,
కాచిగూడ, హైదరాబాదు - 500029
ఫోన్స్: 24658101, 55830529

ముద్రణ
శ్రీ కళాంజలి గ్రాఫిక్స్
విఠల్ వాడి, హైదరాబాదు - 500029
ఫోన్స్: 23224831

# మున్నుడి

*"యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।*
*స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥"* - భగవద్గీత

"మానవుడు తనకు విహితమైన కర్మల నిష్ఠతో నాచరించుట ద్వారా సర్వజీవులకు మూల కారణమైనవాడును, సర్వవ్యాపియు నైన పరమాత్ముని అర్చించినవాడై కృతార్థుడగును" - అని భగవద్గీత చెప్పుచున్నది. ఇక్కడ కర్మలనగా, మానవుడు ఉదరపోషణకొఱకై చేసెడి లౌకిక కర్మలు గాదు. అవి యుండనే యుండును. కర్మలనగా నిక్కడ శాస్త్రములచేత, స్వవేదశాఖోక్త మైన గృహ్యసూత్రములచేత విధింపబడి, భగవదారాధనరూపకముగా చేయవలసిన నిత్య నైమిత్తికకర్మలని యర్థము. జననాదిమరణాంతము చేయు కర్మలు, మరణానంతరము పితృ దులకు భక్తిప్రపత్తులతో జేయు ఔర్ధ్వదైహికకర్మలు - అని ఇవి రెండు రకములు. ఈ కర్మలు చేయు పద్ధతులను వివరించు గ్రంథములకు వరుసగా, "పూర్వప్రయోగము", "అపర ప్రయోగము" అని పేరులు.

*విష్ణుం శివం వా భజతాం, గురోః పిత్రోశ్చ సేవినాం,*
*గోవైష్ణవ మహాశైవ తులసీ సేవినామపి,*
*వస్మాత్కాలికృతో దోషః కాశ్యాం నివసతామపి,*
*కలౌ గురూణాం భజన మీశభక్త్యధికం స్మృతమ్॥*

"విష్ణువును గాని శివునిగాని పూజించువారికి, గురువులను, పితరులను సేవించువారికి. విష్ణుభక్తులను, శివభక్తులను, గోవును, తులసిని ఆరాధించువారికి, కాశిలో (భక్తిప్రపత్తులతో) నివసించువారికిని కలిపాపములంటవు. కలియుగమునందు గురువులందు, దేవునియందును భక్తి అధికముగా నుండవలెను" - అని పై శ్లోకమున కర్థము. చిట్టచివరి గురుశబ్దమునకు, విద్యా దాతలగు గురువులే కాక, తల్లిదండ్రులును - అని యర్థము. ఈ తల్లిదండ్రుల సేవ వారు జీవించి యున్నప్పుడే కాక, వారి మరణానంతరము గూడ వారికి శ్రద్ధాభక్తులతో దహనసంస్కారాదు లను చేయుట ద్వారా, ప్రత్యాబ్దికశ్రాద్ధమును, పితృతర్పణాదులను సకాలములో శ్రద్ధతో, భక్తితో నల్పుటవల్ల ఆచరింపవలెనని దీనికి విశేషార్థము. ఈ సంస్కారవిధానములు, శ్రాద్ధతర్పణ

విధానములు ఆయా వేదశాఖలకు చెందిన గృహ్యసూత్రకారులచేత నిర్దిష్టములై ఆచరింపబడుచున్నవి. ఈగ్రంథములో నేను కృష్ణయజుశ్శాఖాధ్యాయులును, ఆపస్తంబసూత్రానుయాయులును ఐన శ్రీవైష్ణవుల కాచరణీయమైన ఔర్ధ్వదైహికకర్మలు వివరించితిని.

ఈ గ్రంథసంకలనము నేనెప్పుడూ అనుకోని విధముగా, యాదృచ్ఛికముగా జరిగినది. 1998 సంవత్సరములో మాతండ్రిగారు పరమపదించిరి. ఆ సందర్భములో మా మేనమామ గారు శ్రీమాన్ శాపురం రామాచార్యులవారు కర్మ చేయించిరి. వారివద్ద అతిశిథిలావస్థలో నున్న "అపరప్రయోగ"గ్రంథముండెను. దాని అవస్థకు చింతించి, అంతకంటె స్వస్థతగా నున్న "అపరప్రయోగ"గ్రంథములేమైన దొరకునాయని చాలా అన్వేషించితిని. కాని అట్టిదేదియు మార్కెటులో నాకు లభింపలేదు. కాని ప్రస్తుతము ముద్రణలో లేని రెండు గ్రంథముల ప్రతులు నాకు లభించెను. అందు మొదటిది బెంగుళూరులోని వైష్ణవసభకు కార్యదర్శులైన శ్రీమాన్ స.మా. కృష్ణమాచార్యులు కన్నడలిపిలో, కన్నడవివరణతో రచించిన "అపరప్రయోగః" - అను గ్రంథము. రెండవది కాకినాడకు చెందిన శ్రీమాన్ కందాడై శ్రీనివాసాచార్యులు తెలుగు వివరణతో ప్రచురించిన "అపరప్రయోగానుక్రమణిక" యను గ్రంథము. ఇవి రెండును ముఖ్యముగా "ప్రయోగదర్పణము", "పితృమేధసారము" - అను పూర్వగ్రంథములపై ఆధారపడి సంకలనము చేసినవి. ఇవి ఇప్పుడు ముద్రణలో నుండకపోవుటయే కాక, అసమగ్రముగను, కొంతవఱకు లోపభూయిష్ఠముగను ఉన్నవి. ఉదాహరణకు "అపరప్రయోగానుక్రమణిక"లో ప్రయోగమునకు పక్కని తెలుగు వివరణమున్నను, మంత్రములకు స్వరములు లేవు, ప్రేతకు చేయవలసిన వివిధప్రాయశ్చిత్తములన్నియులేవు, బ్రహ్మమేధసంస్కారపద్ధతిగాని నారాయణ బలిగాని లేదు. శ్రీమాన్ కృష్ణమాచార్యులవారి గ్రంథములో ఇవి యున్నను, ప్రయోగమునకు వివరణ సమగ్రముగా లేదు, మంత్రములకు స్వరములున్నను,ముద్రణకారుని అజాగ్రతవల్ల వాని నిర్దేశము సక్రమముగా లేదు. ఇట్లు కొన్ని లోపములున్నను, ఈ గ్రంథకర్తల శ్రమ శతధా ప్రశంసనీయమని చెప్పక తప్పదు. ఆస్తికలోకమెల్లను వారి కృషికి ఋణపడియున్నది.

నా యీ గ్రంథమును పై రెండు గ్రంథములను సమన్వయించి సంకలనము చేసితిని. ఈ రెండు గ్రంథముల విషయములలో భేదము లున్నప్పుడు వీనికంటె ప్రామాణికమైన "పితృమేధసార"ప్రోక్తమైన విధానము ననుసరించితిని. అవసరమైన చోట్ల ఆపస్తంబ,బోధాయనగృహ్య సూత్రములను,ధర్మసింధువును,పూర్వప్రయోగమును, ప్రయోగదర్పణమును, కంఠభూషణ మను ధర్మశాస్త్రగ్రంథమును పరిశీలించితిని. వేదమంత్రములు, వాని ప్రామాణికస్వరనిర్దేశముల విషయములో 19వ శతాబ్దిలో మైసూరు మహారాజావారి ఓరియంటలు రిసర్చి లైబ్రరీవారు

బ్రహ్మశ్రీ మహాదేవశాస్త్రి, పండితరత్నం రంగాచార్యులవారి పర్యవేక్షణలో ప్రమరించిన తైత్తిరీయసంహితారణ్యకములను ప్రమాణముగా గొంటిని. ఇట్లు నా యల్పబుద్ధికి సాధ్యమైనంత విపులప్రయోగవివరణలతో, మంత్రములు పునరుక్తమగుచోట వానిని పూర్తిగా నిచ్చుచు, ఈ కాలమువారికి ఉపయుక్తమగునట్లుగా ఈ గ్రంథమును సంకలనము చేసితిని. ఎంత జాగ్రత వహించినను ఇందులో కొన్ని దోషములుండియే యుండును. పండితులు వీనిని నాదృష్టికి తెచ్చినచో వారికి మిక్కిలి కృతజ్ఞుడనౌదును. దీనికి అనుబంధముగా "శ్రాద్ధప్రయోగ"మను మఱొక గ్రంథమును సంతరించితిని. సపిండీకరణానంతరము వచ్చు మాసికములు, ప్రత్యాబ్దికములు, దర్శాదితర్పణములు ఆచరించు విధాన మీగ్రంథములో తెలుగువివరణతో గూడ సంకలనము చేసితిని.

సర్వత్ర సంస్కృతప్రయోగమునకు తెల్గులో సమగ్రవివరణము వ్రాసితిని. మంత్రములు వచ్చినను సంస్కృతభాషాజ్ఞానము కొరవడుటచే పైతృకకర్మ నాచరింపలేని వారికిది మిక్కిలి ఉపయోగకరముగా నుండగలదు. మంత్రములు వచ్చి సంస్కృతప్రయోగార్థము పూర్తిగా నవగాహన కాకున్నను గోష్ఠిదాటుగా పైతృకకర్మను జరిపించుచున్నటువంటి వారికిని ఇది ఉపయోగపడగలదు. వీరేకాక కేవలము ప్రయోగమును తెలిసికొను వాసక్తి యున్న పామరులకును ఇది ఉపయోగపడగలదని నా ఆశయము. రానురాను సంస్కృతజ్ఞానము సన్నగిలుచున్న ఈ కాలములో నిట్టి వివరణము అవశ్యకమగుచున్నదనుటలో సందియము లేదని చెప్పవచ్చును. ఈ ప్రయోగము కృష్ణయజుశ్శాఖాధ్యాయులైన శ్రీవైష్ణవుల పద్ధతి ననుసరించినను, ఇతరశాఖలవారికిని ఇది సమాచరణీయము, సమాదరణీయము కాగలదని నా విశ్వాసము.

*"యన్నామ్నాతం స్వశాఖాయాం పరోక్తమవిరోధి చ/*
*విద్వద్భిస్తదనుష్ఠేయ మగ్నిహోత్రాదికర్మవత్//"*

అనగా "స్వశాఖలో అనుక్తమగు విషయమేదేని అన్యశాఖోక్తమైయున్నచో, అవిరుద్ధమగునంతవఱకు దానిని అన్యశాఖలనుండి స్వీకరించి అనుష్ఠింపవచ్చును" - అను శాస్త్రవచనము లున్నందువలన ఈ గ్రంథమునందలి విషయములు అన్యశాఖీయులకును ఉపయుక్తము కాగలవని నా నమ్మకము. పైతృకకర్మను సక్రమముగా,యథాశాస్త్రముగా నాచరించుటకు కొంతవఱకైనా ఈ గ్రంథము తోడ్పడిన నా యత్నము కృతార్థమైనట్లుగా నేను భావింతును.

విన్నిపెగ్, కెనడా
తారణసంవత్సరశ్రీరామనవమి

ఇట్లు బుధజనవిధేయుడు
తిరుమల కృష్ణదేశికాచార్యుడు

# విషయసూచికా

# ముమూర్షుదశాయాం కర్తవ్యాని

*యస్యా౽భవద్భక్తజనార్తిహంతుః పితృత్వమన్యేష్వవిచార్య తూర్ణమ్।*
*స్తంభే౽వతారస్తమనన్యలభ్యం లక్ష్మీనృసింహం శరణం ప్రపద్యే॥*

ప్రతివైదికకార్యమునందును కర్త స్నానము చేసి, ఊర్ధ్వపుండ్రములను ధరించి, (వివాహితుడైనచో) ధోవతిని ధరించి, కర్మాచరణము చేయవలెను. అయాకర్మలయందు ప్రదక్షిణము, ప్రణామము, ప్రాణాయామము ఉపవీతితో చేయవలెను. పితృకార్యములను ప్రాచీనావీతితో చేయవలెను. దేవకార్యములందు రెండు దర్భలతో చేసిన పవిత్రమును, పితృకార్యములందు మూడుదర్భలతో చేసిన పవిత్రమును ధరింపవలెను. ప్రథమదినమునందు ప్రేతసంస్కారము చేయునప్పుడు ఒకే దర్భతో చేసిన పవిత్రమును ధరింపవలెను. అట్లే ద్వితీయదినము నుండి సపిండీకరణపర్యంతముగూడ ప్రేతకార్యములందు ఒకే దర్భతో చేసిన పవిత్రమును ధరింపవలెను. సపిండీకరణమునందు పితృపితృపితామహప్రపితామహహోమాదికార్యములందు మూడుదర్భలతో చేసిన పవిత్రమును ధరింపవలెను. ప్రేతశబ్దరహితమైన సర్వపితృకార్యములందును మూడుదర్భలతో చేసిన పవిత్రమును ధరింపవలెను. వైదికకర్మలను కర్త శ్రద్ధాభక్తులతో భగవదారాధనాత్మకముగా చేయవలెను. అట్లే అన్ని కర్మలను సాత్త్వికత్యాగ పురస్సరముగా చేయవలెను.

ఈ అధ్యాయములో చెప్పబడు జీవప్రాయశ్చిత్తమును, ఉత్క్రాన్తిగోదానమును, కర్ణమంత్రజపమును, శ్రీమార్గపరిపాలనను ఉపవీతితో, పసుపు అక్షతల నుపయోగించియే చేయవలెను. జీవప్రాయశ్చిత్తమును, ఉత్క్రాన్తిగోదానమును మరణాసన్నుడైన వ్యక్తి స్వయముగా గాని, లేదా ధర్మశాస్త్రరీత్యా అర్హుడైన కర్తగాని చేయవచ్చును. కాని కర్ణమంత్రజపమును, శ్రీమార్గపరిపాలనను అర్హుడైన కర్తయే చేయవలెను. ప్రథమదినమున అగ్నిసంధానము మొదలుకొని దశమదినమున శాన్తిహోమపర్యంతముగల కార్యములను కర్త ప్రాచీనావీతితో అక్షతలకు మాఱుగా నువ్వుల నుపయోగించి, శ్రీమార్గరహితముగా తిరుమణిని మాత్రము ధరించి చేయవలెను. అగ్నిసంధానము చేసినతర్వాత ఆ యగ్నిలోనే అవసరమైన ప్రాయశ్చిత్తములన్నియు చేసి, తదుపరి అదే అగ్నితో దహనసంస్కారమును చేయవలెను.

*మరణదినమున పాటింపవలసిన కొన్ని విషయములు:*

1. మరణించిన వెంటనే ఒక దీపమును వెలిగించి, శవముయొక్క తలవైపు పెట్టవలెను. పుత్రాదిజ్ఞాతులు ఉత్తరీయసహితులై, ప్రాచీనావీతిని చేసికొనియు, స్త్రీలు కేశములను విఱబోసికొనియు దక్షిణాభిముఖులై శవమునకు నమస్కరింపవలెను.
2. సాధ్యమైనంతవఱకు కర్తలు భోజనము చేయకుండగనే కర్తమంత్రమును చెప్పుట యుక్తము. అందుచేత, మరణము సంభవించుట అవశ్యమనిపించినచో, కాలాతిక్రమణ మైనను కర్తలు భుజింపకుండా ఉండవలెను. ఒకవేళ భోజనానంతరము మరణము సంభవించి, ఆనాడే దహనసంస్కారము జరిగినచో, ఆనాటి రాత్రి మృతుని పుత్రులు భోజనము చేయకూడదు. ఒకవేళ సంస్కారము మఱురోజు జరిగినచో, ఆనాడు పుత్రులు పగలు భోజనము చేసినచో రాత్రికి ఫలహారాదులను మాత్రమే స్వీకరింపవలెను. విశేషముగా, మరణాది సంవత్సరపర్యంతము పుత్రులు ఏకభుక్తమునే చేయవలెనని శాస్త్రము - అనగా పగలు సుష్ఠుగా భుజించినయెడల, రాత్రికి ఫలహారాదులు మాత్రమే తీసుకొనవలెను.
3. పురుషుడు మరణించినప్పుడు అతని భార్యయే అతని శిరస్సుపై అక్కమును, నలుగు పిండిని పెట్టుట జరుగుచున్నది. కాని అతని భార్య అతనికంటె ముందుగనే గతించినచో, అతని కుమార్తెలుగాని కోడండ్రుగాని (వారు జీవంతువు లైనప్పటికి) ఈ కార్యమును చేయవచ్చును.
4. ఒక స్త్రీ సుమంగళిగా (అనగా భర్త జీవించియుండగనే) మరణించినచో, దహనమునకు ముందే ఇతరసుమంగళులచేత రోటిలో పసుపుకొమ్ములను దంపించి, శవమునకు స్నానము చేయించి, ఆ పసుపును శవముఖమునకు పూయించి, నుదుటిపై పెద్ద కుంకుమ బొట్టును పెట్టించి, పూలమాలలను వేసి శవము నలంకరింపజేయుట ఆచారముగా నున్నది. అప్పుడామెకు పుట్టింటివారు కడసారిగా క్రొత్తచీర నీయవలెను.
5. ఒకవేళ అవివాహితులు మరణించిన, వారి తల్లిదండ్రులుగాని, అక్కచెల్లెండ్రుగాని అన్నదమ్ములుగాని శవము తలపై నేతిని, నలుగుపిండిని పెట్టవచ్చును.
6. స్త్రీలకు పైతృమేధికసంస్కారమే కాని బ్రహ్మమేధసంస్కారము లేదు. సాధ్యమైనంత వఱకు సూర్యాస్తమయమైన తరువాత దహనము చేయగూడదు. కాని 2వ అధ్యాయములో చెప్పినట్లుగా, సూర్యాస్తమయానికి ముందే ప్రేతాగ్నిసంధానమును ఆరంభించి యుండిన, సూర్యాస్తమయము తర్వాతకూడ దహనము చేయవచ్చును. అట్లు కానిచో,

మఱునాడు అగ్నిసంధానాదులను చేసి, దహనము చేయుట మంచిది. దహనము చేయు నప్పుడు కపాలమోక్షమగు వఱకు శ్మశానములో నుండుట మంచిది.

7. కర్తయొక్క భార్యగాని, ప్రేతయొక్క భార్యగాని రజస్వలలైనప్పటికి మరణదినాది ఏకోద్దిష్టపర్యంతము గల కార్యక్రమములను కర్త యథాశాస్త్రముగా సకాలములో నిర్వర్తింపవలెను.

8. మరణదినమునుండి కర్తలును, దహనదినమునుండి దశరాత్రజ్ఞాతులును పదవనాడు ఆనన్దహోమము జరుగువఱకును శ్రీచూర్ణరహితముగా తిరుమణిని మాత్రమే ధరింపవలెను.

9. మరణసమయమున వాడినట్టి ఉదకుంభమును, వాసోదకవస్త్రమును భద్రపరచుకొని, నిత్యవిధికి, దశాహస్నునకు వాటినే వాడుకొనవలెను.

10. శవమును దహనార్థము తీసికొని పోవునప్పుడు (ఉన్నచో) ముందుగా మంగళవాద్యములు, వాని వెనుక దహనాగ్నితో కర్త, కర్త వెనుక శవము, శవము వెనుక ఇతరులు నడువవలెను. ఎట్టి స్థితిలోను శవమునకు ముందరగాని, ప్రక్కలకుగాని ఇతరులు నడువ గూడదు. శవము నెప్పుడును శ్మశానమువైపు చూచుచున్నట్లు (అనగా కాళ్లు శ్మశానము వైపు చేసి) తీసికొనిపోవలెను.

## జీవప్రాయశ్చిత్తము

తాను మరణించెడశలో తానైనా లేక తన కుమారుడైనా ముందుగా ప్రాజాపత్యకృచ్ఛ్రమును చేసి, అటుపైని జీవప్రాయశ్చిత్తమును చేయవలెను. దీని ప్రయోగ మీవిధముగా నున్నది:

*ప్రయోగః:* [1]పాదౌ ప్రక్షాళ్య, ఆచమ్య, దక్షిణాతాంబూలసహితం అక్షతాన్ హస్తే గృహీత్వా,

---

[1] కాళ్లు కడుగుకొని, ఆచమనము చేసి, దక్షిణాతాంబూలములను, అక్షతలను ఒక తట్టలో పెట్టుకొని నిలుచుండి *"ఓం నమస్సదసే"* అను మంత్రమును చెప్పి, సభకు ప్రణమించి, తదుపరి *"సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః-----అనుగ్రహాణ"* - అనునంతవఱకు చెప్పి, వైష్ణవగోష్ఠిపై అక్షతలను వేసి, నమస్కరించి, *"స్వామినః భవత్పాదమూలే---యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ"*- అని ప్రార్థించి, *"తథాస్తు", "యోగ్యతాసిద్ధిరస్తు"* - అని శ్రీవైష్ణవానుజ్ఞను పొంది, ముందుగా

*"ఓం నమస్సదసే నమస్సదసస్పతయే నమస్సఖీనాం పురోగాణాం చక్షుషే నమో దివే నమః పృథివ్యై। సప్రథ సభాం మే గోపాయ। యే చ సభ్యాస్సభాసదః। తానిన్ద్రియావతః కురు। సర్వమాయురుపాసతామ్। సర్వేభ్యః శ్రీవైష్ణవేభ్యో నమః॥"*

ప్రణమ్య, *"స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య ----గోత్రస్య -----శర్మణః మమ పితుః (అథవా,-----గోత్రాయాః------నామ్న్యాః మమ మాతుః) ప్రాణానాం సుఖోత్క్రమణసిద్ధ్యర్థం జన్మప్రభృతి ఏతత్క్షణపర్యంతం బాల్యయౌవనకౌమారవార్ధక్యేషు జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాయాం (ప్రపన్నానాం, ప్రపత్త్యుత్తరకాలప్రభృతి ఏతత్క్షణ పర్యంతం) జ్ఞానతోఽజ్ఞానతో వా మనోవాక్కాయైః అనుష్ఠితానాం అకృత్యకరణ కృత్యాకరణాది భగవదపచార, భాగవతాపచారాది అనంతాపచారైశ్చ సంభావితానాం అకృతప్రాయశ్చిత్తానాం పాపానాం అపనోదనార్థం ప్రాజాపత్యకృచ్ఛ్రం కర్తుం యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ" - ఇతి ప్రార్థ్య, "తథాస్తు", "యోగ్యతాసిద్ధిరస్తు" -* ఇత్యనుజ్ఞాప్య, [2]దర్భేష్వాసీనః, దర్భాన్ ధారయమాణః, పవిత్రపాణిః ప్రాణానాయమ్య -

*సంకల్పః* ***"అస్యాం తిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం ------ గోత్రస్య -----శర్మణః పితుః (అథవా, ------గోత్రాయాః ----- నామ్న్యాః మాతుః) ప్రాణానాం సుఖోత్క్రమణసిద్ధ్యర్థం జన్మప్రభృతి ఏతత్క్షణపర్యంతం బాల్యయౌవన***

---

ప్రాజాపత్యకృచ్ఛ్రమును చేయవలెను. (సూచన: ఇట్టి వైష్ణవగోష్ఠికే "పరిషత్తు" అనియు, వారి అనుజ్ఞను పొందుటకే "పరిషదనుజ్ఞను పొందుట" అనియు పేరులు)

[2] ప్రాజాపత్యకృచ్ఛ్రమునకై కర్త దర్భలపై కూర్చొని, రెండు దర్భలచే కట్టిన పవిత్రమును ధరించి, రెండు దర్భలను కుడిచేతి చూపుడు వ్రేలు, చిటికెన వ్రేళ్లకు మధ్య చేర్చి పట్టుకొని, ప్రాణాయామము చేసి, *"అస్యాం తిథౌ ---హిరణ్యదానం కరిష్యే "* - అని సంకల్పించి, *"వ్యాశేషభూతేన ---ప్రక్రమతే స్వయం"* -- అని సాత్త్వికత్యాగము చేసి, దక్షిణను, అక్షతలను చేతిలోనికి తీసికొని, *"హిరణ్యగర్భగర్భస్థం---ప్రయచ్ఛ మే", "ఏతద్ధిరణ్యం ---సంప్రదదే నమమ"*- అని చెప్పి, అక్షతలను, దక్షిణను జలముతో సహ భూమిపై విడిచి వానినొక శ్రోత్రియునకు దానమీయవలెను.

*కౌమారవార్ధక్యేషు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాయాం (ప్రపన్నానాం, ప్రపత్త్యుత్తర కాలప్రభృతి ఏతత్క్షణపర్యంతం) జ్ఞానతో౽జ్ఞానతో వా మనోవాక్కాయైః అనుష్ఠితానాం అకృత్యకరణకృత్యాకరణాది భగవదపచార, భాగవతాపచారాద్యనంతాపచారైశ్చ సంభావితానాం అకృతప్రాయశ్చిత్తానాం పాపానాం అపనోదనార్థం ప్రాజాపత్య కృచ్ఛ్రప్రతినిధి యత్కించిత్ హిరణ్యదానం కరిష్యే "*- ఇతి సంకల్ప్య (అని సంకల్పించి)

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

ఇతి సాత్త్వికత్యాగం కృత్వా, హిరణ్యమక్షతైస్సహ హస్తే గృహీత్వా,

*హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।*
*అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*
*ఏతద్ధిరణ్యం అక్షతాసహితం తుభ్యమహం సంప్రదదే నమమ "*

ఇతి సోదకేన భూమౌ త్యక్త్వా, దరిద్రాయ శ్రోత్రియాయ దద్యాత్.[3] తదనంతరం

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

---

[3] దానము చేసిన తర్వాత *"స్వశేషభూతేన మయా.."* అను శ్లోకముతో సాత్త్వికత్యాగమును చేసి, శ్రీపాదతీర్థమునుగాని, సాలిగ్రామతీర్థమునుగాని ఇచ్చి (లేదా, తీసికొని) తలపై ప్రోక్షించి (లేదా, ప్రోక్షించుకొని), తులసిమాలను ధరించి (లేదా ధరింపజేసి), భూమిపై (జీవితునికి) రెండు దర్భలను (మృతునికి ఒక దర్భను) పఱచి, దక్షిణము వైపు శిరస్సును చేసి పరుండి (లేదా పరుండబెట్టి) ద్వయమంత్రమును (*"శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే। శ్రీమతే నారాయణాయ నమః"* - అనునది ద్వయమంత్రము), ద్వాదశాక్షరమును (*"ఓం నమో భగవతే వాసుదేవాయ "*- అనునది ద్వాదశాక్షరము), షడక్షరమును (*"ఓం నమో విష్ణవే"* - అనునది షడక్షరమంత్రము) చెప్పవలెను. ప్రపన్నజీవనోత్క్రమణదశయందు దీపమును వెలిగించి, సూయ్ వకుంబణి మొహిల్, మునియెనాన్ మహనే అను పాశురములను చెప్పుట సంప్రదాయము.

- ఇతి సాత్త్వికత్యాగం కృత్వా, శ్రీపాదతీర్థం, సాలిగ్రామతీర్థం వా ప్రాశయిత్వా, శిరసి ప్రోక్ష్య, తులసీదళమాలాం ధారయిత్వా, శుచౌ దేశే భూమ్యాం దర్భేషు సాదయిత్వా, పుంసూక్తం, ద్వయమంత్రం, అష్టాక్షరం, ద్వాదశాక్షరం, షడక్షరం శ్రావయేత్.

## ఉత్క్రాంతిగోదానప్రయోగము

ప్రాణోత్క్రమణము సుఖముగా జరిగేందుకు, **అంత్యదశలో** గోదానమును చేయుట పరిపాటి. దీనికి ప్రయోగము:

ప్రయోగః పాదౌ ప్రక్షాళ్య, ఆచమ్య, ప్రాణానాయమ్య, (కాళ్లు కడుగుకొని, ఆచమించి, రెండుదర్భల పవిత్రమును అనామికపై ధరించి, ఒకమారు ప్రాణాయామమును చేసి, ఈ క్రింది విధముగా మహాసంకల్పమును చెప్పవలెను)

*శ్రీమాన్వేంకటనాథార్యః కవితార్కికకేసరీ/*
*వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది//*
*గురుభ్యస్తద్గురుభ్యశ్చ నమోవాకమధీమహే/*
*వృణీమహే చ తత్రాద్యౌ దంపతీ జగతాం పతీ//*
*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వపరిచ్ఛదైః/*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్//*
*శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్/*
*ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాన్తయే//*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్/*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే//.*

*హరిరోం తత్సత్, శ్రీగోవింద, గోవింద, గోవింద- అస్య శ్రీ భగవతః మహాపురుషస్య* ***విష్ణోరాజ్ఞయా*** *ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే* ***వైవస్వతమన్వంతరే అష్టావింశతితమే*** *కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే* ***భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే*** *అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్టి* ***సంవత్సరాణాం మధ్యే*** *----సంవత్సరే ---- అయనే ----ఋతౌ ----మాసే -----పక్షే*

*----తిథౌ----వాసరే ----నక్షత్రయుక్తాయాం అస్యాం తిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీభగవత్కైఙ్కర్యరూపం ------గోత్రస్య ----శర్మణః మమ పితుః (అథవా,------గోత్రాయాః --------నామ్న్యాః మమ మాతుః) ప్రాణానాం సుఖోత్క్రమణసిద్ధ్యర్థం, ఉత్క్రాంతి గోదానం కరిష్యే* - ఇతి సంకల్ప్య (అని మహాసంకల్పము చెప్పి)

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

ఇతి సాత్త్వికత్యాగం కృత్వా (అని సాత్త్వికత్యాగమును చేసి),

*అత్యుత్క్రాంతౌ ప్రవృత్తస్య సుఖోత్క్రమణసిద్ధయే।*
*తుభ్యం సంప్రదదే ధేనుం ఇమాముత్క్రాంతిసంజ్ఞికామ్॥*
*గవామంగేషు తిష్ఠన్తి భువనాని చతుర్దశ।*
*తస్మాదస్యాః ప్రదానేన అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

అని చెప్పి, "*...గోత్రాయ ... శర్మణే ... శాఖాధ్యాయినే శ్రీవైష్ణవాయ తుభ్యమహం సంప్రదదే నమమ, అచ్యుతః ప్రీయతామ్*"- అని చెప్పి, గోపుచ్ఛమును తాకి, ఆ గోవు నొక శ్రోత్రియునకు దానమీయవలెను. గోవు లేనిచో, "*గోదానప్రతినిధి యత్కించిత్ హిరణ్యదానం కరిష్యే*" అని సంకల్పించి,

*హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।*
*అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

అని చెప్పి హిరణ్యమును, అక్షతలను జలముతో సహ భూమిపై విడిచి, గోదానమునకు ప్రత్యామ్నాయముగా దానినొక శ్రోత్రియునకు దానమీయవలెను.

## *కర్ణమంత్రః*

అంత్యదశలో జీవించియున్నప్పుడు గాని, మరణించిన తరువాత గాని, కర్ణమంత్రమును వ్యక్తిచెవిలో నుచ్చరించుట సంప్రదాయము (సూచన: వీలైనంతవరకు జీవించియున్నప్పుడే ఈ మంత్రమును చెప్పుట మంచిది). సామాన్యులకు పితృమేధవిధిగను, యోగులకు, వేదాంతులకు బ్రహ్మమేధవిధిగను ఈ మంత్రమును చెప్పవలెను.

*పితృమేధకర్ణమంత్రః:* కర్త కాళ్లు, చేతులు కడుగుకొని, అచమనము చేసి, ఒక మారు ప్రాణాయామమును చేసి, *"---- గోత్రస్య ---- శర్మణః మమపితుః* (లేదా, ---- *యజమానస్య-----పితుః)* (లేదా తల్లి మృతురాలైనచో,---*గోత్రాయాః----నామ్న్యాః మమ మాతుః) మోక్షప్రాప్త్యర్థం కర్ణమంత్రజపం కరిష్యే "* - అని సంకల్పమును చెప్పి,

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

అని సాత్త్వికత్యాగమును చేసి, మృతవ్యక్తియొక్క కుడిచెవిని దర్భతో తాకుచు

*"ఆయుషః ప్రాణగ్ం సన్తను। ప్రాణాదపానగ్ం సన్తను। అపానాద్వ్యానగ్ం సన్తను। వ్యానాచ్చక్షుస్సన్తను। చక్షుషశ్శ్రోత్రగ్ం సన్తను। శ్రోత్రాన్మనస్సన్తను। మనసో వాచగ్ం సన్తను। వాచ ఆత్మానగ్ం సన్తను। ఆత్మనః పృథివీగ్ం సన్తను। పృథివ్యా అన్తరిక్షగ్ం సన్తను। అన్తరిక్షాద్దివగ్ం సన్తను। దివస్సువస్సన్తను। నారాయణ। నారాయణ। నారాయణ।"* -అని చెవిలో కర్ణమంత్రమును చెప్పవలెను.

బ్రహ్మమేధసంస్కారమునందు పైవిధముగనే కర్ణమంత్రము నుచ్చరించి, *"బ్రహ్మవిదాప్నోతి పరమ్"*- అను ప్రశ్నతో ఆరంభించి, *"భృగుర్వై వారుణిః"* - అను ప్రశ్నవఱకు చెవిలో జపించి మూడుతడవలు నారాయణశబ్దమును, ద్వయమంత్రమును చెప్పవలెను. ఈ పద్ధతి 5వ అధ్యాయములో వివరింపబడినది. స్త్రీలకు పితృమేధమేకాని బ్రహ్మమేధసంస్కారము లేదు.

## ప్రాజాపత్యకృచ్ఛ్రవిధిః

ప్రేతసంస్కారయోగ్యత కల్గుటకొఱకై కర్త ప్రాజాపత్యకృచ్ఛ్రమును చేయవలెను. దీనికై కర్త కాళ్లు, చేతులు కడుగుకొని, అచమనము చేసి, ఒకమారు ప్రాణాయామమును చేసి, *"---- గోత్రస్య ----శర్మణః మమపితుః ప్రేతస్య* (అథవా, *---గోత్రాయాః----నామ్న్యాః మమ మాతుః ప్రేతాయాః)* అద్య ప్రథమేహని పైతృమేధికవిధినా సంస్కర్తుం (బ్రహ్మ

మేధమందు, పైతృమేధికవిధినా సహ బ్రహ్మమేధవిధినాసంస్కర్తుం)స్వస్య యోగ్యతా సిద్ధ్యర్థం ప్రాజాపత్యకృచ్ఛ్రం యత్కించిద్ధిరణ్యరూపేణ కరిష్యే"

(అని సంకల్పించి, మూడురూపాయలకు తక్కువ లేకుండ చేతిలో నుంచుకొని),

*హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।*

*అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

అని చెప్పి, "----గోత్రస్య ----శర్మణః మమ పితుః (అథవా,----గోత్రాయాః ---నామ్న్యాః మమ మాతుః) ప్రాజాపత్యకృచ్ఛ్రప్రతినిధి యత్కించిద్ధిరణ్యదానం -----గోత్రాయ ----శర్మణే తుభ్యమహం సంప్రదదే నమమ। అచ్యుతః ప్రీయతామ్।" - అని జలము, అక్షతలతో సహ హిరణ్యమును భూమిపై విడిచి, దానినొక శ్రోత్రియున కీయవలెను.

## శ్రీమూర్ణపరిపాలనమ్

*ప్రయోగః:*[4]చేతనస్య మరణానంతరం కర్తా స్నాత్వా, ఊర్ధ్వపుండ్రం వినా శ్రీ చూర్ణం ధృత్వా, శవం స్నాపయిత్వా, అలంకృత్య, శ్రీమూర్ణపరిపాలనం కుర్యాత్. [5]గృహబహిర్ద్వార సమీపే, చతుర్ద్వారం చతుస్తంభమండపం కారయిత్వా, అలంకృత్య, "సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః" - ఇత్యక్షతాం దక్షిణాం చ దత్వా,

"స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య ----గోత్రస్య ---శర్మణః మమ పితుః ప్రేతస్య (అథవా,----గోత్రాయాః ----నామ్న్యాః మమ మాతుః ప్రేతాయాః) పరమపద

[4] జీవి మరణానంతరము, కర్త స్నానము చేసి, శ్రీమూర్ణము లేకుండా ఊర్ధ్వపుండ్రములను ధరించి, ప్రేతకు స్నానముపోసి, అలంకరించి, శ్రీమూర్ణపరిపాలనమును చేయవలెను. (సూచన: శ్రీమూర్ణపరిపాలనమును కర్త ఉపవీతియై, పసుపు అక్షతలతోనే చేయవలెను.)

[5] ఇంటి వెలుపల నాలుగుద్వారములు గల నాలుగు స్తంభముల మండపమును వేసి, దాని నలంకరించి, "సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః" - అని అక్షతలను, దక్షిణను, వైష్ణవగోష్ఠికి సమర్పించి, "స్వామినః భవత్పాదమూలే-----యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ" - అని ప్రార్థించి, "తథాస్తు! యోగ్యతాసిద్ధరస్తు" - అని బ్రాహ్మణానుజ్ఞను పొంది, ప్రాణాయామము చేసి, "స్వామినః --- కరిష్యే" - అని సంకల్పించి,

*ప్రాప్త్యర్థం శ్రీపాంచరాత్రోక్తవిధానేన శ్రీమార్గపరిపాలనం కర్తుం యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ" - ఇతి ప్రార్థ్య, "తథాస్తు! యోగ్యతాసిద్ధిరస్తు"- ఇత్యనుజ్ఞాప్య, ప్రాణానాయమ్య, "----గోత్రస్య ---శర్మణః మమ పితుః ప్రేతస్య (అథవా,----గోత్రాయాః ----నామ్న్యాః మమ మాతుః ప్రేతాయాః) పరమపదప్రాప్త్యర్థం శ్రీపాంచరాత్రోక్తవిధానేన శ్రీమార్గపరిపాలనం కరిష్యే "-ఇతి సంకల్ప్య,*

[6]మంటపే ధ్యానపీఠోపరి నవవస్త్రం ప్రసార్య, ఉపవీత్యేవ మధ్యే ఏకకలశం, కోణేషు కలశచతుష్టయం నిధాయ, తద్బహిః కేశవాది ద్వాదశకలశాన్ పూర్వాదిక్రమేణ నిధాయ, ఆపః పూరయిత్వా, కూర్చామ్రపల్లవపుష్పాణి నిధాయ, పవిత్రం హిరణ్యం చ నిధాయ,వస్త్రై రలంకృత్య, తత్తత్ ప్రతిమాం నిక్షిప్య,

| | | | | |
|---|---|---|---|---|
| | 6 | 7 | 8 | |
| 17 | 2 | | 3 | 9 |
| 16 | | 1 | | 10 |
| 15 | 5 | | 4 | 11 |
| | 14 | 13 | 12 | |

1వ పటము : కలశముల నుంచవలసిన స్థానములు

[6] మంటపమధ్యంలో క్రొత్త వస్త్రముపై బియ్యమును పఱచి, ఉపవీతితోడనే ఆ బియ్యముపై 17 కలశములను పైపటములో సంఖ్యాప్రకారము చూపినట్లుగా 1. (మధ్యలో) శ్రీమన్నారాయణ, 2. (ఈశాన్యదిశలో) వాసుదేవ, 3. (ఆగ్నేయదిశలో) సంకర్షణ, 4. (నైఋతిదిశలో) ప్రద్యుమ్న, 5. (వాయవ్యదిశలో) అనిరుద్ధకలశములను, ఈ 5 కలశములకు వెలుపల తూర్పునుండి ప్రదక్షిణముగా 6 నుండి 17 వ సంఖ్యవఱకు గల స్థానములలో కేశవాదిదామోదరనామములకు 12 కలశములను ఉంచవలెను. అట్లుంచిన కలశములను నీటిచే నింపి, అందులో కూర్చామ్రపుష్పపల్లవహిరణ్యముల నుంచి, వస్త్రములచేత నలంకరించి, ఆయా దైవముల ప్రతిమల నాయా స్థానములలో నుంచవలెను.

[7]మధ్యే శ్రీమన్నారాయణ మావాహ్య, కోణేషు ప్రత్యేకం వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధానావాహ్య, పూర్వాదిప్రదక్షిణక్రమేణ కేశవాదిదామోదరాంతమావాహ్య, షోడశోప చారాన్ సమర్ప్య,

[8]*"ఉలూఖలే పృథివీమావాహయామి, ముసలే ఆపః ఆవాహయామి, శూర్పే తేజః ఆవాహయామి, శ్రీమూర్ణే వాయుమావాహయామి, ఘృతే ఆకాశమావాహ యామి"* - ఇత్యావాహ్య , షోడశోపచారాన్ సమర్ప్య, [9]కేశవాదిద్వాదశనామభిః హరిద్రా

---

[7] అట్లుంచిన ప్రతిమలను వరుసగా, *1.శ్రీమన్నా రాయణమావాహయామి, 2.వాసుదేవమా-వాహయామి, 3. సంకర్షణమావాహయామి, 4.ప్రద్యుమ్న మావాహయామి,5.అనిరుద్ధ-మావాహయామి, 6.కేశవమావాహయామి, 7.నారాయణమావాహయామి, 8.మాధవ మావాహయామి,9.గోవిందమావాహయామి, 10.విష్ణుమావాహయామి,11.మధుసూదన మావాహయామి, 12.త్రివిక్రమమావాహయామి, 13.వామనమావాహయామి, 14.శ్రీధర మావాహయామి, 15. హృషీకేశమావాహయామి, 16. పద్మనాభమావాహయామి, 17. దామోదరమావాహయామి* - అని ఆవాహన చేసి, వానికి షోడశోపచారముల నొసగి,

[8] తదుపరి ఱోటిలో పృథ్విని, రోకలిలో నీటిని, చేటలో తేజస్సును, శ్రీమూర్ణములో వాయువును, నేతిలో ఆకాశమును వరుసగా *1. ఉలూఖలే పృథివీమావాహయామి, 2. ముసలే ఆపః ఆవాహయామి, 3. శూర్పే తేజః ఆవాహయామి, 4. శ్రీమూర్ణే వాయుమావాహయామి, 5.ఘృతే ఆకాశమావాహయామి* - అని ఆవాహన చేసి, వానికి గూడ షోడశోపచారముల సమర్పించవలెను.

[9] అతర్వాత కేశవాది ద్వాదశనామముల జపించుచూ పసుపును ఱోటిలో వేసి, రోకలిచే పొడి గొట్టి, ప్రణవముతో (*"ఓం"* - అనేది ప్రణవము) ఆ పొడిని శోధించి, మఱల ఆ మూర్ణమును ఱోటిలో వేసి, వ్యాహృతులతో (*"ఓం భూర్భువస్సువః"* - అనునవి వ్యాహృతులు) దానిపై తీర్థమును ప్రోక్షించి, మళ్లీ చూర్ణం చేసి, ఆచూర్ణమును చేటలో నుంచి, దానిని, చందనపు పొడిని, తిరుమణిని శ్రీవైష్ణవులచేత తాకించి, శ్రీవైష్ణవులతో సహ శ్రీసూక్తమును జపించవలెను (సూచన: శ్రీసూక్తము అనుబంధములో నీయబడినది). తదుపరి కుంభోదకములను కూర్చాగ్రముతో గ్రహించి, పురుషసూక్తముతో (57వ పేజీ), పవమానసూక్తముతో (40వ పేజీ) ఆ చూర్ణమును ప్రోక్షించి, కర్త ఆ చూర్ణమును తన కుడిచేతిలోనికి తీసికొని, *"స్వామినః---రక్షిత్రదుళవేణుమ్"*- అని స్వాములను ప్రార్థించి,

చూర్ణం ముసలేన ఉలూఖలే చూర్ణీకృత్య, ప్రణవేన తచ్చూర్ణం శోధయిత్వా, పునరులూఖలే నిక్షిప్య, వ్యాహృతిభిః ప్రోక్ష్య, పునశ్చూర్ణం కృత్వా, తచ్చూర్ణం శూర్పే నిక్షిప్య, శ్రీమార్జం స్పృశన్ శ్రీవైష్ణవైస్సహ శ్రీసూక్తం జపిత్వా, కుంభోదకైః కుశాగ్రైః పుంసూక్తేన, పవమానిభిశ్చ చూర్ణం ప్రోక్ష్య, కర్తా తచ్చూర్ణం హస్తే నిధాయ, *"స్వామినః అడియేన్ న్నడైయ తిరుత్త హప్పనార్ (తిరుత్తాయార్) ఆచార్యన్ తిరువడిహళై యడైందార్, తన్ని మిత్త మాహ, కోయిల్ తిరుమలై పెరుమాళ్ కోయిల్, తిరునారాయణపురం, ముదలాన దివ్యదేశంగళిల్ ఎళుందరుళి యిరుక్కుం జీయాళ్ శ్రీవైష్ణవాళ్ అనైవరం శ్రీమూర్ణపరి పాలనం కండరుళి కృపైశైదు రక్షిత్తరుళవేణుమ్"*- ఇతి ప్రార్థ్య,

[10]శ్రీవైష్ణవాన్ పరితోపవేశ్య, తిరుప్పల్లాండు, కణ్ణినుణ్ శిఱుత్తాంబు, తిరువాయ్ మొళి, తిరువిరుత్తం, రామానుజనూత్తందాది అడైక్కలప్పత్తు, పిళ్లియిందాదిప్రబంధాన్ సమ్యక్ పాఠ యిత్వా, శ్రీమూర్ణం శ్రీవైష్ణవేభ్యస్సమర్పయిత్వా, శేషం నిక్షిప్య, *"కలశస్థ దేవతానుద్వాస యామి"*- ఇతి కలశస్థ దేవతానుద్వాస్య,

[11]కలశోదకైః పుంసూక్తేన శవవిగ్రహం ప్రోక్ష్య, కేశవాదినామభిః శ్ర్యాది నామభిశ్చ ఊర్ధ్వ పుండ్రాన్ శ్రీమూర్ణం చ తత్తత్ స్థానేషు ధారయిత్వా, తచ్ఛేషం పుత్రాదయశ్చ ధారయేయుః. తతః భగవదర్పిత దివ్యమాలాదీన్ శేషవస్త్రం చ శవస్య ధారయిత్వా శవమలంకుర్యాత్. తతః శ్రీవైష్ణవేభ్యః తాన్ కలశవస్త్రాదీన్ దక్షిణాం చ దద్యాత్.

---

[10] స్వాములను చుట్టూ కూర్చుండబెట్టుకొని, వారితో సహ తిరుప్పల్లాండు, కణ్ణినుణ్ శిఱుత్తాంబు, తిరువాయ్ మొళి, తిరువిరుత్తం, రామానుజ నూత్తందాది అడైక్కలప్పత్తు, పిళ్లియిందాదిప్రబంధములను పఠించి, వారికా శ్రీమూర్ణము నొసగి, శేషించిన శ్రీమూర్ణమును ప్రక్కన నుంచుకొని, *"కలశస్థ దేవతానుద్వాసయామి"*- అని చెప్పి కలశములం దావాహితులైన దేవతల నుద్వాసన చేయవలెను.

[11] ఆ తర్వాత పురుషసూక్తయుక్తముగా కలశోదకములచేత శవమును ప్రోక్షించి, కేశవాది నామములతో శ్రీనామములతో విహితస్థానములందు శవమునకు ఊర్ధ్వపుండ్ర, శ్రీమూర్ణములు పెట్టి, మిగిలిన ఊర్ధ్వపుండ్రమును పుత్రాదులు ధరింపవలెను. ఆపైని భగవదర్పితదివ్యమాల లను శేషవస్త్రమును శవముచే ధరింపజేసి శవము నలంకరించి, శ్రీవైష్ణవులకు కలశములను, వానికి గట్టిన వస్త్రములను, దక్షిణను సమర్పింపవలెను.

## సులభశ్రీమూర్ణపరిపాలనమ్

పైన విధించిన విధముగా 17 కలశముల నుంచి, శ్రీమూర్ణపరిపాలన చేయుటకు వీలులేని వారు, శ్రీమాన్ కందాడై శ్రీనివాసాచార్యులు వారి "అపరప్రయోగానుక్రమణిక"లో నొసగిన ఈ క్రింది సులభపద్ధతి ననుసరింపవచ్చును. దీనికి ప్రయోగము:

[12]అశ్వత్థపత్రే ఘృతం, శ్రీమూర్ణం నిధాయ, హస్తే గృహీత్వా, కనిష్ఠపూర్వకం కర్తా సభాం ప్రతి ప్రదక్షిణీకృత్య,

*"రామానుజదయాపాత్రం జ్ఞానవైరాగ్యభూషణమ్।*
*శ్రీమద్వేఙ్కటనాథార్యం వన్దే వేదాన్తదేశికమ్॥"*

- ఇత్యారభ్య యథాసంప్రదాయం "తిరుప్పల్లాణ్డు", "తిరుప్పళ్లియెళుచ్చి", "కణ్ణినున్ శిఱుత్తామ్బు", "కోయిల్ తిరువాయ్ మొళి", "రామానుజనూత్తందాది", "ఉపదేశరత్తినమాలై" - ఇత్యాది ద్రావిడదివ్యప్రబంధాన్ యథాశక్తిం వాచయిత్వా, ఘృతం శ్రీమూర్ణం అశ్వత్థశాఖేన సమ్మేళనం కృత్వా, శ్రీమూర్ణం భాగవతేభ్యో దత్వా, శవస్యముఖే శ్రీమూర్ణమలంకృత్య, తచ్ఛేషం సానుజైస్స్వయం ధారయేత్.



[12] రావియాకులో నెయ్యిని, శ్రీమూర్ణమును పెట్టుకొని, ఆ ఆకును కుడిచేతిలో నుంచుకొని, కనిష్ఠపూర్వకముగా కర్త సభకు ప్రదక్షిణము చేసి, *"రామానుజదయాపాత్రం"* - అను శ్లోకముతో నారంభించి, యథాసంప్రదాయము "తిరుప్పల్లాణ్డు", "తిరుప్పళ్లియెళుచ్చి", "కణ్ణినుణ్ శిఱుత్తామ్బు","కోయిల్ తిరువాయ్ మొళి", "రామానుజనూత్తందాది", "ఉపదేశరత్తినమాలై"- మున్నగు ద్రావిడదివ్యప్రబంధములను వైష్ణవులతో గూడి పఠించి, రావిపుల్లతో నేతిని, శ్రీమూర్ణమును రెంటిని కలిపి, ఆ శ్రీమూర్ణమును బ్రాహ్మణుల కొసగగా వారు దానిని ధరింపవలెను. తదుపరి శేషించిన శ్రీమూర్ణమును ప్రేతముఖమందు ధరింపజేసి, ఇంకను మిగిలిన శ్రీమూర్ణమును కర్త తమ్ములతోసహ తాను ధరింపవలెను. తరువాత (ఇదివరకే తీసికొననిచో పక్షమున) ఆచార్య తిరువడిఘలను (పాదద్వయమును) పట్టువస్త్రముపై నద్దించి, ఆ వస్త్రమును భద్రపరచుకొనవలెను.

# అగ్నిసన్ధానవిధిః

## అగ్నినిర్ణయః

ప్రేతదహనమునకు ముందుగా అగ్నిసంధానమును చేయవలెను. తండ్రి మృతుడై, తల్లి బ్రతికియుండినచో, తండ్రికి (19వ పుటలో చెప్పినట్లుగ) ఔపాసనాగ్నిని పునస్సంధానము చేసి దహనసంస్కార మా అగ్నితోనే చేయవలెను. లేదా తల్లి మరణించి, తండ్రి బ్రతికియున్న ఆమెకు ఔపాసనాగ్నిసంధానము చేసి, ఆ అగ్నితోడనే దహనసంస్కారము చేయవలెను. అనగా తల్లిదండ్రులలో మొదట ఎవరు గతించినను వారికి ఔపాసనాగ్నిసంధానము చేయ వలెను. ఇట్లు చేయు అగ్నిసంధానమునకు "పత్నీవతః ప్రేతాగ్నిసంధాన"మని పేరు. ఆ తరు వాత గతించిన వారికి ఉత్తపనాగ్నిసంధానము చేయవలెను.

శాస్త్రప్రకారము బ్రాహ్మణుడు వివాహాగ్నినే పరిరక్షించుకొని నిత్యమూ అందులో ఔపాస నము చేయుచుండవలెను. ఇట్టి ఔపాసనాగ్నిని గృహస్థుడు మంత్రపూర్వకముగా తన ఆత్మలో నావేశించుకొనిగాని, లేదా సమిధయందు నావేశించిగాని, లౌకికాగ్నినుండి ఔపాసనాగ్నిని పునఃపరికల్పన చేసికొనవచ్చును. ఈరీతిగా నగ్ని నావేశించుకొనుటకు వరుసగా "ఆత్మ సమారోపణము", "సమిత్సమారోపణము" - అని పేరులు. అందుచేత ఆపస్తంబసూత్రాను యాయియైన మృతుడు మరణదినమునకు 3 రోజులకులోగా ఆత్మసమారోపణ చేసికొని యుండినయెడల, లౌకికాగ్నిని ప్రతిష్ఠించి, మృతుని కుడిచేతి కొక సమిధను తాకించి, అతడు సమారోపణము చేసికొన్న అగ్నిని సమిధద్వారా "ఉపావరోహ" అను మంత్రముతో లౌకి కాగ్నిలో ప్రవేశింపజేసిన ఆ యగ్ని ఔపాసనాగ్ని యగునని శాస్త్రము. ఒకవేళ మరణించినది గృహిణియైన, ఆమెకు ఔపాసనాధికారము లేనందున, జీవితుడైన ఆమె భర్త కుడిచేతికి సమిధను తాకించి, కర్త (సామాన్యముగా వారి జ్యేష్ఠపుత్రుడు) పై మంత్రమును చెప్పుచూ లౌకి కాగ్నిలో నా సమిధను వేసి, లౌకికాగ్నినుండి ఔపాసనాగ్నిని సృజింపవలెను. గృహస్థుడు సమిత్సమారోపణము చేసియుండిన అట్టి సమారోపణము చేసిన సమిధను "అజుహోత్",

"ఉద్బుధ్యస్వాగ్నే "అను రెండు మంత్రములతో లౌకికాగ్నియందు జేర్చిన ఆ యగ్ని ఔపాస నాగ్ని యగునని శాస్త్రము. పై విధముగా సమిధలను చేర్చి ఔపాసనాగ్నిని సృజించినప్పుడు, ఆ సమిధల మాలిన్యపరిహారమునకై ఉపఘాతప్రాయశ్చిత్తహోమమును కూడ చేయవలెను. అత్మ, సమిత్సమారోపణములు చేయనిచో లఘుపునస్సంధానమును చేసి ఔపాసనాగ్నిని మంత్రపూర్వకముగా పునః ప్రతిష్ఠించి, ఆ యగ్నితో దహనసంస్కారము చేయవలెను.

యతిభార్య, విధురుడు (మృతభార్యుడు), విధవ (మృతభర్తృక), కన్య, అనుపనీతుడు, స్నాతకుడు - వీరికి ఉత్తపవాగ్నియందు, బాలురకు, బాలికలకు తుషాగ్నియందు, బ్రహ్మ చారి, యతిభార్య మొదలగువారికి లౌకికాగ్నియందు సంస్కారమును చేయదగును. బ్రహ్మ చారికి కపాలాగ్నియు సమ్మతము. యతి జీవించియున్నచో, యతిభార్యకు ప్రేతాగ్ని సంధానము చేసి, సంస్కారము చేయవచ్చును.

## ఆహితాగ్ని విషయము

ఆహితాగ్ని మరణించినప్పు డతవిని అతని యజ్ఞపాత్రలతో సహ త్రేతాగ్నులతో (అనగా, ఆహవనీయ, గార్హపత్య, దక్షిణాగ్నులతో) దహింపవలెను. ఆహితాగ్ని తర్వాత అతని భార్య మరణించినచో, అరణిచేత అగ్నిని సృష్టించి, ఆ అగ్నితో నామెకు దహనసంస్కారము చేయ వలెను. ఆహితాగ్నికంటె భార్య ముందుగా మరణించినచో ఆమెకు త్రేతాగ్నులతో దహన సంస్కారము చేసి, తరువాత మరణించిన భర్తకు అరణిమథితాగ్నితో దహనసంస్కారమును చేయవలెను. ఒకవేళ ఆహితాగ్ని నష్టమైనచో, ఇరువురికీ అరణిమథితాగ్నితోనే దహనసం స్కారమును చేయవలెను.

## ఇర్వురు భార్యల విషయము

ఇద్దరు భార్యలున్నప్పుడు ఆ ఇర్వురియొక్క ఔపాసనాగ్నులను సంసృష్టము చేసి (అనగా కలిపివేసి), జ్యేష్ఠభార్య ముందు మరణించినచో ఆ సంసృష్టాగ్నియందు సంస్కారము చేయ వలెను. కనిష్ఠపత్ని మొదట మరణించిన, అగ్నిని రెండుభాగములు చేసి, దక్షిణభాగము జ్యేష్ఠ పత్నికి, ఉత్తరభాగము కనిష్ఠపత్నికి నిర్దేశము చేసి, వేరువేరుగా పూర్ణాహుతి చేసి, జ్యేష్ఠభార్య (దక్షిణార్ధం) అగ్నిని ఆర్పివేసి, ఉత్తరార్ధపుటగ్నితో కనిష్ఠభార్యకు సంస్కారము చేయవలెను.

ఇర్వురేకకాలమున మరణించినచో, దక్షిణాగ్నితో జ్యేష్ఠపత్నికి, ఉత్తరాగ్నితో కనిష్ఠ పత్నికి సంస్కారము చేయవలెను. ఇర్వురికి ముందుగా భర్త మరణించినచో, ఇర్వురు భార్యల ఔపాసనాగ్నులను సంసృష్టముచేసి, ఆ అగ్నితో భర్తకు దహనసంస్కారము చేయవలెను.

వివాహములో శేషహోమమునకు ముందుగా వరుడుగాని, వధువుగాని లేక ఇర్వురు గాని మరణించినచో శేషహోమాంతవైవాహికకర్మ నాచరించి, ఆ అగ్నితోనే దహనసంస్కారము చేయవలెను.

## ఉత్తపనాగ్ని

*"దర్భేష్వగ్నిం సమారోప్య పునర్దర్భేషు సంస్థితః।*
*పునర్మూష్వన్తరారూఢో వహ్ని రుత్తపనాహ్వయః॥"*

అని ఉత్తపనాగ్నిలక్షణము చెప్పబడినది. అనగా మూడు దర్భపుంజములను పిడికిటిలో పట్టుకొని, క్రమముగా మెదటిదానిచే రెండవ దర్భపుంజమును, రెండవదానిచే మూడవ దర్భ పుంజమును ప్రజ్వలించి పరికల్పించిన అగ్నికి ఉత్తపనాగ్నియని పేరు. ఈ ఉత్తపనాగ్ని సంధానప్రయోగము 31వ పుటలో చెప్పబడినది.

## తుషాగ్ని

కుండపెంకును ఎఱ్ఱగా వేడిచేసి, అందులో వరిపొట్టువంటి దానిని వేసినచో, ఆ పొట్టంటు కొనును. ఇట్లు పరికల్పితమైన పెంకులోని అగ్నిని తుషాగ్ని యందురు. మూడేండ్లనుండి ఉప నయనమగులోగా బాలుడు మరణించినను, మూడేండ్లనుండి వివాహమయ్యేలోగా బాలిక మర ణించినను, లేదా ఏడేండ్లకు మించి ఉపనయనముగాని బాలుడు మరణించినను, వారికి తుషా గ్నితో ఏకార్చవిధితో సంస్కారము చేయవలెను. మూడేండ్లలోగా మరణించిన బాలబాలికలకు ఖననమే కాని దహనసంస్కారము లేదు ఈ ఏకార్చవిధిసంస్కారము తరువాతి అధ్యాయ ములో చెప్పబడినది.

## కపాలాగ్ని

కుండపెంకులో నొక ఆవుపిడకనుంచి, దానిని బాగుగా వేడిచేయగా పుట్టిన అగ్నిని "ఓం భూర్భువస్సువస్స్వాహా" అని ఆజ్యాహుతిచే సంస్కరించి పరికల్పించిన అగ్నికి కపా లాగ్ని యని పేరు.

## *అభ్యుక్షణాదిపదవివరణము*

ముందు చెప్పబోవు అగ్నిసంధానాదులలో అభ్యుక్షణము, అవోక్షణము మున్నగు పారిభాషికపదములు తరచుగా వచ్చును. సౌలభ్యమునకై వాని అర్థమిక్కడ ముందుగానే వివరింపబడినది.

*శ్లో॥ ఉత్తానేన తు హస్తేన కర్తవ్యం ప్రోక్షణం బుధైః*
*అవాచీనేన హస్తేన కర్తవ్యం స్యాదవోక్షణమ్॥*
*అవాఙ్ముష్టిప్రకారేణ అభ్యుక్షణముదీరితమ్।*
*తిర్యగ్భూతేన హస్తేన పర్యుక్షణమితి స్మృతమ్॥*

అనగా వెల్లకిల నున్న చేతితో నీటిని చల్లుటను ప్రోక్షణమనియు, బోర్లించిన చేతితో నీటిని చల్లుటను అవోక్షణమనియు, బోర్లించిన పిడికిటి ద్వారా నీటిని చల్లుటను అభ్యుక్షణ మనియు, అడ్డముగా నుందిన చేతి పిడికిలితో నీటిని చల్లుటను పర్యుక్షణమనియు అందురు.

## *ఇధ్మముల లక్షణములు*

*"పాలాశః ఖాదిరో వా స్యాదిధ్మః పంచదశ స్మృతః।" - ఇతి బోధాయనః.*
*"ప్రమారా ప్రాదేశసంమితా। ద్వః ప్రాదేశో భవేదిధ్మః। త్రిః ప్రాదేశస్తు మధ్యమః।*
*స్థవిష్ఠో దక్షిణార్ధస్స్యాత్త్రిరనామిక ఇష్యతే। త్రిర్మధ్యమం చోత్తరార్ధ్యః పరిధీనాం*
*ప్రమాణకమ్। సంఖ్యా వింశతిధాతో్ప్రిక్తాన్యేకవింశతిధా క్వచిత్॥"*
-ఇతి నారసింహస్మార్తకారికావృత్తిః.

అనగా ఇధ్మములు మోదుగవిగాని, చంద్రవిగాని పదునైదుండవలెనని బోధాయనమహర్షి చెప్పెను (సూచన: ఇవియే కాక, జమ్మి, మఱ్ఱి, రావి, వెదురు, మేడి, గఱిక, దర్భలు మొదలగు అన్యవృక్షజన్యమైనవి గూడ నుండవచ్చును గాని, యాజ్ఞికకోటిలో సర్వసాధారణముగా మోదుగపుల్లలనే ఇధ్మములుగా వాడుట జరుగుచున్నది). ఇధ్మముల లక్షణములు నృసింహపండితుని స్మార్తకారికావృత్తిలో నిట్లు చెప్పబడినవి: "ఇధ్మకట్టలో మొత్తము 20 సమిధలుండవలెను. వీనిలో 15 ఇధ్మములు; ఇవి రెండు జిట్టల పొడవుండవలెను. మిగిలినవానిలో రెండు ఆఘారసమిధలు; ఇవి జిబ్బెడు పొడవుండవలెను. ఇవి అగ్నికి తూర్పున గేటువలె నుంచునవి. ఇంకను మిగిలిన 3 సమిధలకు పరిధులని పేరు; వీనిలో మధ్యమపరిధి అగ్నికి పడమటను, దక్షిణపరిధి అగ్నికి దక్షిణముననను, ఉత్తరపరిధి అగ్నికి ఉత్తరముననను ఉంచబడునవి. ఇందులో

మధ్యమపరిధి 3 జిట్టల పొడవుండవలెను. దక్షిణపరిధి 3 అనామికల పొడవుండవలెను; అనామిక యనగా చాచిన అంగుష్ఠానామికలకు మధ్యగల దూరము. ఉత్తరపరిధి 3 మధ్యమ ముల పొడవుండవలెను; మధ్యమమనగా చాచిన మధ్యమాంగుష్ఠములకు మధ్యగల దూరము. (సూచన : శ్రౌతకర్మలయందు పై 20 సమిధలే కాక మఱొక సమిధ - అనూయాజసమిత్తు అనునది - ఉండును. కాని స్మార్తకర్మలయందు 20 సమిధలే యుండును.)

## హోమపాత్రల వివరములు

కొన్ని హోమములు నాల్గు హోమపాత్రలతోను, మఱికొన్ని ఆఱు హోమపాత్రలతోను చేయుచున్నారు. వీనికి వరుసగా చతుష్పాత్రప్రయోగము, షట్పాత్రప్రయోగము - అని పేర్లు. పితృసంబంధమైన అనేకహోమములు చతుష్పాత్రప్రయోగముతోనే చేయుచున్నారు. చతుష్పాత్రప్రయోగమునకు వాడు పాత్రలు:

**దర్వి:** ఆజ్యమును, హవిర్హవిష్యాదులను అగ్నియందు వేసి ప్రధానహోమము చేయుట కుపయోగించు పాత్ర. దీనికే "స్రుక్కు" అనియు, "ప్రధానదర్వి" అనియు పేరులు.

**ఆజ్యస్థాలి:** సంస్కరింపబడిన ఆజ్యము నుంచు పాత్ర

**ప్రోక్షణి:** పాత్రలను ప్రోక్షించి, సంస్కరించు జలముంచు పాత్ర.

**ఇతరదర్వి:** ఆజ్యమును స్రుక్కునందుంచుట కుపయోగించు పాత్ర. దీనికే "స్రువ" మనియు పేరు. ప్రధానహోమమునకు అనుషంగికమైన అనాజ్ఞాతాదిహోమములు స్రువముతోనే చేయు చున్నారు. స్రుక్స్రువములకు యాజ్ఞికులు సామాన్యముగా మోదుగాకులను వాడుట చూచు చున్నాము. అట్లుగాకున్న వీనికై కఱ్ఱతో చేసినపాత్రలు గూడ వాడవచ్చును.

ఈ క్రిందివి షట్పాత్రప్రయోగములో నుపయోగించు రెండు అదనపు పాత్రలు:

**ప్రణీత:** పూర్ణజలపాత్ర - శిరోమార్జనాదులకు వాడుకొను జలముంచు పాత్ర.

**ఇధ్మము:** పైన చెప్పినట్లుగా 20 సమిధలు గలిగి, దర్భత్రాటిచే కట్టబడిన సమిధల కట్ట.

ఆయా హోమవిధులందు చెప్పబడినట్లుగా అగ్నికి ప్రక్కన దర్భలను పఱచి, వానిపై పై పాత్రలను బోర్లించి యుంచవలెను. వివాహాదిశుభకార్యములందు వీనిని జంటజంటగా రెండు చేతులలో పట్టుకొని ఉంచవలెను. అనగా దర్విని, అజ్యస్థాలిని కుడి,ఎడమచేతులలో నొకేసారి గ్రహించి, బోర్లించి యుంచవలెను. అట్లే ప్రోక్షణిని, ప్రణీతని జంటగాను, ఇధ్మకట్టను, ఇతర దర్విని మఱొక జంటగాను కుడి, ఎడమచేతులలో నొకేసారి పట్టుకొని బోర్లించి యుంచవలెను. పితృకార్యములందు జంటగా గాక, ఒక్కొక పాత్రనే క్రమముగా బోర్లించి యుంచవలెను. ఇక

మనుష్యసంబంధమైన పాత్రలనన్నిటిని ఒకేసారి అగ్నికి సమీపమున నుంచవలెను. అనగా ఉపనయనాదులలో అవసరమైన మౌంజి, మేఖలా, వస్త్ర యజ్ఞోపవీతాదులన్నియు నొక వెండి తట్టలో నుంచి, ఆ తట్టను అగ్ని సమీపమున నుంచవలెను. పై పాత్రలే కాక, ఈ క్రింది పాత్రలును తరచుగా ఈ గ్రంథమందలి ప్రయోగములలో ప్రసక్తమగును:

**అభ్యుక్షణతోయపాత్ర:** ఇతరపాత్రలపై ప్రోక్షించుటకై నీటి నుంచు పాత్ర.

**చరుపాత్ర:** చరువును - అనగా బియ్యమును, కొంచెము పెసరపప్పును కలిపి అగ్నిపై వండుట కుపయోగించు పాత్ర.

**హవిఃపాత్ర:** హోమార్థమైన హవిస్సును (అన్నమును) ఉంచు పాత్ర.

**హవిష్యపాత్ర:** హోమార్థమైన హవిష్యమును (కూరను) ఉంచు పాత్ర.

**మేక్షణము:** దర్విని తుడుచుటకు, హవిస్సును తోడుటకు ఉపయోగించెడు సమిధ.

**ఆయామతము:** ప్రయోగోక్తవిధిగా, ఒకటిగాని రెండుగాని దర్భలకు ఉంగరపు ముడివేసి, ప్రోక్షణ్యాజ్యపాత్రాదిసంస్కారములకై వాడునట్టి పవిత్రము.

**అర్ఘ్యపాత్రలు:** శ్రాద్ధములో స్వాముల కీయవలసిన అర్ఘ్యజలము నుంచు పాత్రలు.

## పత్నీవతః ప్రేతాగ్నిసంధానక్రమః

భార్య జీవించియుండగా భర్త మరణించినను, భర్త జీవించియుండగా భార్య మరణించినను "పత్నీవతః ప్రేతాగ్నిసంధానము"ను చేసి దహనసంస్కారమును చేయవలెను. దీనికి ప్రయోగము: [13]కర్తా ఆచమ్య, ఏకదర్భకృతం పవిత్రం ధృత్వా, ఉత్థాయ,

*నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ।*
*జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః॥*

ఇత్యుక్త్వా, సభాం నమస్కృత్య, దక్షిణాం దత్వా, ప్రాచీనావీతి -

*"అశేషే హే పరిషత్. స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య ------గోత్రస్య ------*

---

[13] కర్త ఒకసారి ఆచమించి, ఒకదర్భతో కట్టిన పవిత్రమును ధరించి, లేచి నిలబడి, *"నమో బ్రహ్మణ్య దేవాయ----నమో నమః"* అని చెప్పి, సభలోని శ్రీవైష్ణవులకు నమస్కరించి, దక్షిణ సమర్పించి, ప్రాచీనావీతియై, *"అశేషే హే పరిషత్----అనుగ్రహాణ"* పర్యంతము చెప్పి, *"తథాస్తు, యోగ్యతాసిద్ధిరస్తు"*- అని బ్రాహ్మణానుజ్ఞను పొంది,

*శర్మణః* మమ పితుః ప్రేతస్య (అథవా,----*గోత్రాయాః* ----నామ్న్యాః మమ మాతుః *ప్రేతాయాః) అద్య ప్రథమేఽహని పైతృమేధికవిధినా సంస్కారార్థం ప్రేతాగ్ని సంధానం కర్తుం యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ" - ఇతి ప్రార్థ్య, "తథాస్తు, యోగ్యతాసిద్ధిరస్తు"* - ఇత్యనుజ్ఞాప్య,

[14]ఉపవీతి, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి - *"అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే అష్టావింశతితమే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరత ఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాదిషష్ఠి సంవత్సరాణాం మధ్యే ----- సంవత్సరే ---- అయనే ---- ఋతౌ -----మాసే -----పక్షే - ---తిథౌ -----వాసరే ----నక్షత్రయుక్తాయాం అస్యాం తిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీభగవత్కైఙ్కర్యరూపం ------గోత్రస్య ------శర్మణః పితుః ప్రేతస్య* (అథవా,------- *గోత్రాయాః ------నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ప్రథమేఽహని పైతృమేధిక విధినా సంస్కారార్థం ప్రేతాగ్ని సంధానం కరిష్యే "*- ఇతి సంకల్ప్య- ఉపవీతి,

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వపరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥* - ఇతి సాత్త్వికత్యాగం కృత్వా,

**అగ్ని ముఖమ్**[15]ప్రాచీనావీతి, స్థండిలం కల్పయిత్వా, [16]విపరీతముల్లిఖ్య, [17]అవాక్కరోఽభ్యుక్ష్య, [18]తృణం నిరస్య, అప ఉపస్పృశ్య, [19]*"ఓం భూర్భువస్సువరోమ్"* - ఇతి లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య, ([20]ఆత్మారూఢానలః ప్రేతశ్చేత్, తద్దక్షిణహస్తం సమిధేన స్పృష్ట్వా,

---

14 ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై, *"అస్య శ్రీభగవతః ----ప్రేతాగ్ని సంధానం కరిష్యే"* - అని సంకల్పించి, ఉపవీతియై సాత్త్వికత్యాగమును చేసి, ప్రాచీనావీతియై క్రింద చెప్పిన విధముగా అగ్నిముఖమును చేయవలెను.

15 అగ్నిప్రతిష్ఠాపనకై చతురశ్రవేదికను(స్థండిలమును) కల్పించి, దానిపై నువ్వులను చల్లి,

16 ఒకదర్భతో ఆవేదికపై తూర్పునుండి మొదలిడి పడమటికి అంతమగునట్లు వేదియొక్క ఉత్తరార్థమునందును, మధ్యను, దక్షిణార్థమునందును వరుసగా నొక్కొక్క రేఖను గీచి, అట్లే

*ఉపావరోహ జాతవేదః పునస్త్వమ్। దేవేభ్యో హవ్యం వహ నః ప్రజానన్।*
*ఆయుః ప్రజాగ్ం రయిమస్మాసు ధేహ్యజస్రో దీదిహి నో దురోణే॥*

ఇతి తత్సమిధం లౌకికాగ్నౌ ప్రహరేత్. అథవా, సమిత్సమారోపితానలే ప్రేతే,

*అజుహ్వానస్సుప్రతీకః పురస్తాదగ్నే స్వాం యోని మాసీదసాధ్యా।*
*అస్మిన్త్సధస్థే అధ్యుత్తరస్మిన్ విశ్వేదేవా యజమానశ్చసీదత॥*
*ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహ్యేనమిష్టాపూర్తే సగ్ంసృజేథామయం చ।*
*పునః కృణ్వగ్గ్ం స్త్వాపితరం యువానమన్వాతాగ్ంసీత్త్వయి తన్తుమేతమ్॥*

- ఇతి అగ్న్యారోపితసమిధం లౌకికాగ్నౌ ప్రహరేత్)

---

ఉత్తరమునుండి మొదలిడి దక్షిణమున కంతమగునట్లు మూడురేఖలను వేదియొక్క పూర్వార్ధమందు, మధ్యన, పశ్చిమార్ధములందును వరుసగా అదే దర్భతో గీచి, ఆదర్భను వేదిపై నుంచి,
[17] అభ్యుక్షణతోయపాత్రలో కొంచము నీటిని పోసికొని, దానిచే స్థండిలమును ప్రోక్షించి,
[18] దర్భను వేదిపైనుండి తీసివేసి, దానిని దక్షిణమునకు త్యజించి, నీరు ముట్టి,
[19] స్థండిలముపై *"ఓం భూర్భువస్సువరోమ్"* - అని లౌకికాగ్నిని ప్రతిష్ఠించి,
[20] ఒకవేళ గృహస్థుడు ఆత్మసమారోపణము చేసికొనియుండిన, కర్త ఒక సమిధను (గృహస్థుడే ప్రేతయైనచో) ప్రేత కుడిచేతికి తాకించి, *"ఉపావరోహ--దురోణే"*- అను మంత్రముతో ఆ సమిధను అగ్నిలో చేర్చి, లౌకికాగ్నినుండి ఔపాసనాగ్నిని పరికల్పింపవలెను. ఒకవేళ మరణించినది జీవితుడైన గృహస్థుని భార్యయైనచో ఆమెకు ఔపాసనాధికారము లేనందున, జీవించియున్న గృహస్థుని కుడిచేతికి సమిధను తాకించి దహనకర్త (సామాన్యముగా వారి జ్యేష్ఠపుత్రుడు) పై మంత్రమును చెప్పుచూ లౌకికాగ్నినుండి ఔపాసనాగ్నిని పరికల్పించి దహింపవలెను. అట్లుకాక గృహస్థుడు సమిత్సమారోపణము చేసియుండిన యెడల, అతడు గతించినను, అతని భార్య గతించినను, అట్లు సమారోపణము చేసిన సమిధను *"అజుహ్వాన"*, *"ఉద్బుధ్యస్వాగ్నే"*- అను మంత్రములతో లౌకికాగ్నిలో చేర్చి లౌకికాగ్నినుండి ఔపాసనాగ్నిని సృజించి దహింపవలెను. ఆత్మసమారోపణ, సమిత్సమారోపణవివరములకై 14వ పుటను చూడుడు. పై రెండువిధములుగా సమిధద్వారా లౌకికాగ్నిలో చొప్పించిన అగ్నికి ధార్యాగ్ని యని పేరు.

[21]తతః అగ్నిం ప్రజ్వాల్య, ప్రాక్తోయం నిధాయ, [22]విపరీతం పరిస్తీర్య, [23]అగ్నేర్దక్షిణతో ఏకం దర్భం దక్షిణాగ్రం సంస్తీర్య, తత్ర దర్వీం, ఆజ్యస్థాలీం, ప్రోక్షణీం, ఇతరదర్వీం చ ఏకైకశః సాదయిత్వా, [24]ఏకదర్భేణ ఆయామితం కృత్వా, ప్రోక్షణీపాత్రే నిక్షిప్య, [25]ఆదాయ, జలేన పూరయిత్వా, విపరీతం త్రిరుత్పూయ, [26]పాత్రాణి ఉత్తానాని కృత్వా, [27]ప్రోక్షణీజలేన ప్రోక్ష్య, శేషముత్సృజ్య, అన్యజ్జలం పూరయిత్వా, ఉత్తరతో నిధాయ, [28]ఆయామితం ఆజ్యస్థాల్యాం నిధాయ, ఆజ్యం విలాప్య,

---

[21] అగ్నిని ప్రజ్వలింపజేసి, అభ్యుక్షణతోయపాత్రలోని నీటిని పరిహరించి (పారబోసి), వేఱే నీటి నందులో నింపి, ఆ పాత్రను వేదికకు తూర్పున ముందు వేయబోవు పరిస్తరణల కవతల నుంచి,

[22] దక్షిణమునుండి మొదలిడి అప్రదక్షిణముగా ఒక్కొక దర్భను ఆ అగ్నికి చుట్టును పరిస్తరించి (అనగా తూర్పుపశ్చిమములందు వేయు దర్భలను దక్షిణాగ్రములుగను, ఉత్తరదక్షిణము లందు వేయు దర్భలను పూర్వాగ్రములుగాను, దక్షిణమునుండి మొదలిడి అప్రదక్షిణముగా వేసి, ఉత్తరదిశలో వేసిన దర్భను ప్రాక్పశ్చిమముగా వేసిన దర్భల మొదళ్లపై నుండునట్లును, దక్షిణమున వేసిన దర్భను ప్రాక్పశ్చిమముగా వేసిన దర్భల కొనలకు క్రిందుగా నుండునట్లును పవరించవలెను. (ఇట్లు దర్భలుంచుటకు *"దక్షిణాగ్రైః పశ్చాత్"*, *"దక్షిణా ప్రాగైర్వా"* - అను ఆపస్తంబగృహ్యసూత్రములు ప్రమాణములు.)

[23]అగ్నికి దక్షిణమునకు దక్షిణాగ్రముగా ఒకదర్భను పరచి, ఆ దర్భపై ఉత్తరమునుండి దక్షిణ మునకు వరుసగా దర్విని(స్రుక్కును), ఆజ్యస్థాలీని, ప్రోక్షణీపాత్రను, ఇతరదర్విని(స్రువమును) ఒక్కొకటిగా తీసికొని బోర్లించి ఉంచవలెను.

[24] ఆ తర్వాత ఒక దర్భతో ఆయామితపవిత్రమును చేసి, దానిని ప్రోక్షణీపాత్రలో నుంచి,

[25] ఆ ప్రోక్షణీపాత్రను తన ముందుంచుకొని, దానిలో నీటిని పోసి, అయామితముచేత మూడు సార్లు ఉత్పూరణము (అనగా, కొన దక్షిణమునకుండునట్లు ఆయామితం రెండుకొనలను రెండుచేతుల అనామికాంగుష్ఠములచే గ్రహించి ప్రోక్షణిలోని నీటికి తాకించుచూ మూడుసార్లు తూర్పునుండి పశ్చిమమునకు త్రిప్పుట) చేసి,

[26] అగ్నికి దక్షిణమున దర్భపై బోర్లించియుంచిన ఇతరపాత్రలను వెల్లకిల త్రిప్పి పెట్టి,

[27] ప్రోక్షణీపాత్రలోని జలముతో వానిని ప్రోక్షించి, ప్రోక్షణిలో మిగిలిన జలమును పారబోసి, అందులో వేఱే జలమును నింపి, దానిని తన ముందు ఎడమవైపుంచుకొని,

[28] ఆయామితాన్ని ప్రోక్షణిలోనుండి తీసి నేతిపాత్రలోనుంచి, అందులో నేతిని నింపి,

[29]దక్షిణతోంఽగారాన్నిరూహ్య, తేష్వధిశ్రిత్య, [30]జ్వలతా తృణేనావద్యోత్య, [31]ఏకదర్భాగ్రం ప్రత్యస్య విపరీతం త్రిః పర్యగ్ని కృత్వా దక్షిణతః ఉద్వాస్య, [32]అంగారానగ్నౌ ప్రత్యూహ్య, దక్షిణాగ్రాయామతేన విపరీతం త్రిరుత్పూయ, [33]పవిత్రగ్రంథిం విస్రస్య, అప ఉపస్పృశ్య, ప్రత్యగ్రమగ్నౌ ప్రహరతి. [34]దర్వీన్నిష్టప్య, దర్భేణ సంమృజ్య, పునర్నిష్టప్య, ప్రోక్ష్య, నిధాయ, అద్భిః సంస్పృశ్య, అగ్నౌ ప్రహృత్య, [35]అగ్నిమప్రదక్షిణం పరిషిచ్య, దర్వ్యాం ద్వాదశగృహీతేనాజ్యేన జుహోతి:

---

[29] దక్షిణమువైపు అగ్ని నుండి కొన్ని నిప్పులను వేఱుగా తీసికొని, వానిపై ఆ నేతిపాత్ర నెక్కించి,

[30] ఒక దర్భను నిప్పుతో నంటించి, ఆ జ్వాల నేతిపాత్రయందు ప్రతిబింబించునట్లుగా దర్భను చూపించి (ఇదియే అవద్యోతనము), ఆ దర్భను పారవేసి,

[31] ఒక దర్భాగ్రమును త్రుంచి, కడిగి, నేతిపాత్రలో నుంచి, నేతిపాత్ర నొక జ్వలితదర్భచేత అప్రదక్షిణముగా మూడుసార్లు చుట్టి, ఆ దర్భను దక్షిణమునకు పరిత్యజించి,

[32] అగ్ని నుండి వేఱుగా తీసికొన్న నిప్పులను తిరిగి అగ్నిలో చేర్చి, దక్షిణాగ్రాయామతంతో నేతిని మూడుసార్లు విపరీతంగా తూర్పునుండి పడమర కుత్పూరణము చేసి,

[33] ఆయామతము ముడివి విప్పి, దానిని ప్రోక్షణీజలములో తడిపి, కొనలు పడమటి కుండునట్లు పట్టుకొని అగ్నియందు వేయవలెను.

[34] ప్రధానదర్విని(స్రుక్కును) కుడిచేత, ఇతరదర్విని (స్రువమును) ఎడమచేత ఒకేసారి గ్రహించి, వాని నగ్నిపై కాచి, ఆ రెంటిని ఎడమచేతిలో పట్టుకొని, కుడిచేత నొక దర్భను తీసికొని ఆ దర్భతో వానిని తుడిచి, ఆ దర్భను ప్రక్కకు పెట్టి మఱల మునుపటివలె వానిని రెండుచేతులలో పట్టుకొని అగ్నిపై కాచి, మఱల వానిని ఎడమచేతిలో పట్టుకొని, కుడిచేతితో ఇదివఱకు వానిని తుడిచిన దర్భతో ప్రోక్షణిలోని నీటిని వానిపై ప్రోక్షించి, మఱల వానిని రెండుచేతులలో పట్టుకొని, ఆజ్యపాత్రకు ఎడమవైపు ఎడమచేతిలోని దర్విని (స్రువమును), కుడికి కుడిచేతిలోని దర్విని (స్రుక్కును) ఉంచి, తుడిచిన దర్భను ప్రోక్షణిలోని నీటితో తాకి, దాని నగ్నిలో పడవేయవలెను.

[35] తరువాత అగ్నిని అప్రదక్షిణముగా పరిషేచనము చేసి, స్రువముతో స్రుక్కులోనికి 12 సార్లేసి నేతిని గ్రహించుచూ 1-2 మంత్రములతో హోమము చేయవలెను.(సూచన: హోమము చేయునప్పుడు ప్రధానదర్విని ఎడమచేతిలో పట్టుకొని, ఏకం, ద్వే, త్రీణి, చత్వారి, పంచ, షష్ఠ, సప్త, అష్టౌ, నవ, దశ, ఏకాదశ, ద్వాదశ - అని చెప్పుచూ 12 సార్లు ఇతరధర్విచేత దానిలో నేతిని వేసికొని, ఆ తర్వాత ఇతరదర్విని నేలపై నుంచి, ప్రధానదర్విని కుడిచేతిలో పట్టుకొని, ఎడమ

1. ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం నమమ।
2. అయాశ్చాగ్నే ఽస్యనభిశస్తిశ్చ సత్యమిత్త్వమయా అసి। అయసా మనసా ధృతోఽయసా హవ్యమూహిషేఽయా నో ధేహి భేషజగ్గ్ం స్వాహా। అగ్న యే అయస ఇదం నమమ।

[36]ఇతి హుత్వా, ఇతరదర్వ్యా సకృద్గృహీతాజ్యేన అనాజ్ఞాతహోమం జుహోతి.

3. అనాజ్ఞాతం యదాజ్ఞాతం యజ్ఞస్య క్రియతే మిథు। అగ్నే తదస్య కల్పయ। త్వగ్ం హి వేత్థ యథా తథగ్గ్ం స్వాహా। అగ్న య ఇదం నమమ।
4. పురుషసమ్మితో యజ్ఞో యజ్ఞః పురుషసమ్మితః। అగ్నే తదస్య కల్పయ। త్వగ్ం హి వేత్థ యథా తథగ్గ్ం స్వాహా। అగ్న య ఇదం నమమ।
5. యత్పాకత్రా మనసా దీనదక్షా న యజ్ఞస్య మన్వతే మర్తాసః। అగ్నిష్టద్ధోతా క్రతువిద్విజానన్యజిష్ఠో దేవాగ్ం ఋతుశో యజాతి స్వాహా। అగ్న య ఇదం నమమ।
6. శ్రీవిష్ణవే స్వాహా। విష్ణవే పరమాత్మన ఇదం నమమ।

[37]ఇతి హుత్వా, అగ్నిమప్రదక్షిణం పరిషిచ్య, యథావసరం ఉపఘాతప్రాయశ్చిత్తం చ కృత్వా, ఔపాసనంకుర్యాత్.

**ఉపఘాతప్రాయశ్చిత్తమ్** [38]అనంతరం "ఉపఘాతప్రాయశ్చిత్తం కరిష్యే" - ఇతి సంకల్ప్య,

---

చేతితో నేతిపాత్రను తాకుచు, "స్వాహా"- అని పలికిన తర్వాత ప్రధానదర్విలోని నేతిని అగ్నిలో నుంచవలెను. "చతుర్గృహీతేనాజ్యేన జుహోతి"- అన్నప్పుడు "ఏకం, ద్వే, త్రీణి, చత్వారి" - అని నాల్గు సార్లు ప్రధానదర్విలోనికి నేతిని వేసికొని, పైవిధముగనే అగ్నిలో నుంచవలెను).

36 తదుపరి స్రువములోనికి ఒకసారి మాత్రము నేతిని తీసికొనుచూ 3-6 మంత్రములతో అనాజ్ఞాతహోమమును చేయవలెను.

37 ఇట్లు హోమము చేసి, అగ్నిని అప్రదక్షిణముగా పరిషేచనము చేసి, అవసరమైనచో ఉపఘాత ప్రాయశ్చిత్తమును గూడ చేసి, ఆ తర్వాత ఔపాసనమును చేయవలెను.

38 పై అగ్నిసంధానములో ఆత్మసమారోపణ, లేక సమిత్సమారోపణ చేసిన సమిధను అగ్నిలో చేర్చియుండినచో, ఆ సమిధ మాలిన్యపరిహారార్థము "ఉపఘాతప్రాయశ్చిత్తం కరిష్యే" - అని

*1. పునస్త్వా౽౽దిత్యా రుద్రా వసవస్సమిన్ధతాం పునః బ్రహ్మాణో వసునీథ యజ్ఞైః ఘృతేన త్వం తనువో వర్ధయస్వ సత్యాస్సన్తు యజమానస్య కామాస్స్వాహా/ అగ్నయ ఇదం నమమ/*

*2. ఓం భూర్భువస్సువస్స్వాహా/ప్రజాపతయ ఇదం నమమ/ 1*

ఇతి ద్వాభ్యాం హుత్వా, అనంతరం అనాజ్ఞాతం, పురుషసమ్మితః, యత్పాకత్రాది మంత్రైః హోమం కుర్యాత్.

## ప్రేతస్య ఔపాసనవిధిః

[39]*కర్తా ఉపవీతి, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి, "పూర్వోక్త ఏవంగుణవిశేషణవిశిష్టాయామస్యాం తిథౌ అనేకకాలసాయంప్రాతరాహుతీనాం అకరణప్రాయశ్చిత్తార్థం ప్రాజాపత్యకృచ్ఛ్రప్రతినిధి కించిద్ధిరణ్యం, ఔపాసనద్రవ్యదానం, స్థాలీపాకద్రవ్యదానం చ హిరణ్యరూపేణ కరిష్యే." - ఇతి సంకల్ప్య*

---

సంకల్పించి, 1,2 మంత్రములతో హోమం చేసి, తదుపరి క్రింద చెప్పినట్లుగా అనాజ్ఞాతం, పురుషసమ్మితః, యత్పాకత్రాదిమంత్రములతో అనాజ్ఞాతహోమమును చేయవలెను.

[39]తరువాత ప్రేతార్థము కర్త ఔపాసన చేయవలెను. దీనికి వివరణ: ఆమరణాంతము గృహస్థుడు నిత్యౌపాసనమును చేయవలెను. మరణానంతరము కూడ దహనకర్త క్రింద చెప్పినట్లుగా ప్రేత తరపున ఔపాసన చేసి, ఆ ఔపాసనాగ్నియందే అవసరమైన ప్రాయశ్చిత్తాదులన్నియు చేసి, యథావసరముగా పితృమేధహోమమును కూడ అందే చేసి, ఆ అగ్నితోనే ప్రేతను దహింప వలెను. అందుచేత ఇక్కడ ఔపాసన యనగా "ప్రేతార్థమైన ఔపాసన" అని యర్థము. కాని అందుకు ముందుగా ప్రేత చాలా కాలమునుండి ఔపాసన చేయనందుకు ప్రాయశ్చిత్తార్థము హిరణ్యదానమును, తండులదానమును చేయవలెను. దీనికై కర్త ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై *"పూర్వోక్త.....కరిష్యే"* - అని సంకల్పము చెప్పి, *"హిరణ్యగర్భ...", "తండులా.."* అను రెండుశ్లోకములు చెప్పి భూమిపై జలమును, తిలలను పితృతీర్థముతో విడిచి ఒక శ్రోత్రియునకు తండులదానము చేసి, ఆ తర్వాత 3 రూ.లకు తక్కువ కాకుండ ప్రాజాపత్యకృచ్ఛ్ర ప్రతినిధిగా హిరణ్యదానమును చేయవలెను.

*హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।*

*అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

*తండులావైశ్వదేవత్యాః పాకేనాన్నం పచంతి యే।*

*తస్మాత్తండులదానేన అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

ఇతి తండులదానం కృత్వా, *"ఇదమౌపాసన, స్థాలీపాకద్రవ్యదానం ప్రాజాపత్య కృచ్ఛ్రప్రతినిధి యత్కించిద్ధిరణ్యం -----గోత్రాయ ----శర్మణే శ్రీవైష్ణవాయ తుభ్య మహం సంప్రదదే నమమ"*- ఇతి పితృతీర్థేన భూమౌ జలేన తర్పయిత్వా విప్రాయ దద్యాత్.

[40]ఉపవీతి, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి, *"శ్రీభగవదాజ్ఞయా శ్రీభగవత్కైఙ్కర్య రూపం పితుః ప్రేతస్య పూర్వేద్యుః సాయమౌపాసనం అద్య ప్రాతరౌపాసనం చ హోష్యామి"* - ఇతి సంకల్ప్య, [41]అగ్నిమప్రదక్షిణం పరిషిచ్య, మృతస్య భార్యాయాః కరే తండులాన్నిధాయ, ప్రేత కరస్పర్శనం కారయిత్వా, ప్రోక్ష్య, ఏకాం సమిధమగ్నిమాదాయ, తండులాని ద్వేధా విభజ్య, తయోరేకభాగం పునర్ద్వేధా విభజ్య, ఏకైకభాగేన

*ఓం అగ్నయే స్వాహా। అగ్నయ ఇదం నమమ।*

*ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా। అగ్నయే స్విష్టకృత ఇదం నమమ।*

- ఇతి జుహుయాత్. శేషతండులాని పునర్ద్వేధా విభజ్య, ఏకైకభాగేన

---

[40] తరువాత ఔపాసనము చేయుటకై కర్త ఉపవీతియై ప్రాణాయామము చేసి, ఆ తర్వా ప్రాచీనావీతియై, *"శ్రీభగవదాజ్ఞయా---హోష్యామి"* - అని సంకల్పించవలెను.

[41] తరువాత అగ్ని నప్రదక్షిణముగా పరిషేచించి, మృతుని భార్యచేతిలో బియ్యమును పో ప్రేతచేతికి తాకించి, ప్రోక్షించి, అమంత్రకముగా అగ్నిలో ఒక సమిధను చేర్చి, ఆ బియ్యము రెండు భాగములు చేసి, అందులోని ఒక భాగమును మఱల రెండు భాగములు చేసి, ఆ రెండు భాగములను వరుసగా *"ఓం అగ్నయే స్వాహా। అగ్నయ ఇదం నమమ।"*, *"ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా। అగ్నయే స్విష్టకృత ఇదం నమమ।"*- అను మంత్రముల హోమము చేయవలెను. ఇప్పుడు మిగిలిన అర్ధభాగమును మఱల రెండు భాగములు చేసి, భాగములతో వరుసగా *"ఓం సూర్యాయ స్వాహా। సూర్యాయేదం నమమ।"*, *"ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా। అగ్నయే స్విష్టకృత ఇదం నమమ।"* - అను మంత్రములతో హోమం చేసి

ఓం సూర్యాయ స్వాహా/ సూర్యాయేదం నమమ/
ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా/ అగ్నయే స్విష్టకృత ఇదం నమమ//

ఇతి హుత్వా, [42]తదనంతరం ఏకం సమిధమాదాయ, పునరప్రదక్షిణం పరిషిచ్య, ఆజ్య మితరదర్వ్యాం గృహీత్వా,

1. అనాజ్ఞాతం యదాజ్ఞాతం యజ్ఞస్య క్రియతే మిథు/ అగ్నే తదస్య కల్పయ/ త్వగ్ం హి వేత్థ యథా తథగ్గ్ం స్వాహా/ అగ్నయ ఇదం నమమ/ కల్పయ
2. పురుషసమ్మితో యజ్ఞో యజ్ఞః పురుషసమ్మితః/ అగ్నే తదస్య కల్పయ/ త్వగ్ం హి వేత్థ యథా తథగ్గ్ం స్వాహా/ అగ్నయ ఇదం నమమ/
3. యత్పాకత్రా మనసా దీనదక్షాన యజ్ఞస్య మన్వతే మర్త్యాసః/ అగ్నిష్టద్ధోతా క్రతు విద్విజానన్యజిష్ఠో దేవాగ్ం ఋతుశో యజాతి స్వాహా/ అగ్నయ ఇదం నమమ/
4. శ్రీవిష్ణవే స్వాహా/ విష్ణవే పరమాత్మన ఇదం నమమ/

ఇతి హుత్వా, అగ్నిమప్రదక్షిణం పరిషిచ్య, విహితవివిధప్రాయశ్చిత్తాని తదేవాగ్నౌ కృత్వా, సంస్కుర్యాత్.

[42] మరియొక సమిధను అమంత్రకముగా అగ్నిలో చేర్చి, అగ్నిని అప్రదక్షిణముగా పరిషేచ నము చేసి, ఇతరదర్విలోనికి ఒకమారు మాత్రమే ఆజ్యమును తీసికొనుచు 1-4 మంత్రములతో అనాజ్ఞాతహోమమును చేసి, అవసరమైన ప్రాయశ్చిత్తాదులన్నియు చేసి, ఆ అగ్నితోనే ప్రేతను దహింపవలెను. వివరణ: ఒకవేళ భార్యయే ముందుగా మరణించినచో, భర్తచేతిలో బియ్య మును పోసి, మృతురాలైన భార్యచేతి కా బియ్యమును తాకించి, పైవిధముగనే విభజించి పై నాల్గు ఔపాసనహోమములను చేయవలెను. ఒకవేళ జీవితురాలైన భార్యగాని, జీవితుడైన భర్త గాని, అట లేకున్నచో, "హోష్యామి, "జుహుధి" అనుకొని (అనగా "హోమం చేస్తున్నాను" - అని అనగా, "చేయండి" - అని అక్కడ లేని వ్యక్తి చెప్పినట్లుగా భావించుకొని) పై రీతిగనే బియ్యమును నాల్గుభాగములు చేసి, నాల్గు హోమములను చేయవలెను. దీని విధానము ముందు చెప్పబడినది.

*మమ మాతః ప్రేతే)"* - ఇత్యపసవ్యముత్సృజ్య, ఆతురవ్యంజనం చ కృత్వా, అనంతరం ప్రభూతం తటాకే నిక్షిప్య స్నాయాత్.

## *జ్ఞాతీనాం వాసోదక, తిలోదకవిధిః*

[181]ప్రతిదినముదకదానం కర్తుమశక్తాః జ్ఞాతయః దశమేఽహని పాషాణోద్వాసనాత్పూర్వ మేవ సర్వాంగవపనం కృత్వా, స్నాత్వా, ఆర్ద్రవాసాః, శ్రీమూర్ణరహితోర్ధ్వపుండ్రాన్ ధృత్వా, త్రింశతితమవాసోదకాని, పంచసప్తతితమతిలోదకాని చ పాషాణే దద్యుః. యది దశమేఽహని శుక్రవారశ్చేత్ తన్నవమేఽహన్యేవ వపనం కృత్వా, దశమేఽహని వాసోదక, తిలోదకాని దద్యుః.

[182]*ప్రయోగః:* జ్ఞాతికర్తా దర్భం ధారయమాణః, దర్భే ఆసీనః, ఉపవీతి, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి, *"ఓం శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవ స్వతమన్వంతరే అష్టావింశతితమే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్టి*

---

[181] కర్తతో కలిసియే యుండినయెడల జ్ఞాతులు ప్రతిదినమూ కర్తలు వాసోదక, తిలోదకములను విడిచిన పిదప తాముసు విడువవలెను. అట్లు వసతిలేకున్న, పదవనాడు జ్ఞాతులు కర్త స్థాపించిన పాషాణమునకు కర్తకంటె పూర్వమే 10 రోజులపాటు బాకీపడిన 30 వాసోదకములను, 75 తిలోదకములను విడువవలెను. ఇందులకై జ్ఞాతులు ప్రొద్దుననే సర్వాంగక్షౌరము చేయించుకొని, స్నానము చేసి, తడిబట్టను కట్టుకొని, శ్రీమూర్ణరహితముగా ఊర్ధ్వపుండ్రములను పెట్టుకొని సిద్ధము కావలెను. ఒకవేళ 10వదినము శుక్రవారమైనయెడల, 9వ నాడే క్షౌరము చేయించుకొని, పదవనాడు వాసోదకతిలోదకములను విడువవలెను. దీని ప్రయోగమిట్లున్నది:

[182] జ్ఞాతికర్త ఒకదర్భచే కట్టిన పవిత్రమును ధరించి, ఒక దర్భను ఆసనముగా వేసుకొని, ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై *"ఓం శ్రీ గోవింద, గోవింద, గోవింద - ప్రేతతృప్త్యర్థం -----అహని దేయమేతద్వాసోదకం దదామి"* - అని చెప్పుచూ, మూడుమడతలుగా మడచిన వాసోదకవస్త్రము మధ్య ఒకదర్భను, నువ్వులను చేర్చి, *"దదామి"* అన్నప్పుడెల్లా ఆ బట్టను రెండుచేతులయొక్క బొటన వ్రేలు, చూపుడువ్రేళ్లకు మధ్య పట్టుకొని, చెంబులోని నీటిలో తడిపి మూడుసార్లు పాషాణముపై పిండుచూ, మొత్తము 30 వాసోదకముల నీయవలెను.

*సంవత్సరాణాం మధ్యే ----- సంవత్సరే ---- అయనే ---- ఋతౌ ----- మాసే ----- పక్షే ---- తిథౌ ---- వాసరే ---నక్షత్రయుక్తాయాం అస్యాం తిథౌ -----గోత్రాయ ---- శర్మణే జ్ఞాతిభూతప్రేతాయ (అథవా, -----గోత్రాయై ----నామ్న్యై జ్ఞాతిప్రేతాయై జ్ఞాతిభూతాయై) అద్య దశమేఽహని దహనజనితక్షుత్తృష్ణాదాహతాపోపశమనార్థం, ప్రేతాప్యాయనార్థం, ప్రేతతృప్త్యర్థం*

*ప్రథమేఽహని దేయమేతద్వాసోదకం దదామి,*

*ద్వితీయేఽహని దేయమేతద్వాసోదకం దదామి,*

*తృతీయేఽహని దేయమేతద్వాసోదకం దదామి,*

*చతుర్థేఽహని దేయమేతద్వాసోదకం దదామి,*

*పంచమేఽహని దేయమేతద్వాసోదకం దదామి,*

*షష్ఠేఽహని దేయమేతద్వాసోదకం దదామి,*

*సప్తమేఽహని దేయమేతద్వాసోదకం దదామి,*

*అష్టమేఽహని దేయమేతద్వాసోదకం దదామి,*

*నవమేఽహని దేయమేతద్వాసోదకం దదామి,*

*దశమేఽహని దేయమేతద్వాసోదకం దదామి"*

**ఇతి సంకల్ప్య, తిథివత్త్రింశతితమవాసోదకాని దద్యాత్.[183] అనన్తరం,**

---

[183] తరువాత, *"అస్యాం తిథౌ ----గోత్రాయ ----శర్మణే --- దేయమేతత్తిలోదకం దదామి"* - అని చెప్పుచూ, *"దదామి"* - అన్నపుడెల్లా ప్రథమదినమున మూడుసార్లతో ఆరంభించి, ఆ తరువాత ప్రతిదినము పూర్వదినముకంటె ఒకటిచొప్పున అధికము చేయుచు పోయి, పది దినములకుగాను మొత్తము 75 తిలోదకములను పితృతీర్థముచే విడువవలెను. తరువాత పాషాణావాహితప్రేతకు హిరణ్యసహితముగా తాంబూలము నొసగి, లేచి నిలుచుండి *"----గోత్ర ----శర్మన్ -- తృప్తోభవ! తృప్తోభవ! తృప్తోభవ!* (స్త్రీలకు, *తృప్తా భవ! తృప్తా భవ! తృప్తా భవ!* అని చెప్పవలెను)" - అని చెప్పి నమస్కరింపవలెను. తర్వాత స్నానము చేసి, ఊర్ధ్వపుండ్రాదులను ధరింపవలెను. అనందహోమానన్తరం జ్ఞాతులందఱును శ్రీమార్జనహితోర్ధ్వపుండ్రములను ధరింపవచ్చును.

*"అస్యాం తిథౌ ----గోత్రాయ ----శర్మణే జ్ఞాతిభూతప్రేతాయ (అథవా, ----- గోత్రాయై ----నామ్న్యై జ్ఞాతిప్రేతాయై జ్ఞాతిభూతాయై) అద్య దశమేఽహని దహన జనితక్షుత్తృష్ణాదాహతాపోపశమనార్థం, ప్రేతాప్యాయనార్థం ప్రేతతృప్త్యర్థం*

*ప్రథమేఽహని దేయమేతత్తిలోదకం దదామి (ఇతి త్రివారం),*

*ద్వితీయేఽహని దేయమేతత్తిలోదకం దదామి (ఇతి చతుర్వారం),*

*తృతీయేఽహని దేయమేతత్తిలోదకం దదామి (ఇతి పంచవారం),*

*చతుర్థేఽహని దేయమేతత్తిలోదకం దదామి (ఇతి షడ్వారం),*

*పంచమేఽహని దేయమేతత్తిలోదకం దదామి (ఇతి సప్తవారం),*

*షష్ఠేఽహని దేయమేతత్తిలోదకం దదామి (ఇత్యష్టవారం),*

*సప్తమేఽహని దేయమేతత్తిలోదకం దదామి (ఇతి నవవారం),*

*అష్టమేఽహని దేయమేతత్తిలోదకం దదామి (ఇతి దశవారం),*

*నవమేఽహని దేయమేతత్తిలోదకం దదామి (ఇత్యేకాదశవారం),*

*దశమేఽహని దేయమేతత్తిలోదకం దదామి (ఇతి ద్వాదశవారం),*

*తాంబూలసహితహిరణ్యం దదామి"*

ఇతి తిలోదకాని పితృతీర్థేన దత్వా, అనంతరం హిరణ్యసహితతాంబూలం ప్రేతాయ దద్యాత్. తతః ఉత్థాయ, *"-----గోత్ర -----శర్మన్ పితః ప్రేత (అథవా, -----గోత్రే -----నామ్ని మాతః ప్రేతే) మయా దత్తాని ఏతద్వాసోదకాన్యుపతిష్ఠ, ఏతత్తిలోదకాన్యుపతిష్ఠ, తాంబూలసహితహిరణ్యముపతిష్ఠ-నారాయణ నమస్తేఽస్తు శంఖచక్రగదాధర! అక్షయ్య వాసోదకతిలోదకప్రదానైః ప్రేత తృప్తికరో భవ! తృప్తో భవ! తృప్తో భవ! తృప్తో భవ! (స్త్రీణాం, తృప్తా భవ! తృప్తా భవ! తృప్తా భవ!)* - ఇత్యుక్త్వా ప్రణమేత్. తతః కర్తా స్నాత్వా ఊర్ధ్వపుండ్రాదికం ధారయేత్. అనందహోమానన్తరం జ్ఞాతయః శ్రీమార్జనసహితోర్ధ్వ పుండ్రాన్ ధారయేయుః.

## దేశాన్తరజ్ఞాతీనాం తిలోదకదానవిధిః

ఒకవేళ జ్ఞాతులు దేశాంతరమందుగాని, గ్రామాంతరమందుగాని ఉండి, 10వ రోజు కర్తృ గ్రామమునకు రాలేకపోయినచో వారున్నచోటనే సర్వాంగవపనము చేయించుకొని, 75 తిలోదకములను మాత్రము విడువవలెను (వాసోదకము లక్కఱలేదు.) దీనికి ప్రయోగము:

*ప్రయోగః:* [184]జ్ఞాతయః దశమేఽహని సర్వాంగవపనం కృత్వా, స్నాత్వా, ఆర్ద్ర వాసాః, శ్రీమార్జరహితోర్ధ్వపుండ్రాన్ ధృత్వా, నదీ (అథవా తటాక,కూప) తీరే ఏకదర్భకృతే భుగ్నే ప్రేతమావాహ్య, పంచసప్తతితమతిలోదకాని దద్యుః. యది దశమేఽహని శుక్రవారశ్చేత్ తన్నవమేఽహన్యేవ వపనం కృత్వా, దశమేఽహని తిలోదకాని దద్యుః.

[185]*ప్రయోగః:* ఉపవీతినః జ్ఞాతయః త్రిః ప్రాణానాయమ్య, ప్రాచీనావీతినః, *"అస్యాం తిథౌ ----గోత్రాయ ----శర్మణే జ్ఞాతిభూతప్రేతాయ (అథవా, ------గోత్రాయై----- నామ్న్యై జ్ఞాతిప్రేతాయై జ్ఞాతిభూతాయై) అద్య దశమేఽహని దహనజనితక్షుత్తృష్ణా దాహతాపోపశమనార్థం, ప్రేతాప్యాయనార్థం ప్రేతతృప్త్యర్థం పంచసప్తతితిలోదకాన్*

---

[184] జ్ఞాతులు 10వ నాటి ప్రొద్దునవే సర్వాంగక్షౌరము చేయించుకొని, స్నానము చేసి, తడిబట్టను కట్టుకొని, శ్రీమార్జరహితంగా ఊర్ధ్వపుండ్రములను పెట్టుకొని, నదీ, లేక తటాక, లేక కూప తీరమునందు ఒక దర్భచే కట్టిన భుగ్నముపై ప్రేత నావాహనము చేసి, దానికి 75 తిలోదకము లను మాత్ర మీయవలెను (అనగా వాసోదకము లక్కఱ లేదు). ఒకవేళ 10వ దినము శుక్రవార మైనయెడల, 9వ నాడే క్షౌరమును చేయించుకొని, 10వనాడు తిలోదకములను విడువవలెను.

[185] దీనికై జ్ఞాతులుపవీతులై మూడుసార్లు ప్రాణాయామము చేసి, తదుపరి ప్రాచీనావీతులై, *"అస్యాం తిథౌ ---పంచసప్తతితిలోదకాన్ కరిష్యే"*- అని సంకల్పించి, ఒక ఆకులో దక్షిణాగ్ర ముగా ఒక దర్భను వేసి, దానిపై ఒక దర్భతో కట్టిన భుగ్నమును దక్షిణాగ్రముగా నుంచి, *"----గోత్రం ----శర్మాణం జ్ఞాతిభూతం ప్రేతం (అథవా, ----గోత్రాం -----నామ్నీం జ్ఞాతిప్రేతాం) ఆవాహయామి"* - అని ఆ భుగ్నముపై తిలలను వేసి ప్రేత నావాహనము చేసి, పైన చెప్పిన రీతిగా మొత్తం 75 తిలోదకముల నిచ్చి, దక్షిణాతాంబూలముల నొసగి, ఉపస్థానమును కూడ చేసి, *"ప్రేతం యథాస్థానం విసర్జయామి"*- అని భుగ్నముపై తిలలను చల్లి ప్రేతను విసర్జించి, ఆ భుగ్నమును నీటిలో పడవేసి, స్నానము చేసి శ్రీమార్జసహితోర్ధ్వపుండ్రములను ధరింపవలెను.

*దదామి"* - ఇతి సంకల్ప్య, దక్షిణాగ్రమేకం దర్భం నిధాయ, తస్యోపరి ఏకదర్భఖుగ్నం దక్షిణాగ్రం సంస్థాప్య, *"-----గోత్రం -----శర్మాణం జ్ఞాతిభూతం ప్రేతం (అథవా, ----గోత్రాం -----నామ్నీం జ్ఞాతిప్రేతాం) ఆవాహయామి"* - ఇతి ఖుగ్నోపరి తిలాన్ వికీర్య ప్రేతం (ప్రేతాం) ఆవాహ్య,

*ప్రథమేఽహని దేయమేతత్తిలోదకం దదామి* (ఇతి త్రివారం),

*ద్వితీయేఽహని దేయమేతత్తిలోదకం దదామి* (ఇతి చతుర్వారం),

*తృతీయేఽహని దేయమేతత్తిలోదకం దదామి* (ఇతి పంచవారం),

*చతుర్థేఽహని దేయమేతత్తిలోదకం దదామి* (ఇతి షడ్వారం),

*పంచమేఽహని దేయమేతత్తిలోదకం దదామి* (ఇతి సప్తవారం),

*షష్ఠేఽహని దేయమేతత్తిలోదకం దదామి* (ఇత్యష్టవారం),

*సప్తమేఽహని దేయమేతత్తిలోదకం దదామి* (ఇతి నవవారం),

*అష్టమేఽహని దేయమేతత్తిలోదకం దదామి* (ఇతి దశవారం),

*నవమేఽహని దేయమేతత్తిలోదకం దదామి* (ఇత్యేకాదశవారం),

*దశమేఽహని దేయమేతత్తిలోదకం దదామి* (ఇతి ద్వాదశవారం),

*తాంబూలసహితహిరణ్యం దదామి"*

**ఇతి తిలోదకాని పితృతీర్థేన దత్వా, అనంతరం హిరణ్యసహితతాంబూలం ప్రేతాయ** దద్యుః. తతః ఉత్థాయ, *"-----గోత్ర -----శర్మన్ పితః ప్రేత (అథవా, -----గోత్రా ----నామ్ని మాతః ప్రేతే) మయా దత్తాని ఏతద్వాసోదకాన్యుపతిష్ఠ, ఏతత్తిలోదకాన్యుపతిష్ఠ, తాంబూలసహితహిరణ్యముపతిష్ఠ* - *నారాయణ నమస్తేఽస్తు శంఖచక్రగదాధర! అక్షయ్య వాసోదకతిలోదకప్రదానైః ప్రేత తృప్తికరో భవ! తృప్తో భవ! తృప్తో భవ! తృప్తో భవ! (ప్రీణాం, తృప్తా భవ! తృప్తా భవ! తృప్తా భవ!)* - ఇత్యుపస్థాయ, *"ప్రేతం యథాస్థానం విసర్జయామి"* - ఇతి ఖుగ్నోపరి తిలాన్ వికీర్య ప్రేతం (ప్రేతాం) విసర్జ్య, ఖుగ్నం జలే ప్రక్షిప్య, స్నాత్వా, శ్రీమార్జసహితోర్ధ్వపుండ్రాన్ ధారయేయుః.

## పాషాణోత్థాపనమ్

[186]అథ కర్తా స్నాత్వా, ఊర్ధ్వపుండ్రాదికం ధృత్వా, ప్రాచీనావీతి,
*నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ।*
*జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః॥*

ఇత్యుక్త్వా, కృష్ణతిలాన్ వికీర్య, బ్రాహ్మణాన్ ద్విః ప్రణమ్య, ప్రాచీనావీతి, *"అశేషే హే పరిషత్- స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య -----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, -----గోత్రాయాః -----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య దశమేహని పాషాణోత్థాపనం కర్తుం యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ"* - ఇతి ప్రార్థ్య, *"తథాస్తు, యోగ్యతాసిద్ధిరస్తు"*- ఇతి బ్రాహ్మణైరనుజ్ఞాప్య, ఉపవీతి - ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి, *"అస్యాం తిథౌ ---గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ---గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య దశమేఽహని పాషాణోత్థాపనం కరిష్యే "* - ఇతి సంకల్ప్య,

[187]ఉపవీతి, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి, *"పాషాణోత్థాపనకాలే తిథివారనక్షత్ర యోగకరణాదిదోషనివృత్త్యర్థం ప్రాజాపత్యకృచ్ఛ్రం యత్కించిద్ధిరణ్యదానరూపేణ కరిష్యే "*- ఇతి సంకల్ప్య,

---

[186] పదవనాడు ముందుగా జ్ఞాతులు, తరువాత కర్తలు కనిష్ఠప్రథమముగా వాసోదక,తిలోదకము లొసగి, ఇతరనిత్యవిధులను నిర్వర్తించి, ప్రభూతబలి నొసగిన తర్వాత, కర్త పాషాణోత్థాపన చేయవలెను. దీనికై కర్త స్నానము చేసి, శ్రీమార్జరహితముగా ఊర్ధ్వపుండ్రములను ధరించి, ప్రాచీనావీతియై, *"నమో బ్రహ్మణ్య దేవాయ---గోవిన్దాయ నమో నమః"* పర్యంతము చెప్పి, నల్లనువ్వులను సభపై చల్లి, రెండుసార్లు నమస్కరించి, *"అశేషే హే పరిషత్---- అనుగ్రహాణ"* పర్యంతము చెప్పి పరిషత్తును ప్రార్థించి, *"తథాస్తు! యోగ్యతాసిద్ధిరస్తు"* అని పరిషదనుజ్ఞను పొంది, ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై *"అస్యాం తిథౌ--- పాషాణోత్థాపనం కరిష్యే "*- అని సంకల్పించి,

*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

ఇతి సాత్త్వికత్యాగం కృత్వా, ప్రాచీనావీతి, త్రీణి రూప్యాణి హస్తే గృహీత్వా,

*హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।*
*అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

*పాషాణోత్థాపనకాలే యే తిథివారనక్షత్రయోగకరణాదిదోషాస్సముజని తద్దోష నివృత్త్యర్థం ప్రాజాపత్యకృచ్ఛ్రప్రతినిధి ఇదం హిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ - అచ్యుతః ప్రీయతామ్"* - ఇతి హిరణ్యం సతిలోదకం భూమౌ త్యక్త్వా, బ్రాహ్మణాయ దద్యాత్.

[188]అనంతరముత్థాయ, -----*గోత్ర ----శర్మన్ పితః ప్రేత (అథవా, ----గోత్రా ---- నామ్నీ మాతః ప్రేతే) అస్మాత్పాషాణాదుత్తిష్ఠ"* - ఇతి ప్రేతం ప్రార్థ్య, పాషాణోపరి తిలాన్ వికీర్య, నిమీలితాక్షః సవ్యహస్తేన పాషాణం గృహీత్వా, నిత్యవిధివాసోదకవస్త్రేణ తం పరిస్తీర్య, *"అస్మత్కులమభివర్ధతామ్"*- ఇతి కుండే యవాన్ ప్రక్షిప్య, మృద్భిః కుండం పూరయిత్వా, శిక్యాదికం (ప్రేతపిండం, ప్రభూతబలిం చ) గృహీత్వా, నదీ వా తటాకతీరం ప్రాప్య,

---

[187]పాషాణోత్థాపనసమయంలో తిథివారనక్షత్రదోషశుద్ధికై ప్రాజాపత్యకృచ్ఛ్రమును చేయవలెను. దీనికై కర్త ఉపవీతియై *"స్వశేషభూతేన---ప్రక్రమతే స్వయమ్"*- అని సాత్త్వికత్యాగం చేసి, ప్రాచీనావీతియై *"హిరణ్యగర్భగర్భస్థం---అచ్యుతః ప్రీయతామ్"*- వఱకు చెప్పి, 3 రూపాయలను తిలోదకములతో సహ భూమిపై విడిచి బ్రాహ్మణున కీయవలెను.

[188]తదుపరి లేచి నిలబడి, "---*గోత్ర ---- అస్మాత్పాషాణాదుత్తిష్ఠ"* అని చేతులు జోడించి ప్రేతను ప్రార్థించి, పాషాణముపై తిలలను చల్లి, కన్నులు మూసికొని ఆ పాషాణము నెడమ చేతిలో గ్రహించి, రోజూ వాసోదకము నిచ్చేందుకు వాడుకొనే బట్టలో దానిని చుట్టుకొని, *"అస్మత్కులమభివర్ధతాం"* - అని చెప్పి కుండములో ధాన్యమును (వడ్లను) వేసి, ఆ కుండమును మట్టితో గప్పి, ఆ శిలను, శిలపై క్షీరనీరము లొసగుటకు కట్టిన ఉట్టిని, మృత్పాత్రలను, పిండమున కొసగిన నిత్యబలిని, ప్రభూతబలిని ఒక బట్టలో కట్టుకొని నదికి గాని తటాకమునకు గాని పోయి,

[189]తత్ర జలే తిష్ఠన్, *"పృథివీం గచ్ఛాన్తరిక్షం గచ్ఛ దివం గచ్ఛ దిశో గచ్ఛ సువర్గచ్ఛ సువర్గచ్ఛ దిశో గచ్ఛ దివం గచ్ఛాన్తరిక్షం గచ్ఛ పృథివీం గచ్ఛాపో వా గచ్ఛ యది తత్ర తే హితమోషధీషు ప్రతితిష్ఠా శరీరైః"* - ఇత్యుచ్చరన్ నేత్రౌ నిమీల్య అప్సు ప్రక్షిప్య స్నాయాత్.

తతః కర్తా సభాం ప్రణమ్య, *"అస్యాం తిథౌ ---గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) ప్రథమదినాదారభ్య అద్య దశమదినపర్యన్తేషు అహరహః కృతేషు వాసోదక, తిలోదక, పిండబలి, ఏకోత్తర వృద్ధి, నవశ్రాద్ధ, ప్రభూతబలిప్రదానేషు కర్మసు మన్త్రలోపే, క్రియాలోపే, ద్రవ్యలోపే, నియమలోపే సత్యపి సర్వం సాంగం యథాశాస్త్రానుష్ఠితం భూయాదితి మహాన్తోఽను గృహ్ణంతు"*- ఇతి ప్రార్థయేత్. *"తథాస్తు! యథాశాస్త్రానుష్ఠితమస్తు"* - ఇతి ప్రతివచనమ్. తతః కర్తా కనిష్ఠపూర్వకం సర్వాంగవపనం కృత్వా స్నాయాత్.

## శాన్తిహోమః

[190]అథ దశమేఽహని వపనానన్తరం కర్తా గ్రామశ్మశానయోర్మధ్యే, తత్రాఽసంభవే కస్మింశ్చిద్దేవాలయప్రాంగణే వా, యత్రకుత్రాపి వృక్షమూలే వా ఉపవిశ్య శాన్తిహోమం

---

[189] అక్కడ నడుములబంటి నీటిలో నిలుచుండి, *"పృథివీం గచ్ఛాన్తరిక్షం గచ్ఛ --- ఓషధీషు ప్రతితిష్ఠాశరీరైః"* - అను మంత్రమును చెప్పి కనులు మూసికొని వానిని నీటిలో విసరి వేసి, కర్త స్నానము చేయవలెను. తరువాత కర్త సభకు నమస్కరించి, *"అస్యాం తిథౌ ---మహాన్తోఽను గృహ్ణంతు"*- అని ప్రార్థించవలెను. సదస్యులు *"తథాస్తు! యథా శాస్త్రానుష్ఠితమస్తు"* - అని అనుగ్రహింపవలెను. తరువాత కర్తలు కనిష్ఠపూర్వకముగా సర్వాంగవపనము చేయించుకొని స్నానమును చేయవలెను.

[190]పదవదినమునందు వపనానన్తరం కర్త గ్రామశ్మశానములకు మధ్యన, అది అసంభవమైన సమీపదేవాలయము ముంగిటనో, లేక ఏదోయొక వృక్షమూలముననో కూర్చొని శాన్తిహోమ, అనన్తహోమములను చేయవలెను. అనన్తహోమమును తమ ఇంటికి ఈశాన్యమందు చేయవలె నని కొందఱి మతము. కాని ఈకాలములో సామాన్యముగా దీనిని శాన్తిహోమము చేసిన చోటనే చేయుచున్నారు. శాన్తిహోమమును, అనన్తహోమమును ఒకే అగ్నియందు చేయరాదు. అందు

అనన్దహోమం చ కుర్యాత్. అనన్దహోమం స్వగృహస్యోత్తరపూర్వదేశే కుర్యాదితి కేషాంచిదాచారః.

[191] *శాన్తిహోమసంభారాః* - దర్భాః, ఆజ్యం, ధాన్యం, ఇన్ధనం, సమిత్, ఆజ్యపాత్రం, వారణౌ స్రుక్స్రువౌ, అగ్నిః, ఉదకుమ్భం, చూతపత్రం, అనడుహశ్చర్మ, అనడ్వాన్, అవకాః,వేతసశాఖాః, పాషాణాః, ఓషధిస్తమ్భః, వేతసమాలాః, సంపాతపాత్రం, తాంబూలమ్.

[192] *ప్రయోగః:* తతః కర్తా (భ్రాతరశ్చ) శ్రీమూర్ణరహితోర్ధ్వపుండ్రాన్ ధృత్వా, ఉపవీతీ, సభాం ప్రణమ్య, *"అశేషే హే పరిషత్. స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య ----గోత్రస్య ---శర్మణః పితుః ప్రేతస్య* (అథవా, *----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య దశమేహని మమ, జ్ఞాతీనాం చ అఘనిర్హరణార్థం శాన్తిహోమం, ఆనందా-*

---

చేత ఈ రెండు హోమములకు వేఱేవేఱే అగ్నిప్రతిష్ఠాపన చేయవలెను. శాన్తిహోమమును ఆశౌచవిముక్తిని, అనన్దహోమమును అనందావాప్తికిని చేయుచున్నారు. ఇవి రెండును శుభకరమైన హోమములే. ఐతే శాన్తిహోమమునకు సంకల్పములో **"అస్మాం శుభతిథౌ"** అని చెప్పి, అగ్నిముఖములో మాత్రము కొన్నిచోట్ల శుభప్రయుక్తముగను, కొన్నిచోట్ల అశుభప్రయుక్తముగను చేయుచున్నారు. అనన్దహోమమును మాత్రము మొత్తం శుభప్రయుక్తముగనే చేయుచున్నారు.

[191] శాన్తిహోమమునకు కావలసిన సంభారముల పట్టిక: దర్భలు, నేయి, ధాన్యము, ఇన్ధనం, సమిధలు, నేతిపాత్ర, మేడి స్రుక్స్రువములు, అగ్ని, ఉదకుంభము, మామిడాకులు, ఎద్దు చర్మము (లేదా రావియాకు), ఎద్దు (లేదా రావియాకు), నాచు, ప్రబ్బలికొమ్మలు, ఱాయి, ఓషధిస్తంబము (అనగా ఆకులధికముగా గల చెట్టుమొదలు లేక రావికొమ్మ), ప్రబ్బలియాకుల మాలలు, సంపాతాజ్యమును చేర్చుకొనుట కొక దొప్ప, తాంబూలము.

[192]శాన్తిహోమప్రయోగ మిట్లున్నది: స్నానానంతరము కర్తలు శ్రీమూర్ణరహితముగా ఊర్ధ్వపుండ్రములను పెట్టుకొని, అందు జ్యేష్ఠుడు ఉపవీతియై సభకు ప్రణమించి, *"అశేషే హే పరిషత్ ---అనుగ్రహాణ"* - అని ప్రార్థించి, *"తథాస్తు, యోగ్యతాసిద్ధిరస్తు"* - అని బ్రాహ్మణానుజ్ఞను పొంది, ఉపవీతియై ప్రాణాయామము చేసి, *"ఓం శ్రీగోవింద---శాన్తిహోమం కరిష్యే"* - అని సంకల్పించి,

వాప్త్యర్థం అనన్తహోమం చ కర్తుం యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ"- ఇతి ప్రార్థ్య, "తథాస్తు, యోగ్యతాసిద్ధిరస్తు"- ఇతి బ్రాహ్మణైరనుజ్ఞాప్య, ఉపవీతి - ప్రాణానాయమ్య,

"ఓం శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే అష్టావింశతితమే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరత ఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే -----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే ----- పక్షే ----తిథౌ ----వాసరే ---నక్షత్రయుక్తాయాం అస్యాం శుభతిథౌ ---గోత్రస్య--- శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య దశమేఽహని మమ, జ్ఞాతీనాం చ అఘనిర్హరణార్థం శాన్తిహోమం కరిష్యే" - ఇతి సంకల్ప్య,

**అగ్ని ముఖమ్:** [193]ఉపవీతి స్థండిలం కల్పయిత్వా, ప్రాచీః పూర్వముదక్సంస్థం దక్షిణారంభమాలిఖేత్. అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభ మాలిఖేత్.

[194]అవాక్కరోభ్యుక్ష్య, తృణం నిరస్య, అప ఉపస్పృశ్య, "ఓం భూర్భువస్సువరోమ్"- ఇతి లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య,ఉత్సృజ్యతేఽభ్యుక్షణతోయశేషమ్. ప్రాక్తోయమన్యం విదధాయ,

[195]అగ్నిమిధ్వా, ప్రజ్వాల్య, (తూష్ణీం తిలైః) అలంకృత్య, పరిసమూహ్య, ప్రాగగ్రైః దర్భైః ప్రాగాదిక్రమేణ ప్రదక్షిణం పరిస్తీర్య, దక్షిణానుత్తరాన్, ఉత్తరానధరాన్ కృత్వా,

---

[193] అగ్నిప్రతిష్ఠాపనకై చతురశ్రవేదికను(స్థండిలమును) కల్పించి, దానిపై నువ్వులను చల్లి, ఒకదర్భతో ఆవేదికపై పడమటినుండి మొదలిడి తూర్పున కంతమగునట్లు వేదియొక్క దక్షిణార్ధమునందును, మధ్యను, ఉత్తరార్ధమునందును వరుసగా మూడురేఖలను గీచి, అట్లే దక్షిణమునుండి మొదలిడి ఉత్తరమున కంతమగునట్లు మూడురేఖలను వేదియొక్క పశ్చిమార్ధమందును, మధ్యను, పూర్వార్ధమందును వరుసగా అదే దర్భతో గీచి, ఆ దర్భను వేదిపై నుంచి,

[194] అభ్యుక్షణతోయపాత్రలో కొంచము నీటిని పోసికొని, దానిచే స్థండిలమును ప్రోక్షించి, దర్భను వేదిపైనుండి తీసివేసి, నీరు ముట్టి, స్థండిలముపై "ఓం భూర్భువస్సువరోమ్"అని లౌకికాగ్నిని ప్రతిష్ఠించి, అభ్యుక్షణతోయపాత్రలోని నీటిని చల్లి, మఱల వేరే నీటి నందులో పోసి, ఆ పాత్రను అగ్నికి తూర్పువైపున ముందు వేయబోవు దర్భపరిస్తరణల కవతల నుంచవలెను.

[196]తత్పశ్చాత్ లోహితమానడుహం చర్మ తదభావే తదాకారం మృగచర్మ వా ప్రాచీన గ్రీవముత్తరలోమాస్తీర్య, తస్మిన్ వేతసమాలినో జ్ఞాతీనారోపయన్తి.

*"ఆరోహతాయుర్జరసం గృణానా, అనుపూర్వం యతమానా యతిష్ట/ ఇహ త్వష్టా సుజనిమా సురత్నో దీర్ఘమాయుః కరతు జీవనే వః"* - ఇతి కనిష్ఠపూర్వ మారోప్య,

[197] *"యథాఽహాన్యనుపూర్వం భవన్తి యథర్తవ ఋతుభిర్యన్తి క్లృప్తాః/ యథా న పూర్వమపరో జహాత్యేవా ధాతరాయూగంషి కల్పయైషామ్"* - ఇతి తాన్ జ్యేష్ఠక్రమాన్ కల్పయిత్వా,

[198]అగ్నేర్దక్షిణతః ప్రాగగ్రాన్ దర్భాన్ సంస్తీర్య, తత్ర దర్వీం, ఆజ్యస్థాలీం, ప్రోక్షణీం, ఇతర దర్వీం చ ఏకైకశః పశ్చిమారంభాత్ సాదయిత్వా, [199]ద్వాభ్యాం దర్భాభ్యాం ఆయామతం

---

[195] అగ్నిని ప్రజ్వలింపజేసి, అమంత్రకముగా అగ్నిచుట్టును అష్టదిశలందును ప్రదక్షిణముగా తిలల నుంచి అలంకరించి, తడిచేతితో అగ్నిచుట్టును ప్రదక్షిణముగా పృశించి, అగ్నిచుట్టు ప్రదక్షిణముగా దర్భలను పరిస్తరణ చేయవలెను. అనగా అగ్నికి చుట్టును తూర్పుపడమరల యందు వేసిన దర్భలు ఉత్తరాగ్రములుగను, ఉత్తరదక్షిణములందు వేసిన దర్భలు పూర్వాగ్ర ములుగను ఉండునట్లు వేసి, దక్షిణమునందు వేసిన దర్భలను తూర్పు, పడమరలందు వేసిన దర్భల మొదళ్ళపైకుండునట్లు సవరింపవలెను. అట్లే ఉత్తరమందు వేసిన దర్భలను తూర్పు పడమరలయందు వేసిన దర్భల కొనల క్రింద నుండునట్లు సవరింపవలెను.

[196] అగ్నికి పశ్చిమమున పైకి రోమములుండునట్లును, ముఖము తూర్పునకుండునట్లును ఒక ఎఱ్ఱని ఎద్దు చర్మమును, లేకున్న జింకచర్మమును పఱచి, దానిపై ప్రబ్బలియాకుల మాలలను ధరించిన జ్ఞాతులను *"ఆరోహతాయుర్జరసం----"* అను మంత్రముతో కనిష్ఠపూర్వకముగా కూర్చుండబెట్టి,

[197] *"యథాఽహాన్యనుపూర్వం ---- కల్పయైషామ్"* - అని వారిని జ్యేష్ఠక్రమముగా దింప వలెను. గమనిక: ఈ కాలములో ఎద్దు, జింకచర్మములు అలభ్యములు గనుక, ఒక రావి యాకును పెట్టి దానిపై *"ఆరోహతాయుర్జరసం--"* అను మంత్రముతో జ్ఞాతుల స్థానములో నొక కూర్చను పెట్టి, దానిని కనిష్ఠునిచే తాకించి, *"యథాఽహాన్యనుపూర్వం---కల్పయైషామ్"* - అను మంత్రముతో ఆ కూర్చను జ్యేష్ఠునిచే కదలింపజేసి, ఈ తంత్రమును నడిపింపవలెను.

కృత్వా, ప్రోక్షణీపాత్రే నిక్షిప్య, [200]ఆదాయ, జలేన పూరయిత్వా, ప్రాచీ స్త్రిరుత్పూయ, అభి మంత్ర్య, [201]పాత్రాణి ఉత్తానాని కృత్వా, [202]ప్రోక్షణీజలేన ప్రోక్ష్య, శేషముత్సృజ్య, అన్యజ్జలం పూరయిత్వా, ఉత్తరతో నిధాయ, [203]ఆయామతం ఆజ్యస్థాల్యాం నిధాయ, ఆజ్యం విలాప్య, [204]ఉదీచోఽఙ్గారాన్నిరూహ్య, తేష్వధిశ్రిత్య, [205]జ్వలతా తృణేనావద్యోత్య, [206]ద్వే దర్భాగ్రే ప్రచ్ఛిద్య, ప్రక్షాళ్య, ప్రత్యస్య (ఆజ్యే ప్రాశ్య), త్రిః పర్యగ్నికృత్వా, ఉదగుద్వాస్య, అంగారా నగ్నౌ ప్రత్యూహ్య,

---

[198]అగ్నికి దక్షిణమున పూర్వాగ్రములుగా 3 దర్భలను పరచి, ఆదర్భలపై పడమటినుండి తూర్పునకు వరుసగా మేడిదర్విని(స్రుక్కును), ఆజ్యస్థాలిని, ప్రోక్షణీపాత్రను, మేడి ఇతర దర్విని (స్రువమును) ఒక్కొకటి చొప్పున తీసికొని బోర్లించి ఉంచవలెను.

[199] తదుపరి రెండు దర్భలతో ఆయామతపవిత్రమును చేసి, దానిని ప్రోక్షణీపాత్రలో నుంచి,

[200] ఆ ప్రోక్షణీపాత్రను తన ముందుంచుకొని, దానిలో నీటిని పోసి, ఆయామతము చేత మూడు సార్లు ప్రాక్సమాప్తిగా ఉత్పూరణము చేసి (అనగా, కొన ఉత్తరమునకుండునట్లు ఆయామతం రెండుకొనలను రెండుచేతుల అనామికాంగుష్ఠములచే గ్రహించి ప్రోక్షణిలోని నీటిని మూడు సార్లు పశ్చిమమునుండి తూర్పునకు గిచి), ప్రోక్షణిపై కుడిచేతిని బోర్లించి చూపెట్టి, ఆ చేతిని తటాలున తీసి (ఇదియే అభిమంత్రణము)

[201] అగ్నికి దక్షిణమున దర్భలపై బోర్లించియుంచిన ఇతరపాత్రలను వెల్లకిల త్రిప్పిపెట్టి,

[202] ప్రోక్షణిలోని జలమును ఆయామతంతో ఆ పాత్రలపై ప్రోక్షించి, ప్రోక్షణిలో మిగిలిన నీటిని పారబోసి, అందులో వేఱే నీటిని నింపి, దానిని తనముందు ఎడమవైపుంచుకొని,

[203] నేతిపాత్రను ప్రదక్షిణముగా తీసికొని వచ్చి తన ముందుంచుకొని, ఆయామతాన్ని ప్రోక్షణి నుండి తీసి దానిలోనుంచి, అందులో నేతిని నింపి,

[204]అగ్నినుండి ఉత్తరమువైపు కొన్ని నిప్పులను వేఱుగా తీసికొని, వానిపై ఆ నేతిపాత్ర నెక్కించి,

[205] ఒక దర్భను నిప్పుతో అంటించి, ఆజ్వాల నేతిపాత్రయందు ప్రతిబింబించునట్లుగా దర్భను చూపించి (ఇదియే అవద్యోతనము), తదుపరి ఆ దర్భను పారవేసి,

[206] రెండు దర్భాగ్రములను త్రుంచి, కడిగి, నేతిపాత్రలో నుంచి, నేతిపాత్రను జ్వలితదర్భచే ప్రదక్షిణముగా మూడుసార్లు చుట్టి, ఆ దర్భను ఉత్తరమునకు త్యజించి, అగ్నినుండి వేఱుగా తీసికొనిన నిప్పులను తిరిగి అగ్నిలో చేర్చి,

[207]ఉత్తరాగ్రాయామతేన పునరాహారమాజ్యం త్రిరుత్పూయ, పవిత్రగ్రంథిం విస్రస్య, అప ఉపస్పృశ్య, ప్రాగగ్రమగ్నౌ ప్రహరతి. [208]దర్వీన్నిష్టప్య, దర్భైణ సంమృజ్య, పునర్నిష్టప్య, ప్రోక్ష్య, నిధాయ, అద్భిః సంస్పృశ్య, అగ్నౌ ప్రహరతి. [209]అగ్నిం సమన్తం ప్రదక్షిణం పరిషిచ్య, *"న హి తే అగ్నే, అప నశ్శోశుచదఘమ్"* - ఇతి ద్వాభ్యాం చతుర్గృహీతాజ్యేన దర్వీ మూలేన జుహుయాత్ (ప్రతిస్వాహాకారాన్తే కస్మింశ్చిత్పాత్రే హుతశేషమాజ్యం నినయేత్).

1. *న హి తే అగ్నే తనువై క్రూరం చకార మర్త్యః। కపిర్బభస్తి తేజనం పునర్జరాయు గౌరివ స్వాహా। అగ్న యే శుచయ ఇదం నమమ।*
2. *అప నశ్శోశుచదఘమగ్నే శుశుద్ధ్యా రయిమ్। అప నశ్శోశుచదఘం మృత్యవే స్వాహా। అగ్న యే శుచయ ఇదం నమమ।*

[210]అథోత్తరేణ దర్వీమూలేన ఆజ్యం సకృత్ గృహీత్వా జుహుయాత్:

---

[207] ఉత్తరాగ్రాయామతంతో మూడుసార్లు తూర్పునుండి మొదలిడి తూర్పునకే అంతమగు నట్లు (ఇదియే పునరాహారము) నేతిని గీచి, ఆయామతము ముడిని విప్పి, దానివి ప్రోక్షణీజల ముతో దాకి, కొనలు తూర్పున కుండునట్లు పట్టుకొని అగ్నియందు వేయవలెను.

[208] ప్రధానదర్విని(స్రుక్కును) కుడిచేత, ఇతరదర్విని (స్రువమును) ఎడమచేత ఒకేసారి పట్టు కొని, వాని నగ్నిపై కాచి, దర్భలతో తుడిచి, మళ్లీ కాచి, అట్లు తుడిచిన దర్భలతో ప్రోక్షణిలోని జలమును వానిపై ప్రోక్షించి, ఆజ్యపాత్రకు ఎడమవైపు ఎడమచేతిలోని దర్విని (స్రువమును), కుడికి కుడిచేతిలోని దర్విని (స్రుక్కును) ఉంచి, సమ్మార్జనము చేసిన దర్భలను ప్రోక్షణిలోని నీటితో తాకి, వాని నగ్నియందు పడవేయవలెను.

[209] మంత్రరహితముగా అగ్నిచుట్టును ప్రదక్షిణముగా పరిషేచనము చేసి, నాల్గేసి సార్లు ఇతర దర్వీమూలమునుండి ప్రధానదర్విలోనికి నేతిని వేసికొనుచు, 1, 2 మంత్రములతో "స్వాహా"- అన్నపుడెల్లా ప్రధానదర్వీమూలమునుండి నేతిని అగ్నిలో వేయుచు, ప్రధానదర్విలో శేషించిన నేతి నొక చిన్న దొప్పలో చేర్చుచుండవలెను. ఇట్లు దొప్పలో చేర్చుకొనిన పరిశిష్టాజ్యమునకు సంపాతాజ్యమని పేరు.

[210] తదుపరి ఒక్కొక్కమారు ప్రధానదర్విలోనికి ఆజ్యమును వేసికొనుచు, దర్వీమూలము నుండి ఆజ్యము నగ్నిలో పోయుచు 1-10 మంత్రములతో హోమమును చేయుచు సంపాతాజ్య మును దొప్పలో చేర్చుకొనవలెను.

1. అప నశ్శోశుచదఘమగ్నే శుశుద్ధ్యా రయిమ్। అప నశ్శోశుచదఘం స్వాహా। అగ్నయే శుచయ ఇదం నమమ।
2. సుక్షేత్రియా సుగాతుయా వసూయా చ యజామహే। అప నశ్శోశుచదఘం స్వాహా। అగ్నయే శుచయ ఇదం నమమ।
3. ప్రయద్భన్దిష్ఠ ఏషాం ప్రాస్మాకాసశ్చ సూరయః। అప నశ్శోశుచదఘం స్వాహా। అగ్నయే శుచయ ఇదం నమమ।
4. ప్రయదగ్నే స్సహస్వతో విశ్వతో యన్తి సూరయః। అప నశ్శోశుచదఘం స్వాహా। అగ్నయే శుచయ ఇదం నమమ।
5. ప్రయత్తే అగ్నే సూరయో జాయేమహి ప్ర తే వయమ్। అప నశ్శోశుచదఘం స్వాహా। అగ్నయే శుచయ ఇదం నమమ।
6. త్వగ్ం హి విశ్వతోముఖ విశ్వతః పరిభూరసి। అప నశ్శోశుచదఘం స్వాహా। అగ్నయే శుచయ ఇదం నమమ।
7. ద్విషో నో విశ్వతోముఖాఽతి నావేవ పారయ। అప నశ్శోశుచదఘం స్వాహా। అగ్నయే శుచయ ఇదం నమమ।
8. స నస్సిన్ధుమివ నావయాఽతిపరుషాస్వస్తయే। అప నశ్శోశుచదఘం స్వాహా। అగ్నయే శుచయ ఇదం నమమ।
9. ఆపః ప్రవణాదివ యతీరపాస్మత్స్యన్దతామఘమ్। అప నశ్శోశుచదఘం స్వాహా। అగ్నయే శుచయ ఇదం నమమ।
10. ఉద్వనాదుదకానీవాపాస్మత్స్యన్దతామఘమ్। అప నశ్శోశుచదఘం స్వాహా। అగ్నయే శుచయ ఇదం నమమ।

[211]దర్వ్యౌ ప్రహృత్య, పూర్వవదగ్నిం పరిషిచ్య, అగ్నేరుత్తరతో లోహితమనడ్వాహం ప్రాఙ్ముఖమవస్థాపయేత్. తతః

---

[211] హోమానంతరము దర్వుల నగ్నిలో పడవైచి, పూర్వమువలెనే అగ్ని చుట్టునూ ప్రదక్షిణముగా పరిషేచనము చేసి (శాన్తిహోమము చివర అనాజ్ఞాతాదిహోమములు, అగ్న్యుపస్థాన

"అనడ్వాహమన్వారభామహే స్వస్తయే/ స న ఇన్ద్ర ఇవ దేవేభ్యో వహ్ని స్సంపారణో భవ/" - ఇతి సర్వే జ్ఞాతయః కనిష్ఠపూర్వం తమనడుహమన్వారభ్య,

"ఇమే జీవా వి మృతైరావవర్తిన్నభూద్భద్రా దేవహూతిం నో అద్య/ ప్రాఞ్చో గామా నృతయే హసాయ ద్రాఘీయ ఆయుః ప్రతరాం దధానాః/" ఇత్యనుడుహా సహ ప్రాచీం దిశం గచ్ఛేయుః.[212] పశ్చాద్గచ్ఛన్ కర్తా వేతసశాఖావమకాంశ్చ సహ గృహీత్వా తాభ్యా మనడుత్పదాని మృత్యోః పదమితి మార్జయతి.

"మృత్యోః పదం యోపయన్తో యద్రైమ ద్రాఘీయ ఆయుః ప్రతరాం దధానాః/ ఆప్యాయమానాః ప్రజయా ధనేన శుద్ధాః పూతా భవథ యజ్ఞియాసః/" - ఇతి.[213] తతః జ్ఞాతీన్ ప్రస్థాప్య, జీవతాం మృతానానన్తరం భవేదితి మనసా ధ్యాత్వా, జ్ఞాతిభ్యో దక్షిణతః -

"ఇమం జీవేభ్యః పరిధిం దధామి మా నో ను గాదపరో అర్ధమేతమ్/ శతం జీవన్తు శరదః పురూచీస్తిరో మృత్యుం దధ్మహే పర్వతేన/" - ఇత్యశ్మానం స్థాపయిత్వా,

---

ములు లేవు), అగ్ని కుత్తరమున ఒక ఎఱ్ఱని యెద్దును తూర్పుముఖముగా నుంచి, "అనడ్వాహ మన్వారభామహే స్వస్తయే/ న న ఇన్ద్ర ఇవ దేవేభ్యో వహ్ని స్సంపారణో భవ/" - అను మంత్ర మును జ్ఞాతులందఱును చెప్పుచు కనిష్ఠపూర్వముగా ఆ యెద్దును తాకి, "ఇమే జీవా ---ఆయుః ప్రతరాం దధానాః"- అను మంత్రమును అందఱును చెప్పుచు ఆ యెద్దుతో సహ తూర్పునకు నడువవలెను.

[212] ఆ యెద్దు వెనుక నడచుచు, దాని పాదములు మృత్యుపాదములని తలచుచు "మృత్యోః పదం యోపయన్తో--- భవథ్యజ్ఞియా సః/"- అను మంత్రమును కర్త యొక్కడు మాత్రమే చెప్పుచు ప్రబ్బలికొమ్మతో, నాచుతో (అవక మనగా నాచు) ఆ యెద్దుగిట్టలు పడిన స్థానముల నాతడు తుడువవలెను. గమనిక: ఈ కాలములో ఎద్దుకు బదులుగా రావియాకులో ఒక ఆయా మతము నుంచి, ఎద్దుకు సంబంధించిన మంత్రములు దానికే చెప్పుచు, తాకుట, తూర్పుకు నడుపుట మున్నగునవన్నియు దానికే చేయుచున్నారు.

[213] కర్త జీవితులకు, మృతులకు మధ్య అడ్డమిదియని మదిలో నెంచుచు, "ఇమం జీవేభ్యః--- దధ్మహే పర్వతేన/"- అను మంత్రముతో జ్ఞాతులకు దక్షిణమున ఒక ఱాతిని ఉంచవలెను.

[214] *"ఇమా నారీరవిధవాస్సుపత్నీ రాఞ్జనేన సర్పిషా సంమృశన్తామ్। అనశ్రవో అనమీవాస్సుశేవా ఆరోహన్తు జనయో యోనిమగ్రే"* - ఇతి పాత్రసంపాతాజ్యం జ్ఞాతిస్త్రీణా మఞ్జలీషు దద్యాత్.

[215] తాః స్త్రియశ్చ *"యదాఞ్జనం త్రైకకుదం జాతగం హిమవతస్పరి। తేనామృతస్య మూలేనారాతీర్జమ్భయామసి"* - ఇతి తదాజ్యమఞ్జనవత్ ధరిష్యన్తి.

[216] తతః *"యథా త్వముద్భినత్స్యోషధే పృథివ్యా అధి। ఏవమిమ ఉద్భిన్దన్తు కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన।"* - ఇతి పృథివ్యామోషధిస్తంభం ప్రతిష్ఠాపయేత్. తతః శాన్తి హోమాగ్నౌ దీపం ప్రజ్వాల్య, దీపహస్తాః స్త్రీరగ్రతో గృహం ప్రస్థాపయేత్.

## ఆనన్దహోమః

[217] తతః కర్తా, జ్ఞాతయశ్చ శ్రీమార్గసహితోర్ధ్వపుండ్రాణి ధృత్వా, తత్ర వా గృహోత్తరపూర్వ దిశే వా ఆనన్దహోమం కరోతి - తత్ప్రయోగః - కర్తా ప్రాఙ్ముఖ ఉపవిశ్య, ఉపవీతి, ప్రాణానా

---

214 తదుపరి *"ఇమా నారీరవిధవాః --- జనయో యోనిమగ్రే"* - అను మంత్రముతో దొప్పలో చేర్చుకొనిన సంపాతాజ్యమును జ్ఞాతిస్త్రీల చేతులలో నుంచవలెను.

215 *"యదాఞ్జనం త్రైకకుదం --- మూలేనారాతీర్జమ్భయామసి"* - అను మంత్రముతో ఆ స్త్రీలా నేతిని లేతదర్భలతో కంటికి కాటుకవలె నద్దుకొనవలెను. కాని ఈ కాలములో ఊరి బయట శాన్తి హోమమును చేసినప్పు డచ్చటకు జ్ఞాతిస్త్రీలు వచ్చుట లేదు. అందుచేత ముందుగా జ్ఞాతులును, తదుపరి కనిష్ఠపూర్వకముగా కర్తలును సంపాతాజ్యమును పై మంత్రముతో కాటుకవలె పెట్టు కొనుచున్నారు. పక్షాంతరమున, కొందఱు సంపాతాజ్యమును ఇంటికి గొనిపోయి స్త్రీల కీయగా పై మంత్రముతో వారు కన్నులకు పెట్టుకొనుచున్నారు.

216 తదుపరి *"యథా త్వముద్భినత్స్యోషధే --- బ్రహ్మవర్చసేన।"* - అను మంత్రముతో అగ్నికి ఉత్తరమున ఓషధిస్తంబమును (అనగా, ఆకులు గల ఒక రావి కొమ్మను) భూమిలో ప్రతిష్ఠించి, హోమాగ్నితో దీపమును (కందిలిని) వెలిగించి, దీపహస్తులై స్త్రీలు ముందు నడువగా ఇంటికి వెళ్లవలెను (స్త్రీలు లేనిచో కనిష్ఠుడు దీపమును తీసికొని వెళ్లవచ్చును).

217 శాన్తిహోమానంతరము కర్తయు, జ్ఞాతులును శ్రీమార్గసహితముగా నామములను ధరించి, ఆ ప్రదేశములోనే కాని, లేదా ఇంటికి ఈశాన్యదిశలో గా[illegible]వేతే అగ్నిని స్థాపించి, అందులో

యమ్య, *"ఓం శ్రీగోవిన్ద, గోవింద, గోవింద - అస్య శ్రీ భగవతః మహాపురుషస్య విష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే అష్టావింశతితమే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరత ఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠిసంవత్స రాణాం మధ్యే -----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే -----పక్షే ---- తిథౌ ----వాసరే ---నక్షత్రయుక్తాయాం అస్యాం శుభతిథౌ మమ జ్ఞాతినాం చ ఆనన్దా వాప్త్యర్థం ఆనన్దహోమం కరిష్యే "* - ఇతి సంకల్ప్య,

*అగ్ని ముఖమ్:* [218]స్థండిలం కల్పయిత్వా (తణ్డులచూర్ణం వికీర్య), ప్రాచీః పూర్వ ముదక్సంస్థం దక్షిణారంభమాలిఖేత్. అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభమాలిఖేత్. [219]అవాక్కరోభ్యుక్ష్య, తృణం నైఋత్యాం నిరస్య, అప ఉపస్పృశ్య, *"ఓం భూర్భువస్సువ రోమ్"* - ఇతి లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య, ఉత్సృజ్యతేఽభ్యుక్షణతోయశేషమ్. [220]ప్రాక్తోయ

---

ఆనన్దహోమమును చేయవలెను. దీనికి ప్రయోగము: కర్త ప్రాఙ్ముఖుడై ఉపవీతిని చేసికొని కూర్చుండి ప్రాణాయామము చేసి, *"ఓం శ్రీ గోవిన్ద ----- ఆనందహోమం కరిష్యే "* - అని సంక ల్పించి, ముందుగా అగ్నిముఖమును చేయవలెను.

[218] అగ్నిప్రతిష్ఠాపనకై చతురశ్రవేదికను(స్థండిలమును) కల్పించి, దానిపై బియ్యపుపిండిని నెఱపి, పసుపు అక్షతలను చల్లి, రెండుదర్భలను సగమునకు మడచి పట్టుకొని వానితో ఆ వేదిపై పడమటినుండి మొదలిడి తూర్పున కంతమగునట్లు వేదియొక్క దక్షిణార్థమునందును, మధ్యను, ఉత్తరార్ధమునందును వరుసగా మూడురేఖలను గీచి, అట్లే దక్షిణమునుండి మొదలిడి ఉత్తరమున కంతమగునట్లు మూడురేఖలను వేదికయొక్క పశ్చిమార్థమందును, మధ్యను, పూర్వార్థములందును వరుసగ్గా గీచి, ఆ దర్భలను వేదిపై నుంచి,

[219] అభ్యుక్షణతోయపాత్రలో కొంచము నీటిని పోసికొని, దానిచే స్థండిలమును ప్రోక్షించి, దర్భ లను వేదిపైనుండి తీసి నైఋతికి పడవేసి, నీరు ముట్టి, స్థండిలముపై *"ఓం భూర్భువస్సువరోమ్"* - అని లౌకికాగ్నిని ప్రతిష్ఠించి, అభ్యుక్షణతోయపాత్రలోని నీటిని చల్లి,.

[220] మఱల వేరే నీటిని అభ్యుక్షణతోయపాత్రలో పోసి, ఆ పాత్రను అగ్నికి తూర్పువైపున (పరి స్తరణల కవతల) ఉంచి, అగ్నిని ప్రజ్వలింపజేసి, తడిచేతితో అగ్నిచుట్టును ప్రదక్షిణముగా స్పృశించి (ఇదియే పరిసమూహనము), *"అగ్నయే నమః---విసర్పిణే నమః"*- అను 8 మంత్ర

మన్యం నిదధాయ, అగ్నిమిధ్వా, ప్రజ్వాల్య, పరిసమూహ్య, "అగ్నయే నమః", "జాతవేదసే నమః", "సహోజసే నమః", "అజిరాప్రభవే నమః", "వైశ్వానరాయ నమః", "నర్యాపసే నమః", "పఙ్క్తిరాధసే నమః", "విసర్పిణే నమః" - ఇత్యష్టభిః ప్రదక్షిణమలం కృత్య, "శ్రీయజ్ఞపురుషాయ నమః" - ఇత్యగ్నౌ అక్షతాన్ దత్వా, ప్రాగగ్రైః దర్భైః ప్రాగాదిక్రమేణ ప్రదక్షిణం పరిస్తీర్య, దక్షిణానుత్తరాన్, ఉత్తరానధరాన్ కృత్వా, [221]ఉత్తరేణాగ్నిం ప్రాగగ్రాన్ దర్భాన్ సంస్తీర్య, తత్ర దర్వీం, ఆజ్యస్థాలీం, ప్రోక్షణీం, ఇతర దర్వీంచ ఏకైకశః పశ్చిమారంభాత్ సాదయిత్వా, [222]ద్వాభ్యాం దర్భాభ్యాం ఆయామతం కృత్వా, ప్రోక్షణీపాత్రే నిక్షిప్య,

[223]ఆదాయ, జలేన పూరయిత్వా, ప్రాదిస్త్రిరుత్పూయ, అభిమంత్ర్య, [224]పాత్రాణి ఉత్తానాని కృత్వా, [225]ప్రోక్షణీజలేన ప్రోక్ష్య, శేషముత్సృజ్య, అన్యజ్జలం పూరయిత్వా, ఉత్తరతో నిధాయ,

---

ములతో తూర్పునుండి మొదలిడి 8 దక్కులందును ప్రదక్షిణముగా అగ్ని చుట్టును హరిద్రాక్షతల నుంచి, "శ్రీయజ్ఞపురుషాయ నమః" - అని అగ్నిపై అక్షతలను వేసి, అగ్ని చుట్టును ప్రదక్షిణముగా దర్భలను పరిస్తరణ చేయవలెను. అనగా అగ్నికి చుట్టును తూర్పు, పడమరలందు వేసిన దర్భలు ఉత్తరాగ్రముగను, ఉత్తరదక్షిణములందు వేసిన దర్భలు పూర్వాగ్రములుగను ఉండునట్లు వేసి, దక్షిణమందు వేసిన దర్భలను తూర్పు, పడమరలయందు వేసిన దర్భల మొదళ్లపైనుండునట్లు సవరింపవలెను. ఆట్లే ఉత్తరమందు వేసిన దర్భలను తూర్పు, పడమరలందు వేసిన దర్భల కొనల క్రింద నుండునట్లుగా సవరింపవలెను.

[221] అగ్నికి ఉత్తరమున పూర్వాగ్రములుగా దర్భలను పరచి, ఆదర్భలపై పడమటినుండి తూర్పునకు వరుసగా మేదిదర్విని(స్రుక్కును), ఆజ్యస్థాలిని, ప్రోక్షణీపాత్రను, మేడి ఇతర దర్విని (స్రువమును) ఒక్కొకటి చొప్పున తీసికొని బోర్లించి ఉంచవలెను.

[222] తదుపరి రెండు దర్భలతో ఆయామతపవిత్రమును చేసి, దానిని ప్రోక్షణీపాత్రలో నుంచి,

[223] ఆ ప్రోక్షణీపాత్రను తన ముందుంచుకొని, దానిలో నీటిని పోసి, ఆయామతముచేత మూడు సార్లు ప్రాక్పమాప్తిగా ఉత్పూరణము చేసి (అనగా, కొన ఉత్తరమునకుండునట్లు ఆయామతం రెండుకొనలను రెండుచేతుల అనామికాంగుష్ఠములచే గ్రహించి ప్రోక్షణిలోని నీటిని మూడు సార్లు పశ్చిమమునుండి తూర్పునకు గీచి), ప్రోక్షణిపై కుడిచేతిని బోర్లించి చూపెట్టి, ఆ చేతిని తటాలున తీసి (ఇదియే అభిమంత్రణము)

[224] అగ్నికి ఉత్తరమున దర్భలపై బోర్లించియుంచిన ఇతరపాత్రలను వెల్లకిల త్రిప్పిపెట్టి,

[226] ఆయామితం ఆజ్యస్థాల్యాం నిధాయ, ఆజ్యం విలాప్య, [227] ఉదీచోఽఙ్గారాన్నిరూహ్య, తేష్వధిశ్రిత్య, [228] జ్వలతా తృణేనావద్యోత్య, [229] ద్వే దర్భాగ్రే ప్రచ్ఛిద్య, ప్రక్షాల్య, ప్రత్యస్య (ఆజ్యే ప్రాస్య), త్రిః పర్యగ్నికృత్వా, ఉదగుద్వాస్య, అఙ్గారానగ్నౌ ప్రత్యూహ్య, ఉత్తరాగ్రాయామితేన పునరాహారమాజ్యం త్రిరుత్పూయ, పవిత్రగ్రంథిం విస్రస్య, అప ఉపస్పృశ్య, ప్రాగగ్రమగ్నౌ ప్రహరతి.

[230] దర్వీన్నిష్టప్య, దర్భైః సంమృజ్య, పునర్నిష్టప్య, ప్రోక్ష్య, నిధాయ, అద్భిః సంస్పృశ్య, అగ్నౌ ప్రహరతి.

[231] అగ్నిం సమన్తం ప్రదక్షిణం పరిషిచ్య, "అనస్థాయ--" ఇత్యాది ద్వాభ్యాం వారణదర్వ్యగ్రేణ చతుర్గృహీతం జుహోతి.

---

[225] ప్రోక్షణిలోని జలమును ఆయామితంతో ఆ పాత్రలపై ప్రోక్షించి, ప్రోక్షణిలో మిగిలిన నీటిని పారబోసి, అందులో వేరే నీటిని నింపి, దానిని తనముందు ఎడమవైపుంచుకొని,

[226] నేతిపాత్రను ప్రదక్షిణముగా తీసికొని వచ్చి తన ముందుంచుకొని, ఆయామితాన్ని ప్రోక్షణి నుండి తీసి దానిలోనుంచి, అందులో నేతిని నింపి,

[227] ఉత్తరమువైపు అగ్నిలోనుండి కొన్ని నిప్పులను వేరుగా తీసికొని, వానిపై ఆ నేతిపాత్ర నుంచి,

[228] ఒక దర్భను నిప్పుతో అంటించి, అజ్యాల నేతిపాత్రయందు ప్రతిబింబించునట్లుగా దర్భను చూపించి (ఇదియే అవద్యోతనము), ఆ తర్వాత ఆ దర్భను పారవేసి,

[229] రెండు దర్భాగ్రములను త్రుంచి, కడిగి, నేతిపాత్రలో నుంచి, నేతిపాత్రను జ్వలితదర్భచేత ప్రదక్షిణముగా మూడుసార్లు చుట్టి (ఇదియే పర్యగ్నికరణము), ఆ దర్భను ఉత్తరమునకు త్యజించి, అగ్నినుండి వేరుగా తీసిన నిప్పులను తిరిగి అగ్నిలో చేర్చి, ఉత్తరాగ్రాయామితంతో తూర్పునుండి మొదలిడి తూర్పునకే అంతమగునట్లు (ఇదియే పునరాహారము) మూడుసార్లు నేతిని గీచి, ఆయామితము ముడిని విప్పి, దానిని ప్రోక్షణీజలముతో దాకి, కొనలు తూర్పున కుండునట్లు పట్టుకొని అగ్నియందు వేయవలెను.

[230] ప్రధానదర్విని (స్రుక్కునే) కుడిచేత, ఇతరదర్విని (స్రువమును) ఎడమచేత ఒకేసారి తీసికొని, వాని నగ్నిపై కాచి, దర్భలతో తుడిచి, మళ్లీ కాచి, ఇట్లు తుడిచిన దర్భలతో ప్రోక్షణిలోని జలమును వానిపై ప్రోక్షించి, అజ్యపాత్రకు ఎడమవైపు ఎడమచేతిలోని దర్విని (స్రువమును), కుడికి కుడిచేతిలోని దర్విని (స్రుక్కును) ఉంచి, సమ్మార్జనము చేసిన దర్భలను ప్రోక్షణిలోని నీటితో తాకి, వాని నగ్నియందు పడవేయవలెను.

1. అనజ్ఞాయ ప్రమోదాయ పునరాగాగం స్వాన్నృహాన్। అప నశ్శోకుచదఘం స్వాహా। అగ్నయే అనజ్ఞాయేదం నమమ।
2. న వై తత్ర ప్రమీయతే గౌరశ్వః పురుషః పశుః। యత్రేదం బ్రహ్మ క్రియతే పరిధిర్జీవనాయ కమప నశ్శోకుచదఘం స్వాహా। అగ్నయే అనజ్ఞాయేదం నమమ।

[232] ఇతిహుత్వా, ప్రాణానాయమ్య, "శ్రీభగవదాజ్ఞయా భగవత్కైఙ్కర్యరూపం అనజ్ఞ హోమకర్మణి సంభావిత మన్త్ర-తన్త్ర-స్వర-వర్ణ-విధి-విపర్యాస-న్యూనాతిరిక్త-దోష ప్రాయశ్చిత్తార్థం సర్వప్రాయశ్చిత్తార్థం అనాజ్ఞాతాద్యాహుతీశ్చ హోష్యామి" - ఇతి సంకల్ప్య,

3. ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం నమమ।
4. అనాజ్ఞాతం యదాజ్ఞాతం యజ్ఞస్య క్రియతే మిథు। అగ్నే తదస్య కల్పయ। త్వగ్ం హి వేత్థ యథా తథగ్గం స్వాహా। అగ్నయ ఇదం నమమ।
5. పురుషసమ్మితో యజ్ఞో యజ్ఞః పురుషసమ్మితః। అగ్నే తదస్య కల్పయ। త్వగ్ం హి వేత్థ యథా తథగ్గం స్వాహా। అగ్నయ ఇదం నమమ।
6. యత్పాకత్రా మనసా దీనదక్షాన యజ్ఞస్య మన్వతే మర్త్యాసః। అగ్నిష్టద్ధోతా క్రతువిద్విజానన్యజిష్ఠో దేవాగ్ం ఋతుశో యజాతి స్వాహా। అగ్నయ ఇదం నమమ।
7. శ్రీవిష్ణవే స్వాహా। విష్ణవే పరమాత్మన ఇదం నమమ।

---

[231] మంత్రరహితముగా అగ్నిచుట్టును ప్రదక్షిణముగా పరిషేచనము చేసి, వాళ్లెపసార్లు నేతిని ఇతరదర్వితో ప్రధానదర్విలోనికి వేసికొనుచు, 1, 2 మంత్రములతో హోమము చేయుచు, "స్వాహా"- అన్నపుడెల్లా ప్రధానదర్వి కొననుండి నేతిని అగ్నిలో వేయుచు, ప్రధానదర్విలో శేషించిన నేతి నొక చిన్నదొప్పలో చేర్చుచుండవలెను. ఇట్లు దొప్పలో చేర్చుకొనిన పరిశిష్టాజ్యమునకు సంపాతాజ్యమని పేరు.

[232] తరువాత ప్రాణాయామము చేసి, "శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం----సర్వప్రాయశ్చిత్తం అనాజ్ఞాతాద్యాహుతీశ్చ హోష్యామి"- అని చెప్పి, 3-7 మంత్రములతో ఇతర దర్విలోనికి ఒక్కొకసారి ఆజ్యమును తీసికొనుచు ప్రాయశ్చిత్తహోమమును వేయవలెను.

[233]ఇతి స్రువేణ సకృద్గృహీతాజ్యేన హుత్వా, దర్భాన్ ప్రహృత్య, పూర్వవదగ్నిం పరిషిచ్య, అగ్న్యుపస్థానం కుర్యాత్.

[234] అగ్న్యుపస్థానమ్:

ప్రాణానాయమ్య, "శ్రీభగవదాజ్ఞయా భగవత్కైఙ్కర్యరూపం అగ్న్యుపస్థానం కరిష్యే" - ఇతి సంకల్ప్య, ఉత్థాయ, అఞ్జలిం బధ్వా,

"అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్। యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ। అగ్నయే నమః। ప్రవశ్శుక్రాయ భానవే భరధ్వమ్। హవ్యం మతిం చాగ్నయే సుపూతమ్। యో దైవ్యాని మానుషా జనూగంషి। అన్తర్విశ్వాని విద్మనా జిగాతి। అచ్ఛాగిరో మతయో దేవయన్తీః। అగ్నిం యన్తి ద్రవిణం భిక్షమాణాః। సుసందృశగ్ం సుప్రతీకగ్ం స్వంచమ్। హవ్యవాహ మరతిం మానుషాణామ్। అగ్నే త్వమస్మ ద్యుయోధ్యమీవాః। అనగ్నిత్రా అభ్యమన్త కృష్టీః। పునరస్మభ్యగ్ం సువితాయ దేవ। క్షాం విశ్వేభి రజరేభిర్యజత్ర। అగ్నే త్వం పారయా నవ్యో అస్మాన్ స్వస్తిభిరతి దుర్గాణి విశ్వా। పూశ్చ పృథ్వీ బహులా న ఉర్వీ భవా తోకాయ తనయాయ శంయోః। ప్రకారవో మననా వచ్యమానాః। దేవద్రీచీం నయథ దేవయన్తః। దక్షిణావాడ్వాజినీ ప్రాచ్యేతి। హవిర్భరన్త్యగ్నయే ఘృతాచీ।"

మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన।
యద్ధుతంతు మయా దేవ పరిపూర్ణం తదస్తు తే॥

---

[233] అనాజ్ఞాతహోమానన్తరము దర్భలను అగ్నిలో పడవేసి, అమంత్రకముగా ప్రదక్షిణముగా అగ్నిని పరిషేచనము చేసి, అగ్న్యుపస్థానము చేయవలెను.

[234] అగ్న్యుపస్థానము ఈవిధముగా చేయవలెను. కర్త, అతని తమ్ములును ప్రాణాయామము చేసి, "శ్రీభగవదాజ్ఞయా భగవత్కైఙ్కర్యరూపం అగ్న్యుపస్థానం కరిష్యే" - అని సంకల్పించి, లేచి నిలబడి, అఞ్జలిబద్ధులై, "అగ్నే నయ సుపథా రాయే అస్మాన--- యాని తేషామశేషాణాం కృష్ణానుస్మరణం పరమ్।" - పర్యంతము చెప్పి, అగ్నికి నమస్కరించి, చెవులు మూసికొని వంగి తమ గోత్రర్షినామములతో గూడిన ప్రవరను చెప్పి అభివాదము చేసి కూర్చొనవలెను.

*ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపః కర్మాత్మకాని వై।*
*యాని తేషామశేషాణాం కృష్ణానుస్మరణం పరమ్॥*

ప్రణమ్య, "అభివాదయే ---" ఇతి ప్రవరముక్త్వా అభివాద్య ఉపవిశేత్.

[235] తతః, *"యదాక్షానం త్రైకకుదం జాతగం హిమవతస్పరి। తేనామృతస్య మూలే నారాతీర్జమ్భయామని"*- ఇత్యఞ్జనం ధృత్వా, కస్మింశ్చిత్పాత్రే హోమాగ్నిం గృహీత్వా, గృహం గత్వా పుణ్యాహం కారయిత్వా, తేన జలేన గృహాదికాని ఆత్మానం చ ప్రోక్ష్య, హోమాగ్నినా దీపం ప్రజ్వాల్య, వస్త్రాణి శుద్ధ్యర్థం రజకాయ దత్వా, నూతనవస్త్రాణి ధృత్వా, యవౌదనం, వ్రీహ్యోదనం వా జ్ఞాతిభిస్సహ *"యవోసి యవయాస్మద్ద్వేషో యవయారాతీః"*- ఇతి భుక్త్వా, బ్రాహ్మణేభ్యో యథాశక్తి దక్షిణాం దద్యాత్.

[235] తరువాత *"యదాక్షానం త్రైకకుదం----జమ్భయామని"* అను మంత్రముతో సంపాతాజ్యమును కనురెప్పలపై రుద్దుకొని, హోమాగ్నిని ఒక చిన్న పాత్రలో తీసికొని, ఇంటిలోనికి ప్రవేశించవలెను. కర్త ఇంటిలోనికి ప్రవేశించునపుడు స్త్రీలతనికి హారతి నీయవలెను. అతనికి ఆరటికాయ, బియ్యము, బెల్లము, అద్దములను చూపవలెను. ప్రవేశించిన తర్వాత కర్త పుణ్యాహవాచనము చేయించి, తజ్జలముతో ఇంటిని, తనను, జ్ఞాతులను, ప్రోక్షించుకొని, వస్త్రములను చాకలికి వేసి, మామగారువారు తెచ్చిన నూతనవస్త్రములను ధరించి, ఇంటికి తెచ్చిన హోమాగ్నితో దీపమును వెలిగించి (ఈ దీపము మఱునాటివఱకుండవలెను. దీనిలోనే 11వనాటి ఉదయం ప్రేతభార్యముఖమును చూడవలెను), *"యవోసి యవయాస్మద్ద్వేషో"*- అను మంత్రముతో యవాన్నమును గాని, వరియన్నమునుగాని జ్ఞాతులతో సహ భుజించి, బ్రాహ్మణులకు యథాశక్తి దక్షిణ నీయవలెను. ఐతే ఊరికి బయట ఈ హోమములను చేసినప్పుడు అన్నమును తినుటకు వీలుపడదు గనుక, సాధారణముగా వరపేలాల వాసనాఘ్రాణించి ఈ తంత్రమును నడుపుచున్నారు.

## పుణ్యాహవాచనమ్

[236]పాణిపాదౌ ప్రక్షాళ్య, ఆచమ్య, పవిత్రపాణిః శుద్ధభూమౌ కదళ్యాదిదళే ప్రస్థపరిమితం తణ్డులం నిక్షిప్య, తణ్డులోపరి ప్రాచీనాగ్రం దర్భద్వయం నిక్షిప్య, తేషు తన్తువేష్టితం, ధూపితం జలకుమ్భం నిధాయ, తం ప్రణవవ్యాహృతిభిరద్భిః పూరయిత్వా, కూర్చామ్రపల్లవాదిభి రలం కృత్య, దర్భేష్వాసీనః ప్రాణానాయమ్య,

*శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నో పశాన్తయే॥*
*యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్।*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే॥*

*"ఓం శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే*

---

[236] పుణ్యాహవాచనము చేయుటకై కర్త ముందుగా కాళ్లు, చేతులు కడిగికొని, ఆచమించి, పవిత్రమును ధరించి, పరిశుద్ధమైన ప్రదేశమున అరటియాకును పఱచి, దానిలో మానెడు బియ్యమును పోసి, ఆ బియ్యముపై పూర్వాగ్రములుగా రెండు దర్భలను పఱచి, వానిపై చుట్టుచు దారమును చుట్టబడినదియు, అగరువత్తులపొగచే ధూపితమైన లోపలిభాగము కలదియునైన కలశము నుంచి (సూచన: కొందఱు దారమును చుట్టని కలశమునే ఉంచుచున్నారు), "ఓం భూర్భువస్సువరోమ్" - అని అందులో నీటిని నింపి, కూర్చను, మామిడికొమ్మను (ఆకుల కొనలు, కూర్చకొనలు పైకుండునట్లుగా) ఆ కలశమునందుంచి దాని నలంకరించి (టెంకాయను కూడ కొందఱు జుట్టు పైకిచేసి ఆ కలశముఖమున నుంచుచున్నారు), దర్భహస్తులైన బ్రాహ్మణులను తూర్పుముఖముగా కూర్చుండ బెట్టుకొని, కర్త దక్షిణదిశలో నుత్తరమువైపు ముఖము చేసి దర్భలపై కూర్చుండి ప్రాణాయామము చేసి, "*శుక్లాంబరధరం ---*", "*యస్య ద్విరదవక్త్రాద్యాః --*" అను శ్లోకములను చెప్పి, "*ఓం శ్రీగోవింద---శుద్ధిపుణ్యాహవాచనం కరిష్యే* "- అని సంకల్పించవలెను. (గమనిక: అంత్యక్రియలు చేయు కర్త కింకను ఆశౌచము ఉండుటచే, పుణ్యాహవాచనము ఆశౌచము లేని వేఱొక శ్రోత్రియునిచే చేయింపవలెను. అందుచే ఇక్కడ కర్త యనగా ఆ శ్రోత్రియుడే యని గ్రహింపవలెను.)

అష్టావింశతితమే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే ----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----మాసే ----పక్షే ----తిథౌ ---- వాసరే ----నక్షత్రయుక్తాయాం శుభనక్షత్ర, శుభయోగ, శుభకరణ ఏవం గుణ విశిష్టాయాం అస్యాం శుభతిథౌ శ్రీభగవదాజ్ఞయా భగవత్కైంకర్యరూపం ఆశౌచనివృత్త్యర్థం ఆత్మశుద్ధ్యర్థం స్థలాదిశుద్ధ్యర్థం చ శుద్ధిపుణ్యాహవాచనం కరిష్యే" - ఇతి సంకల్ప్య,

[237] "పుణ్యాహే చతురో బ్రాహ్మణాన్ తోషయిష్యే" - ఇతి సాక్షతతీర్థం భూమౌ నిస్రావ్య, దక్షిణకరతలేన కుమ్భం సమాలభ్య, "స్వామినః మనస్సమాధీయతామ్ - ఇతి కర్తా, "సమాహితమనసః స్మః" - ఇతి ప్రతివచనమ్. కర్తా "ప్రసీదన్తు భవన్తః" - "ప్రసన్నాః స్మః"-ఇతి ప్రతివచనమ్. కర్తా - "భవద్భిరనుజ్ఞాతః శుద్ధిపుణ్యాహం వాచయిష్యే" - "ఓం వాచ్యతామ్" - ఇతి ప్రతివచనమ్. కర్తా - "పుణ్యాహం భవన్తో బ్రువన్తు" - "పుణ్యాహమస్తు"- ఇతి ప్రతివచనమ్. "స్వస్తి భవన్తో బ్రువన్తు" - "స్వస్త్యస్తు"- ఇతి ప్రతివచనమ్. కర్తా- "ఋద్ధిం భవన్తో బ్రువన్తు" - "ఋధ్యతామ్"-ఇతి ప్రత్యుక్తిః. ఇతి ప్రార్థనాప్రతివచనే త్రిః త్రిః.

---

[237] "పుణ్యాహే చతురో బ్రాహ్మణాన్ తోషయిష్యే" - అని చెప్పుచు హిరణ్యమును, హరిద్రాక్షతలను, జలమును కుడిచేతిలోనికి తీసికొని, కలశముచుట్టును ప్రదక్షిణముగా మూడుసార్లు చుట్టి, దానిని వాయవ్యమునకు వదలి పెట్టి (ఆ హిరణ్యమును బ్రాహ్మణుల కొసగవలెను), కుడి అఱచేతిని కలశముపై మూసియుంచి, కర్త "స్వామినః మనస్సమాధీయతామ్" - అని ప్రార్థింపగా బ్రాహ్మణులు "సమాహితమనసః స్మః" - అని చెప్పవలెను. ఇట్లే కర్తయు, విప్రులును వరుసగా, "ప్రసీదన్తు భవన్తః" అనగా, "ప్రసన్నాః స్మః" అనియు, "భవద్భిరనుజ్ఞాతః శుద్ధిపుణ్యాహం వాచయిష్యే" అనగా, "ఓం వాచ్యతామ్" అనియు, "పుణ్యాహం భవన్తో బ్రువన్తు" అనగా, "పుణ్యాహమస్తు" అనియు, "స్వస్తి భవన్తో బ్రువన్తు" అనగా, "స్వస్త్యస్తు" అనియు, "ఋద్ధిం భవన్తో బ్రువన్తు" అనగా, "ఋధ్యతామ్" అనియు ప్రార్థనా, ప్రత్యుక్తులు పలుకవలెను. గమనిక: "పుణ్యాహం భవన్తో బ్రువన్తు" నుండి "ఋద్ధిం భవన్తో బ్రువన్తు" వఱకు గల మూడు ఉత్తరప్రత్యుత్తరములను మూడు మూడేసి సార్లు పలుకవలెను.

[238] అనంతరం "ఓం ఋద్ధిః, ఓం సమృద్ధిః, పుణ్యాహసమృద్ధిరస్తు, శివం కర్మాస్తు, ప్రజాపతిః ప్రీయతామితి భవన్తో బ్రువన్తు" - ఇతి ప్రార్థయేత్. "అస్తు ప్రీయతాం భగవాన్ ప్రజాపతిః" - ఇతి ప్రతివచనమ్.

[239] అథ "శాన్తిరస్తు, పుష్టిరస్తు, తుష్టిరస్తు, ఋద్ధిరస్తు, అవిఘ్నమస్తు, ఆయుష్యమస్తు, ఆరోగ్యమస్తు, ధనధాన్యసమృద్ధిరస్తు, గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు" - ఇతి కించిత్ కించిజ్జలం కూర్చేన కస్మింశ్చిత్పాత్రే నిధాయ సర్వే సహ బ్రూయుః.

[240] "ఐశాన్యాం బహిర్దేశే అరిష్టనిరసనమస్తు, ఆగ్నేయ్యాం యత్పాపం తత్ప్రతిహతమస్తు, సర్వశోభనమస్తు, సర్వాన్నసమృదస్త్వస్తు" - "ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః" - ఇతి నీతం జలం కుమ్భే వినయేత్. [241] తతః

---

[238] తరువాత కర్త "ఓం ఋద్ధిః, ఓం సమృద్ధిః, పుణ్యాహసమృద్ధిరస్తు, శివం కర్మాస్తు, ప్రజాపతిః ప్రీయతామితి భవన్తో బ్రువన్తు" - అని బ్రాహ్మణులను ప్రార్థింపగా, వారు "అస్తు ప్రీయతాం భగవాన్ ప్రజాపతిః" - అని చెప్పవలెను.

[239] తరువాత కర్త ఎడమచేతిలో నొక ఎండుకొబ్బెరిగిన్నెను పట్టుకొని, కొనలు క్రిందికుండునట్లుగా కలశములో నుంచిన కూర్చను, మామిడికొమ్మను కలిపి కుడిచేతిలో పట్టుకొని "ఓం ఋద్ధిః---- గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు" - అను తొమ్మిది వాక్యములను బ్రాహ్మణులతో గూడి చెప్పుచూ, ప్రతివాక్యము చివర కలశములోనుండి కొంచెము నీటిని కూర్చామ్రపల్లవములతో ఆ గిన్నెలోనికి చేర్చుకొని,

[240] "ఐశాన్యాం బహిర్దేశే అరిష్టనిరసనమస్తు" అని చెప్పుచు ఈశాన్యమునకు, "ఆగ్నేయ్యాం యత్పాపం తత్ప్రతిహతమస్తు" అనుచు ఆగ్నేయమునకును, "దక్షిణతః సర్వశోభనమస్తు" అనుచు దక్షిణమునకును, "సర్వాన్నసమృదస్త్వస్తు" అనుచు పైకిని కూర్చ, మామిడియాకుల కొనలతో కలశములోని నీటిని చల్లి "ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః" - అని కొబ్బెరిగిన్నెలో సేకరించిన జలమును మఱల కలశములో పోసి, కూర్చను, మామిడి కొమ్మను కొనలు పైకుండునట్లుగ మఱల కలశములో నుంచవలెను.

[241] తరువాత అయామతమును, అక్షతలను కుడిచేతిలో తీసికొని "ఇమం మే వరుణ ------ ప్రమోషీః" - అను మంత్రమును చెప్పి, "అస్మిన్ కుమ్భే వరుణరూపిణం పరమాత్మానమావాహయామి" - అని కలశమునందు అక్షతలను, అయామతము నుంచి వరుణుని ఆవాహన చేసి,

"ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృడయ। త్వామవస్యురా చకే। తత్త్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదాశాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో వరుణేహ బోధ్యురుశగంస మా న ఆయుః ప్రమోషీః॥ అస్మిన్ కుమ్భే వరుణరూపిణం పరమాత్మమావాహయామి" - ఇతి కుమ్భే వరుణమావాహ్య, "ఆసనాది షోడశోపచారాన్ సమర్పయామి" - ఇత్యక్షతైస్సంపూజ్య, "తదంగం మన్త్రజపం కరిష్యే" - ఇత్యుక్త్వా చతుర్దిక్షూపవేశనిషణ్ణైశ్చతుర్భిః బ్రాహ్మణైః దర్భహస్తైః కుమ్భమన్వారభ్య,

"ఓం దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః। సురభి నో ముఖా కరత్ ప్రణ ఆయూగ్ంషి తారిషత్। ఆపో హిష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన। మహే రణాయ చక్షసే। యో వః శివతమో రసః। తస్య భాజయతేహ నః। ఉశతీరివ మాతరః। తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ। ఆపో జనయథా చ నః।

హిరణ్యవర్ణాశ్శుచయః పావకా యాసు జాతః కశ్యపో యాస్విన్ద్రః। అగ్నిం యా గర్భం దధిరే విరూపాస్తా న ఆపశ్శగ్గ్ం స్యోనా భవన్తు। యాసాగ్ం రాజా వరుణో యాతి మధ్యే సత్యానృతే అవపశ్యం జనానామ్। మధుశ్చుతశ్శుచయో యాః పావకాస్తా న ఆపశ్శగ్గ్ం స్యోనా భవన్తు। యాసాం దేవా దివి కృణ్వన్తి భక్షం యా అన్తరిక్షే బహుధా భవన్తి। యాః పృథివీం పయసోన్దన్తి శుక్రాస్తా న ఆపశ్శగ్గ్ం స్యోనా భవన్తు। శివేన మా చక్షుషా పశ్యతాపశ్శివయా తనువోప స్పృశత త్వచం మే। సర్వాగ్ం అగ్నీగ్ం రప్సుషదో హువే వో మయి వర్చో బలమోజో నిధత్త।

---

"ఆసనాది షోడశోపచారాన్ సమర్పయామి" - అని హరిద్రాక్షతలను కలశముపై వేసి, "తదంగం మన్త్రజపం కరిష్యే" - అని చెప్పి, రెండు రెండేసి దర్భలను కుంభము చుట్టునూ నలు దిక్కులా ఆసీనులైన నల్గురు బ్రాహ్మణుల కొసగి, వారితో సహ దర్భలచే కుంభమును తాకుచు, కర్త "ఆపో హిష్ఠా మయో భువః", "హిరణ్యవర్ణాశ్శుచయః", "పవమానస్సువర్జనః", "తచ్ఛం యోరావృణీమహే", "నమో బ్రహ్మణే", "ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః" - అను మంత్రములను జపించవలెను. (గమనిక: చిట్టచివరి "నమో బ్రహ్మణే" నుండి "ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః" వరకు గల మంత్రములను మూడేసి సారులు పలుకవలెను.)

పవమానస్సువర్జనః। పవిత్రేణ విచర్షణిః। యః పోతా స పునాతు మా। పునన్తుమా దేవజనాః। పునన్తు మనవో ధియా। పునన్తు విశ్వ ఆయవః। జాతవేదః పవిత్రవత్। పవిత్రేణ పునాహిమా। శుక్రేణ దేవ దీద్యత్। అగ్నే క్రత్వా క్రతూగ్ం రను। యత్తే పవిత్రమర్చిషి। అగ్నే వితతమన్తరా। బ్రహ్మ తేన పునీమహే। ఉభాభ్యాం దేవ సవితః। పవిత్రేణ సవేన చ। ఇదం బ్రహ్మ పునీమహే। వైశ్వదేవీ పునతీ దేవ్యాగాత్। యస్యై బహ్వీస్తనువో వీతపృష్ఠాః। తయా మదన్తస్సధ మాద్యేషు। వయగ్ం స్యామ పతయో రయీణామ్। వైశ్వానరో రశ్మిభిర్మా పునాతు। వాతః ప్రాణేనేషిరో మయోభూః। ద్యావాపృథివీ పయసా పయోభిః। ఋతావరీ యజ్ఞియే మా పునీతామ్। బృహద్భిస్సవితస్తృభిః। వర్షిష్ఠైర్దేవ మన్మభిః। అగ్నే దక్షైః పునాహి మా। యేన దేవా అపునత। యేనాపో దివ్యం కశః। తేన దివ్యేన బ్రహ్మణా। ఇదం బ్రహ్మ పునీమహే। యః పావమానీరధ్యేతి। ఋషిభిస్సంభృతగ్ం రసమ్। సర్వగ్ం సపూతమశ్నాతి। స్వదితం మాతరిశ్వనా। పావమానీ ర్యో అధ్యేతి। ఋషిభిస్సంభృతగ్ం రసమ్। తస్మై సరస్వతీ దుహే। క్షీరగ్ం సర్పిర్మధూదకమ్। పావమానీస్స్వస్త్యయనీః। సుదుఘా హి పయస్వతీః। ఋషిభి స్సంభృతో రసః। బ్రాహ్మణేష్వమృతగ్ం హితమ్। పావమానీర్దిశన్తు నః। ఇమం లోక మథో అముమ్। కామాన్సమర్ధయన్తు నః। దేవీర్దేవైస్సమాభృతాః। పావమానీ స్స్వస్త్యయనీః। సుదుఘా హి ఘృతశ్చుతః। ఋషిభిస్సంభృతో రసః। బ్రాహ్మణేష్వమృతగ్ం హితమ్। యేన దేవాః పవిత్రేణ। ఆత్మానం పునతే సదా। తేన సహస్రధారేణ। పావమాన్యః పునన్తుమా। ప్రాజాపత్యం పవిత్రమ్। శతోద్యామగ్ం హిరణ్మయమ్। తేన బ్రహ్మవిదో వయమ్। పూతం బ్రహ్మ పునీమహే। ఇన్ద్రస్సునీతీ సహ మా పునాతు। సోమ స్స్వస్త్యా వరుణస్సమీచ్యా। యమో రాజా ప్రమృణాభిః పునాతు మా। జాతవేదా మోర్జయన్త్యా పునాతు। తచ్ఛంయోరావృణీమహే। గాతుం యజ్ఞాయ। గాతుం యజ్ఞపతయే। దైవీ స్వస్తిరస్తు నః। స్వస్తిర్మానుషేభ్యః। ఊర్ధ్వం జిగాతు భేషజమ్। శం నో అస్తు ద్విపదే। శం చతుష్పదే।

ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః।

నమో బ్రహ్మణే నమో అస్త్వగ్నయే నమః పృథివ్యై నమ ఓషధీభ్యః/ నమో వాచే నమో వాచస్పతయే నమో విష్ణవే బృహతే కరోమి/ ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః/(ఏవం త్రిః) -

[242]ఇతి జపిత్వా, ప్రణవేన కుమ్భముత్థాప్య, దేవస్యత్వాదినా సపత్నీకం యజమానం ప్రోక్షయేత్.

"దేవస్య త్వా సవితుః ప్రసవే/ అశ్వినోర్బాహుభ్యామ్/ పూష్ణో హస్తాభ్యామ్/ అశ్వినోర్భైషజ్యేన/ తేజసే బ్రహ్మవర్చసాయాభిషిఞ్చామి/ దేవస్య త్వా సవితుః ప్రసవే/ అశ్వినోర్బాహుభ్యామ్/ పూష్ణో హస్తాభ్యామ్/ సరస్వత్యై భైషజ్యేన/ వీర్యాయాన్నాద్యాయాభిషిఞ్చామి/ దేవస్య త్వా సవితుః ప్రసవే/ అశ్వినోర్బాహుభ్యామ్/ పూష్ణో హస్తాభ్యామ్/ ఇన్ద్రస్యేన్ద్రియేణ/ శ్రియై యశసే బలాయాభిషిఞ్చామి/

దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాగ్ం సరస్వత్యై వాచో యన్తుర్యన్త్రేణాగ్నేస్త్వా సామ్రాజ్యేనాభిషిఞ్చామీన్ద్రస్య త్వా సామ్రాజ్యేనాభి

---

[242] పై మంత్రములను బ్రాహ్మణులతో సహ జపించి, షోడశోపచారార్థం కలశముపై అక్షతలు వేసి, ప్రణవముతో (అనగా, "ఓం "అనుచు), కలశమును రెండుచేతులా లేవనెత్తి, ఇదివరకు విప్రుల చేతి కొనగిన దర్భలను తిరిగి తీసికొని, వాని కొనలను కలశములోని కూర్చామ్రపల్లవాగ్రములతో చేర్చి, వానితో కలశములోని నీటి వద్దుకొనుచు క్రింద నొసగిన "దేవస్య త్వా" అను మంత్రములను పఠించుచు కర్త తనను, పితృ(మాతృ)కర్మకర్తను, అతని యొక్కయు, జ్ఞాతుల యొక్కయు కుటుంబములను ప్రోక్షింపవలెను. ఇట్లు ప్రోక్షించుకొని "అకాలమృత్యు హరణం "- అను శ్లోకమును చెప్పుచు కలశములోని నీటిని త్రాగవలెను. ఆ తర్వాత "వాస్తోష్పతే - అను మంత్రముతో ఇంటిని, ఇతరపదార్థాదికమును, ఇంటి పరిసరములను ప్రోక్షించి, వస్త్రాదులను ఉతుకుటకై రజకులకు వేసి, క్రొత్తవస్త్రములను ధరింపవలెను. ఈ సందర్భములో కర్త వివాహితుడైనచో అతని మామగారును, బ్రహ్మచారియైన యెడల అతని మేనమామయు అతనికి నూతనవస్త్రము లొసగుట సంప్రదాయము. కర్త ఆ వస్త్రములను ధరించి "యువాసు "అను మన్త్రముతో జ్ఞాతులతో సహ భోజనము చేసి, బ్రాహ్మణాశీర్వాదమును పొంది, వారికి దక్షిణ నీయవలెను.

విశ్వామి/ బృహస్పతే స్త్వా సామ్రాజ్యేనాభిషిఞ్చామి/ భూయ్యవన్నువః" - అమృతాభిషేకో అస్తు. అన్తశ్శుద్ధ్యర్థం పుణ్యాహజలం పిబేత్:

*అకాలమృత్యుహరణం సర్వవ్యాధినివారణమ్/*
*సర్వపాపప్రశమనం పాణి పాదోదకం శుభమ్//*

-ఇతి. "వాస్తోష్పతే"- ఇతి చతుర్భిర్మన్త్రై కూర్చేన గృహాదిషు ప్రోక్షయేత్.

*"వాస్తోష్పతే శగ్మయా సగ్ంసదా తే సక్షీ మహి రణ్వయా గాతుమత్యా/ అవః క్షేమ ఉత యోగే వరం నో యూయం పాత స్వస్తిభిస్సదా నః/ వాస్తోష్పతే ప్రతరణో న ఏధి గోభిరశ్వేభిరిన్దో/ అజరాసస్తే సఖ్యే స్యామ పితేవ పుత్రాన్ ప్రతి నో జుషస్వ/ అమీవహా వాస్తోష్పతే విశ్వా రూపాణ్యావిశన్/ సఖా సుశేవ ఏధి నః శివగం శివమ్/*



నియవలెను.

# ఏకాదశాహవిధిః

[243]ఏకాదశాహని కర్తా, జ్ఞాతయశ్చ ఆశౌచనివృత్తిస్నానం కృత్వా, శ్రీచూర్ణసహితోర్ధ్వ పుండ్రాన్ ధృత్వా, నూతనయజ్ఞోపవీతం, పవిత్రం చ ధృత్వా, సన్ధ్యావన్దనాది నిత్యకర్మాణి కుర్యుః. తతః ప్రాణానాయమ్య, *"అస్యాం తిథౌ ----గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశాహని సర్వోపకరణశుద్ధ్యర్థం ఆద్యమాసిక, ఆవర్తాద్యమాసిక ఏకోద్దిష్టశ్రాద్ధ-ద్రవ్యోపకరణ శుద్ధ్యర్థం చ శుద్ధపుణ్యాహం వాచయిష్యే"* - ఇతి సంకల్ప్య, శుద్ధపుణ్యాహం కృత్వా, పుణ్యాహజలేన గృహం ప్రోక్ష్య, సర్వోపకరణాని ప్రోక్ష్య, వస్త్రాణి శౌచనార్థం రజకాయ దత్వా, ప్రాతఃకాలే ఏవ వృషోత్సర్జనం కృత్వా, తతః నవశ్రాద్ధం కుర్యాత్.

## *వృషోత్సర్జనవిధిః*

*"ఏకాదశాహే ప్రేతస్య యస్య నోత్సృజ్యతే వృషః।*
*ప్రేతత్వం సుస్థిరం తస్య దత్తైః శ్రాద్ధశతైరపి॥"*

---

243 11వ నాటి ఉదయమందు కర్తలు కాలకృత్యముల దీర్చి, శ్రీచూర్ణయుతముగా తిరుమణిని ధరించి, 10వనాడు ఆనన్దహోమాగ్నితో వెలిగించిన దీపమును తీసికొనిపోయి, మాంగల్యాదులను పరిత్యజించిన ప్రేతభార్య (తమ తల్లి) ముఖమును చూడవలెను. తరువాత జ్ఞాతులూ, కర్తయు ఆశౌచనివృత్తిస్నానమునుచేసి, ఇంటిలోని వస్త్రముల నన్నిటిని ఉతికి ఆరవేసికొని, శ్రీచూర్ణయుతముగా ఊర్ధ్వపుండ్రములను ధరించి, నూతనయజ్ఞోపవీతములను ధరించి సంధ్యావన్దనాదికర్మల నాచరించి, పవిత్రమును ధరించి, అందులో జ్యేష్ఠుడు ప్రాణాయామము చేసి, *"అస్యాం తిథౌ---శుద్ధపుణ్యాహం వాచయిష్యే"*- అని సంకల్పించి, ఆశౌచరహితుడైన ఒక శ్రోత్రియునిచే శుద్ధిపుణ్యాహవాచనము చేయించి (పుణ్యాహవాచనమునకు వెనుకటి అధ్యాయమును చూచునది), ఆ జలముతో ఇంటిని, జ్ఞాతులను, సర్వపదార్థములను ప్రోక్షింపజేసి, ఉదయముననే వృషోత్సర్జనము చేసి, ఆపైన శ్రీచూర్ణమును తుడిపివేసికొని, నవశ్రాద్ధమును చేసి, మఱల స్నానమును చేసి, తిరుమణిని మాత్రమే పెట్టుకొని, నిత్యవిధికి వండిన పాత్రలోనే ఏకోద్దిష్టమునకై అన్నమును వండి, వేఱుగా (అరటికాయ)కూరను, పెసరపప్పును, వడలను, పాయసమును కూడ వండి, ఏకోద్దిష్టశ్రాద్ధమును చేయవలెను.

*"లోహితో యస్తు వర్ణేన ముఖే పుచ్ఛే చ పాండురః।*
*శ్వేతః ఖురవిషాణాభ్యాం స వృషో నీల ఉచ్యతే॥"*

[244]ఇత్యుక్తలక్షణం వా, సర్వకృష్ణవర్ణం వా, యథా శోభనవర్ణం వా ద్వివర్షాధికం వర్షా[illegible] వా వృషభముత్సృజేత్. తతః ఏకాదశేఽహని వృషోత్సర్జనాకరణే యదాకదాచిత్ సపిండీకరణాత్పూర్వం కుర్యాత్. పతిపుత్రవత్యాః స్త్రియాస్సగాం వృషభముత్సృజేత్. పుత్రాసన్నిధానే భర్తాఽన్యో వా కర్తా చేద్వృషభమేవోత్సృజేత్. అపుత్రాయా భర్తృమత్యా గోదానమాత్రం కుర్యాత్.

*ప్రయోగః:* కర్తా ఉపవీతి,

*"నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ।*
*జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః॥"*

---

[244] *వృషోత్సర్జనవిధిక వివరణము:* 11వ రోజు చేయు కర్మలన్నియు మృతునికి ప్రేతత్వవిమోచనము కల్గించి, అతనిని పితృదేవతలలో చేరుటకు అర్హుని చేయుటకై ఉద్దేశించినవి. వానిలో వృషోత్సర్జనము (ఎద్దును విడిచిపెట్టుట) అను కర్మ ఎవనికైతే చేయబడదో అతనికై మాసికాది శ్రాద్ధములు పెట్టినను అతనికి ప్రేతత్వము వదలదు - అని ధర్మశాస్త్రము. దేహమంతయు ఎఱ్ఱనిదై, ముఖము, తోకయు, గిట్టలును, కొమ్ములును తెల్లనివై యున్న ఎద్దునకు నీలవృషభమని పేరు; లేదా తెల్లని దానికి ముఖపుచ్ఛాదులు నల్లనివైనను అదియు నీలవృషభమే. ఇట్టి నీల వృషభమునుగాని, అంతటను నల్లనైనదానిని గాని, లేదా ఏదోయొక లక్షణమైన వర్ణముగల దానిని గాని, ఒకటి లేక రెండు సంవత్సరముల ప్రాయముగల దానిని విడువవలెను. ఒకవేళ 11వ నాడు విడువజాలనిచో సపిండీకరణమునకు లోగా ఎట్లో యొకట్లు విడువవలెను. పతిపుత్రులు గల సువాసిని మృతినందినచో వృషముతో బాటు గోవును కూడ విడువవలెను. సుమంగళి మరణించినప్పుడు పుత్రుడు చెంతలేక భర్తాదులు కర్మ చేయునెడ స్త్రీలకు సైతము ఎద్దునే విడువవలెను. పుత్రులులేని సుమంగళి మరణించినచో గోదానమును మాత్రము చేయవలెను. (గమనిక: ఈ కాలములో ప్రత్యక్షవృషభమును విడుచుటకు వసతి లేకున్నది. అందుచేత ఈ కర్మను ప్రత్యక్షవృషభముతో చేయకున్నను, పరోక్షముగా ఆమరూపప్రతికృతితోనైనను చేయవలెను. ఈ ప్రత్యక్ష, పరోక్షవిధానము లిచ్చట వివరింపబడినవి.)

- ఇతి బ్రాహ్మణాన్ నమస్కృత్య, [245]ప్రాచీనావీతి, *"అశేషే హే పరిషత్. స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్త దక్షిణామివ స్వీకృత్య -------గోత్రస్య -------శర్మణః పితుః ప్రేతస్య (అథవా,----- గోత్రాయాః-----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశాహని పాపక్షయార్థం పైశాచత్వనివృత్త్యర్థం వృషోత్సర్జనం కర్తుం యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ"*- ఇతి ప్రార్థ్య, *"తథాస్తు,యోగ్యతాసిద్ధిరస్తు"*- ఇతి బ్రాహ్మణైరనుజ్ఞాప్య, ఉపవీతి, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి, *"అస్యాం తిథౌ----గోత్రస్య----శర్మణః పితుః ప్రేతస్య(అథవా,----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశాహని పాపక్షయార్థం పైశాచత్వ నివృత్త్యర్థం వృషోత్సర్జనం కరిష్యే"* - ఇతి సంకల్ప్య, [246]సర్వం కృష్ణవర్ణం వా, లోహిత వర్ణం వా యథాసంభవం వా వృషభం స్నాపయ్య, అలంకృత్య, శంఖచక్రముద్రాః అగ్నితప్తేనాయసేన తస్య పశ్చిమే దక్షిణపాదమూలే విలిఖ్య, తద్దహనదోషనివృత్త్యర్థం హిరణ్యరూపేణ ప్రాజాపత్యకృచ్ఛ్రం కుర్యాత్. తత్ప్రకారః:

[247]ఉపవీతి, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి, *"శ్రీభగవదాజ్ఞయా శ్రీభగవత్కైఙ్కర్యరూపం వృషస్య త్వక్చర్మ రుధిరదహనదోషనివృత్త్యర్థం ప్రాజాపత్యకృచ్ఛ్రం హిరణ్యదాన రూపేణ కరిష్యే"*-ఇతి సంకల్ప్య,

---

[245] కర్త ఉపవీతియై *"నమో బ్రహ్మణ్య దేవాయ--- నమో నమః"* అని బ్రాహ్మణులకు నమస్కరించి, ప్రాచీనావీతియై *"అశేషే హే పరిషత్---అనుగ్రహాణ"*- అని పలికి, *"తథాస్తు, యోగ్యతాసిద్ధిరస్తు"* - అని బ్రాహ్మణానుజ్ఞను పొంది, ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై, *"అస్యాం తిథౌ గోత్రస్య ---వృషోత్సర్జనం కరిష్యే"*- అని సంకల్పించి,

[246] నల్లని లేదా ఎఱ్ఱని లేదా ఏదోయొక లభ్యమైన వర్ణముగల ఎద్దునకు స్నానము పోసి, అలంకరించి, శంఖచక్రములను కాల్చి ఆ ఎద్దుయొక్క వెనుకవైపు కుడిభుజముపై ముద్రలు వేసి, ఇట్లు శరీరముద్రలు వేయుటవలన చేకూరిన చర్మరుధిరదహనదోషనివృత్తికై హిరణ్యదానరూపకముగా ప్రాజాపత్యకృచ్ఛ్రమును చేయవలెను.

[247] దానికై కర్త ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై *"శ్రీభగవదాజ్ఞయా------ హిరణ్యదానరూపేణ కరిష్యే"*- అని సంకల్పించి, *"హిరణ్యగర్భగర్భస్థం ---ప్రయచ్ఛ మే"*-

*హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।*
*అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥ అచ్యుతః ప్రీయతామ్॥*

ఇత్యుక్త్వా, హిరణ్యం జలేన సహ భూమౌ విసృజ్య, *"ఇదం వృషస్య త్వక్చర్మ రుధిర దహనదోషనివృత్త్యర్థం ప్రాజాపత్యప్రతినిధి యత్కించిద్ధిరణ్యదానం తుభ్యమహం సంప్రదదే నమమ"* - ఇతి హిరణ్యదానం బ్రాహ్మణాయ దద్యాత్.

[248]అనంతరం *"పిశఙ్గరూప", "తన్న స్తురీపమ్"* - ఇతి మన్త్రద్వయం క్రమేణ వృషస్య దక్షిణవామకర్ణయోః దక్షిణకర్ణే వా జపేత్.

*పిశఙ్గరూపస్సుభరో వయోధా శ్రుష్టీ వీరో జాయతే దేవకామః। ప్రజాం త్వష్టా విష్యతు నాభిమస్మే అథా దేవానామప్యేతు పాథః।*

*తన్న స్తురీపమథ పోషయిత్ను దేవ త్వష్టర్విరరాణస్య స్వ। యతో వీరః కర్మణ్య స్సుదక్షో యుక్తగ్రావా జాయతే దేవకామః।*

తతః *"ఋచాం ప్రాచీ"* - ఇతి మన్త్రేణ తిలమిశ్రితజలం వృషేణ పిబ్యన్తే.

*ఋచాం ప్రాచీ మహతీ దిగుచ్యతే। దక్షిణామాహుర్యజుషామపారామ్। అథర్వణా మంగిరసాం ప్రతీచీ। సామ్నా ముదీచీ మహతీ దిగుచ్యతే। ఋగ్భిః పూర్వాహ్ణే దివి దేవ ఈయతే। యజుర్వేదే తిష్ఠతి మధ్యే అహ్నః। సామవేదేనాస్తమయే మహీయతే। వేదై రశూన్య స్త్రిభిరేతి సూర్యః। ఋగ్భ్యో జాతాగం సర్వశో మూర్తిమాహుః। సర్వా*

---

అని చెప్పి 5 రూపాయలను జలముతో సహ భూమిపై విడిచి, *"ఇదం వృషస్య త్వక్చర్మ రుధిర దహనదోషనివృత్త్యర్థం ప్రాజాపత్యప్రతినిధి యత్కించిద్ధిరణ్యదానం సంప్రదదే నమమ"* - అని చెప్పి ఆ రూపాయల నొక శ్రోత్రియునకు దానమీయవలెను. నిజమైన వృషభమునకు బదులు ప్రతికృతి దానము చేయునెడల ఈ ప్రాజాపత్యకృచ్ఛ్రముతో (అందుచే నీ హిరణ్యదానముతో) పని లేదు.

[248] తరువాత *"పిశఙ్గరూప", "తం న స్తురీప"* - అను మంత్రములను వరుసగా వృషభము యొక్క కుడి, ఎడమచెవులలో గాని, కేవలము కుడిచెవిలో గాని ఉచ్చరించి, *"ఋచాం ప్రాచీ"* అను అనువాకము నుచ్చరించుచూ, దానికి తిలోదకములను త్రాపవలెను.

గతిర్యాజుషీ హైవ శశ్వత్/ సర్వం తేజస్సామ రూప్యగ్ం హ శశ్వత్/ సర్వగ్ం హేదం
బ్రహ్మణా హైవ సృష్టమ్/ ఋగ్భ్యో జాతం వైశ్యం వర్ణమాహుః/ యజుర్వేదం క్షత్రియ
స్యాహుర్యోనిమ్/ సామవేదో బ్రాహ్మణానాం ప్రసూతిః/ పూర్వే పూర్వేభ్యో వచ ఏత
దూచుః/ ఆదర్శమగ్నిం చిన్వానాః/ పూర్వే విశ్వసృజోఽమృతాః/ శతం వర్ష సహ-
స్రాణి/ దీక్షితాస్సత్రమాసత/ తప ఆసీద్గృహపతిః/ బ్రహ్మ బ్రహ్మాభవత్స్వయమ్/
సత్యగ్ం హ హోతైషామాసీత్/ యద్విశ్వసృజ ఆసత/ అమృతమేభ్య ఉదగాయత్/
సహస్రం పరివత్సరాన్/ భూతగ్ం హ ప్రస్తోతైషామాసీత్/ భవిష్యత్ప్రతి చాహరత్/
ప్రాణో అధ్వర్యు రభవత్/ ఇదగ్ం సర్వగ్ం సిషాసతామ్/ అపానో విద్వానావృతః/
ప్రతిప్రాతిష్ఠదధ్వరే/ ఆర్తవా ఉపగాతారః/ సదస్యా ఋతవోఽభవన్/ అర్ధమాసాశ్చ
మాసాశ్చ/ చమసాధ్వర్యవోఽభవన్/ అశగ్ం సద్బ్రహ్మణస్తేజః/ అచ్ఛావాకోఽ
భవద్యశః/ ఋతమేషాం ప్రశాస్తాఽఽసీత్/ యద్విశ్వసృజ ఆసత/ ఊర్గ్రాజాన
ముదవహాత్/ ధ్రువగోపస్సహోఽభవత్/ ఓజోఽభ్యష్టౌద్గ్రావణః/ యద్విశ్వసృజ
ఆసత/ అపచితిః పోత్రీయామయజత్/ నేష్ట్రీయామయజత్త్విషిః/ అగ్నీద్ధ్రాద్విదుషీ
సత్యమ్/ శ్రద్ధా హైవాయజత్స్వయమ్/ ఇరా పత్నీ విశ్వసృజామ్/ ఆకూతిరపినద్ధవిః/
ఇధ్మగ్ం హ క్షుచ్చైభ్య ఉగ్రే/ తృష్ణా చావహతాముభే/ వాగేషాగ్ం సుబ్రహ్మణ్యా
ఽఽసీత్/ ఛన్దోయోగాన్ విజానతీ/ కల్పతన్త్రాణి తన్వానాఽహః/ సగ్ంస్థాశ్చ సర్వశః/
అహోరాత్రే పశుపాల్యౌ/ ముహూర్తాః ప్రేష్యా అభవన్/ మృత్యుస్తదభవద్ధాతా/ శమి
తోగ్రో విశాం పతిః/ విశ్వసృజః ప్రథమాస్సత్త్ర మాసత/ సహస్రసమం ప్రసుతేన యన్తః/
తతో హ జజ్ఞే భువనస్య గోపాః/ హిరణ్మయశ్శకునిర్బ్రహ్మ నామ/ యేన సూర్యస్తపతి
తేజసేద్ధః/ పితా పుత్రేణ పితృమాన్ యోని యోనౌ/ నాఽవేదవిన్మనుతే తం బృహన్తమ్/
సర్వానుభుమాత్మానగ్ం సంపరాయే/ ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య/ న కర్మణా
వర్ధతే నో కనీయాన్/ తస్యైవాత్మా పద విత్తం విదిత్వా/ న కర్మణా లిప్యతే పాపకేన/
పఞ్చ పఞ్చాశతస్త్రివృతస్సంవత్సరాః/ పఞ్చ పఞ్చాశతః పఞ్చదశాః/ పఞ్చ పఞ్చా
శతస్సప్తదశాః/ పఞ్చ పఞ్చాశత ఏకవిగ్ంశాః/ విశ్వ సృజాగ్ం సహస్రసంవత్సరమ్/

ఏతేన వై విశ్వసృజ ఇదం విశ్వమసృజన్త/ యద్విశ్వ మసృజన్త/ తస్మాద్విశ్వసృజః/ విశ్వమేనానను ప్రజాయతే/ బ్రహ్మణస్సాయుజ్యగం సలోకతాం యన్తి/ ఏతాసామేవ దేవతానాగం సాయుజ్యమ్/ సార్ష్టితాగం సమాన లోకతాం యన్తి/ య ఏతదుపయన్తి/ యే చైనత్ ప్రాహుః/ యేభ్యశ్చైనత్ ప్రాహుః/ ఓమ్/"- ఇతి పాయయిత్వా, [249] "ఏతం యువాన"మిత్యనువాకేన వృషభమభిమన్త్రయేత్.

ఏతం యువానం పరి వో దదామి తేన క్రీడన్తీశ్చరత ప్రియేణ/ మా నశ్శాప్త జనుషా సుభాగా రాయస్పోషేణ సమిషా మదేమ/ నమో మహిమ్న ఉత చక్షుషే తే మరుతాం పితస్తదహం గృణామి/ అనుమన్యస్వ సుయజా యజామ జుష్టం దేవానామిదమస్తు హవ్యమ్/ దేవానామేష ఉపనాహ ఆసీదపాం గర్భ ఓషధీషు న్యక్తః/ సోమస్య ద్రప్స మవృణీత పూషా/ బృహన్నద్రిరభవత్తదేషామ్/ పితా వత్సానాం పతిరఘ్నియానా మథో పితా మహతాం గర్గరాణామ్/ వత్సో జరాయు ప్రతిధుక్పీయూష ఆమిక్షామస్తు ఘృతమస్య రేతః/ త్వాం గావోఽవృణత రాజ్యాయ త్వాగం హవన్త మరుత స్స్వర్కాః/ వర్ష్మన్ క్షత్రస్య కకుభి శిశ్రియాణస్తతో న ఉగ్రో విభజా వసూని/ వ్యృద్ధేన వా ఏష పశునా యజతే యస్యైతాని న క్రియన్తే ఏష హ త్వై సమృద్ధేన యజతే యస్యైతాని క్రియన్తే"- తతః

"ధర్మస్త్వం వృషరూపేణ బ్రహ్మణా నిర్మితః పురా/
తవోత్సర్గప్రదానేన తారయస్వ భవార్ణవాత్//"-

ఇతి వృషభం ప్రార్థ్య, [250] "హే వృషభరాజ! పూర్వసముద్రాతః పశ్చిమసముద్రపర్యన్త భూమిషు, బ్రాహ్మణభూమిం విహాయ యథేచ్ఛం విహర" - ఇతి చతసృషు దిక్షు విసృజేత్.

---

[249] అపైన వృషభమును "ఏతం యువానం "అను అనువాకముతో అభిమంత్రించి, "ధర్మస్త్వం వృషరూపేణ -- తారయస్వ భవార్ణవాత్"- అని వృషభమును ప్రార్థించి,

[250] "హే వృషభరాజ ------యథేచ్ఛం విహర" - అని చెప్పి ఆ యెద్దును స్వేచ్ఛగా తిరుగు నట్లును, కర్తృగృహమునకు తిరిగి రాకుండునట్లుగను విడిచిపెట్టవలెను.

[251]వృషోత్సర్జనాశక్తౌ ఏకాదశబ్రాహ్మణభోజనం, తదశక్తౌ తావత్పర్యాప్తమామం హిరణ్యం వా బ్రాహ్మణాయ దద్యాత్. తత్ప్రకారః -

[252]కర్తా ఉపవీతీ, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ, *"అస్యాం తిథౌ గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ---- గోత్రాయాః -----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశాహని పాపక్షయార్థం పైశాచత్వనివృత్త్యర్థం వృషోత్సర్జనప్రతినిధి తండుల హిరణ్యసహితం ప్రతికృతిదానం కరిష్యే"* - ఇతి సంకల్ప్య,

*న్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*

*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

ఇతి సాత్త్వికత్యాగం కృత్వా, తిలాన్ వికీర్య,

*హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।*

*అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

*తండులా వైశ్వదేవత్యాః పాకేనాన్నం పచంతి యే।*

*తస్మాత్తండులదానేన అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥* - *ఇదం వృషోత్సర్జనప్రతినిధి తండులహిరణ్యసహితం ప్రతికృతిదానం తుభ్యమహం సంప్రదదే నమమ"* - ఇత్యుక్త్వా తిలోదకం భూమౌ విసృజ్య, హిరణ్యసహితమామం విప్రాయ దద్యాత్.

---

[251] ఎద్దును విడువ నశక్తులైనవారు దానికి బదులు పదకొండు బ్రాహ్మణులకు భోజమును పెట్ట వలెను. అదియు సాధ్యముగానిచో 100రూ.ల దక్షిణతో సహ ఆమమును దానము చేయ వలెను. ఆమమనగా 3 కిలోల బియ్యము, పావుకిలో పెసరపప్పు, బెల్లము, తాంబూలాదులు. వీనినొక ఆకులోనుంచి, బియ్యముపై వృషభాకృతిని వ్రాసి, "వృషమావాహయామి" - అని చెప్పి, "పితఙ్గరూప "అను మంత్రముతో మొదలిడి "ఏతం యువానం "అను మంత్రమువఱకన్ని మంత్రములను చెప్పవలెను.

[252] ఆతర్వాత కర్త ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై, *"అస్యాం తిథౌ----ప్రతి కృతిదానం కరిష్యే"* - అని సంకల్పించి, సాత్త్వికపరిత్యాగము చేసి, తిలలను భూమిపై వల్లి, *"హిరణ్యగర్భగర్భస్థం ---- ప్రయచ్ఛ మే॥"*, *"తండులా ----- ప్రయచ్ఛ మే॥"*, *"ఇదం వృషోత్సర్జన ప్రతినిధి-----సంప్రదదే నమమ"* - అని చెప్పి, తిలలతోగూడిన జలమును నేలపై విడిచి, ఆమమును 100రూ.ల దక్షిణతో సహ శ్రోత్రియునకు దానమీయవలెను.

# ఏకోద్దిష్టహోమవిధిః (అగ్న్నావేకోద్దిష్టం)

11వ దినమందు ముందుగా ప్రేతభార్య (తల్లి) ముఖావలోకన చేసి, తరువాత వృషోత్సర్జనము చేసి, ఆపైని 127వ పుటలో చెప్పినట్లుగా నవశ్రాద్ధమును చేసి, ఆ తర్వాత ఏకోద్దిష్టశ్రాద్ధమును చేయవలెను. నవశ్రాద్ధ, ఏకోద్దిష్టములను చేయునప్పుడు పూర్ణాశౌచము కల్గును. అందుచేత వీనిని తిరుమణిని మాత్రమే ధరించి చేయవలెను. ఏకోద్దిష్టమును మధ్యాహ్నమునందే (అనగా 12గంటలకు) చేయవలెను.11వ రోజ ఏకోద్దిష్టమును చేయుటకు ద్రవ్యాభావము, లేక బ్రాహ్మణాభావమున్నచో అగ్నిప్రతిష్ఠాపనము చేసి, ఆ అగ్నినే పితృస్థానమున వరణము చేసి, ఆ అగ్నిలో అన్నహోమమును, ఆజ్యహోమమును చేసి, పిండప్రదానము చేసి, ఆపైన మరణాది 12వ, లేక 13వ, లేక 27వ రోజన సపిణ్డీకరణమునకు ముందుగా బ్రాహ్మణునితో ఏకోద్దిష్టమును చేయవలెను. శ్రీమాన్ కృష్ణమాచార్యులు కన్నడలిపిలో ప్రచురించిన "అపరప్రయోగము"లో అగ్నిని వరించి చేయు ఈ అగ్న్నావేకోద్దిష్టము మిక్కిలి సంక్షిప్తీకరింపబడినది. అనగా అగ్నికి అర్ఘ్యదానము గాని, కృసరదానము గాని, పాదప్రక్షాళనము గాని చెప్పబడలేదు. తరువాత ప్రత్యక్ష బ్రాహ్మణవరణముతో ఏకోద్దిష్టమును సంపూర్ణముగా చేయుమని వారు నిర్దేశించుటయే ఈ సంక్షిప్తీకరణకు కారణము గావచ్చును (గమనిక: బోధాయనపితృమేధసూత్రములో గూడ బ్రాహ్మణాభావమునందు చేయబడు అగ్న్నావేకోద్దిష్టమునకు అర్ఘ్యదాన,కృసరదానములు చెప్పబడలేదు). కాని శ్రీమాన్ కందాడై శ్రీనివాసాచార్యులవారి "అపరప్రయోగానుక్రమణిక" లో 11వరోజ బ్రాహ్మణునికి మారు ఆయామతము నుంచి, దానికే ప్రత్యక్షబ్రాహ్మణునికి చేయు వరణ, పాదప్రక్షాళన, అర్ఘ్యదాన, కృసరదానాదులు సమస్తము చేయుమని వారు వ్రాసినారు. ఇట్లు సమస్తము ఆయామతరూపుడైన ప్రేతకు 11వ దినమున చేయుటచే, మరల ప్రత్యక్ష బ్రాహ్మణవరణముతో ఏకోద్దిష్టమును చేయనక్కఱలేదని వీరి యభిప్రాయము. ఈరెంటికంటె ప్రధానమైన, ప్రామాణికమైన "పితృమేధసారము" అను ధర్మశాస్త్రగ్రంథములో ప్రత్యక్ష బ్రాహ్మణ వరణప్రయోగమే చెప్పబడినది. ఇదియే ఉత్తమపక్షముగా దోచుచున్నది. ఒకవేళ 11వరోజ బ్రాహ్మణుడు దొరుకకున్న అగ్నిని వరణము చేసి, తర్వాత ప్రత్యక్షబ్రాహ్మణునితో ఏకోద్దిష్టమును చేయుట మధ్యమపక్షముగా దోచుచున్నది. కేవలము ఆయామతముతో ఈ తంత్రమును నడిపించుట అధమపక్షముగా దోచుచున్నది. అందుచేత ఇచ్చట శ్రీమాన్ కృష్ణమాచార్యులవారి ప్రయోగానుసారముగా, సంక్షిప్తమైన అగ్న్నావేకోద్దిష్టము, సమగ్రమైన ప్రత్యక్ష బ్రాహ్మణైకోద్దిష్టప్రయోగము చెప్పబడుచున్నవి. కేవలము ఆయామతైకోద్దిష్టమును చేయు

వారు, బ్రాహ్మణుని స్థానములో ఆయామతము నుంచి ఈ సమగ్రవిధానమందలి మంత్రతంత్రముల నన్నిటిని దానికే పాటించుచూ, దీనిని నడుపుట కనుకూలముగా సమగ్రవిధానమును విశదీకరించునప్పుడు ఈ ఆయామతవిధానము కూడ సందర్భానుసారముగా ప్రస్తావించబడును. శ్రీమాన్ కృష్ణమాచార్యులు చెప్పిన సంక్షిప్తాగ్నావేకోద్దిష్టప్రయోగ మీక్రింది విధముగా నున్నది (సూచన: కృష్ణమాచార్యులవారు వారి అపరప్రయోగముయొక్క అనుబంధములో ముందుగా అగ్నావేకోద్దిష్టమును, ఆతర్వాత సబ్రాహ్మణైకోద్దిష్టమును చేయుమని వ్రాయుటచే, 11వనాడు బ్రాహ్మణుడు లభించినను, ఆనాడు ముందుగా అగ్నావేకోద్దిష్టమును చేసి, ఆ తర్వాత సబ్రాహ్మణైకోద్దిష్టమును చేయవలెనని వారి అభిప్రాయముగా దోచుచున్నది.)

*ప్రయోగః:*[253]ఏకాదశాహని ద్రవ్యస్య, బ్రాహ్మణస్య వా అలాభే హవిఃశ్రపణం కృత్వా, అభిఘార్య, ఉద్వాస్య, పునరభిఘార్య, [254]ప్రాచీనావీతి, *"అశేషే హే పరిషత్. స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య ------గోత్రస్య ------శర్మణః పితుః ప్రేతస్య (అథవా,------గోత్రాయాః ------నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశాహని ఆద్యమాసిక అగ్నావేకోద్దిష్టశ్రాద్ధం కర్తుం యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ"* - ఇతి ప్రార్థ్య, *"తథాస్తు, యోగ్యతాసిద్ధిరస్తు"*- ఇతి బ్రాహ్మణైరనుజ్ఞాప్య, ఉపవీతి, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి, *"అస్యాం తిథౌ------గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,----గోత్రాయాః ---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశాహని ఆద్యమాసిక అగ్నావేకోద్దిష్ట*

---

[253]అగ్నావేకోద్దిష్టమునకై, హవిస్సును (అనగా 32 ఉసరికాయ ప్రమాణము గల హోమాహుతులకును, ఒక ప్రేతపిండమునకును కావలసినంత అన్నమును) వండి, (ప్రాయ్యిపై నున్నప్పుడే) దానిని నేతితో నభిఘరించి, ప్రాయ్యినుండి దానిని దక్షిణమునకు దించి, మరల నేతితో అభిఘరించవలెను. అన్నముతో బాటు పాయసమును కూడ వండి యుంచుకొనవలెను.

[254] ప్రాచీనావీతియై, *"అశేషే హే పరిషత్------యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ"*- అని పరిషత్తును ప్రార్థించి, *"తథాస్తు, యోగ్యతాసిద్ధిరస్తు"*- అని పరిషదనుజ్ఞను పొంది, ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై *"అస్యాం తిథౌ------ఆద్యమాసిక అగ్నావేకోద్దిష్టశ్రాద్ధం కరిష్యే"*- అని సంకల్పించి అగ్నిప్రతిష్ఠ చేయవలెను.

శ్రాద్ధం కరిష్యే" - ఇతి సంకల్ప్య, [255]స్థండిలం కల్పయిత్వా, [256]విపరీతముల్లిఖ్య, [257]అవాక్కరోఽభ్యుక్ష్య, [258]తృణం నిరస్య, అప ఉపస్పృశ్య,[259] "ఓం భూర్భువస్సువరోమ్"- ఇతి లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య, విపరీతం పరిస్తీర్య, దక్షిణాప్రాగగ్రైః ప్రాగాద్యప్రదక్షిణం పరిస్తీర్య, [260]ప్రాక్తోయం నిధాయ,[261]విపరీతం పరిస్తీర్య, [262]అగ్నేర్దక్షిణతో దర్భాన్ దక్షిణాగ్రాన్ సంస్తీర్య, తత్రాదుమ్బరదర్వీం, ఆజ్యస్థాలీం, ప్రోక్షణీం, ఇతరదర్వీంచ ఏకైకశః సాదయిత్వా, [263]ఏక దర్భేణ ఆయామతం కృత్వా, ప్రోక్షణీపాత్రే నిక్షిప్య, [264]ఆదాయ, జలేన పూరయిత్వా, విప రీతం త్రిరుత్పూయ, [265]పాత్రాణి ఉత్తానాని కృత్వా, [266]ప్రోక్షణీజలేన ప్రోక్ష్య, శేషముత్సృజ్య,

---

[255]అగ్నిప్రతిష్ఠాపనకై చతురశ్రవేదికను(స్థండిలమును) కల్పించి, దానిపై నువ్వులను చల్లి,

[256] ఒకదర్భతో ఆవేదికపై తూర్పునుండి మొదలిడి పడమటికి అంతమగునట్లు వేదియొక్క ఉత్తరార్ధమునందును, మధ్యను, దక్షిణార్ధమునందును వరుసగా నొక్కొక్క రేఖను గీచి, అట్లే ఉత్తరమునుండి మొదలిడి దక్షిణమున కంతమగునట్లు మూడురేఖలను వేదికి పూర్వార్ధము నందును, మధ్యను, పశ్చిమార్ధములందును వరుసగా అదేదర్భతో గీచి, దానిని వేదిపై నుంచి,

[257] అభ్యుక్షణతోయపాత్రలో కొంచము నీటిని పోసికొని, దానిచే స్థండిలమును ప్రోక్షించి,

258 దర్భను వేదిపైనుండి తీసివేసి, దానిని దక్షిణమునకు త్యజించి, నీరు ముట్టి,

[259] స్థండిలముపై *"ఓం భూర్భువస్సువరోమ్"* అని లౌకికాగ్నిని ప్రతిష్ఠించి,

[260] అభ్యుక్షణతోయపాత్రలోని నీటిని పారబోసి, అందులో వేరే నీటిని నింపి, ఆ పాత్రను వేదికి తూర్పున, ముందు వేయబోవు పరిస్తరణల కవతల నుంచి,

[261] దక్షిణమునుండి మొదలిడి అప్రదక్షిణముగా ఒక్కొక దర్భను ఆ అగ్నికి చుట్టును పఱచి

[262]అగ్నికి దక్షిణమునకు దక్షిణాగ్రముగా దర్భలను పరచి, వానిపై ఉత్తరమునుండి దక్షిణము నకు వరుసగా మేడిదర్విని(స్రుక్కును), ఆజ్యస్థాలీని, ప్రోక్షణీపాత్రను, మేడి ఇతరదర్విని (స్రువ మును) ఒక్కొకటి చొప్పున తీసికొని బోర్లించి ఉంచవలెను.

[263] ఆతర్వాత ఒక దర్భతో ఆయామతపవిత్రమును చేసి, దానిని ప్రోక్షణీపాత్రలో నుంచి,

[264] ఆ ప్రోక్షణీపాత్రను తన ముందుంచుకొని, దానిలో నీటిని పోసి, ఆయామతముచేత మూడు సార్లు తూర్పునుండి పడమటికి ఉత్పూరణము చేసి,

[265] అగ్నికి దక్షిణమున దర్భలపై బోర్లించియుంచిన ఇతరపాత్రలను వెల్లకిల త్రిప్పిపెట్టి,

[266] ప్రోక్షణీపాత్రలోని జలముతో వానిని ప్రోక్షించి, ప్రోక్షణిలో మిగిలిన జలమును పారబోసి, అందులో అన్యజలమును నింపి, దానిని తన ముందు ఎడమవైపుంచుకొని,

అన్యజ్జలం పూరయిత్వా, ఉత్తరతో నిధాయ, [267]ఆయామతం ఆజ్యస్థాల్యాం నిధాయ, ఆజ్యం విలాప్య, [268]దక్షిణతోఽఙ్గారాన్నిరూహ్య, తేష్వధిశ్రిత్య, [269]జ్వలతా తృణేనావద్యోత్య, [270]ఏక దర్భాగ్రం ప్రత్యస్య విపరీతం త్రిః పర్యగ్ని కృత్వా, దక్షిణతః ఉద్వాస్య, [271]అంగారానగ్నౌ ప్రత్యూహ్య, దక్షిణాగ్రాయామతేన విపరీతం త్రిరుత్పూయ, పవిత్రగ్రంథిం విస్రస్య, అప ఉప స్పృశ్య, ప్రత్యగ్రమగ్నౌ ప్రహరతి.[272]దర్వీన్నిష్టప్య, దర్భేణ సంమృజ్య, పునర్నిష్టప్య, ప్రోక్ష్య, నిధాయ, అద్భిః సంస్పృశ్య, అగ్నౌ ప్రహరతి.

[273]అగ్నిమప్రదక్షిణం పరిషిచ్య, అగ్నేర్దక్షిణతః ఏకస్మిన్ పాత్రే ఏకదర్భేణ కృతం ఆయా మతం నిధాయ, జలం దత్వా, *"----గోత్రస్య ---శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ------*

---

[267] ఆయామతాన్ని ప్రోక్షణిలోనుండి తీసి నేతిపాత్రలోనుంచి, అందులో నేతిని నింపి,

[268] అగ్నినుండి దక్షిణమువైపు కొన్ని నిప్పులను వేఱుగా తీసికొని, వానిపై ఆ నేతిపాత్ర నుంచి,

[269] ఒక దర్భను నిప్పుతో అంటించి, ఆజ్యాల నేతిపాత్రయందు ప్రతిబింబించునట్లుగా దర్భను చూపించి (ఇదియే అవద్యోతనము), ఆ తర్వాత ఆ దర్భను పారవేసి,

[270] ఒక దర్భాగ్రమును త్రుంచి, కడిగి, నేతిపాత్రలో నుంచి, నేతిపాత్రను జ్వలితదర్భచేత అప్ర దక్షిణముగా మూడుపార్లు చుట్టి, ఆ దర్భను దక్షిణమునకు త్యజించి,

[271] అగ్నినుండి వేఱుగా తీసికొన్న నిప్పులను మఱల అగ్నిలో చేర్చి, దక్షిణాగ్రాయామతంతో నేతిని మూడుసార్లు విపరీతంగా తూర్పునుండి పడమర కుత్పూరణము చేసి, ఆయామతం ముడిని విప్పి, దానిని ప్రోక్షణీజలముతో తాకి, కొనలు పశ్చిమదిశగా నుండునట్లు పట్టుకొని అగ్నిలో వేసి,

[272] ప్రధానదర్విని(స్రుక్కును) కుడిచేత, ఇతరదర్విని (స్రువమును) ఎడమచేత ఒకేసారి తీసి కొని, వాని నగ్నిపై కాచి, ఆ రెంటిని ఎడమచేతిలో పట్టుకొని, కుడిచేత నొక దర్భను తీసికొని ఆ దర్భతో వానిని తుడిచి, మఱల మునుపటివలె వానిని రెండు చేతులలో పట్టుకొని అగ్నిపై కాచి, ఇదివఱకు తుడిచిన దర్భను తీసికొని దానితో ప్రోక్షణిలోని నీటిని వానిపై ప్రోక్షించి; ఆజ్యపాత్ర కెడమవైపు ఎడమచేతిలోని దర్విని (స్రువమును), కుడికి కుడిచేతిలోని దర్విని (స్రుక్కును) ఉంచి, సమ్మార్జనము చేసిన దర్భను ప్రోక్షణిలోని నీటితో తాకి, అగ్నిలో పడవేయవలెను.

[273] తరువాత అగ్నిని అప్రదక్షిణముగా పరిషేచనము చేసి, అగ్నికి దక్షిణమున ఒక చిన్న పాత్రలో (తట్టలో, లేక విస్తరాకులో) ఒక దర్భతో కట్టిన ఆయామతము నుంచి, ఆ ఆయా మతముపై జలమును ప్రోక్షించి,

*గోత్రాయాః -----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) ఇదమాసనమ్" -* ఇత్యగ్నౌ ఆసనం దత్వా, *"పితుః ప్రేతస్య (అథవా, మాతుః ప్రేతాయాః) అగ్నౌ వేకోద్దిష్టశ్రాద్ధే అత్ర భవద్భిః ప్రసాదః కరణీయః"-* [274] ఇతి వరణం కృత్వా, అగ్నేర్దక్షిణతః హవిరాసీయ, ప్రతిష్ఠిత మభిఘార్య, ఘృతపాయసేన

*"పిత్రే ప్రేతాయ (అథవా, మాత్రే ప్రేతాయై) యమాయ చ స్వాహా/ యమాయేదం నమమ/"* - ఇతి హుత్వా, *"పిత్రే ప్రేతాయ (అథవా, మాత్రే ప్రేతాయై) యమాయ చ స్వాహా/ యమాయేదం నమమ/"* - ఇతి ఘృతేన జుహుయాత్. [275] తతః హుతశేషమన్నం ఆమలకప్రమాణం పాయసేన ఘృతేన చ దర్వ్యాం గృహీత్వా,

*"యమాయ సోమగ్ంం సునుత యమాయ జుహుతా హవిః/ యమగ్ంహ యజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృత స్స్వాహా/ యమాయేదం నమమ/"*

---

[274] తరువాత *"గోత్రస్య ---ఇదమాసనమ్"* - అని చెప్పి అగ్నిముందు అసనార్థం దర్భను వేసి, *"పితుః ప్రేతస్య ---- ప్రసాదః కరణీయః"* - అని అగ్నిని ప్రార్థించి, అగ్నికి దక్షిణమున వండిన అన్నమును (హవిస్సును), పాయసమును ఉంచి, వానిపై నేతి నభిఘరించి, ప్రధానదర్వి లోనికి ఇతరదర్వితో నేతిని వేసికొని, అందులో ఉసిరికాయంత అన్నమును, కొంచెము పాయసమును వేసికొని, మఱల దానిపై నేతిని వేసికొని, దానితో *"పిత్రే-----యమాయ చ స్వాహా/ యమాయేదం నమమ/"* - అని హోమమును చేసి, తదుపరి నేతినిమాత్రమే దర్విలోనికి తీసికొని *"పిత్రే ప్రేతాయ -----యమాయ చ స్వాహా/ యమాయేదం నమమ/"* - అని అజ్యహోమమును చేయవలెను.

[275] మిగిలిన అన్నముతో మఱల ఉసిరికాయ ప్రమాణములో 32 పిండములను చేసి, వానిని అజ్యపాయసములతో సహ దర్విలోనికి తీసికొనుచు *"యమాయ సోమగ్ం సునుత----అరం కృత స్స్వాహా/ యమాయేదం నమమ/"*- అని చెప్పుచు 32సార్లు హోమము చేసి (ఈ 32 ఆహుతులకు గ్రంథకర్త వివరణ: ప్రత్యక్షబ్రాహ్మణభోక్త భుజించు 32 కబళములను అతని స్థానములో నావాహనచేసికొన్న అగ్నికి 32 అహుతులుగా సమర్పించి, వానిని జీర్ణించుకొనుటకై అగ్నికి మఱల ముందు చెప్పబోవు 32 అజ్యాహుతుల నిచ్చుచున్నారు. అజ్యాహుతులవలన అగ్ని ప్రజ్వరిల్లి, ముందొసగిన అన్నాహుతులు అగ్నిలో పూర్తిగా మిళితమగుటయే అగ్ని వీనిని జీర్ణించుకొనుటగా నెంచవచ్చును.)

- ఇతి ద్వాత్రింశత్ చర్వాహుతీర్హుత్వా,

*"యమాయ ఘృతవద్ధవిర్జుహోత ప్రచతిష్ఠత। స నో దేవేష్వాయమద్దీర్ఘమాయుః ప్రజీవసే స్వాహా॥ యమాయేదం నమమ॥*

[276] ఇతి ద్వాత్రింశదాజ్యాహుతీర్హుత్వా, పునరప్రదక్షిణం పరిషిచ్య, [277]హుతశేషేణ పిండం కృత్వా, ఉపవీతీ, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ, *"----గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, -----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశాహని ప్రేతతృప్త్యర్థం పిండప్రదానం కరిష్యే "* -ఇతి సంకల్ప్య, దక్షిణాగ్రాన్ దర్భాన్ సంస్తీర్య, తేషు *"మార్జయతామ్"* - ఇతి తిలోదకముత్సృజ్య,

*"-----గోత్రాయ ----శర్మణే పిత్రే ప్రేతాయ (అథవా, ----గోత్రాయై ----నామ్న్యై మాత్రే ప్రేతాయై) ఏతం పిణ్డం దదామి "*- ఇతి దత్వా, పునస్తిలోదకం దత్వా, ఉత్థాయ,

*"-----గోత్ర ----శర్మన్ పితః ప్రేత (-----గోత్రా -----నామ్ని మాతః ప్రేతే) ఏతం పిండముపతిష్ఠ"* - ఇత్యుపస్థాయ, పాత్రసంక్షాళనోదకేన పిండం త్రిరప్రదక్షిణం పరిషిచ్య, తత్పాత్రం న్యుబ్జీకృత్య, ప్రోక్ష్య, పర్యావృత్య, పిండమప్సు ప్రక్షిపేత్.

---

[276]ఆతర్వాత దర్విలోనికి ఆజ్యమును మాత్రము తీసికొని, *"యమాయ---ప్రజీవసే స్వాహా॥ యమాయేదం నమమ॥"* - అని చెప్పుచు మఱల 32సార్లు ఆజ్యహోమమును చేసి, అగ్నిని అప్రదక్షిణముగా పరిషేచనము చేసి

[277] ఇంకను శేషించిన అన్నముతో ఒకపిండమును గట్టి, ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై, *"----గోత్రస్య ---పిండప్రదానం కరిష్యే "*- అని సంకల్పించి, దక్షిణాగ్రముగా మూడుదర్భలను పఱచి, *"మార్జయతామ్"*- అని వానిపై పితృతీర్థముతో తిలోదకమును విడిచి, *"-----గోత్రాయ ------ఏతం పిండం దదామి"*- అని పిండమును దర్భలపై నుంచి, మఱల పితృతీర్థముతో తిలోదకము నొసగి, లేచి నిలబడి అంజలిబద్ధుడై, *"---గోత్ర ---ఏతం పిండముపతిష్ఠ"*- అని ఉపస్థానమును చేసి, అన్నపాత్రసంక్షాళనోదకములో తిలలను వేసి, ఆ జలముతో పిండమును మూడుసార్లు అప్రదక్షిణముగా పితృతీర్థముతో పరిషేచనము చేసి, పిండపాత్రను బోర్లించి, ప్రోక్షించి, మఱల త్రిప్పి పెట్టి, ఆ పిండమును నీటిలో పడవేయవలెను.

[278]ఏవం ప్రతిదినం ఏకైకం పిండం దత్వా, ద్వాదశదినే త్రయోదశదినే సప్తవింశతిదినే వా సపిండీకరణాత్పూర్వం సబ్రాహ్మణైకోద్దిష్టం కుర్యాత్.

# సబ్రాహ్మణైకోద్దిష్టమ్

పైన చెప్పినట్లుగా అగ్నియందు ఏకోద్దిష్టశ్రాద్ధమును చేసినను, అనంతరము బ్రాహ్మణ ముఖముగా ఏకోద్దిష్టశ్రాద్ధము నవశ్యముగా చేయవలెను. పదిరోజులలోపల (ఇతరజ్ఞాతులు గతించుటవల్ల) వేతే ఆశౌచము వచ్చినను, అది 11వ దినమున నివారణ యగును. కాని యీ ఆశౌచము మాతాపితరులలో నొకరు గతించుటవల్ల కల్గిన, దానికి మఱల 10 దినములు ఆశౌచముతో నుండవలెను. ఇట్టి స్థితిలో మొదటి వ్యక్తికి 11వ దినమందే ఏకోద్దిష్టమును చేసి, రెండవవ్యక్తి కావ్యక్తి మరణాది 11వ దినమున ఏకోద్దిష్టమును చేయవలెను. తదనంతరము, ముందుగా పితృసపిండీకరణశ్రాద్ధమును చేసి, ఆ తర్వాత మాతృసపిండీకరణశ్రాద్ధమును చేయవలెను. ఈలోపల పితామహుడు మరణించిన, పితామహసపిండీకరణానంతరము పితృ, మాతృసపిండీకరణములను చేయవలెను. ఎట్టి పరిస్థితిలోను 11వ దినమందున విడువకుండ ఏకోద్దిష్టశ్రాద్ధము చేయవలెను.

*ప్రయోగః :*[279]ఏకాదశాహని మధ్యాహ్నే ప్రాచీనావీతీ, *"----గోత్రస్య ---శర్మణః పితుః ప్రేతస్య (అథవా,-----గోత్రాయాః -----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశాహని (అగ్నౌ) అపర్త్రాద్యమాసికైకోద్దిష్టశ్రాద్ధం కర్తుం యోగ్యతాసిద్ధిమను గ్రహాణ"* - ఇతి ప్రార్థ్య, *"తథాస్తు! యోగ్యతాసిద్ధిరస్తు"* - ఇత్యనుజ్ఞాప్య, ఉపవీతీ, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ,

*"శ్రీగోవింద, గోవింద, గోవింద ఆస్యాం తిథౌ శ్రీభగవదాజ్ఞయా భగవత్కైఙ్కర్య రూపం-----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,------గోత్రాయాః------*

---

[278] ఇట్లు ప్రతిదిన మొక్కొక పిండము నొసగుచు 12వ, లేదా 13వ, లేదా 27వ దినమునందు సపిండీకరణమునకు ముందు బ్రాహ్మణయుతముగా ఏకోద్దిష్టమును చేయవలెను.

[279] కర్త 11వరోజు మధ్యాహ్నం ప్రాచీనావీతియై, తూర్పునకు మళ్లి, *"------గోత్రస్య----- యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ"* - అని పశ్చిమముఖుడైన నిమంత్రితబ్రాహ్మణుని ప్రార్థించి, *"తథాస్తు! యోగ్యతాసిద్ధిరస్తు"* -అని అనుజ్ఞను పొంది, ఉపవీతియై, ప్రాణాయామము చేసి,

*నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశాహని (అగ్నౌ) ఆవర్తాద్యమాసికైకో ద్దిష్టశ్రాద్ధం కరిష్యే "*-[260] ఇతి సంకల్ప్య, ప్రత్యఙ్ముఖస్య విప్రస్య హస్తే జలం దత్వా,

[281] *"-----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, -----గోత్రాయాః ----- నామ్న్యాః మాతుః ప్రేతాయాః) ఇదమాసనం"* - ఇత్యాసనం దత్వా, పునర్జలం దత్వా, (అథవా, అగ్నావేకోద్దిష్టే కస్మింశ్చిత్పాత్రే భోక్తృనిమిత్తం పశ్చిమాగ్రం భుగ్నం నిధాయ, తస్యోపరి దర్భం నిధాయ, కూర్చేన జలం దత్వా), *"ఇదమర్చనమ్"*- ఇతి తిలైరభ్యర్చ్య (అథవా, భుగ్నోపరి తిలాన్ వికీర్య), [282]*"ఆవర్తాద్యమాసికైకోద్దిష్టశ్రాద్ధే ప్రేతార్థే భవతా క్షణః*

---

[260] ప్రాచీనావీతియై, *"శ్రీ గోవింద ---మాసికైకోద్దిష్టశ్రాద్ధం కరిష్యే "*- అని సంకల్పించి, పశ్చిమ ముఖుడైన బ్రాహ్మణుని హస్తమునందు కూర్చతో జలమునొసగి (విశేషవివరణము: బ్రాహ్మణుని స్థానములో ఆయామతము నుంచి ఏకోద్దిష్టమును చేయునప్పుడు అగ్నిలో 32 అన్నాహుతులను చేయవలెను. అందుచే ఇట్టి సందర్భములందు బ్రాకెట్లలో నిచ్చిన "అగ్నౌ" అను పదమును (అగ్నౌ అనగా అగ్నిలో అని అర్థము) కలిపి పై సంకల్పములను చెప్పవలెను. ప్రత్యక్షబ్రాహ్మణునితో ఏకోద్దిష్టమును చేయునప్పుడు ఈ "అగ్నౌ"పదమును విడిచి సంకల్పమును చెప్పవలెను. ఇట్లే సర్వత్ర గమనించవలెను.)

[281] *"----గోత్రస్య ---ఇదమాసనం"*- అని బ్రాహ్మణునికి ఆసనార్థమొక దర్భనొసగి, మరల కూర్చతో హస్తమునందు జలము నొసగి, *"ఇదమర్చనమ్"*- అని తిలలతో నతని నర్చించి (లేదా ఆయామతంతో ఏకోద్దిష్టమును చేయునెడ అగ్నిప్రతిష్ఠాపన చేయు స్థానమునకు దక్షిణమున ఒక చిన్న తట్టలో పశ్చిమాగ్రముగా నొక (భోక్తృ)భుగ్నము నుంచి, దానిపై *"---గోత్రస్య---ఇదమాసనమ్"* - అని చెప్పుచు ఒక దర్భను వేసి, కూర్చతో జలము నుంచి, *"ఇదమర్చనమ్"*- అని దానిపై తిలలను వేసి)

[282] *"ఆవర్తాద్యమాసికైకోద్దిష్టశ్రాద్ధే ప్రేతార్థే భవతా క్షణః కర్తవ్యః"*- అని విప్రుని హస్తమునందొక దర్భనుంచి, *"ఓం తథా"*- అతనిచే ప్రత్యుక్తుడై, *"ప్రాప్నోతు భవాన్"* - అని చెప్పి *"ప్రాప్నువాని"* - అని ప్రత్యుక్తుడై (లేదా అయామతైకోద్దిష్టమునందు *"ఆవర్తాద్యమాసికైకోద్దిష్టశ్రాద్ధే ప్రేతార్థే భవతా క్షణః కర్తవ్యః"* - అని చెప్పి భోక్తృభుగ్నముపై నొక దర్భను వేసి, *"ఓం తథా"*- అని మనసులో ననుకొని, *"ప్రాప్నోతు భవాన్"* - అని చెప్పి, *"ప్రాప్నువాని"* - అని మనసులో ననుకొని),

*కర్తవ్యః"* - ఇతి హస్తే దర్భం దత్వా, *"ఓం తథా"* - ఇతి ప్రత్యుక్తే, *"ప్రాప్నోతు భవాన్"* - ఇత్యామన్త్ర్య, *"ప్రాప్నువాని"* - ఇతి ప్రత్యుక్తే,

[283] గజపాదప్రమాణం వృత్తం కుణ్డం ఖాత్వా, గోమయేనోపలిప్య, *"-----గోత్రస్య-----శర్మణః (అథవా, ---గోత్రాయాః ---నామ్న్యాః) అవర్తాద్యమాసికైకోద్దిష్టశ్రాద్ధే పితుః ప్రేతస్య (అథవా, మాతుః ప్రేతాయాః) పాద్యస్థానే ఇదమాసనమ్"* - ఇతి కుణ్డే దర్భాన్నిధాయ, *"ఇదమర్చనమ్"* - ఇతి తిలైరభ్యర్చ్య,

[284] *"------గోత్రస్య-----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ------గోత్రాయాః------నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అవర్తాద్యమాసికైకోద్దిష్టశ్రాద్ధే పితః ప్రేత (అథవా, మాతః ప్రేతే) స్వాగతమ్"* - ఇతి విప్రం కుండే స్వాగతముక్త్వా, *"ఇదం తే పాద్యమ్"* - ఇత్యాదిత్యాభిముఖో భూత్వా విప్రాయ పాద్యం దత్వా, ఆజాన్వాజంఘం వా తస్య పాదద్వయం ప్రక్షాళ్య, స్వస్య చ పాదౌ ప్రక్షాళ్య, పవిత్రం విసృజ్య, అన్యపవిత్రం ధృత్వా, ఆచమ్య,

---

[283] గజపాదప్రమాణముగా గుండ్రని కుణ్డమును త్రవ్వి, దానిని గోమయముతో నలికించి, *"----గోత్రస్య ---పాద్యస్థానే ఇదమాసనమ్"* - అని చెప్పి ఆ కుణ్డములో నొక దర్భను వేసి, *"ఇదమర్చనమ్"* - అని కుండములో తిలలను వేసి అర్చించి,

[284] *"---గోత్రస్య ---స్వాగతమ్"* - అని బ్రాహ్మణుని కుండములోనికి ఆహ్వానించి, పవిత్రమును చెవిసందున పెట్టుకొని, *"ఇదం తే పాద్యమ్"* - అని కర్త ఆదిత్యాభిముఖుడై అతని పాదములను మోకాళ్లవఱకు కడిగి, తనకాళ్లను కూడ కడిగికొని, చెవిసందు పవిత్రమును విప్పి పడవేసి (*"శ్రాద్ధారంభే ధృతాన్ దర్భాన్ పాద్యాంతే వ విసర్జయేత్"* - అనగా కర్త శ్రాద్ధారంభమున ధరించిన పవిత్రమును నిమంత్రితుని పాదములు కడిగిన తర్వాత విసర్జింపవలెనని ధర్మశాస్త్రము), వేఱే పవిత్రమును ధరించి, కుండమున కుత్తరమున ఆచమించి, బ్రాహ్మణుని కూడ ఆచమింపజేసి, (గృహములోనికి పోయి) బ్రాహ్మణునికై ఆసనార్థమొక దర్భను వేసి, దానిపై అతనిని కూర్చుండబెట్టి (లేదా, *"-----గోత్రస్య-----స్వాగతమ్"* - అనుచు భోక్తృభుగ్నమును కుండములో నుంచి, పవిత్రమును తీసి చెవిసందున పెట్టుకొని, *"ఇదం తే పాద్యమ్"* - అని ఆదిత్యాభిముఖుడై దానిపై నీటిని పోసి, కర్త తన కాళ్లను కడిగికొని, మునుపటి పవిత్రమును విప్పి పడవేసి వేఱొక పవిత్రమును ధరించి, ఆచమనమును చేసి, భుగ్నము ఆచమించినట్లు మనసులో భావించి, భుగ్నమును తీసి మణల తట్టలో నుంచి)

ఆచాంతం బ్రాహ్మణమాసనే ఉపవేశ్య, [285] "-----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ----గోత్రాయాః ---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) ఏకాదశేహని (అగ్నౌ) అపర్తాద్యమాసికైకోద్దిష్టశ్రాద్ధే పిత్రే ప్రేతాయ (అథవా, మాత్రే ప్రేతాయై) అంతశ్శుద్ధ్యర్థ మయం తే కృసరః, ఆస్య శుద్ధ్యర్థమిదం తే తామ్బూలమ్" - ఇతి కృసర, తామ్బూలాని దత్వా, "శరీరమలాపకర్షణార్థమిదం స్నానీయమూర్ణమ్" - ఇతి స్నానీయచూర్ణం స్నానాయ దత్వా, "ఇదం తే అభ్యంజనమ్" - ఇత్యభ్యంజనం దత్వా, బ్రాహ్మణమభ్యంజన స్నానేన స్నాపయిత్వా, కర్తా స్వయం స్నాత్వా, అగ్నిముఖం కుర్యాత్.

*అగ్ని ముఖమ్:* [286] స్థండిలం కల్పయిత్వా, [287] విపరీతముల్లిఖ్య, [288] అవాక్కరో౽భ్యుక్ష్య, [289] తృణం నిరస్య, అప ఉపస్పృశ్య, "ఓం భూర్భువస్సువరోమ్" - ఇతి లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య, ఉత్సృజ్యతే౽భ్యుక్షణ తోయశేషమ్. [290] ప్రాక్తోయమన్యం నిధాయ,

---

[285] బ్రాహ్మణుని ఆసనముపై కూర్చుండబెట్టి, "-----[illegible]స్య-----తాంబూలమ్" - అని చెప్పి అతనికి బెల్లము-నువ్వుల ఉండను, తాంబూలముల నిచ్చి, "శరీరమలాపకర్షణార్థమిదం స్నానీయమూర్ణమ్" - అని చెప్పి అతనికి నలుగుపిండి (లేదా బియ్యపుపిండి) నొసగి, "ఇదం తే అభ్యంజనమ్" అని అతని తలపై దర్భతో నూనెనుంచి, అతనిచే అభ్యంజనము చేయించి (లేదా, "----గోత్రస్య----తాంబూలమ్"- అనుచు భోక్తృభుగ్నము ప్రక్కన బెల్లము-నువ్వుల ఉండను, తాంబూలముల నుంచి, "శరీరమలాపకర్షణార్థమిదం స్నానీయమూర్ణమ్" - అని చెప్పి నలుగుపిండి నుంచి, "ఇదం తే అభ్యంజనమ్" అని అభ్యంజనార్థం నేతిని భుగ్నము ప్రక్కకుంచి), కర్త తానును స్నానము చేసి, అగ్నిముఖమును చేయవలెను.

[286] అగ్నిప్రతిష్ఠాపనకై చతురశ్రవేదికను (స్థండిలమును) కల్పించి, దానిపై నువ్వులను చల్లి,

[287] ఒకదర్భతో ఆవేదికపై తూర్పునుండి మొదలిడి పడమటికి అంతమగునట్లు వేదియొక్క ఉత్తరార్థమునందును, మధ్యను, దక్షిణార్థమునందును వరుసగా మూడురేఖలను గీచి, అట్లే ఉత్తరమునుండి మొదలిడి దక్షిణాని కంతమగునట్లు మూడురేఖలను వేదియొక్క పూర్వార్థ మందును, మధ్యను, పశ్చిమార్థమునందును అదే దర్భతో గీచి, ఆదర్భను వేదిపై నుంచి,

[288] అభ్యుక్షణతోయపాత్రలో కొంచము నీటిని పోసికొని, దానిచే స్థండిలమును ప్రోక్షించి,

[289] దర్భను వేదిపైనుండి తీసివేసి, నీరు ముట్టి, "ఓం భూర్భువస్సువరోమ్" అని స్థండిలముపై లౌకికాగ్నిని ప్రతిష్ఠించి, అభ్యుక్షణతోయ పాత్రలోని నీటిని చల్లి, దానిలో వేరే నీటిని పోసి,

[291]అప్రదక్షిణం పరిస్తీర్య, దక్షిణాప్రాగగ్రైః దర్భైః ప్రాగాద్యప్రదక్షిణం పరిస్తీర్య, [292]అగ్నేర్దక్షిణతో దక్షిణాగ్రాన్ దర్భాన్ సంస్తీర్య, తేషు పాత్రాణి దక్షిణారంభాత్ ఏకైకశః ఔదుమ్బర దర్వీం, ఆజ్యస్థాలీం, ప్రోక్షణీపాత్రం, పునర్దర్వీం, హవిఃపాత్రం, హవిష్యపాత్రం, ఔదుమ్బర మేక్షణం చ సాదయిత్వా, తత్పశ్చాత్ దక్షిణాగ్రాన్ దర్భాన్ సంస్తీర్య, తేషు ఏకైకశః సపవిత్రం ప్రేతార్ఘ్యపాత్రం, తిలాన్, సికతాన్, మధు, గన్ధం, పుష్పాణి, తులసీదళాని చ సాదయిత్వా, [293]ఏకేన పవిత్రేణ ప్రోక్షణీరుత్పూయ, [294]ఉత్తానాని పాత్రాణి ప్రోక్ష్య, ఆజ్యసంస్కారే హవిషా

---

[290]దానిని అగ్నికి తూర్పున ముందు వేయబోవు పరిస్తరణల కవతల నుంచి,

[291]ఒక్కొక దర్భను తూర్పునుండి మొదలిడి అప్రదక్షిణముగా అగ్నిచుట్టును పఱచి (అనగా తూర్పు, పడమరలందు వేయు దర్భలను దక్షిణాగ్రములుగను, ఉత్తరదక్షిణములందు వేయు దర్భలను పూర్వాగ్రములుగాను, తూర్పునుండి మొదలిడి అప్రదక్షిణముగా వేసి, ఉత్తరదిశలో వేసిన దర్భను ప్రాక్పశ్చిమముగా వేసిన దర్భల మొదళ్లపై నుండునట్లును, దక్షిణమున వేసిన దర్భను ప్రాక్పశ్చిమముగా వేసిన [illegible]లకు క్రిందుగా నుండునట్లును సవరించవలెను.)

[292] అగ్నికి దక్షిణమున మూడు దర్భలను దక్షిణాగ్రములుగా పఱచి, వానిపై దక్షిణమునుండి మొదలిడి ఔదుంబరదర్విని (మేడిదర్విని), ఆజ్యస్థాలిని, ప్రోక్షణీపాత్రను, మేడి ఇతరదర్విని (స్రువమును), హవిఃపాత్రను (హోమార్థమైన అన్నము నుంచిన పాత్రను ), హవిష్యపాత్రను (హోమార్థమైన వ్యంజనముల నుంచిన పాత్రను), ఔదుంబరమేక్షణమును (మేడిపుల్లను) ఒక్కొక్కటిగా తీసికొని ఉంచవలెను. తర్వాత వానికి పడమట 3 దక్షిణాగ్రపు దర్భలను పఱచి, వానిపై క్రమముగా పవిత్రమునుంచిన ప్రేతార్ఘ్యపాత్రను, తిలలను, తేనెను, ఇసుకను, గంధపుష్పములను, తులసీదళములను ఒక్కొక్కటిగా తీసికొని (పాత్రలను బోర్లించి) ఉంచవలెను.

[293] తర్వాత ఒక దర్భతో నాయూమతం చేసి, దానిని ప్రోక్షణీపాత్రలో నుంచి, ఆ ప్రోక్షణీపాత్రను తన ముందుంచుకొని, దానిలో నీటిని పోసి, పవిత్రముచేత ఉత్పూరణము (దక్షిణాగ్రముగా దర్భను రెండువైపులా రెండుచేతులతో పట్టుకొని ప్రోక్షణిలోని నీటికి తాకించుచూ తూర్పు నుండి పడమటికి త్రిప్పుట) చేయవలెను.

[294] అగ్నికి దక్షిణమున దర్భలపై బోర్లించియుంచిన ఇతరపాత్రలను వెల్లకిల త్రిప్పి పెట్టి, ప్రోక్షణీపాత్రలోని జలముతో వానిని ప్రోక్షించి, ప్రోక్షణిలో అన్యజలమును నింపి దానిని తన కెడమ వైపుంచుకొని, ఒకదర్భను నేతిపాత్రలోనుంచి, అందులో నేతిని నింపి, దక్షిణము వైపు అగ్ని నుండి వేఱుగా కొన్ని నిప్పులను తీసికొని, వానిపై ఆ నేతిపాత్ర నెక్కించి, ఒక దర్భను నిప్పుతో

సహ త్రిః పర్యగ్నికృత్వా, [295]దర్వౌ సంస్కృత్య, [296]అగ్నిమప్రదక్షిణం పరిషిచ్య, అగ్నే ర్దక్షిణతః ఏకస్మిన్ పాత్రే ఏకదర్భేణ కృతం అయామతం నిధాయ, జలం దత్వా,

*అర్ఘ్యగ్రహణమ్:* [297]తతః పవిత్రాంతర్హితే అర్ఘ్యపాత్రే, *"అమ ఆగవ్నుతు ప్రేతో దేవ యానాన్ సముద్రాన్ సలిలాన్ సువర్ణాన్/ అస్మిన్ యజ్ఞే సర్వకామం లభతేఽక్షియ మాణాముపదుహ్యతామిమాం ప్రేతాయ తే గృహ్ణామి" ("అమ ఆగవ్నుతు ప్రేతా దేవ యానాన్ సముద్రాన్ సలిలాన్ సువర్ణాన్/ అస్మిన్ యజ్ఞే సర్వకామం లభతేఽక్షియ మాణా ముపదుహ్యతామిమాం ప్రేతాయై తే గృహ్ణామి" - ఇతి స్త్రీణాం)*

*"----గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ------గోత్రాయాః-----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) ఆపర్ణాద్యమాసికైకోద్దిష్టశ్రాద్ధే స్వధాయేదం తే అర్ఘ్యం గృహ్ణామి" -* ఇత్యర్ఘ్యం గృహ్ణీయాత్.

---

నంటించి, ఆ జ్వాల నేతిపాత్రయందు ప్రతిబింబించునట్లుగా దర్భను చూపించి, ఒక దర్భాగ్ర మును కడిగి నేతిపాత్రలో నుంచి, నేతిపాత్రను హవిఃపాత్రతో సహ జ్వలితదర్భచేత అప్రదక్షిణ ముగా మూడుసార్లు చుట్టి, ఆ దర్భను దక్షిణమునకు త్యజించి, అగ్నినుండి వేఱుగా తీసికొన్న నిప్పులను తిరిగి అగ్నిలో చేర్చి, ప్రోక్షణిలోని అయామతాన్ని నేతిపాత్రలో నుంచి, ఆ దక్షిణాగ్రా యామతంతో నేతిని మూడుసార్లు విపరీతంగా తూర్పునుండి పడమరకు గీచి, అయామత గ్రంథిని విడిపించి, నీటిని తాకి, అయామతం కొనలు పడమటికుండునట్లు పట్టుకొని దానిని అగ్నియందు వేయవలెను.

[295] తరువాత ఇతరదర్విని ఎడమచేతిలోను, ప్రధానదర్విని కుడిచేతిలోను ఒకేసారి తీసికొని, వానిని అగ్నిపై కాచి, దర్భతో సమ్మార్జనము చేసి, మళ్లీ కాచి, సమ్మార్జనము చేసిన దర్భతో ప్రోక్షించి, ఆజ్యపాత్రకు ఎడమవైపున ఇతరదర్విని (స్రువమును), కుడివైపున ప్రధానదర్విని (స్రుక్కును) ఉంచి, సమ్మార్జనము చేసిన దర్భను నీటితో తాకి, దానిని అగ్నిలో వేయవలెను.

[296] ఆ తర్వాత అగ్నిని అప్రదక్షిణముగా పరిషేచనము చేసి, అగ్నికి దక్షిణమున నొక పాత్రను (చెంబును) ఉంచి, దానిలో నొక అయామతమును వేసి, జలముతో నింపవలెను.

[297] ఆపైని అయామతమునుంచిన ప్రేతార్ఘ్యపాత్రలో *"అమ ఆగవ్నుతు ప్రేతో --- ప్రేతాయ తే గృహ్ణామి"*- అనుచు ప్రేతకు అర్ఘ్యము నిచ్చుటకై కావలసిన జలమును పోయవలెను. (సూచన: స్త్రీలకు, *"ప్రేతా దేవయానాన్ --- ప్రేతాయై తే గృహ్ణామి"* -అని చెప్పవలెను.)

[298]తతః పవిత్రముద్ధృత్య, "తిలోఽసి సోమదేవత్యో గోసవో దేవనిర్మితః। ప్రత్నవద్భిః ప్రత్తఏహిప్రేత మిమాన్ లోకాన్ ప్రీణయాహి నః। (ప్రేతామిమాం - ఇతి స్త్రీణాం)" - ఇత్యర్ఘ్యే తిలాన్నిక్షిపేత్. పవిత్రం నిధాయ,

[299]"ఓం మధు వాతా ఋతాయతే మధు క్షరన్తి సిన్ధవః। మాధ్వీర్నస్సన్త్వోషధీః। మధు నక్తముతోషసి మధుమత్పార్థివగ్ం రజః। మధు ద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః। మాధ్వీర్గావో భవన్తు నః। మధుమధుమధు"

- ఇతి ప్రత్యృచం మధు గుడం వా అర్ఘ్యపాత్రే నిక్షిప్య, [300] "సోమస్య త్విషిరసి తవేవ మే త్విషిర్భూయాదమృతమసి మృత్యోర్మా పాహి దిద్యోన్మా పాహి" - ఇతి సర్వాంగు శీభిరభిమృశ్య, దర్భేణ లోడయిత్వా, "అవేష్టా దన్దశూకా" - ఇతి తత్ర పతితం తృణాదిక మాదాయ, "నిరస్తం నముచేశ్శిరః" - ఇతి నైఋత్యాం నిరస్య, అప ఉపస్పృశ్య,

[301]"శం నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే। శంయోరభిస్రవన్తు నః" - ఇత్యర్ఘ్య మభిమన్త్ర్య, "గన్ధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్। ఈశ్వరీగ్ం సర్వ భూతానాం తామిహోపహ్వయే శ్రియమ్" - ఇతి గన్ధాదిభిరభ్యర్చ్య,

---

[298]తర్వాత అర్ఘ్యపాత్రలోని ఆయామతమును బయటకు తీసి పట్టుకొని, "తిలోఽసి సోమ దేవత్యో గోసవో దేవనిర్మితః। ప్రత్నవద్భిః ప్రత్నవ్యథయేహ ప్రేతమిమాన్ లోకాన్ ప్రీణయాహి నః।" - అని చెప్పి అర్ఘ్యపాత్రలో తిలలను వేసి, ఆయామతమును మఱల అర్ఘ్యపాత్రలో నుంచవలెను (స్త్రీలకు మంత్రములో, "ప్రేతామిమాం" - అని చెప్పవలెను).

[299] తరువాత, "మధు వాతా ----- మధుమధుమధు" - అని మధుత్రయమును చెప్పి, ప్రతి మంత్రము చివర మధువునుగాని, బెల్లమునుగాని, అర్ఘ్యపాత్రలో వేయవలెను.

[300] తరువాత "సోమస్యత్విషిరసి ---- దిద్యోన్మా పాహి।" - అని ఆ అర్ఘ్యపాత్రలోని మధువును (గుడమును) అన్నివ్రేళ్లతోను కలిపి, దానిని దర్భతో కలియబెట్టి, "అవేష్టా దన్దశూకా" - అని దానిలో పడిన తృణాదులను తీసి, "నిరస్తం నముచేశ్శిరః" - అని వానిని నైఋతికి పడవేసి, చేయి కడిగికొని,

[301] "శం నో దేవీరభిష్టయ --" అని అర్ఘ్యపాత్రపై కుడిచేతిని మూసి, తటాలున తీసి ఆ పాత్ర నభి మంత్రించి, "గన్ధద్వారాం --" అను మంత్రముతో అందులో గంధమును వేసి, "ఆయనే తే----"

*"ఆయనే తే పరాయణే దూర్వా రోహన్తు పుష్పిణీః। హ్రదాశ్చ పుణ్డరీకాణి సముద్రస్య గృహా ఇమే"* - ఇతి పుష్పతులసీదళాని నిక్షిప్య, హిరణ్యశకలం నిధాయ, దర్భైః దర్వ్యా చ ప్రచ్ఛాద్య, దర్వ్యానర్ఘ్యం దద్యాత్ - తత్పాత్రం నోద్ధరేత్, న పునః పూరయేత్.

*భుక్తిస్థలావోక్షణమ్:* [302]తతః *"అపహతా అసురా రక్షాంసి పిశాచా యే క్షయన్తి పృథివీమను। అన్యత్రేతో గచ్ఛన్తు యత్రాస్య గతం మనః (యత్రాస్యా గతం మనః - ఇతి స్త్రీణాం)"* - ఇతి తిలాన్ సికతాంశ్చ భుక్తిదేశే ప్రకిరేత్.

[303]*"ఉదీర్తామవర ఉత్పర ఉన్మధ్యమః ప్రేతస్సోమ్యః। అసుం య ఇయాయావృకర్తజ్ఞస్స నోఽవతు ప్రేతో హవేషు"- (ఉదీర్తామవర ఉత్పర ఉన్మధ్యమా ప్రేతా సోమ్యా। అసుం యేయాయావృకర్తజ్ఞా సా నోఽవతు ప్రేతా హవేషు। - ఇతి స్త్రీణాం) -* ఇత్యద్భిరవోక్షేత్.

*భుగ్నే హోమదేవతావాహనమ్:* [304]*"ఆయాహి ప్రేత సౌమ్య గంభీరైః పథిభిః పూర్వ్యైః। ప్రజామస్మభ్యం దదద్రయిం చ దీర్ఘాయుత్వం చ శతశారదం చ। ---*

---

అను మంత్రముతో తులసీదళమును, పుష్పములను వేసి, హిరణ్యశకలము (చిల్లర) నందులో వేసి, ఆ పాత్రను దక్షిణాగ్రపుదర్భలచే, దొన్నెచే కప్పవలెను. ఈ పాత్రను పైకెత్తి పట్టుకొనరాదు; మరల దానిలో నీరు పోయరాదు; దీనిపై కప్పిన దొన్నెతో ఇందులోని జలమును తీసికొనవలెను. (సూచన: అర్ఘ్యపాత్రలోని జలము చల్లిపోయిన అర్ఘ్యజలస్కన్నప్రాయశ్చిత్తమును చేయవలెను గనుక అట్లు చల్లిపోకుండ, ముందు అగ్నికి దక్షిణమున నుంచిన ఇసుకలో ఈ పాత్రను స్థిరముగా నుంచవలెను.)

[302] హోమస్థానమునకు దక్షిణమున ప్రేతభోజనస్థానముగా నిర్ణయించి, అచ్చట *"అపహతా అసురా-----యత్రాస్య గతం మనః"* అను మన్త్రముతో తిలలను ఇసుకను చల్లవలెను. ఆపైని,

[303] *"ఉదీర్తామవర-----ప్రేతో హవేషు"* - అను మన్త్రముతో భుక్తిస్థానములో నీటిని చల్లవలెను.

[304] తరువాత అగ్నికి దక్షిణమున ఒక విస్తరాకులో ఒక దర్భచే కట్టిన భుగ్నమును పశ్చిమాగ్రముగా నుంచి, కర్త దక్షిణాముఖముగా కూర్చొని, *"ఆయాహి ప్రేత----ఆవాహయామి"* - అని ఆ భుగ్నముపై తిలలను చల్లి ప్రేత నావాహనము చేసి, *"ప్రేతస్య ఇదమాసనమ్"* - అని ఆ ప్రేత స్థానభుగ్నముపై వేఱొక దక్షిణాగ్రపు భుగ్నము నుంచి, *"ఇదమర్చనమ్"* - అని దానిపై

*గోత్రస్య----శర్మణః ఏకోద్దిష్టశ్రాద్ధే -----గోత్రం-----శర్మాణం పితరం ప్రేతమావాహయామి* (స్త్రీణాం - *"ఆయాహి ప్రేతే సౌమ్యే గంభీరైః పథిభిః పూర్వ్యైః। ప్రజామస్మభ్యం దదతీ రయిం చ దీర్ఘాయుత్వం చ శతశారదం చ।----గోత్రాయాః ----నామ్న్యాః ఏకోద్దిష్టశ్రాద్ధే ----గోత్రాం -----నామ్నీం ప్రేతామావాహయామి")* - ఇతి దక్షిణాముఖస్తిష్ఠన్ అగ్నేర్దక్షిణతః ఋగ్నేతిలాన్ వికీర్య ప్రేత (ప్రేతా) మావాహ్య, *"ప్రేతస్య (ప్రేతాయాః) ఇదమాసనమ్"*- ఇత్యాసనార్థం ఋగ్నోపరి దక్షిణాగ్రమన్యఋగ్నం దత్వా *"ఇదమర్చనమ్"* - ఇతి తిలైరభ్యర్చ్య, పునః పాదప్రక్షాళనం వరణం చ కుర్యాత్.

## పునర్వరణం, పాదప్రక్షాళనమ్:

[305]కర్తా కుణ్డస్య ప్రాగ్భాగే తిష్ఠన్, *"-------గోత్రస్య------శర్మణః (అథవా, -------గోత్రాయాః ------నామ్న్యాః) ఆవర్తాద్యమాసికైకోద్దిష్టశ్రాద్ధే పితుః ప్రేతస్య* (అథవా, *మాతుః ప్రేతాయాః) పాద్యస్థానే ఇదమాసనమ్"*- ఇతి కుణ్డే దర్భాన్నిధాయ, *"ఇదమర్చనమ్"*- ఇతి తిలైరభ్యర్చ్య, *"-----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య* (అథవా, *-----గోత్రాయాః -----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) ఆవర్తాద్యమాసికైకోద్దిష్టశ్రాద్ధే పితః ప్రేత (అథవా, మాతః ప్రేతే) స్వాగతమ్"*- [306]ఇతి విప్రం కుణ్డే స్వాగతముక్త్వా, *"ఇదం*

---

తిలలను వేసి, మరల బ్రాహ్మణునికి (లేదా భోక్తృఋగ్నమునకు) పాదప్రక్షాళన, వరణములు చేయవలెను. (సూచన: ఆవాహన చేయునప్పుడు స్త్రీలకు పైన బ్రాకెట్లలో నిచ్చినట్లుగా *"ఆయాహి ప్రేతే సౌమ్యే---ప్రేతామావాహయామి"*- అని చెప్పవలెను)

[305] కర్త పాదప్రక్షాళనకుణ్డమునకు తూర్పున పశ్చిమాభిముఖుడై నిలుచుండి, *"----గోత్రస్య---- పాద్యస్థానే ఇదమాసనమ్"*- అని ఆ కుణ్డములో దక్షిణాగ్రముగా దర్భలను వేసి, *"ఇదమర్చనమ్"*- అని అందులో తిలలను వేసి అర్చించి,

[306] *"----గోత్రస్య ----స్వాగతమ్"*- అని విప్రుని కుండములోనికి ఆహ్వానించి, పవిత్రమును కుడిచెవిసందున పెట్టుకొని, సూర్యాభిముఖుడై *"ఇదం తే పాద్యమ్"*- అని అతని పాదములను మోకాళ్లవఱకు కడిగి, కర్త తన కాళ్లను కూడ కడిగికొని, చెవిసందు పవిత్రమును తీసి విప్పి అచటనే పడవేసి, మఱొక పవిత్రమును ధరించి, కర్త తాను ముందుగా ఆచమించి, తదుపరి విప్రుని ఆచమింపజేసి, (లేదా *"------గోత్రస్య-----స్వాగతమ్"* - అనుచు భోక్తృఋగ్నమును కుండమునందుంచి, పవిత్రమును తీసి చెవిసందున పెట్టుకొని, సూర్యాభిముఖుడై *"ఇదం తే*

తే పాద్యమ్"- ఇతి విప్రాయ పాద్యం దత్వా, ఆదిత్యాభిముఖః ఆజాన్వాజంఘం వా పాద ద్వయం ప్రక్షాళ్య, స్వస్య పాదౌ చ ప్రక్షాళ్య, పవిత్రం విసృజ్య, అన్యపవిత్రం ధృత్వా, ఆచమ్య, ఆచాంతం బ్రాహ్మణమాసనే ఉపవేశ్య, హస్తే శుద్ధోదకం ప్రదాయ, అర్ఘ్యపాత్రస్థపవిత్రం విప్రహస్తే నిధాయ,

*అర్ఘ్యాదానమ్:* [307]*"యా దివ్యా ఆపః పయసా సంబభూవుః। యా అన్తరిక్ష ఉత పార్థివీర్యాః। హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శగ్గం స్యోనా భవన్తు॥ ----గోత్రాయ ---- శర్మణే పిత్రే ప్రేతాయ (అథవా, ----గోత్రాయై ----నామ్న్యై మాత్రే ప్రేతాయై) ఇదం తే అర్ఘ్యమ్"* - ఇత్యర్ఘ్యం దత్వా, పునశ్శుద్ధోదకం దత్వా, పవిత్రమాదాయ అర్ఘ్యపాత్రే నిధాయ, దర్భైః దర్వ్యా చ ప్రచ్ఛాద్య, అర్ఘ్యపాత్రాణి నోద్ధరేత్ - న పునః పూరయేత్- దర్వ్యా ఆదాయ అర్ఘ్యం దద్యాత్.

([308]అర్ఘ్యజలే స్కన్నే శోషణే వా *"ఆపో హిష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన। మహే రణాయ చక్షసే। యో వశ్శివతమో రసః। తస్య భాజయతేహ నః। ఉశతీరివ మాతరః।*

---

పాద్యమ్"- అని దానిపై నీటిని పోసి, కర్త తన కాళ్లను కూడ కడిగికొని, పవిత్రమును విప్పి పడవేసి, వేఱొక పవిత్రమును ధరించి, ఆచమనమును చేసి, భుగ్నము ఆచమించినట్లు మనమున భావించి, భుగ్నమును తీసి మఱల తట్టలో నుంచి), గృహములోనికి ప్రవేశించి, బ్రాహ్మణుని పశ్చిమముఖముగా కూర్చుండబెట్టి,అతని చేతిలో శుద్ధోదకము నొసగి, అర్ఘ్యపాత్రలోని ఆయామతమును తీసి అతని చేతిలో నుంచి,

[307] *"యా దివ్యా ఆపః పయసా -- ఇదం తే అర్ఘ్యమ్"*- అని ఇదివఱకు అర్ఘ్యపాత్రను మూసి యుంచిన దొన్నెతో అర్ఘ్యపాత్రలోని జలమును తీసికొని, ఆ జలముతో బ్రాహ్మణునికి అర్ఘ్యము నిచ్చి, కూర్చతో అతని చేతిలో శుద్ధోదకము నొసగి (లేదా భోక్తృభుగ్నముపై దొన్నెతో అర్ఘ్య పాత్రలోని జలమును పోసి, కూర్చతో మఱల దానిపై జలము నుంచి), ఆయామతపవిత్రమును మఱల అర్ఘ్యపాత్రలో నుంచి, దర్భలతో, దొన్నెతో అర్ఘ్యపాత్రను కప్పవలెను అర్ఘ్యపాత్రను పై కెత్తి పట్టుకొనరాదు, దానిలో మఱల జలమును నింపరాదు.

[308] ఒకవేళ అర్ఘ్యజలమంతయు చల్లిపోయినను, ఎండిపోయినను, *"ఆపోహిష్ఠా మయో భువః", "ఆమ ఆగన్పితు"*- అను రెండు మంత్రములతో అందులో నీటిని పోసి, 198-200

*తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ। ఆపో జనయథా చ నః॥ ఆమ ఆగవృతు ప్రేతో దేవయానాన్ సముద్రాన్ సలిలాన్ సువర్ణాన్। అస్మిన్ యజ్ఞే సర్వకామం లభతేఽక్షీయమాణా ముపదుహ్యతా మిమాం ప్రేతాయ తే గృహ్ణామి"* (ప్రేతా దేవయానాన్---ప్రేతాయై తే గృహ్ణామి- ఇతి స్త్రీణాం) - ఇతి పునరర్ఘ్యం గృహీత్వా, తిలప్రక్షేపాద్యాచ్ఛాదనాంతం, అర్చనం గంధపుష్పం చ దత్వా, *"తతమ్మ ఆపస్తదుదాయతే పునః। స్వాధిష్ఠాధీతిరుచథా యతస్య తే। అయగం సముద్ర ఉత విశ్వ భేషజః। స్వాహా కృతస్య సముత్పృష్ణతర్భువః॥"*- ఇతి జుహుయాత్.)

[309]బ్రాహ్మణాయ వస్త్రోత్తరీయ-గంధ-పుష్ప-శయ్యాసనోదకపాత్ర-కాంస్యపాత్ర-దీప పాత్ర-గో-భూ-హిరణ్యాలంకారాదీని యథాశక్తి దత్వా, హస్తే శుద్ధోదకం ప్రదాయ, పవిత్రం హస్తే నిధాయ, దర్వ్యా అర్ఘ్యపాత్రాత్ జలమాదాయ,

[310]*"యా దివ్యా ఆపః పయసా సంబభూవుః। యా అన్తరిక్ష ఉత పార్థివీర్యాః। హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శగ్గం స్యోనా భవన్తు। ----గోత్రస్య ----శర్మణః*

---

పుటలలో చెప్పినట్లుగా తిలప్రక్షేపణగంధపుష్పాద్యర్చనాంతం చేసి, *"తతం మ ఆపః--"* అను మంత్రముతో హోమమును చేయవలెను.

[309] ఇట్లాసీనుడైన బ్రాహ్మణునికి వస్త్రోత్తరీయములు, గంధపుష్పములు, శయ్యాసనములు, ఉదకపాత్ర, కాంస్యపాత్ర, దీపపాత్ర, గోభూహిరణ్యాలంకారాదులు వస్తురూపమున గాని, హిరణ్యరూపమున గాని యథాశక్తి నొసగి (ఈ దానములను చేయునప్పుడు చెప్పవలసిన సంకల్పములకై అనుబంధమును చూమనది), ఆతని చేతిలో కూర్చతో శుద్ధోదకము నొసగి, అర్ఘ్యపాత్రలోని ఆయామతపవిత్రమును తీసి మఱల ఆతని చేతిలో నుంచి,

[310]అర్ఘ్యపాత్రపై కప్పిన దర్వితో అర్ఘ్యపాత్రలోని జలమును తీసికొని, *"యా దివ్యా ఆపః పయసా---స్వధాయేదం తే దక్షిణా తృప్తిః"*- అని చెప్పుచు దక్షిణతోబాటు ఆ జలముతో విప్రున కర్ఘ్యము నొసగి, *"అస్తు దక్షిణా తృప్తిః"* అని అతనిచే చెప్పించుకొని, కూర్చతో మఱల నతని చేతిలో శుద్ధోదకము నొసగి, అతని చేతిలోని పవిత్రమును తీసి మఱల అర్ఘ్యపాత్రలో నుంచి, (లేదా భోక్తృభుగ్నముపై కూర్చతో శుద్ధోదకము నొసగి, అర్ఘ్యపాత్రలోని పవిత్రమును తీసి దాని ప్రక్క నుంచి, *"యా దివ్యా ఆపః పయసా-----స్వధా యేదం తే దక్షిణా తృప్తిః"* - అని చెప్పుచు దక్షిణతోబాటు అర్ఘ్యపాత్రపై కప్పిన దొన్నెతో అర్ఘ్యపాత్రలోని జలమును దానిపై పోసి,

*పితుః ప్రేతస్య (అథవా, ---గోత్రాయాః ---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశేహని ఆవర్త్యమానిక ఏకోద్దిష్టశ్రాద్ధే పిత్రే ప్రేతాయ (అథవా, మాత్రే ప్రేతాయై) స్వధా నమః - స్వధాయేదం తే దక్షిణా తృప్తిః"* - ఇత్యుక్త్వా, *"అస్తు దక్షిణా తృప్తిః"* - ఇతి ప్రత్యుక్తే పునః హస్తే శుద్ధోదకం దత్వా, పవిత్రమాదాయ, అర్ఘ్యపాత్రే నిధాయ, దర్భైః దర్వ్యాశ్చ ప్రచ్ఛాద్య,

[311]*"మమ పితః ప్రేత (అథవా, మాతః ప్రేతే) సర్వోపచారార్థే ఇమే తిలాః"* - ఇతి తిలై రభ్యర్చ్య, *"సకలారాధనైస్స్వర్చితమ్"*- ఇతి పునస్తిలైరభ్యర్చ్య, *"అస్త్వర్చితమ్"* - ఇతి ప్రత్యుక్తే,

*హోమః:* [312]అగ్నిసమీపే దక్షిణాముదకుంభం నిధాయ, దక్షిణతః ప్రతిష్ఠితం హవిరభి ఘార్య, సమంతమప్రదక్షిణం పరిషిచ్య, *"అగ్నౌ కరిష్యే?"* - ఇతి పృష్ట్వా, *"కురుష్వ"* - ఇతి ప్రత్యుక్తే, దర్వ్యాముపస్తీర్య, మేక్షణేన హవిర్మధ్యాత్ సకృదవదాయ,

---

కూర్చతో మఱల జలమునుంచి, *"అస్తు దక్షిణా తృప్తిః"* - అని మనసులో ననుకొని, ఆయా మతపవిత్రమును తీసి మఱల నర్ఘ్యపాత్రలో నుంచి) ఆఅర్ఘ్యపాత్రను మఱల దర్భలతో, దర్వితో కప్పి,

[311] *"మమ పితః ప్రేత (అథవా, మాతః ప్రేతే) సర్వోపచారార్థే ఇమే తిలాః"*- అని అతనిపై తిలలను చల్లి అర్చించి, *"సకలారాధనైస్స్వర్చితమ్"* - అని మఱల నట్లే అర్చించి, *"అస్త్వర్చితమ్"*- అని అతనిచే చెప్పించుకొని (లేదా, *"మమ పితః ప్రేత (అథవా, మాతః ప్రేతే) సర్వోపచారార్థే ఇమే తిలాః"* - అని భోక్తృభుగ్నముపై తిలలను వేసి, *"సకలారాధనైస్స్వర్చితమ్"* - అని మఱల తిలలను వేసి, *"అస్త్వర్చితమ్"* - అని మనసులో ననుకొని)

[312] అగ్నికి దక్షిణమున నీటిచెంబును ఉంచి (దీని నిదివఱకే ఉంచియుండినచో మఱల ఉంచ వలసిన అవసరము లేదు), అగ్నికి దక్షిణమువైపున ఉంచిన హవిస్సు నభిఘరించి, అగ్ని నప్ర దక్షిణముగా పరిషేసించి, *"అగ్నౌ కరిష్యే?"*- అని విప్రుని అడిగి, *"కురుష్వ"* - అని చెప్పించు కొని, మేక్షణముతో హవిర్మధ్యమునుండి ఒకసారి ఉసిరికాయంత హవిస్సును ప్రధానదర్వి లోనికి తీసికొని, దానిపై ఇతరదర్వితో ఆజ్యమును వేసికొని, *"గోత్రస్య ---ఏకోద్దిష్ట శ్రాద్ధే"* - అని చెప్పి, 1వ మంత్రముతో అగ్నిలో దక్షిణమువైపు హవిర్హోమమును చేసి, ప్రధానదర్విని మేక్షణ ముతో తుడిచి,

*"----గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య(అథవా,---గోత్రాయాః----నామ్న్యాః మాతుఃప్రేతాయాః) అద్య ఏకాదశేహని ఆవర్తాద్యమానిక ఏకోద్దిష్టశ్రాద్ధే*

*1. పిత్రే ప్రేతాయ (అథవా,మాత్రే ప్రేతాయై) యమాయ చ స్వాహా/ యమాయేదం నమమ/*

- ఇత్యగ్నౌ దక్షిణార్ధే హుత్వా, మేక్షణేన సంమృజ్య,

*2. పిత్రే ప్రేతాయ (అథవా,మాత్రే ప్రేతాయై) యమాయ చ స్వాహా/ యమాయేదం నమమ/*-[313]- ఇతి ప్రధానదర్వ్యా ఆజ్యం గృహీత్వా హుత్వా,

*3. హవిష్యం స్వాహా/*

[314]ఇత్యుత్తరభస్మని హవిష్యం హుత్వా, మేక్షణమగ్నౌ ప్రహృత్య, అప్రదక్షిణమగ్నిం పరిషిచ్య,

*బ్రాహ్మణభోజనమ్:* [315]భోజనస్థానే *"---గోత్రస్య --- శర్మణః పితుః ప్రేతస్య (అథవా,---గోత్రాయాః ---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశేఽహని*

---

[313] ఇప్పుడు ప్రధానదర్విలో నేతినిమాత్రమే గ్రహించి 2వ మంత్రముతో ఆజ్యహోమము చేసి

[314] ఆపైని 3వ మంత్రముతో హవిష్యమును (అరటికాయకూరను) ప్రధానదర్విలోనికి తీసికొని, ఇతరదర్వితో దానిపై నేతి నభిఘరించి, అగ్నిలో ఉత్తరమునందున్న భస్మమునందు హోమము చేసి,మేక్షణమును అగ్నిలో పడవైచి, మరల అప్రదక్షిణముగా అగ్నిని పరిషేచనము చేసి,

[315] అగ్నికి దక్షిణమున భోజనస్థానమందు *"------గోత్రస్య -----ఇదం తే ఆసనమ్"* - అని బ్రాహ్మణునికి ఆసనార్థమొక దర్భనొసగి, భోజనస్థానములో అరటియాకును వేసి, *"ఇదం భోజనపాత్రాసనమ్"*- అని ఆ యాకు క్రింద నొక భుగ్నము నుంచి, *"ఇదమర్చనమ్"* - అని బ్రాహ్మణుని తిలలతో నర్చించి, హోమము చేయగా హవిఃపాత్రలో మిగిలిన యన్నమును, హవిష్యమును, ఇతరముగా వండిన యన్నమును వ్యంజనాపూపాదులతో సహ వడ్డించి, *"ఓం భూర్భువస్సువః"*- అని దానిని కూర్చజలముతో ప్రోక్షించి, *"దేవసవితః అప్రసువ"* - అని అన్నమును అప్రదక్షిణముగా కూర్చజలముచే పరిషేచించి, బ్రాహ్మణుని చేతిలో కూర్చతో శుద్ధోదకము విచ్చి (లేదా, భోక్తృభుగ్నమును అగ్నికి దక్షిణమున నుంచి, దానికి ఉత్తరమున, అనగా భోక్తృభుగ్నమునకు, అగ్నికి మధ్యన దక్షిణాగ్రముగా ఒక అరటియాకును వేసి, *"---గోత్రస్య --- ఇదం తే ఆసనమ్"* - అని భోక్తృభుగ్నముపై ఆసనార్థమొక దర్భను వేసి, *"ఇదం*

ఆవర్తాద్యమాసిక ఏకోద్దిష్టశ్రాద్ధే ప్రేతస్య భోజనస్థానే ఇదం తే ఆసనమ్" - ఇత్యాసనార్థం దర్భం దత్వా, "ఇదం భోజనపాత్రాసనమ్" - ఇతి భోజనపాత్రస్థానే భుగ్నం దత్వా, "ఇద మర్చనమ్"- ఇతి తిలైరర్ఘ్యర్చ్య, హుతశేషమన్నం పాత్రస్థమన్నం సవ్యంజనం సభక్షణా దికం భుక్తిపాత్రే దత్వా, "ఓం భూర్భువస్సువః" - ఇత్యన్నం ప్రోక్ష్య, "దేవసవితః అప్రసువ" - ఇత్యన్నమప్రదక్షిణం పరిషిచ్య, బ్రాహ్మణస్య హస్తే శుద్ధోదకం దత్వా,

"పృథివీ తే పాత్రం ద్యౌరపిధానం బ్రహ్మణస్త్వాముఖే జుహోమి బ్రాహ్మణస్య త్వా విద్యావతః ప్రాణాపానయోర్జుహోమ్యక్షితమసి మా ప్రేతస్య క్షేష్ఠా అముత్రాముష్మిన్ లోకే/ ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదమ్/ సమూఢమస్య పాగ్ంసురే/ప్రేత అన్నం రక్షస్వ/- [316]ఇతి బ్రాహ్మణస్య దక్షిణహస్తేన అన్నం వ్యంజనాదికం చ స్పర్శయిత్వా, అంగుష్ఠనఖప్రదేశం అన్నే నివేశ్య,

[317] "-----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,-----గోత్రాయాః ----- నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశేహని ఆవర్తాద్యమాసిక ఏకోద్దిష్టశ్రాద్ధే --

---

భోజనపాత్రాసనమ్" - అని ఆ యాకుక్రింద నొక భుగ్నము నుంచి, "ఇదమర్చనమ్" - అని భోక్తృభుగ్నముపై తిలలను వేసి, హోమము చేయుగా హవిఃపాత్రలో మిగిలిన యన్నమును, హవిష్యమును, వ్యంజనాపూపాదులతో సహ ఆ ఆకులో వడ్డించి (అందులో ప్రేతపిండము కొఱకై కొంత అన్నమును ముద్దకట్టి వేఱుగా నుంచుకొనవలెను. (సూచన: ఏకోద్దిష్టములో వాయసపిండము లేదు.) వడ్డించిన యన్నాదులను "ఓం భూర్భువస్సువః" - అని కూర్చ జలముతో ప్రోక్షించి, "దేవసవితః అప్రసువ" - అని అప్రదక్షిణముగా కూర్చజలముచే పరి షేచించి, మఱల కూర్చతో భోక్తృభుగ్నముపై శుద్ధోదకము నుంచి)

[316] "పృథివీ తే పాత్రం --- ప్రేత అన్నం రక్షస్వ" -అని చెప్పుచు, బ్రాహ్మణుని కుడిచేతిని పట్టుకొని అతని అంగుష్ఠమును ఆజ్యములో నద్ది, అన్నవ్యంజనాదులను స్పృశింపజేసి,

[317] తదుపరి అతని చేతిని విడిచిపెట్టి, "---గోత్రస్య ---తిలోదకముపతిష్ఠతు"- వఱకు చెప్పి, భోజనపాత్ర (ఆకు) కొనకు తిలోదకములను విడువవలెను. (లేదా "పృథివీ తే పాత్రం--" నుండి మొదలిడి "---తిలోదకముపతిష్ఠతు" వఱకు చెప్పి, భోక్తృభుగ్నమునకై ఉంచిన భోజనపాత్రా గ్రమున తిలోదకములను విడువవలెను.)

----గోత్ర ----శర్మన్ పితః ప్రేత (అథవా,-----గోత్రా -----నామ్ని మాతః ప్రేతే) ఏతత్తే అన్నం సవ్యంజనం సపరికరం చ బ్రాహ్మణస్త్వాహవనీయార్థే -----గోత్రాయ ----- శర్మణే పిత్రే ప్రేతాయ (అథవా, -----గోత్రాయై ----నామ్న్యై మాత్రే ప్రేతాయై) అన్నం సవ్యంజనం సపరికరం తిలోదకముపతిష్ఠతు" - ఇతి పాత్రాగ్రే తిలోదకం దద్యాత్. [318]తతః "ఓం భూర్భువస్సువః"- ఇత్యన్నం ప్రోక్ష్య, "సత్యంత్వర్తేన పరిషిఞ్చామి" - ఇత్యన్న మప్రదక్షిణం పరిషేచయిత్వా,

[319]బ్రాహ్మణహస్తే అపః ప్రదాయ "అమృతోపస్తరణమసి" - ఇత్యాపోశనం కారయిత్వా, "ఓం ప్రాణాయ స్వాహా॥ అపానాయ స్వాహా॥ వ్యానాయ స్వాహా॥ ఉదానాయ స్వాహా॥ సమానాయ స్వాహా॥ బ్రహ్మణి మ ఆత్మా౽మృతత్వాయ॥" - ఇతి ప్రాణాహుతీన్ కారయిత్వా, "పితః ప్రేత (మాతః ప్రేతే) యథా సుఖం జుషధ్వమ్" - ఇత్యుక్త్వా తమూర్ధ్వం భుంజానం న పశ్యేత్ - భోజనమధ్యే దీపం నాశయేత్.

[320](బ్రాహ్మణాభావే భుగ్నప్రతినిధినా కృతే అగ్నావేకోద్దిష్టశ్రాద్ధే భోజనపాత్రస్థాన్నం ద్వాత్రింశత్కబళాని కృత్వా, ఏకైకశః కబళాని గృహీత్వా,

---

[318]తరువాత "ఓం భూర్భువస్సువః"-అని అన్నమును ప్రోక్షించి, "సత్యంత్వర్తేన పరిషిఞ్చామి " - అను మంత్రముతో బ్రాహ్మణునిచే అన్నము నప్రదక్షిణముగా పరిషేచనము చేయించి,

[319] అతని చేతిలో ఆపోశనార్థము తీర్థమునొసగి, "అమృతోపస్తరణమసి" - అని ఆపోశనము పట్టించి, "ఓం ప్రాణాయ స్వాహా---బ్రహ్మణిమ ఆత్మామృతత్వాయ" అను మంత్రములతో ప్రాణాహుతులను చేయించి, "పితః ప్రేత యథాసుఖం జుషధ్వమ్" - అని ప్రార్థించి, ఆపైన భోక్తను నేరుగా చూడరాదు. భోజనం మధ్యలో దీపము నార్పివేయవలెను.

[320] బ్రాహ్మణుడు లేక, అతని ప్రతినిధిగా భుగ్నము నుంచి చేయు ఏకోద్దిష్టశ్రాద్ధములో, పైన అకులో వడ్డించిన అన్నమును, హవిష్యమును 32 ఉండలుగా కట్టి, ఒక్కొక ఉండను ప్రధాన దర్విలో వేసికొనుచు, దానిపై ఇతరదర్వితో నేతిని వేసికొనుచు, "యమాయ ----యమాయేదం నమమ" - అను మంత్రముతో అగ్నిలో 32 అన్నాహుతులను చేసి, మఱల ఇదే మంత్రముతో 32 ఆజ్యాహుతులను చేసి, అగ్ని నప్రదక్షిణముగా పరిషేచన చేయవలెను.

*"యమాయ సోమగ్ంసునుత/ యమాయ జుహుతా హవిః/ యమగ్ంహ యజ్ఞో గచ్ఛత్యగ్ని దూతో అరంకృత స్వాహా/ యమాయేదం నమమ/"* -

ఇతి ద్వాత్రింశదాహుతీర్జుహుయాత్. తతః

*"యమాయ ఘృతవద్ధవిర్జుహోత ప్రచతిష్ఠత/ స నో దేవేష్వాయమద్దీర్ఘమాయుః ప్రజీవసే స్వాహా/ యమాయేదం నమమ/"*

- ఇతి ద్వాత్రింశదాజ్యాహుతీర్హుత్వా, పునరప్రదక్షిణం పరిషించేత్.)

[321]భుక్తే ద్విజే *"పితః ప్రేత (అథవా, మాతః ప్రేతే) భోజనపదార్థేషు కిమపేక్షితమ్?"* - ఇతి పృష్ట్వా, *"సర్వం సమ్పూర్ణమ్"* - ఇతి ప్రతివచనం ప్రాప్య, *"సంపన్నమ్?"* - ఇత్యుక్త్వా, *"అస్తు సంపన్నమ్"* - ఇతి ప్రత్యుక్తే, *"తృప్తోసి?"* - ఇత్యుక్త్వా, *"తృప్తోస్మి"* - ఇతి ప్రత్యుక్తే, *"అమృతాపిధానమసి"* - ఇత్యాపోశనం కారయిత్వా, పాదౌ ప్రక్షాళయిత్వా, ఆచమనాన్తరం అంకే *"స్వదితమ్?"* ఇత్యుక్త్వా, *"అస్తు స్వదితమ్"* - ఇతి ప్రత్యుక్తే, బ్రాహ్మణహస్తే అపః ప్రదాయ, అర్ఘ్యపాత్రస్థపవిత్రం హస్తే నిధాయ, దర్వ్యా అర్ఘ్యపాత్రాత్ జలమాదాయ, [322] *"యా*

---

[321] భోజనాంతమున *"పితః ప్రేత (అథవా, మాతః ప్రేతే) భోజనపదార్థేషు కిమపేక్షితమ్?"* - అని బ్రాహ్మణుని అడిగి, *"సర్వం సమ్పూర్ణమ్"* - అని ప్రతివచనము పొంది, *"సంపన్నమ్"* - అని అడిగి, *"అస్తు సంపన్నమ్"* - అని అతనిచే చెప్పించుకొని, తుదుపరి *"తృప్తోసి?"* - అని అడిగి, *"తృప్తోస్మి"* - అని చెప్పించుకొని, *"అమృతాపిధానమసి"* - అని ఉత్తరాపోశనము చేయించి, అతడు నోరు,కాలుసేతులు కడిగికొని ఆచమించి వచ్చిన పైని, *"స్వదితమ్"* అని అడిగి, *"అస్తు స్వదితమ్"* - అని చెప్పించుకొని, అతని చేతిలో కూర్చతో శుద్ధోదకము నొసగి, అర్ఘ్యపాత్రలోని ఆయామతమును తీసి అతని చేతిలో నుంచి, అర్ఘ్యపాత్రపై కప్పిన దర్వితో అర్ఘ్యపాత్రలోని జలమును తీసికొనుచు,

[322] *"యా దివ్యా అపః పయసా --- స్వధాయేదం తే భుక్త తృప్తిః"* - అని చెప్పుచు అతని చేతిలో నర్ఘ్యము నిచ్చి, *"అస్తు భుక్త తృప్తిః"* - అని అతనిచే చెప్పించుకొని, అతని చేతిలో కూర్చతో శుద్ధోదకము నొసగి, ఆయామతమును తిరిగి అర్ఘ్యపాత్రలో వేసి, అర్ఘ్యపాత్రను ఇదివఱకువలెనే దర్భలతో, దర్వితో కప్పివేయవలయును. (భుగ్నములో చేయు ఏకోద్దిష్టమందు పైన కర్త పలుకవలసిన వాక్యములను యథాప్రకారము పలికి, వానికి ప్రత్యుత్తరములు లభించినట్లుగా

*దివ్యా ఆపః పయసా సంబభూవుః। యా అన్తరిక్ష ఉత పార్థివీర్యాః। హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శగ్ం స్యోనా భవన్తు। ---గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,-------గోత్రాయాః-----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశేహని ఆవర్తాద్యమాసిక ఏకోద్దిష్టశ్రాద్ధే----గోత్రాయ----శర్మణే పిత్రే ప్రేతాయ (అథవా,---గోత్రాయై----నామ్న్యై మాత్రే ప్రేతాయై) స్వధాయేదం తే భుక్త తృప్తిః"* - ఇత్యర్ఘ్యం దత్వా, *"అస్తు భుక్త తృప్తిః"* - ఇతి ప్రత్యుక్తే, పునశ్శుద్ధోదకం దత్వా, పవిత్రమాదాయ, అర్ఘ్య పాత్రే నిధాయ, దర్భైర్దర్వ్యాఞ్చ ప్రచ్ఛాద్య,

[323] *"---గోత్రస్య ---శర్మణః పితుః ప్రేతస్య (అథవా,---గోత్రాయాః ---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ఏకాదశాహని ఆవర్తాద్యమాసిక ఏకోద్దిష్టశ్రాద్ధే మమ పితః ప్రేత (అథవా, మాతః ప్రేతే) భోజనాన్తే యత్కించిత్సదక్షిణాకమిదం తే తామ్బూలమ్"*- ఇతి తామ్బూల-వస్త్ర-హిరణ్యోపానహ-ఛత్ర-దక్షిణాం చ దత్వా, *"అక్షయముచ్యతామ్"* - ఇతి ప్రార్థ్య, *"అస్త్వక్షయమ్"* - ఇతి ప్రత్యుక్తే, [324] *"---గోత్రం---శర్మాణం పితరం ప్రేతం*

---

మనసులో భావించుకొనవలెను. భుగ్నమున కర్షూమును పై మంత్రములను చెప్పుచు ఇదివరకే 203వ పుటలో వివరించినట్లుగా వేయవలెను.)

323 *"---గోత్రస్య---సదక్షిణాకమిదం తే తామ్బూలమ్"*- అని విప్రునికి తాంబూలమును, వస్త్రములను, హిరణ్యమును, చెప్పులను, గొడుగును, దక్షిణను కూడ ఇచ్చి, *"అక్షయముచ్యతామ్"*- అని అడిగి, *"అస్త్వక్షయమ్"*- అని చెప్పించుకొని,

324 *"----గోత్రం----భవంతో మహాన్తోఽనుగృహ్ణన్తు"* - అని ప్రార్థించి, *"తథాస్తు! యథా శాస్త్రానుష్ఠితమస్తు!"*- అని చెప్పించుకొని, అగ్నిసమీపమందుంచిన ఉదకుంభమును, దక్షిణనుకూడ బ్రాహ్మణునకొసగి ప్రణమిల్లి, *"ఉత్తిష్ఠ-----ప్రేత"*- అని బ్రాహ్మణుని లేపి, అతనితో సహ ఇంటి బయటకు వెడలి, *"పత్రశాకాది దానేన------దయాలుభిః"* - పర్యంతము చెప్పుచు ఉపవీతియై తమ్ములతో సహ అతనికి ప్రదక్షిణము చేసి, పాదప్రక్షాళనకుండము కడకేగి, అందులో ధాన్యమును (వడ్లను లేక బియ్యమును, లేక గోధుమలను) వేసి, *"అస్మత్కులమభివర్ధతామ్"* - అని కర్త ప్రార్థింపగా, *"యుష్మత్కులమభివర్ధతామ్"*- అని చెప్పుచు భోక్త ఆ కుణ్డమును మట్టిచే పూరింపవలెను. ఆ తర్వాత భోక్తను పంపివేసి,

*(అథవా,------గోత్రాం------నామ్నీం మాతరం ప్రేతాం)* ఉద్దిశ్య మయా కృతమిదం ఆవర్తాద్యమాసికైకోద్దిష్టశ్రాద్ధం యథా శాస్త్రానుష్ఠితం భూయాదితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు" - ఇత్యుక్త్వా, *"తథాస్తు! యథాశాస్త్రానుష్ఠితమస్తు!"* - ఇతి ప్రత్యుక్తే, అగ్ని సమీపే స్థాపితముదకుంభం దక్షిణాం చ దత్వా, ప్రణమ్య, *"ఉత్తిష్ఠ మమ పితః ప్రేత (మాతః ప్రేతే)"* - ఇత్యుత్థాప్య, అనువ్రజ్య,

*"పత్రశాకాదిదానేన క్లేశితా యూయమీదృశాః।*
*తత్క్షేశజాతం చిత్తేషు విస్మృత్య క్షన్తుమర్హథ॥*
*మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం ద్విజోత్తమాః*
*శ్రాద్ధం సంపూర్ణతాం యాతు ప్రసాదాద్భవతాం మమ॥*
*అద్య మే సఫలం జన్మ భవత్పాదాబ్జవన్దనాత్।*
*అద్య మే వంశజాస్సర్వే యాతావోఽనుగ్రహోద్దివమ్॥*
*ధన్యా వయం భవత్పాదరజః పూతమిదం గృహమ్।*
*అనుగ్రహాత్పు యుష్మాకం కృతోఽస్మాసు దయాలుభిః॥"*

- ఇత్యుపచారానుక్త్వా, ఉపవీతి, అనువ్రజ్యైనాన్ ప్రదక్షిణీకృత్య, పాదప్రక్షాళనకుణ్డే యవాన్నిధాయ, *"అస్మత్కులమభివర్ధతామ్"* - ఇతి కర్తా బ్రూయాత్. *"యుష్మత్కులమభివర్ధతామ్"* - ఇత్యుక్త్వా భోక్తా మృద్భిః కుణ్డం పూరయేత్. తతః భోక్తారం పరివిసృజ్య,

*పిణ్డప్రదానమ్*: ఉపవీతి, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి, *"---గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,---గోత్రాయాః ---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) ఆవర్తాద్యమాసికైకోద్దిష్టశ్రాద్ధే ప్రేతతృప్త్యర్థం పిండప్రదానం కరిష్యే"* - ఇతి సంకల్ప్య,

[325]అగ్నేర్దక్షిణతో దక్షిణాగ్రాన్దర్భాన్ సంస్తీర్య, తేషు *"మార్జయతాం మమ పితః ప్రేత (అథవా, మాతః ప్రేతే)"* - ఇత్యపో మార్జయిత్వా, *"-------గోత్రాయ -----శర్మణే పిత్రే*

325 కర్త ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై *"-----గోత్రస్య -----పిండప్రదానం కరిష్యే"* - అని సంకల్పించి, అగ్నికి దక్షిణమున దక్షిణాగ్రముగా 3 దర్భలను పఱచి, *"మార్జయతాం మమ పితః ప్రేత (అథవా, మాతః ప్రేతే)"* - అని వానిపై పితృతీర్థముతో నీటిని విడిచి, *"----గోత్రాయ ---శర్మణే --- పితం పిండం దదామి"* - అని టెంకాయంత పిండమును చేసి ఆ

*ప్రేతాయ (అథవా, ---గోత్రాయై ---నామ్న్యై మాత్రే ప్రేతాయై) ఏతం పిండం దదామి"* - ఇతి నాలికేరప్రమాణం పిండం దత్వా, తదుపరి తిలోదకం దత్వా, హిరణ్యోదకం చ దత్వా, "-- *---గోత్ర -----శర్మన్ పితుః ప్రేత (అథవా,----గోత్రా మాతః ప్రేతే) ఏతం పిండముపతిష్ఠ"*- ఇత్యుక్త్వా పాత్రసంక్షాళనోదకేన పిండం త్రిరప్రదక్షిణం పరిషిచ్య, [326]పూర్వవత్ *"మార్జయతాం మమ పితః ప్రేత (అథవా, మాతః ప్రేతే)"* ఇత్యపో మార్జయిత్వా, అధోముఖాని పాత్రాణి కృత్వా, *"తృప్యత, తృప్యత, తృప్యత"* - ఇత్యుక్త్వా పాత్రాణి ప్రోక్ష్య, ఉత్తానాని కృత్వా, కర్తా భుక్తశిష్టాన్నవ్యంజనాని పిండదర్భహోమపాత్రాణి వాప్సు ప్రక్షిప్య, స్నాత్వా, గృహం గత్వా,శ్రీమార్జసహితోర్ధ్వపుండ్రాణి ధృత్వా,నూత్నయజ్ఞోపవీతం ధృత్వా, పుణ్యాహవాచనం కృత్వా, పుణ్యాహజలేన ఆత్మానం అనుజాంశ్చ ప్రోక్షయేత్.



---

దర్భలపై నుంచి, తిలోదకములను పితృతీర్థముతో నా పిండముపై విడిచి, అట్లే హిరణ్యోదకమును కూడ విడిచి, పిండమునకై అన్నమునుంచిన పాత్రను కడిగి, ఆ నీటిలో తిలలను వేసి, "-- *---గోత్ర -----శర్మన్ పితుః ప్రేత ఏతం పిండముపతిష్ఠ"*- అని పిండము చుట్టును మూడుసార్లు అప్రదక్షిణముగా పితృతీర్థముతో ఆ నీటిని విడుచుచు పరిషేసించి,

[326]మునుపటివలెనే *"మార్జయతాం మమ పితః ప్రేత (అథవా, మాతః ప్రేతే)"* - అని పితృతీర్థముతో పిండముచుట్టును అప్రదక్షిణముగా నీటిని విడిచి, హవిర్హవిష్యపిండపాత్రలను బోర్లించియుంచి, *"తృప్యత, తృప్యత, తృప్యత"*- అని ఏకధాటిగా చెప్పి ఆపాత్రలను ప్రోక్షించి మరల త్రిప్పిపెట్టి, కర్త బ్రాహ్మణుడు తినగా మిగిలిన అన్నాదులను, పిండదర్భహోమపాత్రలను నీటిలో పడవైచి, తమ్ములతో సహ స్నానము చేసి, ఇంటికి పోయి, శ్రీమార్జసహితోర్ధ్వపుండ్రములను ధరించి,యజ్ఞోపవీతములు మార్చుకొని, ఆశౌచరహితుడైన మరొకవైష్ణవునిచే పుణ్యాహవాచనము చేయించి, కర్త తనను, తమ్ములను ప్రోక్షించుకొనవలెను.

# ద్వాదశాహః - షోడశశ్రాద్ధమ్

మాసికములన్నియు చేసి, ప్రథమాబ్దికము చేయుటకు ముందుగా సపిండీకరణము చేయవలసియున్నది. కాని ఇన్నాళ్లు వేచియుండిన కర్తకు ప్రమాదము వాటిల్లవచ్చును, వత్సరాంతము కర్తలు ఆశౌచము పట్టవలసివచ్చును. ఈ అననుకూలములను నివారించుకొనుటకై ఊనమాసికము మొదలుకొని ప్రథమాబ్దికమువఱకును వచ్చు 15 మాసికములను 12వ నాటికే ఆకర్షించుకొని పదునైదుగురు బ్రాహ్మణులను వరణము చేసి షోడశశ్రాద్ధమును అన్నరూపముగా గాని, లేదా ఆమరూపముగా గాని చేసి, తదుపరి అవాడే సపిండీకరణమును చేయుచున్నారు. సామాన్యముగా ఈ కాలములో ఆమరూపషోడశశ్రాద్ధమునే అందఱును చేయు చున్నారు. ఈ అధ్యాయములో ముందుగా అన్నరూప, ఆమరూపషోడశశ్రాద్ధవిధానములు వివరింపబడు చున్నవి. అనంతరము జరుగు సపిణ్డీకరణప్రయోగము తరువాతి అధ్యాయములో చెప్పబడు చున్నది. గమనిక:ఇట్లాకర్షించుకొని చేయుట సపిండీకరణమును 12వనాడు చేయు సౌకర్యము కొఱకేగాని ఈమాసికములను తత్తత్కాలములం దాచరించు బాధ్యతనుండి తప్పుకొనుటకు గాదు. అందుచే యావత్సంవత్సరము ఈ మాసికములను నిర్ణీతకాలములలో తప్పనిసరిగా పెట్ట వలెను.

## అన్నరూపషోడశశ్రాద్ధమ్

[327]శ్వః సపిండీకరణం కరిష్యమాణః పూర్వేద్యుః సాయం హోమం కృత్వా, స్వయం అనశ్నన్, *"-----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, -----గోత్రాయాః ----- నామ్న్యాః ప్రేతాయాః-ఇతి స్త్రీణామ్) శ్వః సపిండీకరణం భవితా తత్ర భవద్భిః ప్రసాదః కరణీయః"* - ఇతి భుక్తవత్సు ద్విజాన్ విజ్ఞాప్య, [328]శ్వో భూతే బ్రాహ్మణానాహూయ తేషాం పురతో యథాశక్తి దక్షిణాం నిధాయ, ప్రణమ్య, ప్రాచీనావీతి,

---

[327]సపిండీకరణమునకు ముందురోజు కర్త సాయంహోమమును చేసి, తాను భుజింపకుండ, నిమంత్రణ చేయదలచిన విప్రులు భుజించిన పిదప వారిని ఫలానా గోత్రీయుడు (గోత్రీయురాలైన) ప్రేతకు రేపు జరుగబోవు సపిండీకరణశ్రాద్ధమునకై తాము వేంచేయవలెనని కోరి, వారి అంగీకారమును పొందవలెను.

*"అశేషే హే పరిషత్. స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య -----గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, -----గోత్రాయాః-----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) సపిండీకరణ శ్రాద్ధం కరిష్యన్ తత్పూర్వభావీని ఊనమాసికాదీని, ఊనాబ్దికపర్యన్తాని పంచదశైకోద్దిష్టశ్రాద్ధాని తత్తత్కాలాదాకృష్య కర్తుకామోస్మి, తత్ర మమ అధికారసిద్ధిం అనుగ్రహాణ - మాసికాదీని యథాకాలమనుష్ఠితాని భూయాసురితి వానుగ్రహాణ"* - ఇతి ప్రార్థ్య, *"తథాస్తు, అధికారసిద్ధిరస్తు"* - ఇతి బ్రాహ్మణైరనుజ్ఞాప్య, ఉపవీతి, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి, *"అస్యాం తిథౌ -----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, -----గోత్రాయాః ------నామ్న్యాః మాతుః ప్రేతాయాః) సపిండీకరణశ్రాద్ధం కరిష్యన్ తత్పూర్వభావీని ఊనమాసికాదీని, ఊనాబ్దికపర్యన్తాని పంచదశైకోద్దిష్టశ్రాద్ధాని తంత్రేణ కరిష్యే"* - ఇతి సంకల్ప్య,

[329] ఊనమాసికాదిషు క్రమేణ పంచదశబ్రాహ్మణాన్ ప్రేతార్థే వృత్వా, వృత్తే కుండే పాదప్రక్షాళనం కృత్వా, కృసరాదీని దత్వా, అగ్నిప్రతిష్ఠాద్యర్ఘ్యగ్రహణం, భుక్తదేశసంస్కారం, ప్రేతా

---

[328] మఱునాడు కర్త శ్రీమూర్ణరహితముగా ఊర్ధ్వపుండ్రములను ధరించి తడిబట్టను కట్టుకొని, (స్నానానంతరము సంధ్యాదులను చేసినప్పుడు శ్రీమూర్ణము పెట్టుకొనియుండినను దానిని తుడిపివేసి), మధ్యాహ్నమందు బ్రాహ్మణులను రావించి, వారిముందు యథాశక్తి దక్షిణ నుంచి, ప్రాచీనావీతియై, *"అశేషే హే పరిషత్------ భూయాసురితి వానుగ్రహాణ"* - అని ప్రార్థించి, *"తథాస్తు, అధికారసిద్ధిరస్తు"* - అని వారి అనుజ్ఞను పొంది, ఉపవీతియై, ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై, *"అస్యాం తిథౌ ------తంత్రేణ కరిష్యే"* - అని సంకల్పించి (గమనిక: తంత్రేణ అను పదమునకు వత్సరపర్యంతము వచ్చు మాసికముల నన్నిటిని ఒకేసారి అన్వయించుకొని అని అర్థము.)

[329] పదునైదు ఊనమాసికాదులకు క్రమముగా పదునైదుగురు బ్రాహ్మణులను వరణము చేసి, వృత్తాకారకుండములో వారికి పాదప్రక్షాళనము చేసి, కృసరాదుల నొసంగి, అగ్నిప్రతిష్ఠ, అర్ఘ్యగ్రహణం, భుక్తదేశసంస్కారం, ప్రేతావాహనాదుల నేకోద్దిష్టమువలెనే చేసి, హవిస్సు మధ్యలో మేక్షణముచేత 15 భాగములను చేసి, దర్విలో నేతిని వేసికొనుచు, ఆ భాగముల నొక్కొకటిగా దర్విలోనికి తీసికొనుచు, నేతితో నభిఘరించుచు, ఏకోద్దిష్టమువలెనే హోమం చేసి, విప్రులను

వాహనాని ఏకోద్దిష్టవత్ కృత్వా, దర్వ్యాముపస్తీర్య, హవిర్మధ్యాత్ మేక్షణేన పంచదశధా అవదాయ, అభిఘార్య, పూర్వవద్ధుత్వా, పాత్రస్పర్శపూర్వకం బ్రాహ్మణాన్ భోజయిత్వా, తామ్బూలదక్షిణాం చ దత్వా, అగ్నేర్దక్షిణతో దర్భేషు పంచదశపిండాన్ దత్వా, శేషం పూర్వ వత్ సర్వం కుర్యాత్.

## ఆమరూపషోడశశ్రాద్ధమ్

[330]కర్తా ప్రణమ్య, ప్రాచీనావీతీ, *"అశేషే హే పరిషత్. స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య-----గోత్రస్య-----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,-----గోత్రాయాః ----- నామ్న్యాః మాతుః ప్రేతాయాః) సపిండీకరణశ్రాద్ధం కరిష్యన్ తత్పూర్వభావీని ఊన మాసికాదీని, ఊనాబ్దికపర్యన్తాని పంచదశైకోద్దిష్టశ్రాద్ధాని తత్తత్కాలాదాకృష్యామ రూపేణ కర్తుకామోఽస్మి, తత్ర మమ అధికారసిద్ధిం అనుగ్రహాణ - మాసికాదీని యథా కాలమనుష్ఠితాని భూయాసురితి చానుగ్రహాణ"*- ఇతి ప్రార్థ్య, *"తథాస్తు, అధికారసిద్ధి రస్తు"* -ఇతి బ్రాహ్మణైరనుజ్ఞాప్య, ఉపవీతీ, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ, *"అస్యాం తిథౌ -- ---గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా ------గోత్రాయాః -----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) సపిండీకరణశ్రాద్ధం కరిష్యన్ తత్పూర్వభావీని ఊనమాసికాదీని,*

---

భుజింపజేసి, వారికి తామ్బూలదక్షిణల నొసగి, అగ్నికి దక్షిణమున దర్భలయందు 15 పిండ ముల నుంచి పూర్వోక్తవిధముగా పిండప్రదానము చేయవలెను. ఇది ఉత్తమపక్షము. లేనిచో పైన చెప్పినట్లుగా ఆమరూపషోడశశ్రాద్ధమును చేయవలెను. (సూచన: ఈ ఆమరూపషోడశశ్రాద్ధ మునే పలువు రీ కాలములో చేయుచున్నారు.)

[330] ఈ ఆమశ్రాద్ధమునుగూడ కర్త శ్రీమార్జరహితోర్ధ్వపుండ్రములను ధరించి, తడిబట్ట కట్టుకొని యే చేయవలయును. కర్త బ్రాహ్మణులను రావించి, వారిముందు యథాశక్తి దక్షిణ నుంచి, ప్రాచీనావీతియై, *"అశేషే హే పరిషత్--------భూయాసురితి చానుగ్రహాణ"*- అని ప్రార్థించి, *"తథాస్తు, అధికారసిద్ధిరస్తు"*- అని వారి అనుజ్ఞను పొంది, ఉపవీతియై, ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై, *"అస్యాం తిథౌ--- తంత్రేణ కరిష్యే"*- అని సంకల్పించి, బ్రాహ్మణులకు వరణ పాదప్రక్షాళనములు చేసి, గంధపుష్పాదుల నొసగి,

ఊనాబ్దికపర్యన్తాని. పంచదశైకోద్దిష్టశ్రాద్ధాని ఆమరూపేణ తంత్రేణ కరిష్యే" - ఇతి సంకల్ప్య, వరణ, పాదప్రక్షాళనం చ కృత్వా, గంధపుష్పాదీని దత్వా, [331]తండుల, ముద్గ, గుడ, తిల, కదళీ, ఘృత, తామ్బూల, దక్షిణాదీని పంచదశధా పంచదశకదళీపత్రేషు నిధాయ, "ఓం భూర్భువస్సువః" ఇత్యామాని ప్రోక్ష్య, "దేవ సవితః అప్రసువ" - ఇత్యప్రదక్షిణం పరిషిచ్య,

"పృథివీ తే పాత్రం ద్యౌరపిధానం బ్రహ్మణస్త్వాముఖే జుహోమి బ్రాహ్మణస్య త్వా ప్రాణాపానయోర్జుహోమ్యక్షితమసి మాస్య క్షేష్ఠా అముత్రాముష్మిన్ లోకే। ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్। సమూఢమస్య పాగ్ంసురే। స్వధా విష్ణో ఆమం రక్షస్వ।" - ఇతి పాత్రస్పర్శపూర్వకమభిమన్త్ర్య,

ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః।
త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వభుగవ్యయః॥

ఆమరూపైః ఏభిః సవ్యంజనైః సపిండీకరణాత్ పూర్వభావైః పంచదశైకోద్దిష్టశ్రాద్ధైః --- గోత్ర ----శర్మ ప్రేతరూపి (----గోత్రా ----నామ్నీ ప్రేతారూపీ, ఇతి స్త్రీణాం) భగవాన్ శ్రీ

---

[331] బియ్యము, పెసరపప్పు, బెల్లము, తిలలు, అరటిపండ్లు, నేయి, తామ్బూలము, దక్షిణ-వీనిని వరుసగా 1.ఊనమాసిక, 2.ద్వితీయానుమాసిక, 3. త్రైపక్షిక, 4.తృతీయానుమాసిక, 5. చతుర్థానుమాసిక, 6. పంచమానుమాసిక, 7. షష్ఠానుమాసిక, 8. ఊనషాణ్మాసిక, 9. సప్తమానుమాసిక, 10. అష్టమానుమాసిక, 11. నవమానుమాసిక, 12. దశమానుమాసిక, 13. ఏకాదశానుమాసిక, 14. ద్వాదశానుమాసిక, 15. ఊనాబ్దిక - ఈ 15 శ్రాద్ధముల నిమిత్తము వేఱు వేఱుగా 15 అరటియాకులలో నుంచి (లేదా వానిని 4 ఆకులలో నుంచి 15 భాగములు చేసి), "ఓం భూర్భువస్సువః" - అని ఆ 15 ఆమములను ప్రోక్షించి, "దేవసవితః అప్రసువ" - అని వాని నప్రదక్షిణముగా పరిషేచనము చేసి, బ్రాహ్మణులచే ఆమపాత్రలను తాకించుచూ, "పృథివీ తే పాత్రం --- స్వధా విష్ణో ఆమం రక్షస్వ" - అను మన్త్రమును చెప్పి, "ఏకో విష్ణుర్మహద్భూతం -----శ్రీజనార్దనః ప్రీయతామ్" - అని ఆకుల ప్రక్కకొక ఏకదర్భభుగ్నము నుంచి, దానిపై తిలోదకమును విడిచి, ఆమముతో సహ తాంబూలదక్షిణలను బ్రాహ్మణుల కొసగి, వారిని పంపివేసి, కర్త తాను తమ్ములతో సహ స్నానము చేసి, నూత్నయజ్ఞోపవీతములను ధరించి, కర్త స్వగృహమున తానుగాక మఱొక వైష్ణవునిచే పుణ్యాహవాచనమును చేయింపవలెను. ఈ పుణ్యాహవాచనవిధి వెనుకటి అధ్యాయములో వివరింపబడినది.

*జనార్దనః ప్రీయతామ్"*-ఇతి ఏకదర్భకుగ్నే తిలోదకముత్సృజ్య, తాంబూలదక్షిణాం చ బ్రాహ్మణేభ్యో దత్వా, బ్రాహ్మణాన్ ప్రస్థాప్య, తతః స్నాత్వా, నూతనయజ్ఞోపవీతం ధృత్వా, పుణ్యాహం వాచయేత్.

# హిరణ్యరూపసోదకుంభశ్రాద్ధమ్

[332]షోడశశ్రాద్ధానంతరం ఆమరూపేణ వా హిరణ్యరూపేణ వా సోదకుంభశ్రాద్ధం కేచిత్ కుర్వన్తి. తత్ప్రకారః -(కర్తౄణాం జ్యేష్ఠః) ప్రాచీనావీతి, *"అశేషే హే పరిషత్. స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్త దక్షిణామివ స్వీకృత్య ---గోత్రస్య ---శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ---గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) సపిండీకరణశ్రాద్ధం కరిష్యన్ మరణప్రభృతి షష్ట్యుత్తరత్రిశతి(360) సోదకుంభశ్రాద్ధాని తత్తత్కాలాదాకృష్య ఏకతంత్రేణ హిరణ్య రూపేణ కర్తుకామోఽస్మి, తత్ర మమ అధికారసిద్ధిమనుగ్రహాణ - శ్రాద్ధాని యథాకాల*

---

[332] షోడశశ్రాద్ధము తర్వాత కొందఱు ఆమరూపముగా గాని, హిరణ్యరూపముగా గాని సోద కుంభశ్రాద్ధమును చేయుచున్నారు. శాస్త్రప్రకారము మరణసంవత్సరమందు రోజు కొక్కటి చొప్పున మొత్తం 360 సోదకుంభశ్రాద్ధములను చేయవలసియున్నది. ఇట్లు చేయుట సాధ్య పడదు గనుక ఈ 360 శ్రాద్ధములను 12వ రోజునకే ఆకర్షించుకొని వీటన్నిటిని కలిపి హిరణ్య రూపముగా సోదకుంభశ్రాద్ధము చేయు విధాన మతిసులభమైనందున, శ్రీమాన్ కందాళై శ్రీని వాసాచార్యులవారి "అపరప్రయోగానుక్రమణిక" ననుసరించి, ఆ విధాన మిక్కడ వ్రాయబడి నది. దీనికై కర్తలలో జ్యేష్ఠుడు ప్రాచీనావీతియై, *"అశేషే హే పరిషత్-- అనుగ్రహాణ"*- అని చెప్పి, *"తథాస్తు, అధికారసిద్ధిరస్తు"*- అని పరిషదనుజ్ఞను పొంది, ఉపవీతియై ప్రాణాయామ మును చేసి; ప్రాచీనావీతియై, *"అస్యాం తిథౌ--- హిరణ్యరూపేణ కరిష్యే"*- అని సంకల్పించి, హిరణ్యమును (దక్షిణను), తిలలను చేతిలో తీసికొని, *"ఇమాని షష్ట్యుత్తరత్రిశతి సోదకుంభ శ్రాద్ధాని ---తుభ్యమహం సంప్రదదే నమమ"*- అని చెప్పి ఆ హిరణ్యమును తిలలు, జలముతో సహ భూమిపై విడిచి ఒక శ్రోత్రియునికి దానమీయవలెను. తరువాత కర్తలు స్నానము చేసి, మడిబట్టలు కట్టుకొని, శ్రీమూర్ణయుతముగా నూర్ధ్వపుండ్రముల ధరించి, ఆశౌచరహితుడైన మతొక వైష్ణవునిచే పుణ్యాహవాచనమును చేయింపవలెను.

*మనుష్ఠితాని భూయాసురితి చానుగ్రహాణ"* - ఇతి ప్రార్థ్య, *"తథాస్తు, అధికారసిద్ధిరస్తు"* - ఇతి బ్రాహ్మణైరనుజ్ఞాప్య, ఉపవీతి, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి, *"అస్యాం తిథౌ గోత్రస్య ---శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ---గోత్రాయాః---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) సపిండీకరణశ్రాద్ధం కరిష్యన్ మరణప్రభృతి షష్ఠ్యుత్తరత్రిశతి (360) సోదకుంభశ్రాద్ధాని తత్తత్కాలాదాకృష్య ఏకతంత్రేణ హిరణ్యరూపేణ కరిష్యే"*- ఇతి సంకల్ప్య, హిరణ్యం హస్తే గృహీత్వా, *"ఇమాని షష్ఠ్యుత్తరత్రిశతి సోదకుంభశ్రాద్ధాని హిరణ్యరూపేణ ------ గోత్రాయ ------శర్మణే తుభ్యమహం సంప్రదదే నమమ"*- ఇతి తద్ధిరణ్యం తిలోదకేన సహ భూమౌ త్యక్త్వా, బ్రాహ్మణాయ దత్వా, అనంతరం కర్తారః స్నాత్వా, ధౌతవస్త్రాణి ధృత్వా, శ్రీమార్గయుతోర్ధ్వపుండ్రాని ధృత్వా, పుణ్యాహం వాచయేయుః.



# ద్వాదశాహః

# సపిండీకరణప్రయోగః

12వ రోజు షోడశ, సోదకుంభశ్రాద్ధములు ముగిసిన పిదప, కర్తలు స్నానము చేసి, మడి బట్టలు కట్టుకొని, నూతనయజ్ఞోపవీతములు ధరించి, శ్రీమార్జనసహితముగా తిరుమణిని ధరించి, ఆశౌచములేని వేఱొక శ్రోత్రియబ్రాహ్మణునిచే పుణ్యాహవాచనము చేయించి, ఆ పుణ్యా జలములచే సపిండీకరణమునకొఱకైన శాకాదులను, పాత్రలను, స్థలాదులను, ఇతరవస్తువు లను ప్రోక్షింపజేయవలెను. 12వ రోజు కర్తలకింకా పూర్తిగా ఆశౌచనివృత్తి కలుగనందున వేఱొక ఆశౌచరహితుడైన బ్రాహ్మణునిచే ఈపుణ్యాహమును చేయింపవలెను.కర్త విశ్వేదేవస్థానములో నొకరిని, పితుః పితృ-పితామహ-ప్రపితామహస్థానములో నొకరిని, ప్రేతస్థానములో నొకరిని, విష్ణుస్థానములో నింకొకరిని - మొత్తము నల్వురు బ్రాహ్మణులను నిమంత్రించి సపిండీకరణశ్రాద్ధ మును చేయవలెను.

కర్తయొక్క తండ్రి బ్రతికియున్నంతవఱకు, అతడు ఆబ్దికాదిశ్రాద్ధములను తనపైని మూడు తరముల వారికి - అనగా అతని తండ్రికి, తాతకు, ముత్తాతకు - చేయుచుండెను. ఇప్పుడు కర్త యొక్క తండ్రి మరణించి 12వ నాటివఱకు ప్రేతరూపమున నుండెను. 12వ నాడిట్టి ప్రేతకు అతని యొక్క తండ్రి, తాత, ముత్తాతలతో సహ సపిండీకరణమును చేసి, అతని పిండమును వారి పిండములతో సంయోజనముచేసి (కలిపివేసి), ముత్తాతకు పాథేయము (దారిబత్తెము) నిచ్చి పంపివేసి, మృతుడైన తండ్రికి పితృదేవతాస్థానమును కల్పించుటయే సపిండీకరణోద్దేశ్యము. ఈ పరంపరలో బ్రతికియున్నవారిని విడిచిపెట్టి, మృతులైన పైతరముల వారితో సపిణ్డీకరణ మును చేయవలెను. అనగా ఒకవేళ తండ్రి మృతుడైనప్పుడు తాత బ్రతికియే యున్నచో, ప్రేత రూపమున నున్న తండ్రికి ముత్తాతతోను, ముత్తాతతండ్రి, ముత్తాతతాతలతోడను సపిణ్డీకరణ మును చేయవలెను. ఇట్లే అన్యసందర్భములను కూడ నూహించునది. తల్లి మృతురాలై నప్పుడు, ప్రేతరూపమున నున్న ఆమెకు తండ్రితల్లితోడను, తండ్రియొక్క పితామహి, ప్రపితా మహిలతోడను పిండసంయోజనము చేసి, తండ్రియొక్క ప్రపితామహికి పాథేయ మీయ వలెను. ఒకవేళ తల్లి మరణించినప్పుడు తండ్రితల్లి బ్రతికియే యుండిన, ఆమెను విడిచిపెట్టి, ఆమె పైని మూడుతరముల వారితో పిండసంయోజనమును చేయవలెను. గమనిక: స్త్రీలకు హోమాధి

కారము లేనందున, తల్లి సుమంగళిగా మరణించినచో, తల్లి శ్రాద్ధమునందును తండ్రియొక్క పితృ, పితామహ, ప్రపితామహులకే హోమముచేయవలెను; అట్లుకాక తల్లి విధవగా మరణించి నచో ఆమె శ్రాద్ధమునందు కర్తయొక్క పితృ, పితామహ, ప్రపితామహులకు హోమము చేయ వలెను. మిగితా సందర్భములనుకూడ ఇట్లే ఊహించుకొనవలెను.

*ప్రయోగః:*[333] కర్తా మాధ్యాహ్నికం కృత్వా, పాదౌ ప్రక్షాళ్య, ఆచమ్య, ప్రాచీనావీతీ, తిలాక్షతాన్ గృహీత్వా, దక్షిణాభిముఖస్తిష్ఠన్,

*"సమస్త సంపత్సమవాప్తి హేతవః/ సముత్థితాపత్కులధూమకేతవః/*
*అపారసంసారసముద్రసేతవః/ పునన్తు మాం బ్రాహ్మణపాదపాంసవః//"*

ఇత్యుక్త్వా, [334]ఉపవీతీ, *"క్రతుదక్షసంజ్ఞిక విశ్వేభ్యో దేవేభ్యో నమః"* - ఇతి విశ్వేదేవ స్థానే నిమంత్రితవిప్రం దక్షిణపార్శ్వే అక్షతైరభ్యర్చ్య, ప్రాచీనావీతీ, *"పితుః పితృపితామహ ప్రపితామహేభ్యో నమః"* - ఇతి పితుః పితృపితామహప్రపితామహస్థానే నిమంత్రితం విప్రం

---

[333]కర్త మాధ్యాహ్నికమును చేసి, కాళ్లు కడుగుకొని, ఆచమించి, ప్రాచీనావీతియై, మూడు దర్భలచే కట్టిన పవిత్రమును పెట్టుకొని తిలాక్షతలను (అక్షతలనగా నాన్చిన తెల్లబియ్యము, పసుపు అక్షతలు కాదు) ఒక తట్టలో పెట్టుకొని, దక్షిణాభిముఖుడై, *"సమస్త సంపత్సమవాప్తి---బ్రాహ్మణపాదపాంసవః//"* - అని చెప్పి, (సూచన: కర్త తమ్ములును పవిత్రమును ధరించి నమస్కరింపవలెను గాని వారు తిలాక్షతలు తీసికొన నవసరము లేదు.)

[334] ఉపవీతియై *"క్రతుదక్షసంజ్ఞిక విశ్వేభ్యో దేవేభ్యో నమః"* - అని విశ్వేదేవస్థానములో నిమంత్రితుడైన బ్రాహ్మణుని కుడిపార్శ్వమునందు అక్షతలు వేసి అర్చించి, ప్రాచీనావీతియై, *"పితుః పితృపితామహప్రపితామహేభ్యో నమః"*- అని పితుః పితృపితామహప్రపితామహస్థానములో నిమంత్రితుడైన బ్రాహ్మణుని ఎడమపార్శ్వమునందు తిలలు వేసి అర్చించి, *"పిత్రే ప్రేతాయ నిమిత్తాయ నమః"* - అని ప్రేతస్థానమందు నిమంత్రితుడైన బ్రాహ్మణుని ఎడమపార్శ్వమందు తిలలు వేసి అర్చించి, ఉపవీతియై, *"శ్రాద్ధసంరక్షకశ్రీమహావిష్ణవే నమః"* - అని విష్ణుస్థానములో నిమంత్రితుడైన బ్రాహ్మణుని కుడిపార్శ్వమునందు అక్షతలు వేసి అర్చించవలెను. మాతృ సపిండీకరణమందు *"పితుర్మాతృపితామహ ప్రపితామహీభ్యో నమః"*, *"మాత్రే ప్రేతాయై నిమిత్తాయనమః"* - అని చెప్పవలెను. తదుపరి ప్రాచీనావీతియై, *"దేవతాభ్యః పితుః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవ చ/ నమస్స్వధాయై స్వాహాయై నిత్యమేవ నమో నమః"*- అని చెప్పి, ఉప

వామపార్శ్వే తిలైరభ్యర్చ్య, *"పిత్రే ప్రేతాయ నిమిత్తాయ నమః"* - ఇతి ప్రేతస్థానే నిమన్త్రితం విప్రం వామపార్శ్వే తిలైరభ్యర్చ్య ఉపవీతీ, *"శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణవే నమః"* - ఇతి విష్ణుస్థానవిప్రం దక్షిణపార్శ్వే అక్షతైరభ్యర్చ్య, (మాతృశ్రాద్ధేతు, "పితుర్మాతృపితామహీ ప్రపితామహీభ్యో నమః", "మాత్రే ప్రేతాయై నిమిత్తాయనమః" - ఇతి), ప్రాచీనావీతీ,

*"దేవతాభ్యః పితుః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవ చ। నమస్స్వధాయై స్వాహాయై నిత్యమేవ నమో నమః"* - ఉపవీతీ ప్రణమ్య, ప్రాచీనావీతీ,

*"స్వామినః అస్మిన్దివసే----గోత్రం----శర్మాణం పితరం (అథవా,----గోత్రాం----నామ్నీం మాతరం) ప్రేత (ప్రేతా)ముద్దిశ్య సపిండీకరణశ్రాద్ధం కర్తుకామోస్మి। అయం దేశశ్చ కాలశ్చ అస్మిన్గేహే విద్యమాన పక్వాపక్వపదార్థాః శ్రాద్ధార్హాః భూయాసుః। ఇదం క్షేత్రం గయాక్షేత్రసదృశం భూత్వా పితుః ప్రేతస్య (అథవా, మాతుః ప్రేతాయాః) సపిండీకరణశ్రాద్ధకరణే మమ అధికారసంపదస్త్వితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు"* - ఇతి ప్రార్థ్య, *"తథాస్తు! అధికారసంపదస్తు!"* - ఇతి ప్రతివచనం ప్రాప్య, [335] ఉపవీతీ, ఉదఙ్ముఖః, *"శ్రాద్ధభూమిం గయాం ధ్యాత్వా, ధ్యాత్వా దేవం గదాధరమ్"* - ఇత్యుక్త్వా, ప్రాచీనావీతీ దక్షిణాభిముఖః, *"వస్వాదీంశ్చ పితుః పితౄన్ ధ్యాత్వా, తతః శ్రాద్ధం ప్రవర్తయే"* - ఇతి ప్రార్థయేత్. *"ప్రవర్తయ"* - ఇతి ప్రతివచనమ్.

---

వీతియై నిమంత్రితబ్రాహ్మణులకు ప్రణామము చేసి, ఆపైని ప్రాచీనావీతియై, "స్వామినః----- మహాన్తోనుగృహ్ణన్తు"-అని ప్రార్థించి, *"తథాస్తు! అధికారసంపదస్తు"*-అని వారి అనుజ్ఞను పొంది

[335] తరువాత కర్త ఉపవీతితో ఉత్తరాభిముఖుడై *"శ్రాద్ధభూమిం గయాం ధ్యాత్వా, ధ్యాత్వా దేవం గదాధరమ్"* - అని చెప్పి, ప్రాచీనావీతితో దక్షిణాభిముఖుడై, *"వస్వాదీంశ్చ పితుః పితౄన్ ధ్యాత్వా, తతః శ్రాద్ధం ప్రవర్తయే"* - అని చెప్పి *"ప్రవర్తయ"* - అని బ్రాహ్మణాంగీకారమును పొందవలెను.

[336]ఉపవీతీ, దర్భేష్వాసీనః, దర్భాన్ ధారయమాణః, పవిత్రపాణిః త్రిః ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ, "హరిరోం తత్సత్ శ్రీగోవిన్ద గోవిన్ద గోవిన్ద అస్య శ్రీ భగవతః మహాపురుషస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే అష్టావింశతితమే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్ఠి సంవత్సరాణాం మధ్యే -----సంవత్సరే -----అయనే-----ఋతౌ-----మాసే -----పక్షే ----తిథౌ ----వాసరే ----నక్షత్రయుక్తాయాం శ్రీవిష్ణుయోగ శ్రీవిష్ణుకరణ ఏవం గుణవిశేషణవిశిష్టాయాం అస్యాంతిథౌ శ్రీభగవదాజ్ఞయా భగవత్కైఙ్కర్యరూపం----గోత్రస్య ----శర్మణః మమ పితుః ప్రేతస్య (అథవా,----గోత్రాయాః ----నామ్న్యాః మమ మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణశ్రాద్ధం కరిష్యే" - ఇతి సంకల్ప్య, "కురుష్వ"- ఇతి ప్రతివచనం ప్రాప్య, [337]ఉపవీతీ,

స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।
విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥

ఇతి సాత్త్వికత్యాగం కృత్వా,

[338]ఉపవీతీ, విశ్వేదేవహస్తే ఆపః ప్రదాయ, "-----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణశ్రాద్ధే క్రతుదక్షసంజ్ఞక విశ్వేషాం దేవానామిదమాసనమ్" - ఇత్యాసనార్థం

---

336 తదుపరి కర్త ఉపవీతియై, ఉత్తరాగ్రపు దర్భలపై తూర్పుముఖముగా కూర్చొని, మూడు దర్భలతో కట్టిన పవిత్రమును ధరించి, ముమ్మారు ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై, "హరిరోం తత్సత్------సపిండీకరణశ్రాద్ధం కరిష్యే"- అని సంకల్పించి, "కురుష్వ" - అని బ్రాహ్మణాంగీకారమును పొంది,

337 ఉపవీతియై "స్వశేషభూతేన ----ప్రక్రమతే స్వయమ్" - అని సాత్త్వికత్యాగమును చేసి,

338 ఉపవీతిగనే ఉండి, కూర్చతో విశ్వేదేవుల చేతిలో జలము నుంచి, "------గోత్రస్య -----విశ్వేషాం దేవానామిదమాసనమ్"- అని చెప్పి 2 ఉత్తరాగ్రపు దర్భలను విశ్వేదేవులయొక్క వెనుకభాగమున ఆసనార్థము వేయవలెను.

దర్భాన్ దత్వా,[339]పునరపః ప్రదాయ, *"క్రతుదక్షసంజ్ఞిక విశ్వేదేవార్థే భవతా క్షణః కర్తవ్యః"* - ఇతి దర్భాక్షతాన్ దద్యాత్. *"ఓం తథా"* - ఇతి ప్రతివచనమ్. కర్తా: *"ప్రాప్నువన్తు భవన్తః"*- *"ప్రాప్నువామ"* - ఇతి ప్రతివచనమ్. *"అలంకారార్థే ఇమే అక్షతాః/ సకలారాధనైః స్వర్చితమ్"*- ఇత్యక్షతైరర్చయేత్.

[340]ప్రాచీనావీతీ, పితుః పిత్రాదీనాం (పితుర్మాత్రాదీనాం) హస్తే అపః ప్రదాయ, *"---గోత్రస్య ---శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ----గోత్రాయాః---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణశ్రాద్ధే వసురుద్రాదిత్యస్వరూప అస్మత్పితుః పితృ పితామహప్రపితామహానాం ఇదమాసనమ్ (అథవా, అస్మత్పితుర్మాతృ, పితామహీ, ప్రపితామహీనాం ఇదమాసనమ్)* "- ఇత్యాసనార్థం దర్భత్రయకృతం భుగ్నం దత్వా, పున రపః ప్రదాయ,*"-----గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య* (అథవా,----- *గోత్రాయాః-----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీ కరణశ్రాద్ధే వసురుద్రాదిత్యస్వరూప అస్మత్పితుః పితృ,పితామహ,ప్రపితామహార్థే*

---

[339] విశ్వేదేవుల చేతిలో కూర్చచేత మణల నుదకము నిచ్చి, *"క్రతుదక్షసంజ్ఞిక విశ్వేదేవార్థే భవతా క్షణః కర్తవ్యః"*- అని రెండు దర్భలను, అక్షతలను వారి కుడిచేతిమీదుగా క్రిందికి విడువవలెను; విశ్వేదేవులు *"ఓం తథా"*- అని ప్రతివల్కవలెను. కర్త మణల *"ప్రాప్నువన్తు భవన్తః"* - అని పల్కగా, విశ్వేదేవులు *"ప్రాప్నువామ"* - అని ప్రతివల్కవలెను. తరువాత కర్త *"అలంకారార్థే ఇమే అక్షతాః/సకలారాధనైః స్వర్చితమ్/"*- అని శ్వేతాక్షతలను విశ్వేదేవుల యొక్క కుడివైపు వేసి అర్చింపవలెను.

[340] తరువాత ప్రాచీనావీతియై, పితృ (మాతృ) స్థాననిమంత్రితబ్రాహ్మణుని చేతిలో కూర్చతో జలము నొసగి, *"--- గోత్రస్య ----ఇదమాసనం"* - అని ఆసనముకై మూడుదర్భలతో కట్టిన దక్షిణాగ్రభుగ్నమును అతని వెనుకవైపున వేసి, మరల కూర్చతో చేతిలో నీటి నొసగి, *"----- గోత్రస్య ----భవతా క్షణః కర్తవ్యః"*- అని చెప్పి రెండు దర్భలను తిలలతో సహా అతని కుడి అఱచేతి మీదుగా రెండువైపులా పడునట్లు వేసి, *"ఓం తథా"*- అని అతనిచే చెప్పించుకొని, *"ప్రాప్నువన్తు భవన్తః"*- అని అభ్యర్థించి, *"ప్రాప్నువామ"*- అని ప్రతి చెప్పించుకొని, *"అలంకారార్థే ఇమే తిలాః/సకలారాధనైః స్వర్చితమ్/"*- అని అతని ఎడమపార్శ్వమున కొన్నితిలలను వేసి పూజింపవలెను.

భవతా క్షణః కర్తవ్యః (అథవా,అస్మత్పితుర్మాతృ ,పితామహీ,ప్రపితామహ్యర్థే భవతా క్షణః కర్తవ్యః)" - ఇతి ద్వౌ దర్భౌ దద్యాత్. "ఓం తథా" - ఇతి ప్రతివచనమ్. కర్తా: "ప్రాప్నువన్తు భవన్తః" - "ప్రాప్నువామ"- ఇతి ప్రతివచనమ్. "అలంకారార్థే ఇమే తిలాః/ సకలారాధనైః స్వర్చితమ్/"- ఇతి తిలై రర్చయేత్.

[341]ప్రాచీనావీతీ, నిమిత్తస్య హస్తే అపః ప్రదాయ, "---- గోత్రస్య ----శర్మణః పితుః ప్రేత నిమిత్తస్య (అథవా,-----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః నిమిత్తస్య) ఇదమాసనం"- ఇత్యాసనార్థం ఏకదర్భభుగ్నం దత్వా, పునరపః ప్రదాయ, "----- గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,-----గోత్రాయాః -----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణశ్రాద్ధే పితృ (మాతృ) నిమిత్తార్థే భవతా క్షణః కర్తవ్యః"- ఇతి భుగ్నం దద్యాత్. "ఓం తథా"- ఇతి ప్రతివచనమ్. కర్తా: "ప్రాప్నోతు భవాన్" - "ప్రాప్నువాని"- ఇతి ప్రతివచనమ్. "అలంకారార్థే ఇమే తిలాః/ సకలారాధనైః స్వర్చితమ్"- ఇతి తిలైరర్చయేత్.

[342]ఉపవీతీ, విష్ణుహస్తే అపః ప్రదాయ, "-----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,-----గోత్రాయాః----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని

---

[341] ఇంకను ప్రాచీనావీతిగనే యుండి, ప్రేతస్థాననిమంత్రితుని చేతిలో కూర్చచేత జలము నొసగి, "----గోత్రస్య ---- ఇదమాసనం"- అని ఆసనమునకై ఒకదర్భతో కట్టిన దక్షిణాగ్రభుగ్నము నొసగి, మఱల కూర్చచేత ఉదకము నొసగి, "------గోత్రస్య -----భవతా క్షణః కర్తవ్యః"- అని చెప్పి అతని చేతిమీదుగా తిలలతో సహ భుగ్నము నొసగి, "ఓం తథా" - అని అతనిచే చెప్పించుకొని, "ప్రాప్నోతు భవాన్"- అని అతని నభ్యర్థించి, "ప్రాప్నువాని"- అని చెప్పించుకొని, "అలంకారార్థే ఇమే తిలాః/సకలారాధనైః స్వర్చితమ్/"- అని అతని ఎడమపార్శ్వమున కొన్ని తిలలను వేసి పూజింపవలెను.

[342] ఉపవీతియై విష్ణుస్థానమందలి విప్రునికి చేతిలో కూర్చచేత ఉదకము నిచ్చి, "-----గోత్రస్య -----శ్రీమహావిష్ణోరిదం తే ఆసనం"- అని ఆసనార్థం రెండు ఉత్తరాగ్రపు దర్భలను అతని వెనుక వైపున వేసి, మఱల కూర్చచేత ఉదకము నొసగి, "శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణ్వర్థే భవతా క్షణః కర్తవ్యః"- అని అతని కుడిచేతి మీదుగా రెండుదర్భలను శ్వేతాక్షతలతో సహ వదల

*సపిండీకరణశ్రాద్ధే శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణో ఇదం తే ఆసనం"* - ఇత్యాసనార్థం ద్వౌ దర్భౌ దత్వా, పునరపః ప్రదాయ, *"శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణ్వర్థే భవతా క్షణః కర్తవ్యః"* - ఇతి ద్వౌ దర్భౌ దద్యాత్. *"ఓం తథా"* - ఇతి ప్రతివచనమ్. కర్తా: *"ప్రాప్నోతు భవాన్"* - *"ప్రాప్నవాని"* - ఇతి ప్రతివచనమ్. *"అలంకారార్థే ఇమే అక్షతాః/ సకలారాధనైః స్వర్చితమ్/"* - ఇత్యక్షతైరర్చయేత్.

పాద్యస్థానార్చనమ్:[343] అథౌదుమ్బరేణ, అయస్యతిరిక్తేన, అన్యేన వా శంకునా ఉత్తరే చతురశ్రం, మధ్యే త్రికోణం, దక్షిణే మండలం చ త్రీన్ కుణ్డానాయామవిస్తారాన్ కృత్వా, గోమయేనోపలిప్య, కర్తా ఆదిత్యాభిముఖో భూత్వా,

---

వలెను; విష్ణువు *"ఓం తథా"* - అని చెప్పవలెను. అప్పుడు కర్త *"ప్రాప్నోతు భవాన్"* అని పల్కగా, విష్ణువు *"ప్రాప్నవాని"* అని ప్రతివల్కవలెను. తర్వాత కర్త *"అలంకారార్థే ఇమే అక్షతాః/ సకలారాధనైః స్వర్చితమ్/"* - అని శ్వేతాక్షతలను విష్ణువునకు కుడివైపు వేసి అర్చింపవలెను.

[343] ఇనుముతో చేసిన గునపమువంటి పనిముట్లు నుపయోగించకుండా, మేడికొయ్యతోగాని, మఱొకకొయ్యతోగాని (శంకువనగా కొయ్య) ఉత్తరమున చతురస్రము, మధ్యన త్రికోణము, దక్షిణమున వర్తులాకారము గల మూడు కుండములను త్రవ్వి, వానిని ఆవుపేడతో నలికి, వాటి ముందు కర్త సూర్యాభిముఖుడై నిలబడి,

1. ఉపవీతియై *"--- గోత్రస్య --- విశ్వేషాం దేవానాం పాద్యస్థానే ఇదమాసనం"* - అని రెండు ఉత్తరాగ్రపు దర్భల నుత్తరకుణ్డములో నుంచి, *"ఇదమర్చనమ్* - అని కుణ్డములో శ్వేతాక్షతల నుంచి,

2. ప్రాచీనావీతియై *"-----గోత్రస్య -----ప్రపితామహానాం పాద్యస్థానే ఇదమాసనం"* - అని మధ్యమకుణ్డమున దక్షిణాగ్రత్రిదర్భభుగ్నము నుంచి, *"ఇదమర్చనమ్"* - అని తిలలను వేసి,

3. ప్రాచీనావీతితోనే *"----గోత్రస్య ----ప్రేతనిమిత్తస్య పాద్యస్థానే ఇదమాసనం"* - అని దక్షిణ కుణ్డములో ఒకదర్భతో కట్టిన దక్షిణాగ్రభుగ్నమునుంచి, *"ఇదమర్చనమ్"* - అని తిలల నుంచి,

4. చివరకు ఉపవీతియై, *"----- గోత్రస్య ----- శ్రీమహావిష్ణోరిదం తే ఆసనం"* - అని ఉత్తరకుణ్డములో రెండు ఉత్తరాగ్రపు దర్భలనుంచి, *"ఇదమర్చనమ్"* - అని శ్వేతాక్షల నందులో వేయవలెను.

1. ఉపవీతీ, "----గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,---గోత్రాయాః ---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణశ్రాద్ధే క్రతుదక్షసంజ్ఞిక విశ్వేషాం దేవానాం పాద్యస్థానే ఇదమాసనమ్"- ఇత్యుత్తరకుణ్డే దర్భాన్నిధాయ, "ఇదమర్చనమ్"- ఇత్యక్షతైరభ్యర్చ్య,

2. ప్రాచీనావీతీ, "---- గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,-----గోత్రాయాః -----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణశ్రాద్ధే వసురుద్రాదిత్యస్వరూపాణాం పితుః పితృపితామహప్రపితామహానాం (అథవా, పితుర్మాతృపితామహప్రపితామహీనాం) పాద్యస్థానే ఇదమాసనమ్" - ఇతి మధ్యమకుణ్డే భుగ్నన్నిధాయ, "ఇదమర్చనమ్"- ఇతి తిలైరభ్యర్చ్య,

3. ప్రాచీనావీతీ, "----- గోత్రస్య -----శర్మణః పితుః ప్రేత (అథవా, ---- గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతా) నిమిత్తస్య పాద్యస్థానే ఇదమాసనమ్"- ఇతి దక్షిణకుణ్డే ఏకదర్భభుగ్నన్నిధాయ, "ఇదమర్చనమ్"- ఇతి తిలైరభ్యర్చ్య,

4. ఉపవీతీ, "----గోత్రస్య----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ----గోత్రాయాః ---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణశ్రాద్ధే శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణోః పాద్యస్థానే ఇదమాసనమ్"- ఇత్యాసనార్థముత్తరకుణ్డే ద్వౌ దర్భౌ నిధాయ, "ఇదమర్చనమ్"- ఇత్యక్షతైరభ్యర్చ్య,

## విశ్వేదేవానాం పాదప్రక్షాళనమ్

[344]ఉపవీతీ, ఉత్తరకుణ్డే, "-----గోత్రస్య ------శర్మణః పితుః ప్రేతస్య (అథవా,---గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణ

---

[344] కర్త ఉపవీతియై, "--- గోత్రస్య ---విశ్వేదేవాః స్వాగతమ్"- అనుచు ఉత్తరకుణ్డములోనికి విశ్వేదేవుల నాహ్వానించి, వారి పాదముల మీదుగా రెండు దర్భలను ఉత్తరాంతముగా వేయుచు స్వాగతము పల్కవలెను. విశ్వేదేవులు "సుస్వాగతమ్" - అని చెప్పవలెను. తదుపరి "ఇదం వో అర్ఘ్యమ్"అని చెప్పుచు కర్త అక్షతోదకమును వారి దోసిలిలో నుంచగా, వారు "అస్త్వర్ఘ్యమ్" - అని చెప్పవలెను.

ఎలను.

*శ్రాద్ధే క్రతుదక్షసంజ్ఞిక విశ్వేదేవాః స్వాగతమ్"* - ఇతి కర్తా, *"సుస్వాగతమ్"*- ఇతి ప్రతివచనమ్. *"ఇదం వో అర్ఘ్యమ్"*- ఇతి కర్తా, *"అస్త్వర్ఘ్యమ్"*- ఇతి ప్రతివచనమ్. [345]ఇత్యర్ఘ్యం దత్వా, పవిత్రమాదాయ, *"శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునాత్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః"*- ఇతి భోక్తృపాదయోరుపరి అజ్యం విలిప్య,

*"గన్ధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్। ఈశ్వరీగ్ం సర్వ భూతానాం తామిహోపహ్వయే శ్రియమ్"* ఇతి గోమయానులేపనం కృత్వా, *"శం నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే। శంయోరభిస్రవన్తు నః।"* - ఇత్యాజాన్వాజంఘం సాక్షతోదకేన పాదద్వయం ప్రక్షాళ్య, పునః పవిత్రం ధృత్వా,

## *పితుః పితౄణాం పాదప్రక్షాళనమ్*

[346] ప్రాచీనావీతీ మధ్యమకుణ్డే, *"-----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ----గోత్రాయాః ---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణ*

---

[345] తదుపరి కర్త పవిత్రమును తీసి చెవిసందున పెట్టుకొని *"శుక్రమసి జ్యోతిరసి "* అను మంత్రముతో వారి పాదములపై నేతిని రాచి, *"గన్ధద్వారాం దురాధర్షాం ---"* అను మంత్రముతో వారి పాదములపై గోమయమును (లేదా మంచిగంధమును) రుద్ది, *"శం నో దేవీరభిష్టయ--"* - అను మంత్రముతో మోకాటిపర్యంతము పాదములను బాగుగా కడిగి, ఆ జలమును కర్తయు, అతని తమ్ములును తమ తలలపై ప్రోక్షించుకొని, కర్త చెవిసందునందుంచుకొన్న పవిత్రమును తిరిగి ధరింపవలెను. (గమనిక: మిగితా ముగ్గురు భోక్తల పాదప్రక్షాళనమును చేయునప్పుడును ఇవే మంత్రములను, ఇదేపద్ధతిని పాటింపవలెను గాని పితరులకు, ప్రేతకు దీనిని ప్రాచీనావీతితో, తిలోదకములతో చేయవలెను. విష్ణువునకు, విశ్వేదేవులకు ఉపవీతితో, శ్వేతాక్షతోదకముతో చేయవలెను. భోక్తల కాళ్లు కడుగునప్పుడు కర్త పవిత్రమును ధరింపరాదు. అందుచే పవిత్రమును చెవిసందున పెట్టుకొని సూర్యాభిముఖుడై కాళ్లు కడుగి, అటుపైని మరల పవిత్రమును ధరింపవలెను.)

[346] ప్రాచీనావీతియై, *"----గోత్రస్య -----పితృపితామహప్రపితామహాః స్వాగతమ్"*- అనుచు మధ్యమకుణ్డములో పితరులను నిల్పి మూడుదర్భలతో కట్టిన దక్షిణాగ్రపు కూర్చమును దక్షిణాంతముగా వారి పాదముల మీదుగా వేయగా, పితరులు *"సుస్వాగతమ్"*- అని చెప్పవలెను.

*శ్రాద్ధే వసురుద్రాదిత్యస్వరూపాస్మత్పితుః పితృపితామహప్రపితామహాః స్వాగతమ్"* - *"సుస్వాగతమ్* - ఇతి ప్రత్యుక్తిః." *"ఇదం వో అర్ఘ్యమ్"*- ఇతి కర్తా, *"అస్త్వర్ఘ్యమ్"*- ఇతి ప్రతివచనమ్. ఇత్యర్ఘ్యం దత్వా, [347]పవిత్రమాదాయ, *"శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవో వస్సవితోత్పునాత్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః"* - ఇతి భోక్తృపాదయోరుపరి ఆజ్యం విలిప్య, *"గన్ధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్। ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్"* - ఇతి గోమయానులేపనం కృత్వా, *"శం నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే। శంయోరభిస్రవన్తు నః।"* - ఇత్యాజాన్వాజంఘం తిలోదకేన పాదద్వయం ప్రక్షాళ్య, పునః పవిత్రం ధృత్వా,

## *నిమిత్తస్య పాదప్రక్షాళనమ్*

[348]ప్రాచీనావీతీ, *"----గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,----గోత్రాయాః ---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణశ్రాద్ధే పితుః*

---

తదుపరి *"ఇదం వో అర్ఘ్యమ్"*అని చెప్పుచు కర్త తిలోదకమును వారి దోసిలిలో నుంచగా, వారు *"అస్త్వర్ఘ్యమ్"*- అని చెప్పవలెను.

[347] తదుపరి కర్త తన చేతి పవిత్రమును తీసి చెవిసందునపెట్టుకొని, *"శుక్రమసి--"*- అను మంత్రముతో పితరుల పాదములపై నేతిని రాచి, *"గన్ధద్వారాం దురాధర్షాం ----"* అను మంత్రముతో వారి పాదములపై గోమయమును (లేదా మంచిగంధమును) రుద్ది, *"శం నో దేవీరభిష్టయ--"* - అనుమంత్రముతో మోకాటిపర్యంతము పాదములను బాగుగా కడిగి, ఆ జలమును కర్తయు, అతని తమ్ములును తమ శిరములపై ప్రోక్షించుకొని, కర్త చెవిసందునందుంచుకొన్న పవిత్రమును తిరిగి ధరింపవలెను.

[348] ప్రాచీనావీతియై, *"-----గోత్రస్య -----నిమిత్తప్రేత స్వాగతం"* - అని ప్రేతనిమిత్తుని దక్షిణకుణ్డములో నిల్పి, ఒక దర్భతో కట్టిన దక్షిణాగ్రపు కుగ్నము నతని పాదముల మీదుగా దక్షిణాంతముగా వేయవలెను. *"సుస్వాగతమ్"*- అని అతడు ప్రతివక్క్యవలెను. తదుపరి *"ఇదమర్ఘ్యమ్"*అని చెప్పుచు కర్త తిలోదకమును అతని దోసిలిలో నుంచగా, అతడు *"అస్త్వర్ఘ్యమ్"*- అని చెప్పవలెను.

(మాతుః) నిమిత్తప్రేత (నిమిత్తప్రేతే) స్వాగతమ్"- ఇతి దక్షిణకుణ్డే ప్రేతం (ప్రేతాం) స్వాగతం కుర్యాత్. "సుస్వాగతమ్" - ఇతి ప్రతివచనమ్. "ఇదమర్ఘ్యమ్" - ఇతి కర్తా, "అస్త్వర్ఘ్యమ్"- ఇతి ప్రతివచనమ్. ఇత్యర్ఘ్యం దత్వా, పవిత్రమాదాయ, "శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునాత్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః"- ఇతి భోక్తృపాదయోరుపరి ఆజ్యం విలిప్య, "గన్ధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్। ఈశ్వరీగ్ం సర్వ భూతానాం తామిహోపహ్వయే శ్రియమ్"- ఇతి గోమయానులేపనం కృత్వా, "శం నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే। శంయోరభిస్రవన్తు నః।"-[349] ఇత్యాజాన్వాజంఘం తిలోదకేన పాదద్వయం ప్రక్షాళ్య, పునః పవిత్రం ధృత్వా,

## విష్ణోః పాదప్రక్షాళనమ్

[350] ఉపవీతీ, "------గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ----- గోత్రాయాః ---- నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణశ్రాద్ధే శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణో స్వాగతమ్"- ఇత్యుత్తరకుణ్డే విష్ణవే స్వాగతం కుర్యాత్. "సుస్వాగతమ్"- ఇతి ప్రతివచనమ్. "ఇదమర్ఘ్యమ్"- ఇతి కర్తా, "అస్త్వర్ఘ్యమ్"- ఇతి ప్రతివచనమ్. ఇత్యర్ఘ్యం

---

[349] తదుపరి కర్త తన చేతి పవిత్రమును తీసి చెవిసందున పెట్టుకొని, "శుక్రమసి--"- అను మంత్రముతో ప్రేతస్థానిమిత్తుని పాదములపై నేతిని రాచి, "గన్ధద్వారాం దురాధర్షాం ---" అను మంత్రముతో అతని పాదములపై గోమయమును (లేదా మంచిగంధమును) రుద్ది, "శం నో దేవీ రభిష్టయ"- అనుమంత్రముతో మోకాటిపర్యంతము పాదములను తిలోదకములతో బాగుగా కడిగి, ఆ జలమును కర్తయు, అతని తమ్ములును తమ శిరములపై చల్లుకొని, కర్త చెవిసందు నందుంచుకొన్న పవిత్రమును తిరిగి ధరింపవలెను.

[350] ఉపవీతియై, "--- గోత్రస్య --- శ్రీమహావిష్ణో స్వాగతమ్"- అని ఉత్తరకుణ్డములో విష్ణుస్థాన నిమంత్రితుని నిల్చి, రెండు ఉత్తరాగ్రపు దర్భల నతని పాదముల మీదుగా ఉత్తరాంతముగా వేయగా నతడు "సుస్వాగతమ్"- అని చెప్పవలెను. తరువాత "ఇదమర్ఘ్యమ్"అని చెప్పుచు కర్త అక్షతోదకము నతని దోసిలిలో నుంచగా, అతడు "అస్త్వర్ఘ్యమ్"- అని చెప్పవలెను.

దత్వా, [351]పవిత్రమాదాయ, *"శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవోవస్సవితోత్పునాత్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసో స్సూర్యస్య రశ్మిభిః"* - ఇతి భోక్తృపాదయోరుపరి ఆజ్యం విలిప్య, *"గన్ధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్। ఈశ్వరీగ్ం సర్వ భూతానాం తామిహోపహ్వయే శ్రియమ్"*- ఇతి గోమయానులేపనం కృత్వా, *"శం నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే। శంయోరభిస్రవన్తు నః।"*- ఇత్యాజాన్వాజంఘం అక్షతోదకేన పాద ద్వయం ప్రక్షాళ్య, స్వస్య చ పాదౌ ప్రక్షాళ్య, పవిత్రం నిరస్య, అన్యపవిత్రం ధృత్వా, ఆచమ్య, ఆచాన్తాన్ బ్రాహ్మణాన్ ఆసనేషూపవిశ్య కృసరదానం కుర్యాత్.

[352] *కృసరదానమ్:* ఉపవీతి, *"----గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,---- గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణ శ్రాద్ధే క్రతుదక్షసంజ్ఞకవిశ్వేదేవాః అంతశ్శుద్ధ్యర్థమయం వః కృసరః"*- ఇతి కృసరదానం కృత్వా, *"అన్య శుద్ధ్యర్థమిదం వస్త్రామ్బూలమ్"*- ఇతి తామ్బూలం దత్వా, *"శరీరశుద్ధ్యర్థ*

---

[351] తదుపరి కర్త తన చేతి పవిత్రమును తీసి చెవిసందునపెట్టుకొని, *"శుక్రమసి--"*- అను మంత్రముతో విష్ణుస్థానవిమంత్రితుని పాదములపై నేతిని రాచి, *"గన్ధద్వారాం దురాధర్షాం ---"* - అను మంత్రముతో అతని పాదములపై గోమయమును (లేదా మంచిగంధమును) రుద్ది, *"శం నో దేవీ రభిష్టయ"*- అనుమంత్రముతో మోకాటిపర్యంతము అక్షతోదకములతో పాదములను బాగుగ కడిగి, ఆ జలమును కర్తయు, అతని తమ్ములును తమ శిరములపై ప్రోక్షించుకొనవలెను. ఆపైని కర్తయు, అతని తమ్ములును తమ పాదములను కడిగికొని, చెవిసందునందుంచుకొన్న పవిత్రమును విప్పి పడవేసి, అన్యపవిత్రములను ధరించి,కుండముల కుత్తరమున ఆచమనము చేసి, బ్రాహ్మణులచే సైత మాచమనము చేయించి, ఇంటిలోనికి వచ్చి, బ్రాహ్మణుల నాసనములపై నాసీనుల జేసి, వారికి కృసరదానములను చేయవలెను.

[352] కర్త ఉపవీతియై విశ్వేదేవుల ముందు కూర్చుండి, *"---గోత్రస్య ---విశ్వేదేవాః అంతశ్శుద్ధ్యర్థమయం వః కృసరః"*- అని బెల్లము-నువ్వుల ఉండను, *"అన్య శుద్ధ్యర్థమిదం వస్త్రామ్బూలమ్"*- అని తామ్బూలమును, *"శరీరశుద్ధ్యర్థమిదం స్నానీయచూర్ణమ్"*- అని నలుగుపిండిని (తెల్ల బియ్యపు పిండిని) విశ్వేదేవుల కొసగి, *"ఇదం వో అభ్యంజనమ్"*- అని దర్భతో గిన్నెనుండి నూనెను తీసికొని వారి తలపై నుంచవలెను.

*మిదం స్నానీయమూర్ణమ్"* - ఇతి స్నానీయమూర్ణం దత్వా, *"ఇదం వో అభ్యంజనమ్"* - ఇత్యభ్యజ్య,

[353] ప్రాచీనావీతీ, *"---గోత్రస్య ---శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ----గోత్రాయాః ---- నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణశ్రాద్ధే వసురుద్రాదిత్యస్వరూప పితుః పితృపితామహప్రపితామహానాం (అథవా, పితుర్మాతృపితామహీప్రపితామహీనాం) అంతశ్శుద్ధ్యర్థమయం వః కృసరః"* - ఇతి కృసరం దత్వా, *"అన్యశుద్ధ్యర్థమిదం వస్త్రామ్బూలమ్"* - ఇతి తామ్బూలం దత్వా, *"శరీరశుద్ధ్యర్థమిదం స్నానీయమూర్ణమ్"*-ఇతి స్నానీయమూర్ణం దత్వా, *ఇదం వో అభ్యంజనమ్"*-ఇత్యభ్యజ్య,

[354] ప్రాచీనావీతీ, *"-------గోత్రస్య -------శర్మణః పితుః ప్రేతస్య (అథవా,------ గోత్రాయాః -----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణ శ్రాద్ధే పితుః (మాతుః) నిమిత్తస్య అంతశ్శుద్ధ్యర్థమయం తే కృసరః"* - ఇతి కృసరం దత్వా, *"అన్యశుద్ధ్యర్థమిదం తే తామ్బూలమ్"*- ఇతి తామ్బూలం దత్వా, *"శరీరశుద్ధ్యర్థమిదం స్నానీయమూర్ణమ్"* - ఇతి స్నానీయమూర్ణం దత్వా, *"ఇదం తే అభ్యంజనమ్"* - ఇత్యభ్యజ్య,

---

[353] తరువాత ప్రాచీనావీతియై పితృస్థాననిమంత్రితుని ముందు కూర్చుండి, *"-----గోత్రస్య---- అంతశ్శుద్ధ్యర్థమయం వః కృసరః"* - అని బెల్లము-నువ్వుల ఉండను, *"అన్యశుద్ధ్యర్థమిదం వస్త్రామ్బూలమ్"* - అని తామ్బూలమును, *"శరీరశుద్ధ్యర్థమిదం స్నానీయమూర్ణమ్"* - అని నలుగుపిండిని (తెల్లబియ్యపు పిండిని) పితృస్థానభోక్త కొసగి, *"ఇదం వో అభ్యంజనమ్"* - అని దర్భతో గిన్నెనుండి నూనెను తీసికొని అతని తలపై నలంది,

[354] ప్రాచీనావీతితోనే ఉండి ప్రేతస్థాననిమంత్రితుని ముందు కూర్చుండి, *"----గోత్రస్య --- అంతశ్శుద్ధ్యర్థమయం తే కృసరః"* - అని బెల్లము-నువ్వుల ఉండను, *"అన్యశుద్ధ్యర్థం ఇదం తే తామ్బూలమ్"* - అని తామ్బూలమును, *"శరీరశుద్ధ్యర్థమిదం స్నానీయమూర్ణమ్"* - అని నలుగుపిండిని (తెల్లబియ్యపు పిండిని) ప్రేతకొసగి, *"ఇదం తే అభ్యంజనమ్"* - అని దర్భతో గిన్నెనుండి నూనెను తీసికొని అతని తలపై నుంచి,

[355]ఉపవీతీ, *"-----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,-----గోత్రాయాః ----- నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని సపిండీకరణశ్రాద్ధే శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణో అంతశ్శుద్ధ్యర్థమయం తే కృసరః"* - ఇతి కృసరం దత్వా, *"అన్యశుద్ధ్యర్థం ఇదం తే తామ్బూలమ్"* - ఇతి తామ్బూలం దత్వా, *"శరీరశుద్ధ్యర్థమిదం స్నానీయమూర్ణమ్"* - ఇతి స్నానీయచూర్ణం దత్వా, *"ఇదం తే అభ్యంజనమ్"* - ఇత్యభ్యజ్య, *"స్వామినః స్నాత్వా శీఘ్రమాగచ్ఛధ్వమ్* - ఇతి బ్రాహ్మణాన్ ప్రార్థయేత్.

[356] అనంతరం కర్తా స్నాత్వా, ఊర్ధ్వపుండ్రాదికం ధృత్వా, శాకపాకాదిపచనానన్తరం కేనచిత్ శ్రోత్రియేణ తిరువారాధనం కారయిత్వా, పాదౌ ప్రక్షాళ్య, ఆచమ్య, విష్వక్సేనపూజాపూర్వకం విచ్ఛిన్నాగ్నిసంధానం ఔపాసనం చ కృత్వా, తేనైవాగ్నేః సపిండీకరణహోమం కుర్యాత్.

---

[355] తరువాత ఉపవీతియై విష్ణుస్థానభోక్త ముందు కూర్చుండి, *"--- గోత్రస్య ---శ్రీమహావిష్ణో అంతశ్శుద్ధ్యర్థమయం తే కృసరః"* - అని బెల్లము-నువ్వుల ఉండను, *"అన్యశుద్ధ్యర్థం ఇదం తే తామ్బూలమ్"* - అని తామ్బూలమును, *"శరీరశుద్ధ్యర్థమిదం స్నానీయమూర్ణమ్"* - అని నలుగుపిండివి (పెల్లబియ్యపు పిండివి) విష్ణువున కొసగి, *"ఇదం తే అభ్యంజనమ్"* - అని దర్భతో గిన్నెలోని నూనెను అతని తలపై నుంచి, *"స్వామినః స్నాత్వా శీఘ్రమాగచ్ఛధ్వమ్"*- అని బ్రాహ్మణులను త్వరగా అభ్యంగనస్నానము చేసి రమ్మని ప్రార్థింపవలెను.

[356] వంట కొంతవఱకైన తర్వాత కర్తలు స్నానము చేసి, మడిబట్టలను కట్టుకొని, ఊర్ధ్వపుండ్రాదులను ధరింపవలెను. వంటపూర్తియైన పిదప, ఆశౌచరహితుడైన ఒక శ్రోత్రియునిచే భగవదారాధనము చేయించి, అది జరుగుచుండగనే కర్త కాళ్లు కడిగికొని, ఆచమించి, విష్వక్సేనారాధనాపూర్వకముగా విచ్ఛిన్నాగ్నిసంధానమును చేసి, ఆ యగ్నియందే సపిండీకరణహోమమును చేయవలెను (సూచనలు: 1. కర్త బ్రహ్మచారియైనచో, విష్వక్సేనారాధనమును, విచ్ఛిన్నాగ్నిసంధానమును చేయనక్కఱ లేదు. వేఱుగా అగ్నిముఖమును (చతుష్పాత్రప్రయోగమును) చేయవలెను. 2. సపిండీకరణపాకమును ముత్తైదువలు మొదలుపెట్టరాదు. ముందుగా పురుషులుగావి, లేక వితంతువులు గావి పాకమును ఆరంభించిన తరువాత, ముత్తైదువలు దానిని పూర్తి చేయవచ్చును.)

# విచ్ఛిన్నౌపాసనాగ్నిసంధానమ్

[357]అథ కర్తా పాణిపాదౌ ప్రక్షాళ్య, ఆచమ్య, భార్యయా సహ గోమయేనోపలిప్తం రంగవల్ల్యాద్యలంకృతంశుచిప్రదేశం ప్రాప్య,దక్షిణాతాంబూలసహితం హరిద్రాక్షతాం చ గృహీత్వా *"ఓం నమస్సదసే నమస్సదసస్పతయే నమస్సఖీనాం పురోగాణాం చక్షుషే నమో దివే నమః పృథివ్యై/ సప్రథ సభాం మే గోపాయ/ యే చ సభ్యాస్సభాసదః/ తానిన్ద్రియావతః కురు/ సర్వమాయురుపాసతామ్/ సర్వేభ్యశ్శ్రీవైష్ణవేభ్యో నమః/"* - ఇతి ప్రణమ్య,

*"అశేషే హే పరిషత్ -భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య ----గోత్రస్య ---శర్మణః పితుః (అథవా,---గోత్రాయాః ----నామ్న్యాః మాతుః) సపిండీకరణశ్రాద్ధే అద్య ద్వాదశేఽహని, విచ్ఛిన్నౌపాసనాగ్నిసన్ధానం కర్తుం యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ* - ఇతి ప్రార్థ్య, *"తథాస్తు", "యోగ్యతాసిద్ధిరస్తు"* - ఇత్యనుజ్ఞాప్య, దర్భేష్వాసీనః, దర్భాన్ ధారయమాణః, పవిత్రపాణిః ద్విః ప్రాణానాయమ్య ,

*సంకల్పః: "అస్యాం తిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం----గోత్రస్య ----శర్మణః పితుః (అథవా,----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః) సపిండీకరణశ్రాద్ధే అద్య ద్వాదశేఽహని విచ్ఛిన్నౌపాసనాగ్నిసన్ధానం కరిష్యే/ తదంగమాదౌ విష్వక్సేనారాధనం కరిష్యే/"*- ఇతి సంకల్ప్య

---

357. కర్త కాలుసేతులను కడిగికొని, ఆచమించి, భార్యతో సహ గోమయముతో నలుకబడి, ముగ్గులచే నలంకృతమైన శుచియైన ప్రదేశమును ప్రవేశించి, ఒకతట్టలో పసుపు అక్షతలను, తాంబూలమును పెట్టుకొని నిలుచుండి, *"ఓం నమస్సదసే----శ్శ్రీవైష్ణవేభ్యో నమః/"* వఱకు చెప్పి పరిషత్తుకు ప్రణమించి, *"అశేషే హే పరిషత్ -----అనుగ్రహాణ"* - పర్యంతము చెప్పి, *"తథాస్తు/ యోగ్యతాసిద్ధిరస్తు"* - అని పరిషదనుజ్ఞను పొంది, దర్భలపై కూర్చొని, రెండు దర్భలతో కట్టిన పవిత్రమును ధరించి, *"అస్యాం తిథౌ-----విష్వక్సేనారాధనం కరిష్యే "*- అని సంకల్పించి మొదట విష్వక్సేనారాధనము చేయవలెను.

## విష్వక్సేనారాధనమ్:

*"శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్/*
*ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వవిఘ్నోపశాన్తయే//*
*యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్/*
*విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే//*
*దివ్యాకారం సరోజాక్షం శంఖచక్రగదాధరమ్/*
*ముకున్దద్వారనిలయం విష్వక్సేనముపాస్మహే//*
*ఓం భూః విష్వక్సేనమావాహయామి/*
*ఓం భువః విష్వక్సేనమావాహయామి/*
*ఓగ్ం సువః విష్వక్సేనమావాహయామి " -*

*శ్రీమతే విష్వక్సేనాయ నమః ధ్యాయామి/ ఆవాహయామి/*[358] ఇత్యక్షతాదిభిరావాహ్య, [359] *ఆసనం సమర్పయామి/ పాదయోః పాద్యం సమర్పయామి/ హస్తయోరర్ఘ్యం*

---

[358] విష్వక్సేనారాధనకై (వెండి) పళ్లెరమందు బియ్యమును పోసి, అందులో 'శ్రీ' అని వ్రాసి, దానిపై పూర్వాగ్రముగా నొక తమలపాకు నుంచి, ఆ తమలపాకుపై రెండు దర్భలతో కట్టిన ఆయామతము నుంచి, *"శుక్లాంబరధరం--"* నుండి *"ధ్యాయామి! ఆవాహయామి/"* - వఱకు చెప్పి ఆ పవిత్రముపై అక్షతలను వేసి విష్వక్సేనుని ఆవాహనము చేసి,

[359] *"ఆసనం సమర్పయామి"* - అని రెండు పూర్వాగ్రపు దర్భల నా ఆయామతముపై వేసి, *"పాదయోః పాద్యం సమర్పయామి--ఆచమనీయం సమర్పయామి/"* - అని చెప్పుచు అర్ఘ్య, పాద్య, ఆచమనీయములకై (16 దర్భలతో కట్టిన) కూర్చతో ఉదకమును ప్రోక్షించి, *"ఔపచారికస్నానం సమర్పయామి/ ఆపో హిష్ఠా మయో భువః---స్నాపయామి/"* వఱకు చెప్పుచు స్నానార్థము కూర్చతో జలమును ప్రోక్షించి, *"స్నానానంతరమాచమనీయం సమర్పయామి"* - అని చెప్పుచు స్నానము తర్వాత ఆచమనమునకై మఱల కూర్చతో ఉదకము నొసగి, *"వస్త్రం సమర్పయామి"* - అని వస్త్రార్థం అక్షతలను వేసి, *"ఉపవీతం సమర్పయామి"* - అని యజ్ఞోపవీతార్థం అక్షతలను వేసి, *"గన్ధం సమర్పయామి"* - అని గంధము నుంచి, *"పుష్పం సమర్పయామి"* - అని పుష్పముల నుంచి, *"ధూపం సమర్పయామి"* - అని ధూప

సమర్పయామి/ ఆచమనీయం సమర్పయామి/ ఔపచారికస్నానం సమర్పయామి/ *"ఆపో హిష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన/ మహే రణాయ చక్షసే/ యో వశ్శివ తమో రసః/ తస్య భాజయతేహ నః/ ఉశతీరివ మాతరః/ తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ/ ఆపో జనయథా చ నః/"* - స్నాపయామి/ స్నానానంతర మాచమనీయం సమర్పయామి/ వస్త్రం సమర్పయామి/ ఉపవీతం సమర్పయామి/ గన్ధం సమర్పయామి/ పుష్పం సమర్పయామి/ ధూపం సమర్పయామి/ దీపం దర్శ యామి/ ఏతే గన్ధాక్షతపుష్ప ధూపదీపోత్తరీయాభరణాద్యలఙ్కారాన్సర్వోపచారాః - ఇత్యభ్యర్చ్య, [360]నైవేద్యం - *"ఓం భూర్భువస్సువః/"* - ఇతి గుడం ప్రోక్ష్య - *"దేవసవితః ప్రసువ"* - ఇతి పరిషిచ్య, *"ఓం ప్రాణాయ స్వాహా/ ఓం అపానాయ స్వాహా/ ఓం వ్యానాయ స్వాహా/ ఓం ఉదానాయ స్వాహా/ ఓం సమానాయ స్వాహా/ ఓం బ్రహ్మణే*

---

మును ముట్టూరా త్రిప్పి, *"దీపం దర్శయామి"* - అని దీపమును చూపెట్టి, *"ఏతే గన్ధాక్షతపుష్ప ధూపదీపోత్తరీయాభరణాద్యలఙ్కారాన్సర్వోపచారాః"* - అని అక్షతలను వేసి,

[360] నైవేద్యమునకై ఒక బెల్లము ముక్కనుంచి, దానిని *"ఓం భూర్భువస్సువః/"* - అని ప్రోక్షించి, *"దేవసవితః ప్రసువ"* - అని ప్రదక్షిణముగా పరిషేచనము చేసి, *"ఓం ప్రాణాయ స్వాహా------ ఓం బ్రహ్మణే స్వాహా/"* అని ప్రాణాహుతులను పలికి ఆ బెల్లమును నివేదన చేసి, *"మధ్యేమధ్యే పానీయం సమర్పయామి/"* - అనుచు కూర్చతో ఉదకమునొసగి, *"అమృతాపిధానమసి"* - అని కూర్చోదకముతో ఉత్తరాపోశనము నొసగి, *"హస్తౌ ప్రక్షాళయామి/ పాదౌ ప్రక్షాళయామి/"* - అనుచు హస్త, పాదోదకములకై కూర్చతో జలము నొసగి, *"తామ్బూలం సమర్పయామి/"* - అని తామ్బూలము నొసగి, *"సువర్ణమన్త్రపుష్పం సమర్పయామి/"* - అని అక్షతలను వేసి, *"అనయా పూజయా శ్రీవిష్వక్సేనభగవాన్ సుప్రీతో వరదో భూత్వా ఉత్తరే కర్మణ్యవిఘ్న మస్త్వితి భవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు/"* - అని ప్రార్థించి, *"ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు/ "* - అని పరిషత్తుచే చెప్పించుకొని, *"విష్వక్సేనప్రసాదం శిరసా గృహ్ణామి"* - అని విష్వక్సేనునకు సమర్పించిన పూవులలో నొకటి తలలో పెట్టుకొని, *"యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాః-----యత్ర పూర్వే సాధ్యాస్సన్తి దేవాః/ - విష్వక్సేనం యథాస్థాన ముద్వాసయామి శోభనార్థం పునరాగ నాయ చ/"* - అని చెప్పుచు ఆయామతమును కొంచెము కదలించి, నమస్కరించి, విష్వక్సేనుని ఉద్వాసన చేయవలెను.

*స్వాహా॥ మధ్యే మధ్యే పానీయం సమర్పయామి।"*- ఇతి నివేద్య, "*అమృతాపిధాన మసి" - ఇత్యుత్తరాపోశనం దత్వా,"హస్తౌ ప్రక్షాళయామి। పాదౌ ప్రక్షాళయామి। తామ్బూలం సమర్పయామి। సువర్ణమన్త్రపుష్పం సమర్పయామి। అనయా పూజయా శ్రీ విష్వక్సేనభగవాన్ సుప్రీతో వరదో భూత్వా ఉత్తరే కర్మణ్యవిఘ్న మస్త్వితి భవంతో మహాంతో౽ను గృహ్ణన్తు। ఉత్తరే కర్మణ్యవిఘ్నమస్తు। విష్వక్సేన ప్రసాదం శిరసా గృహ్ణామి। యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాః। తాని ధర్మాణి ప్రథమాన్యాసన్। తే హ నాకం మహిమానస్సచన్తే। యత్ర పూర్వే సాధ్యాస్సన్తి దేవాః। విష్వక్సేనం యథాస్థానముద్వాసయామి శోభనార్థం పునరాగమనాయ చ।"* - [361]ఇతి విష్వక్సేనపూజాం కృత్వా, పునః ప్రాణానాయమ్య, "*పూర్వోక్త ఏవం గుణవిశిష్టాయా మస్యాం తిథౌ శ్రీభగవదాజ్ఞయా భగవత్కైఙ్కర్యరూపం అనయా మమ ధర్మపత్న్యా సహ విచ్ఛిన్నోపాసనాగ్ని సన్ధానం కరిష్యే। తదంగమగ్నిప్రతిష్ఠాపనం కరిష్యే।"* - ఇతి సంకల్ప్య,

***అగ్నిముఖమ్ (చతుష్పాత్రప్రయోగః):*** [362]స్థండిలం కల్పయిత్వా, (తణ్డుల మార్జం వికీర్య), ప్రాచీః పూర్వముదక్సంస్థం దక్షిణారంభ మాలిఖేత్. అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభ మాలిఖేత్.

---

[361] ఇట్లు విష్వక్సేనారాధనము చేసి, మరల ప్రాణాయామము చేసి,"*పూర్వోక్త ఏవం గుణ విశిష్టాయామస్యాం తిథౌ----విచ్ఛిన్నోపాసనాగ్ని సన్ధానం కరిష్యే। తదంగమగ్నిప్రతిష్ఠాపనం కరిష్యే।*" - అని సంకల్పించి, అగ్నిముఖమును (చతుష్పాత్రప్రయోగమును) చేయవలెను.

[362] అగ్నిప్రతిష్ఠాపనకై చతురశ్రవేదికను (స్థండిలమును) కల్పించి, దానిపై బియ్యపుపిండిని నెఱపి, పసుపు అక్షతలను చల్లి, రెండుదర్భలను నగమునకు మడచి పట్టుకొని వానితో ఆ వేదికపై పడమటినుండి మొదలిడి తూర్పున కంతమగునట్లు వేదియొక్క దక్షిణార్ధమునందును మధ్యను, ఉత్తరార్ధమునందును వరుసగా మూడురేఖలను గీచి, అట్లే దక్షిణమునుండి మొదలిడి ఉత్తరమున కంతమగునట్లు మూడురేఖలను వేదియొక్క పశ్చిమార్ధమందును, మధ్యను, పూర్వార్ధములందును వరుసగా గీచి, ఆ దర్భలను వేదిపై నుంచి,

[363]అవాక్కరోభ్యుక్ష్య, తృణం నైఋత్యాం నిరస్య, అప ఉపస్పృశ్య, "ఓం భూర్భువస్సువరోమ్"- ఇతి లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య, ఉత్సృజ్యతేఽభ్యుక్షణతోయ శేషమ్. ప్రాక్తోయ మన్యం విదధాయ, అగ్నిమిధ్వా, ప్రజ్వాల్య, పరిసమూహ్య, *"అగ్నయే నమః", "జాతవేదసే నమః", "సహోజసే నమః", "అజిరాప్రభవే నమః", "వైశ్వానరాయ నమః", "నర్యాపసే నమః", "పఙ్క్తిరాధసే నమః", "విసర్పిణే నమః"* - ఇత్యక్షతైః ప్రదక్షిణమలంకృత్య, *"శ్రీయజ్ఞ పురుషాయ నమః"*- [364]ఇత్యక్షతైస్సంపూజ్య,

[365]ప్రాగగ్రైః దర్భైః ప్రాగాదిక్రమేణ ప్రదక్షిణం పరిస్తీర్య, దక్షిణానుత్తరాన్, ఉత్తరానధరాన్ కృత్వా, [366]ఉత్తరేణాగ్నిం ప్రాగగ్రాన్ దర్భాన్ సంస్తీర్య, తత్ర దర్వీం, ఆజ్యస్థాలీం, ప్రోక్షణీం, ఇతరదర్వీంచ ద్వంద్వం న్యఞ్చిపాత్రాణి పశ్చిమారంభాత్ సాదయిత్వా,

---

[363] అభ్యుక్షణతోయపాత్రలో కొంచము నీటిని పోసికొని, దానిచే స్థండిలమును ప్రోక్షించి, దర్భలను వేదిపైనుండి తీసి నైఋతికి పడవేసి, నీరు ముట్టి, స్థండిలముపై *"ఓం భూర్భువస్సువరోమ్"* అని లౌకికాగ్నిని ప్రతిష్ఠించి, అభ్యుక్షణతోయపాత్రలోని నీటిని తల్లి, మణిల వేరే నీటి నందులో పోసి, ఆ పాత్రను అగ్నికి తూర్పువైపున (ముందు వేయబోవు పరిస్తరణల కవతల)ఉంచవలెను.

[364] అగ్నిని ప్రజ్వలింపజేసి, తడిచేతితో అగ్నిచుట్టును ప్రదక్షిణముగా స్పృశించి (ఇదియే పరిసమూహనము), *"అగ్నయే నమః---విసర్పిణే నమః"*- అను 8 మంత్రములతో తూర్పునుండి మొదలిడి 8 దిక్కులందును ప్రదక్షిణముగా అగ్నిచుట్టును హరిద్రాక్షతల నుంచి, *"శ్రీయజ్ఞపురుషాయ నమః"* - అని అగ్నిపై అక్షతలను వేసి అర్చించి,

[365] అగ్ని చుట్టును నలువైపులా ప్రదక్షిణముగా పదహారేసి దర్భలుగల పరిస్తరణల నుంచవలెను. అనగా అగ్నికి చుట్టును తూర్పు, పడమరలయందు వేసిన పరిస్తరణలు ఉత్తరాగ్రముగను, ఉత్తరదక్షిణములందు వేసిన పరిస్తరణలు పూర్వాగ్రములుగను ఉండునట్లు వేసి, దక్షిణమందు వేసిన వానిని తూర్పు, పడమరలయందు వేసిన వాటి మొదళ్ళపైకుండునట్లు సవరింపవలెను. అట్లే ఉత్తరమందు వేసిన వాటిని తూర్పు, పడమరలందు వేసిన పరిస్తరణల కొనల క్రింద నుండునట్లు సవరింపవలెను.

[366]అగ్నికి ఉత్తరమున పరిస్తరణల కవతల పూర్వాగ్రములుగా 12 గాని, లేదా సరిసంఖ్యలో నున్న దర్భలను గాని పరచి, ఆ దర్భలపై పడమటినుండి తూర్పునకు వరుసగా దర్విని అజ్యస్థాలిని, ప్రోక్షణీపాత్రను, ఇతరదర్విని జంటజంటగా పట్టుకొని బోర్లించి ఉంచవలెను.

[496]ఇతి సవ్యేన పాత్రమాలభ్య, దక్షిణేన విప్రహస్తం గృహీత్వా సర్వమన్నం స్పర్శయిత్వా,

*"ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్/ సమూఢమస్య పాగ్ంసురే/ పితుః ప్రేత (అథవా, మాతుః ప్రేతే) అన్నం రక్షస్వ/"* - ఇత్యాజ్యసహితద్విజాఙ్గుష్ఠనఖప్రదేశమన్నే ప్రవేశ్య, బ్రాహ్మణస్య వామాఙ్గుష్ఠతర్జనీమధ్యమాభిః పాత్రం స్పర్శయిత్వా,[497] *"----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,------గోత్రాయాః------నామ్న్యాః మాతుః ప్రేతాయాః) సపిండీకరణశ్రాద్ధే -----గోత్ర ----శర్మన్ పితః ప్రేత (అథవా, ---గోత్రా ----నామ్నిం మాతః ప్రేతే) ఏతత్తే అన్నం సవ్యంజనం సపరికరం చ బ్రాహ్మణస్త్వాహవనీయార్థే తత్పర్వం గయేయం భూర్గదాధరో భోక్తా, అన్నం చ బ్రహ్మ, అహం చ బ్రహ్మ, భోక్తా చ బ్రహ్మ, రజతమయం పాత్రం, అక్షయవటచ్ఛాయేయం నిమిత్తాయ ఇదమిదమిదమన్న మమృతస్వరూపం అతృప్తేర్దత్తం దాస్యమానం చ స్వధా నమమ//"*

- ఇత్యుక్త్వా భోక్తృహస్తం విసృజ్య,

[498]*"గయాయా మక్షయవటచ్ఛాయాయాం-----గోత్రాయ-----శర్మణే పిత్రే ప్రేతాయ (అథవా,------నామ్న్యై మాత్రే ప్రేతాయై) ఇదమిదమిదమన్నం సవ్యంజనం సపరికరం తిలోదకముపతిష్ఠతు//"*-ఇతి పాత్రమూలే తిలోదకముత్సృజేత్.

---

496 కర్త తన ఎడమచేతి కనిష్ఠమధ్యమాంగుష్ఠములతో భోజనపాత్రాగ్రమును పట్టుకొని, *"పృథివీ తే పాత్రం ---అముత్రాముష్మిన్ లోకే"*- అని చెప్పుచు తన కుడిచేత ద్విజుని దోర్లించిన కుడిచేతి నాల్గు వ్రేళ్లను గ్రహించి ఆ చేతిచే అన్నాదికమును స్పృశింపజేసి, ద్విజుని అంగుష్ఠాగ్రమును నేతిలో నద్ది, *"ఇదం విష్ణుర్విచక్రమే--- అన్నం రక్షస్వ"*- అని చెప్పుచు అన్నమధ్యమున ఆ అంగుష్ఠాగ్రమును ప్రవేశపెట్టి, ద్విజుని ఎడమచేతి తర్జనీమధ్యమాంగుష్ఠములతో భోజనపాత్రాగ్రమును (అకును) పట్టించి,

497 ద్విజుని చేతి నట్లే పట్టుకొని, *"---గోత్రస్య ---శర్మణః పితుః ప్రేతస్య --- స్వధా/ కవ్యం నమః/ నమమ/"*- వఱకు చెప్పి, ద్విజుని హస్తమును విడిచి,

498 *"గయాయామక్షయవటచ్ఛాయాయాం---తిలోదకముపతిష్ఠతు"* - అని చెప్పి తిలోదకమును భోజనపాత్రమూలమున పితృతీర్థముతో విడువవలెను,

*విష్ణోః పురతః-* [499]తతః కర్తా ఉపవీతీ, దక్షిణం జాన్వాచ్య, సవ్యపాదం భూమౌ నిధాయ, *"ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్।"* – ఇత్యన్నం ప్రోక్ష్య, *"దేవసవితః ప్రసువ"* - ఇత్యన్నం ప్రదక్షిణం పరిషిచ్య, హస్తే శుద్ధోదకం ప్రదాయ,

[500]*"పృథివీ తే పాత్రం ద్యౌరపిధానం బ్రహ్మణస్త్వా ముఖే జుహోమి బ్రాహ్మణానాం త్వా ప్రాణాపానయోర్జుహోమ్యక్షితమసి మైషాం క్షేష్ఠా అముత్రాముష్మిన్ లోకే।"* - ఇతి సవ్యేన పాత్రమాలభ్య, దక్షిణేన విప్రహస్తం గృహీత్వా సర్వమన్నం స్పర్శయిత్వా, *"ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్। సమూఢమస్య పాంసురే। స్వాహా విష్ణో అన్నం రక్షస్వ।"* - ఇత్యన్నే ఆజ్యసహితనఖద్విజాఙ్గుష్ఠప్రదేశం ప్రవేశ్య, ద్విజవామాఙ్గుష్ఠ తర్జనీమధ్యమాభిః పాత్రం స్పర్శయిత్వా,

*"---గోత్రస్య ---శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ----గోత్రాయాః ---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) సపిండీకరణశ్రాద్ధే శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణో దేవతే ఏతత్తే అన్నం సవ్యంజనం సపరికరం చ బ్రాహ్మణస్త్వాహవనీయార్థే తత్సర్వం గయేయం భూర్గదా ధరో భోక్తా, అన్నం చ బ్రహ్మా, అహం చ బ్రహ్మా, భోక్తా చ బ్రహ్మా, స్వర్ణ మయం పాత్రం, అక్షయవటచ్ఛాయేయం శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణవే శంఖచక్రగదాధరాయ ఇదమిద మిదమన్న మమృతస్వరూపం ఆతృప్తేర్దత్తం దాస్యమానం చ స్వాహా। అన్నం నమః।*

---

[499] ఆపైని కర్త ఉపవీతియై, కుడికాలును వెనుకకు మడచి, ఎడమపాదమును భూమిపై మోపి విష్ణుస్థాననిమంత్రితవిప్రుని ముందు కూర్చుండి, *"ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరేణ్యం। భర్గో దేవస్య ధీమహి। ధియో యోనః ప్రచోదయాత్। దేవసవితః ప్రసువ"*- అని కూర్చజలంతో అన్నమును ప్రోక్షించి, అన్నమును ప్రదక్షిణముగా పరిషేచనము చేసి, విప్రుని హస్తమునందు కూర్చతో శుద్ధోదకము నొసగి,

[500] *"పృథివీ తే పాత్రం---అముత్రాముష్మిన్ లోకే।"* - అని చెప్పుచు ద్విజుని బోర్లించిన కుడిచేతి నాల్గువ్రేళ్లను తన కుడిచేత గ్రహించి అన్నాదికమును స్పృశింపజేసి, *"ఇదం విష్ణుర్విచక్రమే--- స్వాహా విష్ణో అన్నం రక్షస్వ।"* - అని ద్విజుని అంగుష్ఠాగ్రమును నేతిలో నద్ది, ఆ అంగుష్ఠమును అన్నమధ్యమున ప్రవేశపెట్టి, ద్విజుని ఎడమచేతి తర్జనీమధ్యమాంగుష్ఠములతో ఆకునుపట్టించి,

నమమ/"- ఇత్యుక్త్వా భోక్తృహస్తం విసృజ్య, [501] "గయాయామక్షయవటచ్ఛాయాయాం సత్యవ్రతక్షేత్రే పుణ్యకోటివిమాన చ్ఛాయాయాం పెరుందేవీనాయికాసమేత శ్రీదేవాధి రాజస్వామిసన్నిధౌ శ్రీవిష్ణుపాదే దత్తమ్/ శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణవే ఇదం నమమ/" - ఇతి తులసీదళమిశ్రితయవోదకం దర్భైస్సహ పాత్రమూలే దేవతీర్థేన దద్యాత్. [502] అనంతరం భగవదారాధనకైఙ్కర్యపరః "రామానుజదయాపాత్ర"మేతాదిక ముచ్చరన్ భోక్తృహస్తేషు పెరుమాళ్ తీర్థం దద్యాత్.

## పెరుమాళ్ తీర్థప్రదానమ్

*రామానుజదయాపాత్రం జ్ఞానవైరాగ్యభూషణం/*
*శ్రీమద్వేఙ్కటనాథార్యం వన్దే వేదాన్తదేశికమ్//*
*లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్/*
*అస్మదాచార్యపర్యంతాం వన్దే గురుపరమ్పరామ్//*
*యో నిత్యమచ్యుతపదామ్బుజయుగ్మరుక్మ*
*వ్యామోహతస్తదితరాణి తృణాయ మేనే/*
*అస్మద్గురోర్భగవతోఽస్య దయైకసిన్ధోః*
*రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే//*
*మాతాపితాయువతయస్తనయా విభూతి*
*స్సర్వం యదేవ నియమేన మదన్వయానామ్/*
*ఆద్యస్య నః కులపతేర్వకుళాభిరామం*
*శ్రీమత్తదఙ్ఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా//*

---

[501] ద్విజుని హస్తము నట్లే పట్టుకొని, "---గోత్రస్య --- అన్నం నమః/ నమమ/" - వఱకు చెప్పి ద్విజుని హస్తమును విడచిపెట్టి, "గయాయామక్షయవటచ్ఛాయాయాం-----విష్ణవే ఇదం నమమ"- అని చెప్పి దేవతీర్థముతో తులసీదళముతో కూడిన శ్వేతాక్షతోదకమును దర్భలతో సహ భుక్తిపాత్రమూలమున విడువవలెను.

[502] తదుపరి "రామానుజదయాపాత్రం" మొదలగు 5 శ్లోకములను పఠించుచు తిరువారాధన చేసిన స్వామి భోక్తలకు పెరుమాళ్ తీర్థమీయవలెను.

*భూతం సరస్య మహదాహ్వయ భట్టనాథ*
*శ్రీభక్తిసార కులశేఖరయోగివాహాన్।*
*భక్తాఙ్ఘ్రిరేణు పరకాలయతీన్ద్ర మిశ్రాన్*
*శ్రీమత్పరాఙ్కుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్॥*
-ఇత్యుచ్చరన్ భోక్తృణాం పెరుమాళ్ తీర్థం దద్యాత్.

## భుగ్నే సమిష్టిదానాని

[503]ప్రాచీనావీతీ, విశ్వేదేవ పితుః పితృస్థానమధ్యే దక్షిణాగ్రం భుగ్నం నిక్షిప్య, తులసీతిలాక్షతాన్ గృహీత్వా,

---

[503] తరువాత కర్తలలో కనిష్ఠుడు ప్రాచీనావీతియై, విశ్వేదేవులకు, పితరులకు మధ్యస్థలమున నొక దక్షిణాగ్ర భుగ్నము నుంచి, ఎడమమోకాలును వెన్కకు మడచి, కుడిపాదమును నేలపై మోపి కూర్చొని, దక్షిణాభిముఖుడును, అంజలిబద్ధుడునై, *"బ్రహ్మార్పణం బ్రహ్మహవిః--- విశ్వభుగవ్యయః॥"* - అని చెప్పి, "మమ *పితుః (మాతుః) సపిండీకరణశ్రాద్ధారాధనే"* అని పలికి ఉపవీతియై, *"క్రతుదక్షసంజ్ఞక విశ్వేదేవరూపీ"* - అని చెప్పి విశ్వేదేవులకు నమస్కరించి, ప్రాచీనావీతియై, *"వసురుద్రాదిత్యస్వరూప అస్మత్పితుః పితృపితామహప్రపితామహరూపీ"* - అని చెప్పి పితరులకు నమస్కరించి, *"నిమిత్తరూప పితుః (మాతుః) ప్రేతరూపీ"* - అని చెప్పి ప్రేతనిమిత్తునికి నమస్కరించి, ఉపవీతియై, *"శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణురూపీ"* - అని చెప్పి విష్ణువునకు నమస్కరించి, *"ప్రత్యక్ష శ్రీమహావిష్ణురూపీ"* - అని చెప్పి తిరువారాధనగృహము నందలి పెరుమాళ్లవైపు తిరిగి నమస్కరించి, ప్రాచీనావీతియై, *"సర్వాకారో భగవాన్ సదేవ శ్రీజనార్దనః ప్రీయతామ్"* - అని చెప్పి తులసీదళము, తిలలతో కూడిన శ్వేతాక్షతోదకమును పితృతీర్థముతో ఆ భుగ్నము ముడిపై విడిచి, లేచి నిలబడి *"గయగయగయ---అక్షయవటః"*- పర్యంతము చెప్పుచూ మూడుసార్లు తనచుట్టును తాను ప్రదక్షిణముగా తిరిగి, మరల భుగ్నమున కెదుట ఎడమమోకాలిని వెన్కకు జాపి కుడిపాదమును భూమిపై మోపి దక్షిణాముఖముగా కూర్చుండి, ఉపవీతియై, *"భగవత్సమారాధనమ్"* - అనుచు ఉదకుంభములోని జలమును దేవతీర్థముతో ఆ భుగ్నము ముడిపై విడువవలెను. ఈ ప్రదక్షిణాదులను కనిష్ఠునితో మొదలిడి జ్యేష్ఠునివరకు కర్తలందరును చేయవలెను.

"బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥
యజ్ఞేశ్వరో హవ్యసమస్తకవ్య భోక్తాఽవ్యయాత్మా హరిరీశ్వరోఽత్ర।
తత్సన్నిధానాదపయాన్తు సద్యో రక్షాంస్యశేషాణ్యసురాశ్చ సర్వే॥
ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః।
త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వభుగవ్యయః॥"

మమ పితుః (మాతుః) సపిండీకరణశ్రాద్ధారాధనేన, ఉపవీతీ, "క్రతుదక్షసంజ్ఞక విశ్వేదేవరూపీ" - ఇతి విశ్వేదేవాన్ నమస్కృత్య, ప్రాచీనావీతీ, "వసురుద్రాదిత్యస్వరూప అస్మత్పితుః పితృపితామహప్రపితామహరూపీ" - ఇతి పితౄన్ నమస్కృత్య, "నిమిత్త రూప పితుః (మాతుః) ప్రేతరూపీ" - ఇతి నిమిత్తం నమస్కృత్య, ఉపవీతీ, "శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణురూపీ" - ఇతి విష్ణుం నమస్కృత్య, "ప్రత్యక్షశ్రీమహావిష్ణురూపీ" - ఇతి తిరువారాధనగృహస్థభగవన్తం నమస్కృత్య, ప్రాచీనావీతీ, "సర్వాకారో భగవాన్ సదేవ శ్రీజనార్దనః ప్రీయతామ్" - ఇతి తులసీదళతిలసహితయవోదకం పితృతీర్థేన భుగ్నే ఉత్సృజ్య, ఉత్థాయ, "గయగయగయ, గయాశ్రాద్ధం, గయాశ్రాద్ధం, గయాశ్రాద్ధమ్। అక్షయవటో అక్షయవటో అక్షయవటః।" - ఇత్యుచ్చార్య ఆత్మప్రదక్షిణం కృత్వా, ఉపవీతీ, "శ్రీ భగవత్సమారాధనమ్।"- ఇతి దేవతీర్థేనోదకం భుగ్నోపరి దద్యాత్. ప్రదక్షిణాదికం కనిష్ఠాదారభ్య జ్యేష్ఠాన్తం సర్వే కర్తారః కుర్యుః.

## పరిషేచనమ్ - ప్రాణాహుతయః:

[504] "స్వామినః యథా సౌకర్యం పరిషేచనమ్" - ఇత్యుక్త్వా, "సత్యం త్వర్తేన పరిషించామి" - ఇతి భగవత్సమర్పితేనార్ఘ్యజలేన ప్రేతవర్జ్యం పరిషేచనం కారయిత్వా, "అమృ

504 "స్వామినః యథా సౌకర్యం పరిషేచనమ్"- అని స్వాములను పరిషేనము చేయుమని కోరి, ప్రేతకు మినహా ఇతరులకు భగవంతున కర్ఘ్యము నొసగిన జలమును పరిషేచనార్థ మొసగి (ప్రేతకు శుద్ధోదకము నొసగి), "సత్యం త్వర్తేన పరిషించామి"- అని వారందఱిచే అన్నమును పరిషేచనము చేయించి, "అమృతోపస్తరణమసి" - అని ఆపోశనార్థము భగవత్పాదతీర్థమును

తోపస్తరణమసి" - ఇత్యాపోశనం భగవత్పాదోదకేన ప్రేతవర్జ్యం కారయిత్వా, ప్రేతస్య కేవలం శుద్ధోదకేన పరిషేచనం ఆపోశనం చ కారయిత్వా, ప్రాణాహుతీన్ కారయేత్.

1. శ్రద్ధాయాం ప్రాణే నివిష్టోఽమృతం జుహోమి। శివో మాఽఽవిశాప్రదాహాయ। ప్రాణాయ స్వాహా। ప్రాణాయ నారాయణాయేదం నమమ।
2. శ్రద్ధాయామపానే నివిష్టోఽమృతం జుహోమి। శివో మాఽఽవిశాప్రదాహాయ। అపానాయ స్వాహా। అపానాయ నారాయణాయేదం నమమ।
3. శ్రద్ధాయాం వ్యానే నివిష్టోఽమృతం జుహోమి। శివో మాఽఽవిశాప్రదాహాయ। వ్యానాయ స్వాహా। వ్యానాయ నారాయణాయేదం నమమ।
4. శ్రద్ధాయాముదానే నివిష్టోఽమృతం జుహోమి। శివో మాఽఽవిశాప్రదాహాయ। ఉదానాయ స్వాహా। ఉదానాయ నారాయణాయేదం నమమ।
5. శ్రద్ధాయాగ్ం సమానే నివిష్టోఽమృతం జుహోమి। శివో మాఽఽవిశాప్రదాహాయ। సమానాయ స్వాహా। సమానాయ నారాయణాయేదం నమమ।
6. బ్రహ్మణి మ ఆత్మాఽమృతత్వాయ। శ్రీగోవిన్దాయ నమః।

నిమిత్తస్య "ప్రాణాయ స్వాహా। అపానాయ స్వాహా। వ్యానాయ స్వాహా। ఉదానాయ స్వాహా। సమానాయ స్వాహా। బ్రహ్మణి మ ఆత్మాఽమృతత్వాయ।" - ఇతి ప్రాణాహుతీః కారయిత్వా,

హస్తోదకం దత్వా, "స్వామినః యథాసుఖం జుషధ్వమ్। స్వామినః వసిష్ఠవామ దేవావివ యూయమాగతాః, యుష్మదనుగుణం పదార్థాః న మయా సంపాదితాః। సంపాదితేషు పదార్థేషు భగవన్నివేదితేషు యద్యదభీప్సితం తత్తదానాయ్య రాత్రౌ యథా క్షున్న జాయేత తథా భుంక్త్వా వయం సంరక్షణీయాః"–

ప్రేతకు మినహా ఇతరుల కొసగి, ప్రేతకు శుద్ధోదకమును మాత్రమే ఆపోశనార్థ మొసగి, ప్రేతేతరులకు పై నొసగిన 1-6 మంత్రములతో ప్రాణాహుతులను చేయించి, ప్రేతకు మాత్రము "ప్రాణాయ స్వాహా। అపానాయ స్వాహా। వ్యానాయ స్వాహా। ఉదానాయ స్వాహా। సమానాయ స్వాహా। బ్రహ్మణి మ ఆత్మాఽమృతత్వాయ।" - అని ప్రాణాహుతులు చేయించి,

[505]ఇత్యుపవీతీ, ప్రార్థ్య, [506]"ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరేణ్యం। భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్।" - ఇతి త్రిః -"ఓం మధు వాతా ఋతాయతే మధు క్షరన్తి సిన్ధవః। మాధ్వీర్నస్సన్త్వోషధీః। మధు నక్తముతోషసి మధుమత్పార్థివగం రజః। మధు ద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగం అస్తు సూర్యః। మాధ్వీర్గావో భవన్తు నః। ఓం మధుమధుమధు" - ఇతి మధుపరివేషణం కుర్యాత్. పురుష సూక్తాదీని శ్రావయేత్. [507]భోజనాంతే, ప్రాచీనావీతీ,

"అహమస్మి ప్రథమజా ఋతస్య। పూర్వం దేవేభ్యో అమృతస్య నాభిః। యో మా దదాతి స ఇ దేవ మావాః। అహమన్నమన్నమదన్తమద్మి। పూర్వమగ్నే రపి దహత్యన్నమ్। యత్తౌ హాసాతే అహముత్తరేషు। వ్యాత్తమస్య పశవస్సుజమ్భమ్। పశ్యన్తి ధీరాః ప్రచరన్తి పాకాః। జహామ్యన్యం న జహామ్యన్యమ్। అహమన్నం వశమిచ్చరామి। సమానమర్థం పర్యేమి భుఞ్జత్। కో మామన్నం మనుష్యో దయేత। పరాకే అన్నం నిహితం లోక ఏతత్। విశ్వైర్దేవైః పితృభిర్గుప్తమన్నమ్। యదద్యతే లుప్యతే యత్పరోప్యతే। శతతమీసా తనూర్మే బభూవ। మహాన్తౌ చరూ సకృద్దుగ్ధేన పప్రౌ। దివఞ్చ పృశ్ఞి పృథివీఞ్చ సాకమ్। తత్సమ్పిబన్తో నమినన్తి వేధసః। నైతద్భూయో భవతి నోకనీయః। అన్నం ప్రాణమన్నమపానమాహుః। అన్నం మృత్యుంతము జీవాతు

---

[505] ప్రాణాహుతులను చేయునప్పుడు ఆకును పట్టుకొనియుండిన ఎడమచేతిని కడిగికొనుటకు స్వాములకు హస్తోదకము నొసగి, ఉపవీతియై "స్వామినః యథాసుఖం ---- వయం సంరక్షణీయాః" - అని వారిని ప్రార్థించి,

[506] ఉపవీతిగనే ఉండి "ఓం భూర్భువస్సువః-ధియో యో నః ప్రచోదయాత్।"- అని గాయత్రీ మంత్రమును మూడుసార్లును, -"ఓం మధు వాతా ఋతాయతే --- ఓం మధు మధుమధు"- అని మధుత్రయమునూ చెప్పుచూ భోజనము చేయుచున్న స్వాములకు మధువును, అరటి పండ్లను వడ్డించవలెను. పురుషసూక్తాదులను వినిపించవలెను.

[507] స్వాముల భోజనాంతమున (అనగా, వారు పెరుగన్నము తినుచున్నప్పుడు) ప్రాచీనావీతియై, "అహమస్మి ప్రథమజా ఋతాస్య----మదాదిత్యా అధి సర్వే తపన్తి" - అని అన్న సూక్తమును పఠించి,

మాహుః/ అన్నం బ్రహ్మణో జరసం వదన్తి/ అన్న మాహుః ప్రజననం ప్రజానామ్/ మోఘ మన్నం విన్దతే అప్రచేతాః/ సత్యం బ్రవీమివధ ఇత్సతస్య/ నార్యమణమ్పుష్యతి నో సఖాయమ్/ కేవలాఘో భవతి కేవలాదీ/ అహం మేఘ స్తనయన్ వర్షన్నస్మి/ మా మదన్త్యహమద్మ్యన్యాన్/ అహగం సదమృతో భవామి/ మదాదిత్యా అధి సర్వే తపన్తి/ ఓం" - - ఇత్యన్నసూక్తం పఠిత్వా,

[508] "స్వామినః భగవన్ని వేదితేషు పదార్థేషు కిమపేక్షితమ్?" - ఇతి పృష్ట్వా, "సకలం సమ్పూర్ణమ్" - ఇతి తైః ప్రత్యుక్తే,

"ఓం మధు వాతా ఋతాయతే మధు క్షరన్తి సిన్ధవః/ మాధ్వీర్నస్సన్త్వోషధీః/ మధు నక్తముతోషసి మధుమత్పార్థివగం రజః/ మధు ద్యౌరస్తు నః పితా/ మధుమాన్నో వనస్పతిర్మధుమాగం అస్తు సూర్యః/ మాధ్వీర్గావో భవన్తు నః/ ఓం మధుమధుమధు" - ఇతి మధుత్రయం పఠిత్వా,

[509] ఉపవీతి "విశ్వేదేవా మధుమధు సంపన్నమ్?" - ఇతి పృష్ట్వా, "అస్తు సంపన్నమ్" -ఇతి ప్రత్యుక్తే, "తృప్తాస్థః" -ఇతి పృష్ట్వా, "తృప్తాస్మః" -ఇతి ప్రత్యుక్తే, ప్రాచీనావీతీ,

[510] "అక్షన్న మీ మదన్త హ్యవప్రియా అధూషత/ అస్తోషత స్వభానవో విప్రా న విష్ఠయా మతీ/ యోజాన్విన్ద్ర తే హరీ" - వసురుద్రాదిత్యస్వరూప అస్మత్పితుః పితృ

---

[508] "స్వామినః భగవన్ని వేదితేషు పదార్థేషు కిమపేక్షితమ్?" - (భగవంతునికి నివేదించిన భోజ్య పదార్థములలో స్వాములకింకా ఏమి కావలెను?) అని స్వాముల నడిగి, "సకలం సమ్పూర్ణమ్" (అంతా పరిపూర్తియైనది) - అని వారిచే చెప్పించుకొని, "మధు వాతా ఋతాయతే - మధుమధు మధు" - అని మధుత్రయమును చెప్పి,

[509] ఉపవీతియై "విశ్వేదేవా మధుమధు సంపన్నమ్?" - అని విశ్వేదేవుల నడిగి, "అస్తు సంపన్నమ్" -అని చెప్పించుకొని, "తృప్తాస్థః" - అని అడిగి, "తృప్తాస్మః" - అని చెప్పించుకొని,

[510] ప్రాచీనావీతియై, పితృస్థాననిమంత్రితు నుద్దేశించి "అక్షన్న మీమదన్త------ యోజాన్విన్ద్రతే హరీ" - అని చెప్పి, "వసురుద్రాదిత్యస్వరూప ---- మధు మధు సంపన్నమ్?" - అని అడిగి, "అస్తు సంపన్నమ్" - అని చెప్పించుకొని, "పితుః పితృపితామహప్రపితామహాః తృప్తాస్థః?" - అని అడిగి, "తృప్తాస్మః" - అని చెప్పించుకొని,

*పితామహప్రపితామహాః మధుమధు సంపన్నమ్?"* - ఇతి పృష్ట్వా, *"అస్తు సంపన్నమ్"* - ఇతి ప్రత్యుక్తే, *"పితుః పితృపితామహప్రపితామహాః తృప్తాస్థః"* - ఇతి పృష్ట్వా, *"తృప్తాస్మః"* - ఇతి ప్రత్యుక్తే, [511]నిమిత్తం *"సంపన్నమ్"* - ఇతి పృష్ట్వా, *"అస్తు సంపన్నమ్"* - ఇతి ప్రత్యుక్తే, *"తృప్తోఽసి"* - ఇతి పృష్ట్వా, *"తృప్తోఽస్మి"* - ఇతి ప్రత్యుక్తే, [512]ఉపవీతీ, *"శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణో మధుమధు సంపన్నమ్"* - ఇతి పృష్ట్వా, *"అస్తు సంపన్నమ్"* - ఇతి ప్రత్యుక్తే, *"విష్ణో తృప్తోఽసి"* - ఇతి పృష్ట్వా, *"తృప్తోఽస్మి"* - ఇతి ప్రతివచనం ప్రాప్య, వికిరం కుర్యాత్.

## *వికిరక్రమః*

1. [513]ఉపవీతీ, విశ్వేదేవపాత్రస్య పురతః స్వల్పమాత్రస్థలశుద్ధిం కృత్వా, స్వల్పమన్నం గృహీత్వా,

*"అసోమపాశ్చ యే దేవా యజ్ఞభాగవివర్జితాః। తేషామన్నం ప్రదాస్యామి వికిరం వైశ్వదైవికమ్"* - ఇతి దేవతీర్థవదుదగపవర్గం దత్వా, పునశ్శుద్ధోదకం దత్వా,

2. [514]ప్రాచీనావీతీ, పితృపాత్రస్య పురతః స్వల్పమాత్రస్థలశుద్ధిం కృత్వా, స్వల్పమన్నం గృహీత్వా,

---

[511] ప్రాచీనావీతియై, ప్రేతస్థానిమంత్రితుని *"సంపన్నమ్?"* అని అడిగి, *"అస్తు సంపన్నమ్"* - అని చెప్పించుకొని, *"తృప్తోఽసి"* - అని అడిగి, *"తృప్తోఽస్మి"* - అని చెప్పించుకొని,

[512] ఉపవీతియై, విష్ణుస్థానభోక్తను *"శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణో మధు మధు సంపన్నమ్"* - అని అడిగి, *"అస్తు సంపన్నమ్"* - అని చెప్పించుకొని, *"విష్ణో తృప్తోఽసి"* - అని అడిగి *"తృప్తోఽస్మి"* - అని చెప్పించుకొని, ఆ తర్వాత వికిరప్రదానమును చేయవలెను.

[513] ఉపవీతియై, విశ్వేదేవుల భోజనపాత్రముందు దక్షిణమునుండి ఉత్తరమున కొంచెం చిన్న స్థల శుద్ధిని చేసి, పితుర్హవిఃపాత్రనుండి కొంచెమన్నము తీసికొని *"అసోమపాశ్చ"* అను మంత్రముతో నాల్గువ్రేళ్ల కొనలనుండి (దేవతీర్థమువలె) ఆ అన్నమును చాలుగట్టి దక్షిణమునుండి ఉత్తరమున కంతమగునట్లుంచి, ఆ అన్నముపై అదే ప్రకారము చాలుగట్టి కూర్చతో శుద్ధోదకమును విడిచి,

[514] ప్రాచీనావీతియై, పితరుల భోజనపాత్రముందు పడమటినుండి తూర్పున కొంచెం చిన్న స్థల శుద్ధిని చేసి, పితుర్హవిఃపాత్రనుండి కొంచె మన్నము తీసికొని *"అసంస్కృతప్రమీయానా"* అను

*"అసంస్కృతప్రమీతా యే త్యాగిన్యో యాః కులస్త్రియః। దాస్యామి తేభ్యో వికిర మన్నం తాభ్యశ్చ పైతృకమ్।"* - ఇతి పితృతీర్థవత్ప్రాగపవర్గం దత్వా, పునశ్శుద్ధోదకం దత్వా,

3. [515]ఉపవీతీ, విష్ణోః పాత్రస్య పురతః స్వల్పమాత్రస్థలశుద్ధిం కృత్వా, స్వల్పమన్నం గృహీత్వా,

*"అనంతయో భవేద్విష్ణుః మోక్షసాధన మవ్యయమ్। పితౄణాం చ పరం శ్రేష్ఠం వికిరాన్నం చ వైష్ణవమ్।"* - ఇతి మంత్రేణ దేవతీర్థవద్దత్వా, పునశ్శుద్ధోదకం దద్యాత్. నిమిత్తస్య వికిరం నాస్తి.

## ప్రకిరక్రమః(వాయనసపిణ్డప్రదానమ్)

[516]ప్రాచీనావీతీ, దేవపితృమధ్యే ప్రోక్ష్య, పూర్వవద్దక్షిణాగ్రం భుగ్నం నిక్షిప్య, సవ్యం జాన్వాచ్య, *"మార్జయన్తామ్"* ఇతి భుగ్నే తిలోదకం నినీయ,

---

మంత్రముతో అంగుష్ఠతర్జనీమధ్యమునుండి (పితృతీర్థమువలె) ఆ అన్నమును చాలుగట్టి పడమటినుండి తూర్పున కంతమగునట్లుగా నుంచి, ఆ అన్నముపై అదే ప్రకారము చాలుగట్టి కూర్చతో శుద్ధోదకమును విడిచి,

515 ఉపవీతియై, విష్ణువు భోజనపాత్రముందు ఒకే ఒకచోట నొక చిన్న స్థలశుద్ధిని చేసి, పితుర్ణాః పాత్రనుండి కొంచెమన్నము తీసికొని *"అనంతయో భవేద్విష్ణుః"* అను మంత్రముతో నాల్గువ్రేళ్ల కొనలనుండి (దేవతీర్థమువలె) ఆ అన్నమును ఒకేచోట ఆ స్థలమునందుంచి, కూర్చతో ఆ అన్నముపై శుద్ధోదకమును విడువవలెను. ప్రేతకు వికిరప్రదానము లేదు.

516 తరువాత ప్రకిర(వాయన) పిండప్రదానము చేయవలెను. దీనికి ప్రయోగము: కర్త ప్రాచీనా వీతియై హోమము చేయగా మిగిలిన అన్నముతో నొక వాయనపిండమును చేసి, విశ్వేదేవు లకు, పితరులకు మధ్య ఇదివరకుంచిన భుగ్నము ప్రక్క దర్భలపై మఱొక దక్షిణాగ్రభుగ్నము నుంచి, ఎడమమోకాలిని వెనుకకు జాపి, కుడి పాదమును భూమిపై మోపి దక్షిణాముఖముగా కూర్చుండి "*మార్జయన్తామ్*" అని ఆ భుగ్నముపై తిలోదకమును పితృతీర్థముతో విడిచి, పింద మును చేతిలో గ్రహించి, "*యే అగ్ని దగ్ధా---తృప్తా యాన్తు పరాం గతిమ్।*" అని చెప్పుచూ ఆ పిండమును భుగ్నముపై నుంచి, "*అగ్ని దగ్ధేభ్యః అనగ్ని దగ్ధేభ్యః ---- ఏతద్వస్తిలోదకమ్*"- అని చెప్పి ఆ పిండముచుట్టును అపసవ్యముగా పితృతీర్థముతో తిలోదకమును విడిచి, ఉపవీతియై

*"యే అగ్నిదగ్ధా యేஉనగ్నిదగ్ధాః యేహ జాతాః కులే మమ/ భూమౌ దత్తేన పిండేన తృప్తా యాన్తు పరాం గతిమ్/"* - ఇతి నిధాయ, *"అగ్నిదగ్ధేభ్యః అనగ్నిదగ్ధేభ్యః అస్మత్కులప్రసూతమృతేభ్యః అయం పిండస్స్వధా నమః/ అగ్నిదగ్ధాశ్చ అనగ్ని దగ్ధాశ్చ మార్జయన్తామ్/ ఏతద్వస్తిలోదకమ్"* - ఇతి పిండోపరి తిలోదకం నినయేత్. ఉపవీతీ, ఆచమ్య, ప్రాచీనావీతీ, *"సర్వత్ర అమృతాపిధానమసి"* - ఇతి సర్వత్రాపోశనం కారయిత్వా, పిండం వాయసేభ్యో దద్యాత్. ఉపవీతీ ఆచమనం కుర్యాత్.

## *భోజనానంతరార్ఘ్యప్రదానమ్*

[517]ఆచాంతానాసనేషూపవిశ్య, అర్ఘ్యసమీపం గత్వా, ఉపవీతీ, విశ్వేదేవహస్తే శుద్ధోదకం దత్వా, పవిత్రం నిధాయ,

*"యా దివ్యా ఆపః పయసా సంబభూవుః/ యా అన్తరిక్ష ఉత పార్థివీర్యాః/ హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శగ్గం స్యోనా భవన్తు/ -----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ---గోత్రాయాః ---నామ్న్యాః మాతుః ప్రేతాయాః) సపిండీకరణశ్రాద్ధే క్రతుదక్షసంజ్ఞిక విశ్వేభ్యో దేవేభ్యస్స్వాహా నమః/ స్వాహేయం వో భుక్త తృప్తిః"* - ఇత్యర్ఘ్యం దత్వా, *"అస్తు భుక్త తృప్తిః"* - ఇతి ప్రత్యుక్తే, *"క్రతుదక్షసంజ్ఞిక విశ్వే*

---

ఆచమించి, ప్రాచీనావీతియై *"సర్వత్ర అమృతాపిధానమసి"* - అని స్వాముల కుత్తరాపోశనము నొసగి, పిండమును వాయసమున కొసగి, ఉపవీతియై ఆచమనము చేయవలెను.

[517] తదుపరి కరముఖక్షాళనము చేసికొని, ఆచమించి వచ్చిన స్వాములను హోమస్థానమున అర్ఘ్యపాత్రలకు చేరువగా కూర్చుండబెట్టి, ఉపవీతియై విశ్వేదేవులచేతిలో కూర్చతో శుద్ధోదకము నొసగి, అర్ఘ్యపాత్రలో నుంచిన ఆయామతపవిత్రము నతని దోసిటిలో నుంచి, *"యా దివ్యా ఆపః పయసా ---- స్వాహేయం వో భుక్త తృప్తిః"* - అని అర్ఘ్యపాత్రనుండి దర్వితో జలమును తీసికొని అతని దోసిటిలో అర్ఘ్యము నిచ్చి, *"అస్తు భుక్తతృప్తిః"* అని చెప్పించుకొని, *"క్రతుదక్షసంజ్ఞికవిశ్వేదేవాః రోచయత?"* - అని అడిగి, *"అస్తు రోచయత"* - అని చెప్పించుకొని, మణల కూర్చతో శుద్ధోదకము నొసగి, ఆయామతపవిత్రమును తీసికొని తిరిగి అర్ఘ్యపాత్రలో నుంచి, ఆపాత్రను దర్భలచేతను దర్వితను కప్పియుంచవలెను.

*దేవాః రోచయత?"*- ఇతి పృష్ట్వా, *"అస్తు రోచయత"* - ఇతి ప్రతివచనం ప్రాప్య, పునశ్శుద్ధోదకం దత్వా, పవిత్రమాదాయ అర్ఘ్యపాత్రే నిధాయ, దర్భైర్ధర్వ్యా చ ప్రచ్ఛాద్య,

[518] ప్రాచీనావీతీ, పిత్రాదీనాం హస్తే శుద్ధోదకం దత్వా, పవిత్రం నిధాయ,

*"యా దివ్యా ఆపః పయసా సంబభూవుః/ యా అన్తరిక్ష ఉత పార్థివీర్యాః/ హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శగ్గం స్యోనా భవన్తు/-----గోత్రస్య -----శర్మణః పితుః (అథవా, -----గోత్రాయాః -----నామ్న్యాః మాతుః) సపిండీకరణశ్రాద్ధే పితుః పితృపితామహప్రపితామహేభ్యస్స్వధా నమః/ స్వధేయం వో భుక్తి తృప్తిః/"* - ఇత్యర్ఘ్యం దత్వా, *"అస్తు భుక్తి తృప్తిః"*- ఇతి ప్రత్యుక్తే, *"వసురుద్రాదిత్యస్వరూప అస్మత్పితుః పితృపితామహప్రపితామహాః స్వదితమితి బ్రూత"* - ఇతి పృష్ట్వా, *"అస్తు స్వదితమ్"*- ఇతి ప్రత్యుక్తే, పునశ్శుద్ధోదకం దత్వా, పవిత్రమాదాయ అర్ఘ్యపాత్రే నిధాయ, దర్భైర్ధర్వ్యా చ ప్రచ్ఛాద్య, [519] ప్రాచీనావీతీ, నిమిత్తస్య హస్తే శుద్ధోదకం దత్వా, పవిత్రం నిధాయ,

*"యా దివ్యా ఆపః పయసా సంబభూవుః/ యా అన్తరిక్ష ఉత పార్థివీర్యాః/ హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శగ్గం స్యోనా భవన్తు/-----గోత్రస్య -----శర్మణః*

---

[518] తదుపరి ప్రాచీనావీతియై పితరుల చేతిలో కూర్చతో శుద్ధోదకము నొసగి, పిత్రర్ఘ్యపాత్రలోని ఆయామితపవిత్రము తీసి అతని దోసిటిలో నుంచి, *"యా దివ్యా ఆపః పయసా--- స్వధేయం వో భుక్తి తృప్తిః"* - అని అర్ఘ్యము నిచ్చి, *"అస్తు భుక్తితృప్తిః"* అని చెప్పించుకొని, *"వసురుద్రాదిత్యస్వరూప అస్మత్పితుః పితృపితామహప్రపితామహాః స్వదితమితి బ్రూత"* - అని అడిగి, *"అస్తు స్వదితమ్"*- అని చెప్పించుకొని, మఱల కూర్చతో శుద్ధోదకము నొసగి, ఆయామిత పవిత్రమును తీసికొని తిరిగి అర్ఘ్యపాత్రలో నుంచి, ఆపాత్రను దర్భలచేతను దర్విచేతను కప్పి యుంచవలెను.

[519] తదుపరి ప్రాచీనావీతియై ప్రేతనిమిత్తునిచేతిలో కూర్చతో శుద్ధోదకము నొసగి, ప్రేతార్ఘ్య పాత్రలోని ఆయామితపవిత్రమును తీసికొని అతని దోసిటిలో నుంచి, *"యా దివ్యా ఆపః పయసా --- స్వధేయం వో భుక్తి తృప్తిః"* - అని అర్ఘ్యము నిచ్చి, *"అస్తు భుక్తితృప్తిః"* అని చెప్పించుకొని, *"స్వదితమ్?"*- అని అడిగి, *"అస్తు స్వదితమ్"*- అని చెప్పించుకొని, మఱల కూర్చతో శుద్ధోదకము నొసగి, ఆయామితపవిత్రమును తీసికొని తిరిగి అర్ఘ్యపాత్రలో నుంచి, ఆ పాత్రను దర్భలచేతను దర్విచేతను కప్పియుంచవలెను.

*(అథవా,-----గోత్రాయాః -----నామ్న్యాః మాతుః) సపిండీకరణశ్రాద్ధే పిత్రే ప్రేతాయ ఇయం తే భుక్తి తృప్తిః"* - ఇత్యర్ఘ్యం దత్వా, *"అస్తు భుక్తి తృప్తిః"* - ఇతి ప్రత్యుక్తే, *"స్వదితమ్?"* - ఇతి పృష్ట్వా, *"అస్తు స్వదితమ్"* - ఇతి ప్రతివచనం ప్రాప్య, పునశ్శుద్ధోదకం దత్వా, పవిత్రమాదాయ అర్ఘ్యపాత్రే నిధాయ, దర్భైర్దర్వ్యా చ ప్రచ్ఛాద్య,

[520]ఉపవీతీ, విష్ణుహస్తే శుద్ధోదకం దత్వా, పవిత్రం నిధాయ,

*"యా దివ్యా ఆపః పయసా సంబభూవుః। యా అన్తరిక్ష ఉత పార్థివీర్యాః। హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శగ్గం స్యోనా భవన్తు। ----గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా, ----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) సపిండీకరణశ్రాద్ధే శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణవే స్వాహా నమః। స్వాహేదం తే భుక్తి తృప్తిః"* - ఇత్యర్ఘ్యం దత్వా, *"అస్తు భుక్తి తృప్తిః"* - ఇతి ప్రత్యుక్తే, *"శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణో రోచయత?"*- ఇతి పృష్ట్వా, *"అస్తు రోచయత"*- ఇతి ప్రతివచనం ప్రాప్య, పునశ్శుద్ధోదకం దత్వా, పవిత్ర మాదాయ అర్ఘ్యపాత్రే నిధాయ, దర్భైర్దర్వ్యా చ ప్రచ్ఛాద్య,

## తామ్బూలప్రదానమ్

[521] *"స్వామినః భోజనాన్తే యత్కించిత్ సదక్షిణాకమిదం వస్త్రామ్బూలమ్"* - ఇతి నిమిత్తప్రథమం శ్రీవిష్ణుపాదార్పితతులసీదళయుతం సకర్పూరతాంబూలం దక్షిణాం చ దత్వా,

---

[520] తదుపరి ఉపవీతియై విష్ణువు చేతిలో కూర్చతో శుద్ధోదకము నొసగి, విష్ణ్వర్ఘ్యపాత్రలోని అయామతపవిత్రమును తీసికొని అతని దోసిటిలో నుంచి, *"యా దివ్యా ఆపః పయసా -- ఇయం తే భుక్తి తృప్తిః"* - అని అర్ఘ్యము నొచ్చి, *"అస్తు భుక్తితృప్తిః"* - అని చెప్పింమకొని, *"శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణో రోచయత?"*- అని అడిగి, *"అస్తు రోచయత"* - అని చెప్పించుకొని, మఱల కూర్చతో శుద్ధోదకము నొసగి, ఆయామతపవిత్రమును తీసికొని తిరిగి అర్ఘ్యపాత్రలో నుంచి, ఆపాత్రను దర్భలచేతను దర్విచేతను కప్పియుంచవలెను.

[521]*"స్వామినః---ఇదం వస్త్రామ్బూలమ్"*- అని నిమిత్తునికి, పితరులకు, విశ్వేదేవులకు, విష్ణువునకు - ఈ క్రమముగా - భగవదర్పితతులసీదళములతో, కర్పూరముతో కూడిన తాంబూలములను, దక్షిణల నొసగి, గోవు, భూమి, హిరణ్యము, వస్త్రములు, కంబళులు, ఏనుగు, సేవకులు, సేవికలు, భూషణములు, యవలు, వడ్లు, మినుములు, తిలలు, బెత్తము, చెప్పులు,

గో-భూ-హిరణ్య-వస్త్ర-అజావిక-హస్తి-దాస-దాసీ-భూష-యవ-వ్రీహి-మాష-తిల-దండ-ఉపానహ-ఛత్ర-కమండలు-శయన-యానాసన-ఉపధానైః యథావిభవం సంపూజ్య,

[522]హస్తేషూదకం దత్వా, ప్రాచీనావీతీ, *"అక్షయముచ్యతామ్"* - ఇతి నిమిత్తస్య హస్తే పితృహస్తే చ శ్వేతాక్షతాన్ దత్వా, ఉపవీతీ, *"అక్షయముచ్యతామ్"* - ఇతి శ్వేతాక్షతాన్ విశ్వేదేవహస్తే విష్ణుహస్తే చ దత్వా, *"అస్త్వక్షయమ్"* - ఇతి తైః ప్రత్యుక్తే

[523]ప్రాచీనావీతీ, *"వసురుద్రాదిత్యస్వరూప పితుః పితృపితామహప్రపితామహాః స్వధాం వాచయిష్యే"* - ఇత్యుక్త్వా, *"వాచ్యతామ్"* - ఇతి ప్రత్యుక్తే, *"ఓగ్ం స్వధా"* - ఇత్యుక్త్వా, కూర్చగ్రంథిం విస్రస్య పితృమణ్డలే తిలోదకేన విసృజేత్. ప్రాచీనావీతీ,

*"వాజేవాజేఽవత వాజినో నో ధనేషు విప్రా అమృతా ఋతజ్ఞాః। అస్య మధ్వః పిబత మాదయధ్వం తృప్తా యాత పథిభిర్దేవయానైః"* - ఇత్యుక్త్వా,

[524]ప్రాచీనావీతీ, *"పితుః ప్రేతనిమిత్తాయ (అథవా, మాతుః ప్రేతానిమిత్తాయాః) నమః"* - ఇతి తిలాన్ నిమిత్తస్య వామభాగే ప్రకీర్య, ప్రాచీనావీతీ, *"వసురుద్రాదిత్యస్వరూప అస్మ*

---

గొడుగు, నీటిచెంబు, వాహనము, కుర్చీ, శయ్య, దిండ్లు మున్నగువానిని కర్తయొక్క శక్తి ననుసరించి ఇచ్చి వారిని పూజించి (లేదా తత్తుల్యమైన దక్షిణ నొసగి),

[522] వారి దోసిటిలో కూర్చోదకము నిచ్చి, ప్రాచీనావీతియై నిమిత్తునికి, పితరులకును, ఉపవీతియై విశ్వేదేవులకు, విష్ణువునకును శ్వేతాక్షతల నిచ్చి, *"అక్షయముచ్యతామ్?"*-అని వారినడిగి, *"అస్త్వక్షయమ్"*- అని వారిచేత చెప్పించుకొని, ప్రాచీనావీతియై

[523]*"వసురుద్రాదిత్యస్వరూప పితుః పితృపితామహప్రపితామహాః స్వధాం వాచయిష్యే"* - అని పితరుల నడిగి, *"వాచ్యతామ్"* - అని చెప్పించుకొని, *"ఓగ్ం స్వధా"*- అని చెప్పుచు కూర్చను విప్పి తిలోదకములతో సహ పితృమండలములో పడవేసి, ప్రాచీనావీతియై *"వాజే వాజేఽవత వాజినో నో ధనేషు - ---తృప్తా యాత పథిభిర్దేవయానైః"*-అని చెప్పి,

[524] ప్రాచీనావీతియై *"పితుః ప్రేతనిమిత్తాయ (అథవా, మాతుః ప్రేతా నిమిత్తాయాః) నమః"* - అని చెప్పి నిమిత్తునికి ఎడమవైపు తిలలను చల్లి, ప్రాచీనావీతియై *"వసురుద్రాదిత్యస్వరూప అస్మత్పితుః పితృపితామహప్రపితామహేభ్యో నమః"* - అని చెప్పి పితరులకు ఎడమవైపు తిలలను చల్లి, ఉపవీతియై *"క్రతుదక్షసంజ్ఞకవిశ్వేభ్యో దేవేభ్యో నమః"*- అని చెప్పి విశ్వేదేవులకు కుడివైపు

*త్పితుః పితృపితామహప్రపితామహేభ్యో నమః"* - ఇతి పితుః పిత్రాదివామభాగే తిలాన్ ప్రకీర్య, ఉపవీతీ, *"క్రతుదక్షసంజ్ఞకవిశ్వేభ్యో దేవేభ్యో నమః"* - ఇతి విశ్వేదేవానాం దక్షిణ భాగే శ్వేతాక్షతాన్ ప్రకీర్య, ఉపవీతీ *"శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణవే నమః"* - ఇతి శ్వేతాక్ష తాన్ విష్ణోర్దక్షిణభాగే ప్రకీర్య, [525]ఉపవీతీ ప్రణమ్య, ప్రాచీనావీతీ

*"దేవతాభ్యః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవ చ*
*నమస్స్వధాయై స్వాహాయై నిత్యమేవ నమో నమః॥"*

- ఇత్యుక్త్వా, *"స్వామినః అస్మిన్ దివసే ---గోత్రం ---శర్మాణం పితరమ్ (అథవా,--- గోత్రాం ---నామ్నీం మాతరమ్)* ఉద్దిశ్య *సపిండీకరణశ్రాద్ధం మయా కృతమిదం యథోక్తమస్తు, యథా శాస్త్రానుష్ఠితమస్తు, గయాశ్రాద్ధఫలదమస్తు, అక్షయతృప్తికర మస్తు, భగవత్ప్రీణనం చ భూయాదితి భవంతో మహాన్తోఽనుగృహ్ణన్తు"* - ఇతి ప్రార్థ యేత్. *"తథాస్తు, యథోక్తమస్తు, యథా శాస్త్రానుష్ఠితమస్తు, గయాశ్రాద్ధఫలదమస్తు, అక్షయతృప్తికరమస్తు, భగవత్ప్రీణనమస్తు"* - ఇతి ప్రతివచనమ్.

[526] *"అన్నశేషః కిం క్రియతామ్?"* - ఇతి పృష్ట్వా, *"ఇష్టైస్సహ భుజ్యతామ్"* - ఇతి విశ్వేదేవైః ప్రత్యుక్తే, *"నిమిత్తస్థానే అన్నశేషః కిం క్రియతామ్?"* - ఇతి పృష్ట్వా, *"అప్సు ప్రక్షిపేత్"* - ఇతి ప్రతివచనం ప్రాప్య,

---

శ్వేతాక్షతలను చల్లి, ఉపవీతియై *"శ్రాద్ధసంరక్షక శ్రీమహావిష్ణవే నమః"* - అని చెప్పి విష్ణువునకు కుడివైపు శ్వేతాక్షతలను చల్లి పూజించి,

[525] ఉపవీతియై బ్రాహ్మణులకు ప్రణమించి, ప్రాచీనావీతియై *"దేవతాభ్యః పితృభ్యశ్చ -- నమో నమః॥"* - అని చెప్పి, *"స్వామినః అస్మిన్ దివసే --- మహాన్తోఽనుగృహ్ణన్తు"* - అని వారిని ప్రార్థించి, *"తథాస్తు, యథోక్తమస్తు, యథా శాస్త్రానుష్ఠితమస్తు, గయాశ్రాద్ధఫలదమస్తు, అక్షయ తృప్తికరమస్తు, భగవత్ప్రీణనమస్తు"* - అని వారిచే చెప్పించుకొనవలెను.

[526] తరువాత *"అన్నశేషః కిం క్రియతామ్?"* - (అన్నశేషము నేమి చేయవలెను?) అని కర్త అడుగగా, *"ఇష్టైస్సహ భుజ్యతామ్"* - (ఇష్టమైనవారితో భుజింపుము) అని విశ్వేదేవులు చెప్ప వలెను. *"నిమిత్తస్థానే అన్నశేషః కిం క్రియతామ్?"* - (ప్రేతస్థానములోని అన్నశేషము నేమి చేయ వలెను?) - అని అడుగగా, *"అప్సు ప్రక్షిపేత్"* (నీటిలో పడవేయవలెను) - అని ప్రేతస్థానభోక్త

"దాతారో నోఽభివర్ధన్తాం వేదాస్సంతతిరేవ నః।
శ్రద్ధా చ నో మావ్యగమత్ బహు దేయం చ నోఽస్తు॥
అన్నం చ నో బహుభవేత్ అతిథీగ్ంశ్చ లభేమహి।
యాచితారశ్చ నస్సంతు మా చ యాచిష్మ కంచన॥
సత్యా ఏతా ఆశిషస్సన్తు - ఇతి కర్తా ప్రార్థయేత్.
"దాతారో వోఽభివర్ధన్తాం వేదాస్సంతతిరేవ వః।
శ్రద్ధా చ వో మావ్యగమత్ బహు దేయం చ వోఽస్తు॥
అన్నం చ వో బహుభవేత్ అతిథీగ్ంశ్చ లభధ్వమ్।
యాచితారశ్చ వస్సంతు మా చ యాచిధ్వం కంచన॥"
సన్త్వాసిషః - ఇతి బ్రాహ్మణాః వదేయుః.

[527]ఉపవీతీ, "విశ్వేదేవాః ప్రీయన్తామ్" - ఇత్యుక్త్వే, "ప్రీయన్తాం విశ్వేదేవాః" - ఇతి ప్రతి వచనమ్. ప్రాచీనావీతీ, "ఓం స్వధా" - ఇతి దక్షిణాభిముఖస్సన్, సవ్యం జాన్వాచ్య, కస్మింశ్చి త్పాత్రే తిలోదకం గృహీత్వా పితుః పిత్రాదిస్థానే న్యుబ్జ్య, "అస్తు స్వధా" - ఇతి తేన భోక్త్రా ప్రతివచనం పాయాత్. తతః

---

చెప్పవలెను. తదుపరి "దాతారో నోఽభివర్ధన్తాం ---మా చ యాచిష్మ కంచన॥"- అని కర్త ప్రార్థింపగా, "దాతారో వోఽభివర్ధన్తాం ---- మా చ యాచిధ్వం కంచన॥" - అని బ్రాహ్మణులు చెప్పవలెను.

[527] ఉపవీతియై, "విశ్వేదేవాః ప్రీయన్తామ్" - అని అడిగి, "ప్రీయన్తాం విశ్వేదేవాః" - అని చెప్పించుకొని, ప్రాచీనావీతియై, దక్షిణాభిముఖుడై, ఎడమమోకాలును వెనుకకు జాపి, కుడి పాదమును భూమిపై మోపి కూర్చుండి, ఒక దొప్పలో తిలోదకమును తీసికొని పితుః పిత్రాది స్థానభోక్తకు ముందు "ఓం స్వధా" అనుచు దానిని బోర్లించగా, "అస్తు స్వధా" - అని పితృ స్థానభోక్త చెప్పవలెను. తరువాత కర్త "స్వాదుషగ్ం సదః పితరో----తత్రాన్నభ్యా మివేవ శ్చర్మయగ్ం నన్న "- అని చెప్పి ఉపవీతియై ఆ దొప్పను తిలోదకములచే ప్రోక్షించి వెల్లకిల త్రిప్పిపెట్టవలెను.

*"స్వాదుషగ్ం సదః పితరో వయోధాః కృచ్ఛ్రేశ్రితశ్శక్తీవన్తో గభీరాః। చిత్ర సేనా ఇషుబలా అమృధ్రాస్సతో వీరా ఉరవో వ్రాతసాహాః। బ్రాహ్మణా సః పితర స్సోమ్యాస శ్శివే నో ద్యావాపృథివీ అనేహసా। పూషా నః పాతు దురితా దృతావృధో రక్షా మాకిర్నో అఘశగ్ం స ఈశత। సుపర్ణం వస్తే మృగో అస్యా దన్తో గోభిస్సన్నద్ధా పతతి ప్రసూతా। యత్రా నరస్సం చ వి చ ద్రవన్తి తత్రాస్మభ్య మిషవశ్శర్మయగ్ం సన్న్"* - ఉపవీతీ పాత్రం ప్రోక్ష్య, ఉత్తానం కుర్యాత్.

ప్రాచీనావీతీ: *"అష్టావష్టా వన్యేషు ధిష్ణియేషూపదధాత్యష్టాశఫాః పశవః పశూ నేవావరున్ధే షణ్మార్జాలీ యే షడ్వా ఋతవ ఋతవః ఖలు వై దేవాః పితర ఋతూనేవ దేవాన్ పితౄన్ ప్రీణాతి।"* - [528]ఇత్యుపస్థాయ, ఉపవీతీ, ప్రణమ్య, అక్షతాన్ ఆశీర్వాద పూర్వకం గృహీత్వా,

*"ప్రీణాత్వగ్ని రాయుష్మాన్ త్సవనస్పతిభిరాయుష్మాన్ తేనత్వాఽఽయుషాఽఽయుష్మన్తం కరోమి। సోమ ఆయుష్మాన్స ఓషధీభిరాయుష్మాన్తేన త్వాఽఽయుషాఽఽయుష్మన్తం కరోమి। యజ్ఞ ఆయుష్మాన్స దక్షిణాభిరాయుష్మాన్తేన త్వాఽఽయుషాఽఽయుష్మన్తం కరోమి। బ్రహ్మాయుష్మత్తద్బ్రాహ్మణైరాయుష్మత్తేన త్వాఽఽయుషాఽఽయుష్మన్తం కరోమి। దేవా ఆయుష్మన్తస్తేఽమృతేనాయుష్మన్తస్తేన త్వాఽఽయుషాఽఽయుష్మన్తం కరోమి। పితర ఆయుష్మన్తస్తే స్వధయాయుష్మన్తస్తేన త్వాఽఽయుషాఽఽయుష్మన్తం కరోమి। సర్వస్యాప్త్యై సర్వస్య జిత్యై సర్వమేవ తేనా*

---

[528] తరువాత ప్రాచీనావీతియై నిలుచుండి *"అష్టావష్టా వన్యేషు---దేవాన్ పితౄన్ ప్రీణాతి।"*- అని చెప్పి ఉపవీతియై స్వాములకు ప్రణమించి, స్వాముల కాశీర్వాదార్థమై శ్వేతాక్షతల నీయగా, వారు *"ప్రీణాత్వగ్ని రాయుష్మాన్---- సర్వం జయతి "* పర్యంతము చెప్పి కర్తలను దీవించవలెను. అప్పుడు కర్త ఉత్తరీయమును తెఱచి పట్టుకొనగా బ్రాహ్మణులా అక్షతల నా ఉత్తరీయములో వేయవలెను. అట్లువేసిన అక్షతలను ఒక చిన్న పాత్రలో పోసికొని, మఱల ఆ అక్షతలను స్వాముల కిచ్చి తమ్ముల తో సహ కర్త సాష్టాంగప్రణామము చేయగా, వారు *"పితృ ప్రసాదో అస్తు"*- అని కర్తలపై ఆ అక్షతలను వేసి దీవింపవలెను.

*ప్నోతి సర్వం జయతి।"* - ఇతి భోక్తారః ఆశీర్వచనం కుర్యుః. తతః కర్తా తానక్షతాన్ స్వీకృత్య, శ్వేతాక్షతపాత్రే నిధాయ, పునః భోక్తృభ్యః దత్వా, సాష్టాంగం ప్రణమేత్. తదానీం భోక్తారః "పితృ (మాతృ) ప్రసాదో అస్తు"- ఇతి తానక్షతాన్ కర్తౄణాం శిరస్సు ప్రక్షిపేయుః.

[529]ప్రాచీనావీతీ *"----గోత్ర ---శర్మన్ పితః ప్రేత (అథవా, ---గోత్రా ---నామ్నిం మాతః ప్రేతే) నిమిత్త ఉత్తిష్ఠ"* - ఇత్యుత్థాప్య, *"వాజేవాజేஉవత వాజినో నో ధనేషు విప్రా అమృతా ఋతజ్ఞాః। అస్య మధ్వః పిబత మాదయధ్వం తృప్తా యాత పథిభిర్దేవ-యానైః"*- ఇత్యుక్త్వా, ఉపవీతీ, ప్రణమ్య, ఉపచారానుక్త్వా, ఆద్వార మనువ్రజేత్. తత్ప్రకారః

*"పత్రశాకాదిదానేన క్లేశితా యూయ మీదృశాః।*
*తత్సర్వం శజాతం చిత్తేషు విస్మృత్య క్షన్తుమర్హథ॥*
*మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం ద్విజోత్తమ।*
*శ్రాద్ధం సంపూర్ణతాం యాతు ప్రసాదాద్భవతాం మమ॥*
*అద్య మే సఫలం జన్మ భవత్పాదాబ్జవన్దనాత్।*
*అద్య మే వంశజాస్సర్వే యాతా వోஉనుగ్రహాద్దివమ్॥*
*ధన్యా వయం భవత్పాదరజః పూతమిదం గృహమ్।*
*అనుగ్రహాశ్చ యుష్మాభిః కృతోஉస్మాను దయాలుభిః॥*

ఇతి ప్రార్థ్య,ప్రదక్షిణీకృత్య, నిమిత్తసహితః కర్తా తదీయపాదప్రక్షాళనకుణ్డం ప్రాప్య,తస్మిన్ కుణ్డే యవాన్ వికీర్య, *"అస్మత్కులమభివర్ధతామ్"* - ఇతి ప్రార్థయేత్, *"యుష్మత్కుల*

---

529 తరువాత ప్రాచీనావీతియై *"----గోత్ర---శర్మన్---నిమిత్త ఉత్తిష్ఠ"*- అని ప్రేతస్థాననిమంత్రితుని చేతికొక దర్భనొసగి అతనిని లేపి, *"వాజే వాజేஉవత వాజినో నో----తృప్తా యాత పథిభిర్దేవయానైః"* - అని చెప్పి, *"పత్రశాకాదిదానేన--- దయాలుభిః"* - అని ఉపచారములను పలికి, ఉపవీతియై తమ్ముంలతో సహా అతనికి మూడుసార్లు ప్రదక్షిణము చేసి, అతనితో సహా అతనికి కాళ్లు కడిగిన కుణ్డము దగ్గరకు పోయి, కర్త ఆ కుణ్డములో ధాన్యమును (బియ్యమును) వేసి *"అస్మత్కులమభివర్ధతామ్"*- అని నిమిత్తుని ప్రార్థింపగా నతడు *"యుష్మత్కులమభివర్ధతామ్"*- అని చెప్పుచు ఆ కుణ్డములో మట్టిని వేసి పూడ్చవలెను. అప్పుడు కర్త, తమ్ములును, అతనికి దండప్రణామము చేసి, అతనిని ఆసీమాంతము పంపివేసి తిరిగిరావలెను.

మభివర్ధతామ్"- ఇతి భోక్తా ప్రత్యుక్తస్సన్, మృద్భిః కుణ్డం పూరయేత్. తతః కర్తా నిమిత్తం ప్రతి ప్రణమ్య తం ఆసీమాంత మనువ్రజేత్.

[530]తతః ప్రాచీనావీతి, "ఉత్తిష్ఠ అస్మత్పితుః పితృ పితామహప్రపితామహాః", ఉపవీతీ, "అనుగచ్ఛన్తు విశ్వేదేవౌ విష్ణునా సహ" - ఇతి బ్రాహ్మణానుత్థాప్య, "వాజేవాజేఽవత వాజినో నో ధనేషు విప్రా అమృతా ఋతజ్ఞాః। అస్య మధ్వః పిబత మాదయధ్వం తృప్తా యాత పథిభిర్దేవయానైః" - ఇత్యుక్త్వా, ఉపవీతీ, ప్రణమ్య, ఉపచారానుక్త్వా, ఆద్వారమనువ్రజేత్. తత్ప్రకారః:

"పత్రశాకాదిదానేన క్లేశితా యూయ మీదృశాః।
తత్క్లేశజాతం చిత్తేషు విస్మృత్య క్షన్తుమర్హథ॥
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం ద్విజోత్తమాః।
శ్రాద్ధం సంపూర్ణతాం యాతు ప్రసాదాద్భవతాం మమ॥
అద్య మే సఫలం జన్మ భవత్పాదాబ్జవన్దనాత్।
అద్య మే వంశజాస్సర్వే యాతావోఽనుగ్రహాద్దివమ్॥
ధన్యా వయం భవత్పాదరజః పూతమిదం గృహమ్।
అనుగ్రహశ్చ యుష్మాభిః కృతోఽస్మాను దయాలుభిః॥

---

530 తరువాత కర్త ప్రాచీనావీతియై, "ఉత్తిష్ఠ అస్మత్ పితుః పితృపితామహప్రపితామహాః"- అని పితరుల చేతికొక దర్భ నొసగి పితరులను లేపి, ఉపవీతియై "అనుగచ్ఛన్తు విశ్వేదేవాః విష్ణునా సహ"- అని విశ్వేదేవుల చేతికిని, విష్ణువుచేతికిని దర్భల నొసగి వారిని కూడ లేపి, "వాజే వాజే ఽవత వాజినో నో-- తృప్తా యాత పథిభిర్దేవయానైః"-అని చెప్పి, "పత్రశాకాది దానేన----- దయాలుభిః"-అని ఉపచారములను పలికి తమ్ములతో సహ మూడుసార్లు ప్రదక్షిణము చేసి ప్రణమించి, "అస్మత్కులమభివర్ధతామ్"-అని ప్రార్థించి, "యుష్మత్కులమభివర్ధతామ్"అని స్వాములచే చెప్పించుకొని, వారిని ఆ ద్వారాంతము పంపివేయవలెను. ముఖ్యమైన గమనిక: ఇట్లు పంపివేయబడిన భోక్తలు (ముఖ్యముగా ప్రేతస్థానభోక్త) తిరిగి కర్తృగృహమునకు వచ్చి ముందు చేయబోవు పిండసంయోజన, పిండప్రదానాదులను చూడగూడదు.

ఇతి ప్రార్థ్య, ప్రదక్షిణీకృత్య, "అస్మత్కులమభివర్ధతామ్"- ఇతి ప్రార్థ్య, "యుష్మత్కుల మభివర్ధతామ్" - ఇతి ప్రతివచనం ప్రాప్య బ్రాహ్మణానాసీమాంత మనువ్రజేత్.

## పిండప్రదానమ్

[531]ఆగత్య, ఉపవీతీ, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ, -----గోత్రస్య ----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,----గోత్రాయాః-----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) సపిండీకరణ శ్రాద్ధే శ్రాద్ధాన్తే శ్రాద్ధీయపిత్ర్యాణాం అక్షయతృప్త్యర్థం శ్రాద్ధీయపిండప్రదానం కరిష్యే" ఇతి సంకల్ప్య, అగ్నేర్దక్షిణతః త్రేధా దర్భాన్ సంస్తీర్య, "మార్జయన్తాం మమ పితుః పితరః, మార్జయన్తాం మమ పితుః పితామహాః, మార్జయన్తాం మమ పితుః ప్రపితామహాః" - ఇతి పితుః అర్ఘ్యజలముత్సృజ్య, పశ్చిమదర్భేషు "మార్జయన్తాం మమ మాతరః, మార్జయన్తాం మమ పితామహ్యాః, మార్జయన్తాం మమ ప్రపితామహ్యాః" - ఇతి మాతుః అర్ఘ్య జలముత్సృజ్య,

---

[531]స్వాములను పంపివేసి తిరిగి వచ్చి కర్త ఉపవీతియై ప్రాణాయామము చేసి, అటుపైని ప్రాచీనావీతియై "-----గోత్రస్య----శర్మణః పితుః (అథవా,----గోత్రాయాః----నామ్న్యాః మాతుః) ప్రేతస్య సపిండీకరణశ్రాద్ధే శ్రాద్ధాన్తే శ్రాద్ధీయపిత్ర్యాణాం అక్షయతృప్త్యర్థం శ్రాద్ధీయపిండప్రదానం కరిష్యే" -అని సంకల్పించి, అగ్నికి దక్షిణమున దక్షిణాగ్రములుగా ఒక్కొక చాలుకు మూడేసి దర్భల చొప్పున 3 చాళ్లుగా దర్భలను పరచి, "మార్జయంతాం పితుః పితరః, మార్జయంతాం పితుః పితామహాః, మార్జయంతాం పితుః ప్రపితామహాః" - అని చెప్పుచు పితరుల అర్ఘ్యపాత్ర లోని తిలోదకమును ఆ దర్భల మొదళ్లయందు, మధ్యయందు, కొనలయందు పితృతీర్థముతో విడచి, పశ్చిమదర్భలయందు "మార్జయంతాం మమ మాతరః (తల్లి బ్రతికి యుండి తండ్రితల్లి గతించియుండిన మార్జయంతాం పితుర్మాతరః అనియు, తల్లి, తండ్రితల్లి ఇద్దరూ బ్రతికియే యున్నచో మార్జయంతాం పితుః పితామహ్యాః అని చెప్పవలెను), మార్జయంతాం మమ పితామహ్యాః (తండ్రితల్లి జీవించియుండిన పితుః పితామహ్యాః అని చెప్పవలెను), మార్జయంతాం మమ ప్రపితామహ్యాః (తండ్రితల్లి జీవించియుండిన పితుః ప్రపితామహ్యాః అని చెప్పవలెను)" - అని చెప్పుచు పిత్రర్ఘ్యజలమును దర్భల మొదళ్లయందు, మధ్యయందు, కొనలయందును పితృతీర్థముతో విడువవలెను.

[532]అనన్తరం హోమశేషాన్నమిశ్రితాన్నేన షట్పిండాని కృత్వా, స్వల్పాన్నం ప్రత్యేకం నిక్షిప్య, పూర్వోక్త అర్ఘ్యజలప్రదానక్రమేణ పిండప్రదానం కుర్యాత్. తత్ప్రకారః -

*ఏతత్తే మమ పితుః పిత ---గోత్ర ---శర్మన్, యే చ త్వామను*

*ఏతత్తే మమ పితుః పితామహ ---గోత్ర ---శర్మన్, యే చ త్వామను*

*ఏతత్తే మమ పితుః ప్రపితామహ ---గోత్ర ---శర్మన్, యే చ త్వామను*

ఇతి మూల, మధ్య, అగ్రభాగేషు దర్భేషు పిండాని దద్యాత్. "*యే చ త్వామను*" - ఇతి స్వల్పాన్నం పిండానాముపరి వినయేత్. తతః పశ్చిమదర్భేషు

*ఏతత్తే మమ మాతరః ---గోత్రా ---నామ్ని దే, యాశ్చ త్వామను*

*ఏతత్తే మమ పితామహ్యాః ---గోత్రా ---నామ్ని దే, యాశ్చ త్వామను*

*ఏతత్తే మమ ప్రపితామహ్యాః ---గోత్రా ---నామ్ని దే, యాశ్చ త్వామను*

---

[532]తరువాత హోమశేషాన్నముతో ఇతరాన్నమును, వ్యంజనములను కలిపి ఒక పొడవైన ప్రేత పిండమును, ఆరు గుండ్రని పిత్రాదులపిండములను చేసి, కొంత పొడియన్నమును కూడ వేరే ఉంచుకొని, మునుపుఅర్ఘ్యజలమొసగిన క్రమముగానే తూర్పువైపు దర్భలయొక్క మూల, మధ్య,అగ్రభాగములందు మూడు పిండములను "*ఏతత్తే మమ పితుః పిత ---గోత్ర ---శర్మన్*" అను మంత్రములతో నుంచి, "*యేచత్వా మను*" - అని చెప్పినపుడెల్లా పొడియన్నమును పిండములపై నుంచవలెను. ఈ మూడుపిండములను వరుసగా తండ్రి తండ్రికిని, తండ్రి తాత కును, తండ్రి ముత్తాతకును, -----*గోత్ర*----*శర్మన్* అన్నచోట వారివారి పేర్లు చెప్పుచు (ఉదా: *శఠమర్షణగోత్ర శ్రీనివాసశర్మన్*) ఉంచవలెను. తదుపరి పశ్చిమమందున్న దర్భల మూల, మధ్య, అగ్రభాగములందు మూడు పిండములను "*ఏతత్తే మమ మాతరః ----గోత్రా ---- నామ్ని దే*" అను మంత్రములతో గీతలుంచిన స్థానములో గోత్రనామములను, పేరులను చెప్పుచూ (ఉదా: *శఠమర్షణగోత్రా శేషమ్మ నామ్ని దే*) ఉంచి, "*యాశ్చత్వా మను*"- అని చెప్పినపుడెల్లా పొడియన్నమును పిండముపై నుంచవలెను. ఒకవేళ కర్తయొక్కతల్లి బ్రతికి యుండిన, ఈ పిండముల నుంచునప్పుడు క్రమముగా "*ఏతత్తే మమ పితుర్మాతరః, ఏతత్తే మమ పితుః పితామహ్యాః, ఏతత్తే మమ పితుః ప్రపితామహ్యాః*"- అని చెప్పవలెను.

ఇతి షట్పిండప్రదానం కృత్వా (యది మాతా జీవతి, పితుర్మాతరః, పితుః పితామహ్యాః, పితుఃప్రపితామహ్యాః - ఇతి యథాక్రమం వదేత్),

[533]ఉపవీతీ, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ, *"-----గోత్రస్య -----శర్మణః పితుః ప్రేతస్య (అథవా,----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) సపిండీకరణ శ్రాద్ధే నిమిత్త ప్రేత (ప్రేతా) అక్షయతృప్త్యర్థం పిండప్రదానం కరిష్యే"* - ఇతి సంకల్ప్య, మధ్యమదర్భేషు *"మార్జయన్తాం మమ పితః ప్రేత (అథవా, మమ మాతః ప్రేతే)"* - ఇతి ప్రేతార్ఘ్యజల ముత్సృజ్య, *"-----గోత్రాయ పిత్రే ప్రేతాయ (అథవా, ----గోత్రాయై మాత్రే ప్రేతాయై) ఏతం పిండం దదామి"* - ఇతి దత్వా, *"----గోత్ర ----శర్మన్ ప్రేత (అథవా,---గోత్రా----నామ్ని ప్రేతే) ఏతం పిండముపతిష్ఠ"* -ఇత్యుపస్థాయ,

## అర్ఘ్యసంయోజన పిండసంయోజన సంకల్పః

[534]ఉపవీతీ, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ, *"అస్యాం పుణ్యతిథౌ ---గోత్రస్య --- శర్మణః పితుః ప్రేతస్య (అథవా,----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః ప్రేతాయాః) అస్మిన్*

---

[533] తరువాత ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై, *"-----గోత్రస్య---- అక్షయ తృప్త్యర్థం పిండప్రదానం కరిష్యే"* - అని సంకల్పించి, తూర్పుపశ్చిమదర్భలకు మధ్యనున్న దర్భయందు *"మార్జయంతాం మమ పితః ప్రేత (మాతా ప్రేతే)"* - అని పితృతీర్థముతో ప్రేతార్ఘ్య జలమును విడిచి, ఆ దర్భల పైననే *"----గోత్రాయ పిత్రే ప్రేతాయ (అథవా,----గోత్రాయై మాత్రే ప్రేతాయై) ఏతం పిండం దదామి"* - అని (పొడవుగా చేసిన) ప్రేతపిండము నుంచి, *"---గోత్ర --- శర్మన్ ప్రేత (అథవా, -----గోత్రా -----నామ్ని ప్రేతే) ఏతం పిండముపతిష్ఠ"* - అని నిలుచుండి ఉపస్థానమును చేయవలెను. సూచన: ప్రేతార్ఘ్యపాత్రలోని జలమునంతయు ఇప్పుడే వాడుకొనకుండా, తరువాత చేయవలసిన అర్ఘ్యసంయోజనమునకై కొంత మిగిలించుకొనవలెను.

[534] తరువాత అర్ఘ్య,పిండసంయోజనములను చేయవలెను. ఇందుకై కర్త ముందుగా ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై, *"అస్యాం పుణ్యతిథౌ ---- అర్ఘ్యసంయోజనం పిండ సంయోజనం చ కరిష్యే"* - అని సంకల్పించి, ప్రేతార్ఘ్యపాత్రను కుడిచేతిలో పట్టుకొని, దానిని ఎడమచేతితో మూసి, ఎడమకాలిని వెన్కకు జాపి, కుడిపాదమును భూమిపై మోపి కూర్చొని 1,2 మంత్రముల నుచ్చరించుచు పితృతీర్థముతో ప్రేతార్ఘ్యపాత్రలోని జలమును పితుఃపిత్రాదుల

*సపిండీకరణశ్రాద్ధే ప్రేతత్వ (ప్రేతాత్వ) విమోచనార్థం, వస్వాదిపితృలోకావాప్త్యర్థం, పితుః పిత్రాదిపిండైస్సహ సాపిండ్య, సమానోదకసిద్ధ్యర్థం, శాశ్వతవిష్ణులోకావాప్త్యర్థం చ అర్ఘ్యసంయోజనం పిండసంయోజనం చ కరిష్యే* " - ఇతి సంకల్ప్య, ప్రేతార్ఘ్యపాత్రం దక్షిణహస్తే గృహీత్వా, వామహస్తేన పిధాయ, సవ్యం జాన్వాచ్య, దక్షిణపాదేన ఉపవిశ్య,

## అర్ఘ్యసంయోజనమ్

1. *సమానో మంత్రస్సమితిస్సమానీ। సమానం మనస్సహ చిత్తమేషామ్। సమానం కేతో అభిసగం 'రభధ్వమ్। సంజ్ఞానేన వో హవిషా యజామః।*
2. *సమానీవ ఆకూతిః। సమానా హృదయాని వః। సమానమస్తు వో మనః। యథా వస్సుసహాసతి।*

-ఇతి ద్వాభ్యాం ప్రేతార్ఘ్యజలం పితుః పిత్రాద్యర్ఘ్యజలే నినీయ, కర్తా ప్రాచీనావీతీ, దక్షిణాముఖస్సన్ ఉపవిశ్య, నేత్రే నిమీల్య, దర్భరజ్జునా ప్రేతపిండం త్రేధా విభజ్య, పితుఃపిత్రాదిపిండానాం పురతో నిధాయ, వైతరణీగోదాన, దశదానాదికం కుర్యాత్.

## వైతరణీగోదానమ్

[535]ఉపవీతీ, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ, "*పిండసంయోజనకాలే వైతరణీగోదానం కరిష్యే*" - ఇతి సంకల్ప్య, "*శ్రీమహావిష్ణురూపస్య బ్రాహ్మణస్య ఇదమాసనం, ఇదమర్చనమ్*" - ఇతి శ్రోత్రియాయ గంధపుష్పాణి దత్వా, గామలంకృత్య,

---

అర్ఘ్యజలముతో చేర్చవలెను. తదుపరి కర్త ప్రాచీనావీతిగనే ఉండి, దక్షిణాముఖముగ కూర్చొని కనులు మూసికొని, ప్రేతపిండమును దర్భత్రాటితో నొకేసారి కోసి మూడుభాగములు చేసి, ఆ భాగములను మెల్లగా పితుః పితృపితామహప్రపితామహుల పిండముల కభిముఖముగా త్రిప్పవలెను (మాతృశ్రాద్ధములో పితుర్మాత్రాదుల పిండముల వైపునకు త్రిప్పవలెను). తరువాత ప్రేత వైతరణీనదిని దాటి బ్రహ్మలోకమును చేరుకొనుటకై వైతరణీగోదానమును, దశదానాదులను చేయవలెను.

[535] వైతరణీగోదానము: కర్త ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై "*పిండసంయోజనకాలే వైతరణీగోదానం కరిష్యే*" - అని సంకల్పించి, "*శ్రీమహావిష్ణురూపస్య బ్రాహ్మణస్య*

*యమద్వారే పురే ఘోరే తప్తా వైతరణీనదీ।*
*తాం తర్తుం గాం ప్రదాస్యామి బ్రహ్మలోకజిగీషయా॥*
*గవామఙ్గేషు తిష్ఠన్తి భువనాని చతుర్దశ।*
*తస్మాదస్యాః ప్రదానేన అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥*

*-----గోత్రాయ శర్మణే -----శాఖాధ్యాయినే యత్కించిద్దక్షిణాసహితం ఇమాం గాం తుభ్యమహం సంప్రదదే నమమ"* - ఇతి బ్రాహ్మణాయ గాం దత్వా,

## దశవిధదానాని

[536]"*గో-భూ-తిల-హిరణ్య-ఆజ్య-వాసో-ధాన్య-గుడాని చ। రౌప్యం-లవణమిత్యాహు ర్దశదానాః ప్రకీర్తితాః॥"* - ఇతి దశదానాని.

**కర్తా ఉపవీతీ ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ, *"పిండసంయోజనకాలే దశదానాని కరిష్యే "* - ఇతి సంకల్ప్య, యథావద్దద్యాత్. అశక్తశ్చేత్ హిరణ్యం దద్యాత్. తత్ప్రకారః**

---

*ఇదమాసనం, ఇదమర్చనమ్"* - అని ఒక శ్రోత్రియుని గంధపుష్పాదులచే నర్చించి, గోవు నలంకరించి, *"యమద్వారే పురే ---ప్రయచ్ఛ మే॥ --- గోత్రాయ శర్మణే --- తుభ్యమహం సంప్రదదే నమమ"*- అని గోపుచ్ఛమును తాకి తిలోదకములతోసహ బ్రాహ్మణునికి గోదానమును చేయవలెను. ఒకవేళ గోవు లేకున్న *"---గోత్రాయ శర్మణే ---శాఖాధ్యాయినే వైతరణీగోదానప్రతినిధి యత్కించిద్ధిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ"* - అని చెప్పి తిలలతోగూడిన దక్షిణను జలముతో సహ భూమిపై విడిచి, దానిని బ్రాహ్మణునికి దానము చేయవలెను

[536]దశదానములు: గోవు, భూమి, తిలలు, బంగారు, నేయి, వస్త్రములు, ధాన్యము, బెల్లము, వెండి, ఉప్పు - ఇవి దశదానములు. ఇవి యున్నచో కర్త ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై *"పిండసంయోజనకాలే దశదానాని కరిష్యే"* అని సంకల్పించి వానిని దానము చేయవలెను. లేకున్నచో *"పిండసంయోజనకాలే దశదానాని హిరణ్యరూపేణ కరిష్యే"* అని సంకల్పించి, *"హిరణ్యగర్భగర్భస్థం --- అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥ ఇదం దశదానప్రత్యామ్నాయం సతద్ధిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ"* - అని చెప్పి దశదానములకు బదులుగా దక్షిణను, తిలలను జలముతోసహ భూమిపై విడిచి బ్రాహ్మణుల కీయవలెను. దశదానసంకల్పములను, శ్లోకములను అనుబంధములో చూచునది.

*హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।*

*అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

*ఇదం దశదానప్రత్యామ్నాయం ఏతద్ధిరణ్యం తుభ్యమహం సంప్రదదే నమమ -*

ఇతి శ్రోత్రియాయ తిలసహితహిరణ్యదానం దద్యాత్. తదనంతరం

## సాలగ్రామదానమ్

[537] ఉపవీతీ ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ, *"పిండసంయోజనకాలే సాలగ్రామదానం కరిష్యే"* - ఇతి సంకల్ప్య,

*సాలగ్రామశిలా వక్త్రే భువనాని చతుర్దశ।*

*తస్మాదస్య ప్రదానేన అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥*

*ఇదం సాలగ్రామం తుభ్యమహం సంప్రదదే నమమ"* - ఇతి శ్రోత్రియాయ సాలగ్రామ దానం దద్యాత్. తదనంతరం పిండసంయోజనం కుర్యాత్.

## పిండసంయోజనమ్

*"ఓం మధు వాతా ఋతాయతే మధు క్షరన్తి సిన్ధవః। మాధ్వీర్నస్సన్త్వోషధీః। మధు నక్తముతోషసి మధుమత్పార్థివగ్ం రజః। మధు ద్యౌరస్తు నః పితా। మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః। మాధ్వీర్గావో భవన్తు నః। "*

*"సంగచ్ఛధ్వగ్ం సంవదధ్వమ్। సం వో మనాగ్ంసి జానతామ్। దేవా భాగం యథా పూర్వే। సంజానానాం ఉపాసతే। సమానో మంత్రస్సమితిస్సమానీ। సమానం మనస్సహ చిత్తమేషామ్। సమానం కేతో అభిసగ్ం రభధ్వమ్। సంజ్ఞానేన వో హవిషా యజామః। సమానీవ ఆకూతిః। సమానాహృదయాని వః। సమానమస్తు వో మనః।*

---

[537] సాలగ్రామదానము: తరువాత పితృైన సాలగ్రామదానము చేయవలెను. దీనికి ప్రయోగము: కర్త ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై *"పిండసంయోజనకాలే సాలగ్రామ దానం కరిష్యే"* అని సంకల్పించి, *"సాలగ్రామశిలావక్త్రే --- అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥ ఇదం సాలగ్రామం తుభ్యమహం సంప్రదదే నమమ"*- అని చెప్పి సాలగ్రామమును దక్షిణతో సహ బ్రాహ్మణునకు దానము చేయవలెను.

*యథా వస్సుసహా సతి॥"*

[538]ఇత్యంతేన ప్రేతపిండభాగత్రయం యుగపదేవ పితుః పిత్రాదిపిండైః సంయోజ్య (మాతృ సపిణ్డీకరణశ్రాద్ధే మాతృప్రేతాపిండశకలాని పితుర్మాతృ, పితుః పితామహి, పితుః ప్రపితా మహీనాం పిండత్రయేణ సంయోజ్య), ఉత్థాయ, అంజలిం బద్ధ్వా,

*"యే సమానాస్సమనసః॥ పితరో యమరాజ్యే / తేషాం లోక స్స్వధా నమః॥ యజ్ఞో దేవేషు కల్పతామ్॥ యే సజాతాస్స మనసః॥ జీవా జీవేషు మామకాః॥ తేషాగ్ం శ్రీర్మయి కల్పతామ్॥ అస్మిన్ లోకే శతగ్ం సమాః॥"* - ఇతి పిండానుపస్థాయ, నమస్కృత్య, *"ఇతః పరం ప్రేతశబ్దో నాస్తి"* - ఇత్యుచ్చార్య, అనంతరం పాథేయదానం కుర్యాత్.

---

538 ఆపైన, 1)*"మధువాతా ఋతాయతే---మాధ్వీర్గావో భవన్తు నః"*, 2) *"సంగచ్ఛధ్వం---యథావస్సుసహా సతి"* - అను మంత్రములతో ఇదివఱకే 3 భాగములు చేసిన ప్రేతపిండమును, వరుసగా పితృపితుః పితృపితామహ పితృప్రపితామహ (లేదా మాతృసపిండీకరణమందు పితుర్మాతృ, పితృపితామహి, పితృప్రపితామహి) పిండములతో కలిపివేయవలెను (గమనిక: ఇట్లు కలుపునప్పుడు కర్త వంగి, మోచేతివఱకుగల తన ఎడమచేతిని తూర్పున దర్భలపై నుంచిన పితుఃపిత్రాదిపిండముల కానించి యుంచి, మోచేతివఱకు గల తన కుడిచేతితో మధ్య నున్న మూడు ప్రేతపిండశకలములను పిత్రాదిపిండములవైపుకు జరుపుచు వచ్చి, ఆమూడు శకలముల నొకేసారి పితుఃపిత్రాదిపిండములతో కలుపవలెను. మాతృసపిండీకరణమందు మధ్యమపిండశకలములను పితుర్మాత్రాది పిండములవైపు జరుపుచు పోయి, వానితో నొకే సారి సంయోజనము చేయవలెను. ఇట్లు సంయోజనము చేసిన తర్వాత, సంయోజనము చేసిన శకలములను పితృ (లేక మాతృ) పిండములతో కలిపివేసి ఏకముగా ముద్దలను కట్టి తత్తత్ స్థానములలో నుంచవలెను.) తర్వాత కర్త దక్షిణాభిముఖుడై అంజలిబద్ధుడై లేచి నిలబడి *"యే సమానా స్స మనసః--- అస్మిన్ లోకే శతగ్ం సమాః॥"* అని చెప్పి, పిండములకు వంగి నమస్కరించి, కూర్చుండి, పిండములకు నమస్కరించుచు *"ఇతఃపరం ప్రేతశబ్దో నాస్తి"* - అని చెప్పవలెను. దీని తర్వాత జరుగు కర్మలయందు ప్రేతశబ్దమునకు తావు లేదు.

## పాథేయదానమ్

[539]ఉపవీతీ, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ, *"శ్రీభగవదాజ్ఞయా శ్రీభగవత్కైఙ్కర్య రూపం ----వృద్ధప్రపితామహ (---ప్రపితామహి) ప్రీత్యర్థం పాథేయదానం కరిష్యే"*- ఇతి సంకల్ప్య, *"వృద్ధప్రపితామహస్య (అథవా, వృద్ధప్రపితామహ్యాః) రూపస్య బ్రాహ్మణస్య ఇదమాసనమ్"* - ఇత్యాసనం దత్వా,

*దేశాద్దేశం ప్రయాతానాం అధ్వశ్రమహరం పరమ్/*
*పాథేయం పుణ్డరీకాక్ష తృప్తి శర్మ ప్రయచ్ఛతు//*
*నానాశాకసమాయుక్తం, అపూపైశ్చసమన్వితమ్/*
*ప్రపితామహతృప్త్యర్థం దదే పాథేయబన్ధనమ్//*

---

[539]పాథేయదానము: శ్రాద్ధమెప్పుడును పితృ, పితామహ, ప్రపితామహులను (లేదా మాతృ, పితామహి, ప్రపితామహిలను) గూర్చియే యుండును. అందువల్ల కర్తయొక్క తండ్రి మరణించినప్పుడు 11వనాడు అతని ప్రేతకుమాత్రమే ఏకోద్దిష్టశ్రాద్ధమును చేసి, 12వ నాడు ప్రేత యొక్క పితృ, పితామహ, ప్రపితామహులకు, ప్రేతకుగూడ సపిండీకరణశ్రాద్ధమును చేసి, పిండప్రదానము చేసి, పిండసంయోజనమును చేసి, పితృస్థానమున ప్రేతను, పితామహుని స్థానమున ప్రేతపితరుని, ప్రపితామహుని స్థానమున ప్రేత పితామహుని చేర్చి, మునుపటి ప్రపితామహునికి (ఇతడే వృద్ధప్రపితామహుడు) పాథేయమును (దారిబత్తెమును) ఇచ్చి పంపి వేయవలెను. (సూచన: మాతృసపిండీకరణమందు పితుః ప్రపితామహికి పాథేయదానము). దీనికి ప్రయోగము: కర్త ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై *"శ్రీభగవదాజ్ఞయా శ్రీభగవత్కైఙ్కర్యరూపం ---వృద్ధప్రపితామహ (---ప్రపితామహి) ప్రీత్యర్థం పాథేయదానం కరిష్యే"* - అని సంకల్పించి, *"వృద్ధప్రపితామహస్య రూపస్య బ్రాహ్మణస్య ఇదమాసనమ్"* - అని ఒక బ్రహ్మచారికి ఆసనార్థం దర్భలను వేసి, *"దేశాద్దేశం ప్రయాతానాం---అతశ్శాంతిం ప్రయచ్ఛ మే// పాథేయం సదక్షిణాకం సతాంబూలం తుభ్యమహం సంప్రదదే నమమ"* అని పెరుగన్నము నొక మూటలో గట్టి దానిని దక్షిణాతాంబూలముతో సహా ఆ బ్రహ్మచారికి దానమీయవలెను. పెరుగన్నము లేకున్నచో, బియ్యమును, టెంకాయను మూటగట్టి దక్షిణా తాంబూలముతో సహా బ్రహ్మచారికి దానమీయవలెను.

హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।
అనంతపుణ్యఫలదం అతశ్శాంతిం ప్రయచ్ఛ మే॥
---గోత్రస్య శర్మణః పితృభూతస్య మమ వృద్ధపితామహస్య (అథవా, వృద్ధప్రపితామహ్యాః) మహోక్షున్ని వారణార్థం ఇదం పాథేయబన్ధనం సదక్షిణాం సతామ్బూలం తుభ్యమహం సంప్రదదే నమమ" - ఇతి పాథేయదానం బ్రహ్మచారిణే దద్యాత్.

[540]అనంతరం సంస్పృష్టేనార్ఘ్యజలేన

"మార్జయన్తాం మమ పితరః, మార్జయన్తాం మమ పితామహాః, మార్జయన్తాం మమ ప్రపితామహాః," - ఇతి పూర్వదర్భేషు,

"మార్జయన్తాం మమ మాతరః,మార్జయన్తాం మమ పితామహ్యః,మార్జయన్తాం మమ ప్రపితామహ్యః" - ఇతి పశ్చిమదర్భేషు తత్తత్పిండోపరి పితృతీర్థేన అపో దత్వా,

[541]"యేచవోత్ర యేచాస్మాస్వానగేం సంతే" - ఇతి పితృపిండానుపస్థాయ,

"యాశ్చవోత్ర యాశ్చాస్మాస్వానగేం సంతే" - ఇతి మాతృపిండానుపస్థాయ,

---

[540]తదుపరి "మార్జయన్తాం మమ పితరః, మార్జయన్తాం మమ పితామహాః, మార్జయన్తాం మమ ప్రపితామహాః, మార్జయన్తాం మమ మాతరః, మార్జయన్తాం మమ పితామహ్యః, మార్జయన్తాం మమ ప్రపితామహ్యః" - అనుచు సంస్పృష్టార్ఘ్యజలమును పితృ, పితామహ, ప్రపితామహ, మాతృ, పితామహి, ప్రపితామహిపిండములపై పితృతీర్థముతో విడువవలెను. సూచన: పితృ సపిండీకరణము చేయునప్పుడు తల్లి జీవించియే యున్నచో, "మార్జయన్తాం మమ పితు ర్మాతరః, మార్జయన్తాం మమ పితుః పితామహ్యః, మార్జయన్తాం మమ పితుః ప్రపితామహ్యః" - అని చెప్పవలెను. తల్లి సపిండీకరణము చేయునప్పుడు తండ్రి బ్రతికియే యున్నచో, "మార్జ యన్తాం మమ పితుః పితరః, మార్జయన్తాం మమ పితుః పితామహాః, మార్జయన్తాం మమ పితుః ప్రపితామహాః" - అని చెప్పవలెను.

[541]"యేచవోత్ర యేచాస్మాస్వానగేం సంతే" - అని పితృపిండములకు, "యాశ్చవోత్ర యాశ్చాస్మాస్వానగేం సంతే" - అని మాతృపిండముల కుపస్థానము చేసి (అనగా, దక్షిణాభిముఖుడై లేచి నిలబడి నమస్కరించి), "తేచ వహన్తామ్" - అని పితృపిండములను, "తాశ్చ వహన్తామ్" - అని మాతృపిండములను ఎత్తిపట్టుకొని, "తృప్యన్తు భవన్తః" - అని పితృపిండము

"తేవ వహన్తామ్"-ఇతి పితృపిండాన్, "తాశ్చ వహన్తామ్"- ఇతి మాతృపిండాన్, "తృప్యన్తు భవన్తః"- ఇతి పితృపిండాన్, "తృప్యన్తు భవత్యః"- ఇతి మాతృపిండాన్, "తృప్యత, తృప్యత, తృప్యత" - ఇత్యుభయపిండాన్ ఉపస్థాయ, తిలోదకపాత్రం (అర్ఘ్యపాత్రమ్) దక్షిణహస్తే నిధాయ, సవ్యేన పాణినా పిధాయ,

- [542] "పుత్రాన్ పౌత్రానభితర్పయన్తీరాపో మధుమతీరిమాః। స్వధాం పితృభ్యో అమృతం దుహానా ఆపో దేవీరుభయాగ్ంస్తర్పయన్తు। తృప్యత, తృప్యత, తృప్యత" - ఇతి పితృతీర్థేన ప్రపితామహీపిండమారభ్య, త్రిః అప్రదక్షిణం సంతతధారయా నిసిచ్య; తత్పాత్రం పిండానాం దక్షిణతః న్యుబ్జ్య, ఉపవీతీ, ప్రోక్ష్య, ఉత్తానం కృత్వా, ప్రాచీనావీతీ, పిండపితృదేవతాభ్యః షోడశోపచారపూజాం కుర్యాత్.

*షోడశోపచారపూజా: పిండపితృదేవతాభ్యో నమః, ధ్యాయామి, ఆవాహయామి, ఆసనం సమర్పయామి, పాదయోః పాద్యం సమర్పయామి, హస్తయో*

---

లను, "తృప్యన్తు భవత్యః"- అని మాతృపిండములను మణల భూమిపై నుంచి, "తృప్యత, తృప్యత, తృప్యత" అని ఏకధాటిగా చెప్పుచు అన్ని పిండములకు అంజలించి నమస్కరించి,

[542] సంసృష్టార్ఘ్యపాత్రను కుడిచేతిలో నుంచుకొని, ఎడమచేతితో దానిని మూసి, "పుత్రాన్ పౌత్రానభితర్పయన్తీరాపో మధుమతీరిమాః। స్వధాం పితృభ్యో అమృతం దుహానా ఆపో దేవీరుభయాగ్ంస్తర్పయన్తు। తృప్యత, తృప్యత, తృప్యత"- అను మంత్రముతో ప్రపితామహీ పిండమునుండి మొదలిడి మూడుసార్లు అప్రదక్షిణముగా అన్నిపిండముల చుట్టును ఆ అర్ఘ్య పాత్రలోని నీటిని పితృతీర్థముతో ధారగా విడిచి, ఆ పాత్రను పిండములకు దక్షిణమున బోర్లించి, ఉపవీతియై ప్రోక్షించి మణల త్రిప్పి పెట్టి, ప్రాచీనావీతియై "పిండపితృదేవతాభ్యో నమః ధ్యాయామి, ఆవాహయామి" అని పిండములపై తిలలను చల్లి పిండపితృదేవతల నావాహనము చేసి, షోడశోపచారపూజను చేసి, వడలు, సొజ్జెప్పము, నూలఉండలు, మున్నగు వానిని నైవేద్యముగా నుంచి, తామ్బూలాదుల సమర్పించి, "సర్వోపచారాన్ సమర్పయామి"- అని తిలలను చల్లి, మృతునికంటె చిన్నవారైన జ్ఞాతులతో సహ పిణ్డములకు సాష్టాంగదండప్రణామము చేసి, ముగింపవలెను. ఇట్లు చేయునప్పుడు, మాతృపిండముల వద్ద పసుపు, కుంకుమల నుంచుట సంప్రదాయము.

ర్ఘ్యం సమర్పయామి, ఔపచారికస్నానం సమర్పయామి, స్నానానన్తరం శుద్ధా చమనీయం సమర్పయామి, వస్త్రార్థం తిలాన్ సమర్పయామి, యజ్ఞోపవీతార్థం తిలాన్ సమర్పయామి, గన్ధం సమర్పయామి, పుష్పం సమర్పయామి, తులసీ దళాని సమర్పయామి, ధూపమాఘ్రాపయామి, దీపం దర్శయామి, మాషాఽపూప నైవేద్యం సమర్పయామి, పాదౌ ప్రక్షాళయామి, హస్తౌ ప్రక్షాళయామి, తామ్బూలం సమర్పయామి, సువర్ణమన్త్రపుష్పం సమర్పయామి, సర్వోపచారాన్ సమర్ప యామి - ఇతి పిణ్డపితృదేవేభ్యః షోడశోపచారపూజాం కృత్వా,

ప్రాశనమ్:[543] కించిదన్నమాదాయ, "*ప్రాణే నివిష్టోఽమృతం జుహోమి/ బ్రహ్మణి మ ఆత్మా ఽమృతత్వాయ*" - ఇతి గ్రాసమాత్రం ప్రాశ్య, ఆచమ్య, "*పిండపితృదేవతాభ్యో నమః/ యథాస్థానం ప్రతిష్ఠాపయామి*" - ఇతి పిండోపరి తిలాన్ ప్రకీర్య, నేత్రౌ నిమీల్య మధ్యమపిండ మన్యపాత్రే నినీయ, నేత్రౌ ఉన్మీల్య ఇతరపిండాని తదేవపాత్రే నినీయ, సర్వాణి పిండాని అప్సు ప్రక్షిపేత్. ఔపాసనాగ్నిం ఆత్మసమారోపణం కుర్యాత్. లౌకికాగ్నిశ్చేత్ యథా స్థానం ప్రతిష్ఠాపయేత్.

## ఆత్మసమారోపణమ్:

కర్తా పునః ద్వాభ్యాం దర్భాభ్యాం కృతం పవిత్రం ధృత్వా, ఉపవీతీ, ప్రాణానాయమ్య, శ్రీ *భగవదాజ్ఞయా భగవత్కైఙ్కర్యరూపం ఆత్మ సమారోపణం కరిష్యే* "- ఇతి సంకల్ప్య, పవిత్రం విసృజ్య, దక్షిణకరతలే ఆజ్యలేపనం కృత్వా, అగ్నిజ్వాలాం దర్శయన్

---

[543] పిండప్రదానము చేయుగా మిగిలిన యన్నములో స్వల్పమాత్రము తీసికొని "*ప్రాణే నివిష్టోఽమృతం జుహోమి/ బ్రహ్మణిమ ఆత్మా ఽమృతత్వాయ*"- అని నోటిలో వేసికొని, ఆచమ నము చేసి, "*పిండపితృదేవతాభ్యో నమః/ యథాస్థానం ప్రతిష్ఠాపయామి*" - అని పిండములపై తిలలను చల్లి, కన్నులు మూసికొని మధ్యమపిండము వొక పాత్రలో నుంచి, అట్లే కన్నులు మూసికొని ఇతరపిండములను కూడ అదే పాత్రలో నుంచి, అన్ని పిండములను, హోమపాత్ర లను నీటిలో పడవేసి, ఔపాసనాగ్నిని ఆత్మసమారోపణము చేసికొనవలెను. లేదా లౌకికాగ్నితో సపిండీకరణమును చేసినచో ఆ అగ్నిపై అక్షతలు వేసి యథాస్థానప్రతిష్ఠాపనము చేయవలెను.

*"యా తే అగ్నే యజ్ఞియా తనూస్తయే హ్యారోహాత్మా ౨ ౨త్మానమ్/ అచ్ఛావసూని కృణ్వన్నస్మే నర్యా పురూణి/ యజ్ఞో భూత్వా యజ్ఞమాసీద స్వాం యోనిమ్/ జాతవేదో భువ అజాయమాన స్సక్షయ ఏహి/"*-[544] ఇతి త్రివారం జపిత్వా, హస్తేనాగ్నౌ ప్రతప్య చ, క్రమశః ముఖే, హృదయే, నాభౌ చ త్రివారం తం హస్తం స్పృశేత్. తతః పునః పవిత్రం ధృత్వా సాత్త్వికత్యాగం కుర్యాత్.

## సాత్త్వికత్యాగః:

[545]అనంతరం, *"భగవానేవస్వనియామ్యస్వరూపస్థితిప్రవృత్తి స్వశేషతైకరసేన అనేన ఆత్మనా స్వకీయశ్చోపకరణైః స్వారాధనైకప్రయోజనాయ పరమపురుషన స్సర్వశేషీ శ్రియఃపతిః స్వశేషభూతమిదం -----గోత్రస్య -----శర్మణః పితుః (అథవా, -----గోత్రాయాః -----నామ్న్యాః మాతుః) సపిండీకరణశ్రాద్ధం స్వస్మై స్వప్రీతయే స్వయమేవ కారితవాన్"*,- ఇతి సాత్త్వికత్యాగం కృత్వా, సోదకుంభశ్రాద్ధం కుర్యాత్.

**సోదకుంభశ్రాద్ధమ్:** ప్రేతమృతాహాద్ద్వాదశాహాదారభ్య వత్సరాంతం సోదకుంభ శ్రాద్ధం ప్రతిదినం త్రిపురుషోద్దేశేన, ఏకపురుషోద్దేశేన వా, విశ్వేదేవ, విష్ణువరణ, ఆవాహన, హోమ, స్వధావినయన, వికిర పిండప్రదానవర్జం సంకల్పవిధానేన కుర్యాత్ --

---

[544]ఔపాసనాగ్నిని కర్త తన హృదయములో నావేశించుకొనుటకు ఆత్మసమారోపణమని పేరు. దీని విధాన మిట్లున్నది: కర్త మూడుదర్భల పవిత్రమును తీసివేసి రెండుదర్భల పవిత్ర మును ధరించి, ఉపవీతియై ప్రాణాయామము చేసి, *"శ్రీభగవదాజ్ఞయా భగవత్కైంకర్యరూపం ఆత్మసమారోపణం కరిష్యే"* - అని సంకల్పించి, పవిత్రమును తీసివేసి, కుడి అఱచేతికి నేతిని రాచుకొని, ఆ చేతిని అగ్నిజ్వాలకు చూపించుచు *"యా తే అగ్నే యజ్ఞియా.."* - అను మంత్ర మును మూడుసార్లు పఠించి, కుడి అఱచేతిని అగ్నిచుట్టును ప్రదక్షిణముగా త్రిప్పుచు 3 సార్లు తన నోటిని, మఱల ప్రదక్షిణముగా త్రిప్పుచు 3 సార్లు తన వక్షస్థలమును, మఱల ప్రదక్షిణ ముగా త్రిప్పుచు 3 సార్లు తన నాభిని స్పృశించి, మఱల పవిత్రమును ధరించి సాత్త్వికత్యాగ మును చేయవలెను.

[545] తదుపరి *"భగవానేవ ---- స్వయమేవ కారితవాన్"*- అని చెప్పి సాత్త్వికత్యాగమును చేసి, ఆ తర్వాత సోదకుంభశ్రాద్ధమును చేయవలెను.

*"ఆవాహనాగ్నౌకరణ స్వధానినయనం తథా/*
*వికిరం పిండదానం చ సంకల్పే పంచ వర్జయేత్//" -ఇతి*

*ఉదకుంభదానమంత్రః*

*"వారిణాపూరితం కుంభం వాససాపరివేష్టితమ్/*
*తస్మాదస్య ప్రదానేన అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే//"*

*ఇదముదకుంభం పితృలోకవాసజనిత క్షుత్తృష్ణాశాన్త్యర్థం పితృపితామహప్రపితామహేభ్యః (అథవా, మాతృపితామహీప్రపితామహీభ్యః) తృప్తిం కామయమానః తుభ్య మహం సంప్రదదే నమమ"* -ఇతి. అథ మాసికాదిశ్రాద్ధపూర్వేద్యుః అతీతసోదకుంభశ్రాద్ధాని అకృష్య ఆమశ్రాద్ధవిధానేన కుర్యాత్.

*ఆమశ్రాద్ధమ్*

[546]కర్తా పాణిపాదౌ ప్రక్షాళ్య, ఆచమ్య, పవిత్రపాణిః, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతీ *"శ్రీ గోవింద,గోవింద,గోవిందేత్యస్యాం* ***పుణ్యతిథౌ*** *శ్రీభగవదాజ్ఞయా భగవత్కైంకర్య రూపం ----గోత్రస్య ----శర్మణః పితుః (అథవా, -----గోత్రాయాః ----నామ్న్యాః మాతుః) అముక మాసికశ్రాద్ధాన్యదినమారభ్య పూర్వేద్యుః పర్యంతాని అహరహః కర్తవ్యాని సోదకుంభశ్రాద్ధాని ఆమరూపేణ హిరణ్యరూపేణ వ తంత్రతః అద్య కరిష్యే"*

[546] ఆమరూపసోదకుంభశ్రాద్ధవిధానము: కర్త కాళ్లుచేతులు కడిగికొని, ఆచమించి, పవిత్రమును ధరించి ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై *"శ్రీగోవింద --- తంత్రతః అద్య కరిష్యే"* - అని సంకల్పించి, బ్రాహ్మణుని ముందొక అరటియాకులో బియ్యము, పెసరపప్పు, బెల్లము, తిలలు, అరటి పండ్లు, నేయి, తామ్బూలము, దక్షిణల నుంచి (దీనికే ఆమమని పేరు), *"ఓం తత్సవితుర్వరేణ్యం---ప్రచోదయాత్/* - అని ఆ ఆమమును ప్రోక్షించి, *"దేవసవితః ప్రసువ/"*- అని అప్రదక్షిణముగా పరిషేచనము చేసి, బ్రాహ్మణుని చేతిలో కూర్చతో శుద్ధోకము నొసగి, *"పృథివీ తే పాత్రం --- స్వధా విష్ణో ఆమం రక్షస్వ/ ---గోత్రస్య ---శర్మణః --- తుభ్యమహం సంప్రదదే నమమ"* - అని ఆమము నుంచిన ఆకుముదట దక్షిణాగ్రభుగ్నము నుంచి, ఆమమును బ్రాహ్మణున కొసగి, ఆచమనము చేయవలెను.

- ఇతి సంకల్ప్య, బ్రాహ్మణానాం పురతః తండుల, ముద్గ, గుడ, తిల, కదళీఫల, ఘృత, తామ్బూల, దక్షిణాదిని కదళీపాత్రే నిధాయ,

*"ఓం తత్సవితుర్వరేణ్యం। భర్గోదేవస్య ధీమహి। ధియో యోనః ప్రచోదయాత్।" -*

ఇత్యామం ప్రోక్ష్య, *"దేవసవితః ప్రసువ"* - ఇత్యప్రదక్షిణం పరిషిచ్య,

*"పృథివీ తే పాత్రం ద్యౌరపిధానం బ్రహ్మణస్త్వా ముఖే జుహోమి బ్రాహ్మణానాం త్వా ప్రాణాపానయోర్జుహోమ్యక్షితమసి మైషాం క్షేష్ఠా అముత్రాముష్మిన్ లోకే। ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదమ్। సమూఢమస్య పాగ్ంసురే। స్వధా విష్ణో ఆమం రక్షస్వ। - ----గోత్రస్య-----శర్మణః పితుః (అథవా, ----గోత్రాయాః ---నామ్న్యాః మాతుః) అముక మాసికశ్రాద్ధాన్యదినమారభ్య పూర్వేద్యుః పర్యంతాని అహరహః కర్తవ్యాని అద్య సోదకుంభశ్రాద్ధం సాఽఽమం సశాకం ససోపస్కరం సదక్షిణాకం సతామ్బూలం - ----గోత్రేభ్యః----శర్మేభ్యః వసురుద్రాదిత్యస్వరూపేభ్యః అస్మత్పితృ పితామహ ప్రపితామహేభ్యః (అథవా, మాతుః పితామహప్రపితామహీభ్యః) తృప్తిం కామయమానః తుభ్యమహం సంప్రదదే నమమ"* - ఇతి పాత్రాగ్రే దక్షిణాగ్రభుగ్నం విక్షిప్య,

*"ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః।*
*త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వభుగవ్యయః॥*
*హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః।*
*అనంతపుణ్యఫలదం అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥*
*తండులాన్ వైశ్వదేవత్యాః పాకేనాన్నం పచన్తి యే*
*తస్మాత్తండులదానేన అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥"*

*ఇమాని యత్కించిత్ హిరణ్యాని ఆమరూపాణి సోపస్కరాణి ---గోత్రాయ --- శర్మణే తుభ్యమహం సంప్రదదే నమమ। అనేన సోదకుంభశ్రాద్ధారాధనేన వసురుద్రాదిత్యస్వరూప అస్మత్పితృపితామహప్రపితామహరూపీ (అథవా, మాతృ పితామహి ప్రపితామహిరూపీ) శ్రీజనార్దనః ప్రీయతామ్"* - ఇతి సతులసీదళం యవతిలోదకం భుగ్నోపరి ఉత్సృజ్య, తాంబూలదక్షిణాం చ బ్రాహ్మణాయ దత్వా, ఆచమేత్.

# తిరువధ్యయనవిధిః

సపిండీకరణానంతరము శ్రీవైష్ణవసిద్ధాంతప్రకారము దివ్యప్రబంధానుసంధానమును చేసి శ్రీపాదతీర్థగ్రహణము చేసిననే కాని కర్తలకు పరిపూర్ణమైన శుద్ధి గాదు. దీనికే తిరువధ్యయన విధి యనియు కొన్ని ప్రాంతములలో వాడుక యున్నది. ఈ విధి శ్రీమాన్ కందాడై శ్రీనివాసా చార్యులవారి "అపరప్రయోగానుక్రమణిక"లో సవిస్తరముగా వివరింపబడినది. ఈ గ్రంథ మిప్పుడు అనుపలభ్యమానమగుటచే, లోకోపకారార్థమై అందులోని విషయ మిక్కడ పునరుక్త మగుచున్నది. ఇందులకు శ్రీమాన్ శ్రీనివాసాచార్యులకు ఆస్తికలోకమెల్లను అపారకృతజ్ఞతా పూర్వకముగ ఋణపడియున్నది.

12వ నాటి (అనగా, సపిండీకరణము జరిగిననాటి) సాయంత్రమే కర్తలు తిరువారాధన గృహమును శోధింపజేసి, మ్రుగ్గులచే నలంకరింపజేసి, స్నానసంధ్యావందనాదులను పూర్తి చేసికొని, దివ్యప్రబంధానుసంధానమును (సేవాకాలమును) చేయుటకై భాగవతోత్తములను (స్వాములను) ప్రణామపూర్వకముగా ప్రార్థించి, వారిని తమ గృహమునకు వేంచేపు చేసికొని వచ్చి, వారిలో నొక ప్రముఖభాగవతోత్తమునిచే తిరువారాధన చేయింపవలెను. తరువాత భాగవతోత్తములు (స్వాములు) భగవత్సన్నిధిలో గోష్ఠిగా కూర్చుండవలెను. అప్పుడు కర్తలు నైచ్యానుసంధానపూర్వకముగా పెరుమాండ్లకు, గోష్ఠికి సాష్టాంగప్రణామము చేసి కూర్చుం డగా స్వాములు "రామానుజదయాపాత్రం (లేదా శ్రీశైలదయాపాత్రం)" అను తనియన్లనుండి అరంభించి వరుసగా "తిరుప్పల్లాణ్డు", "కణ్ణినుణ్ శిఱుత్తాంబు" లను సేవాకాలము చేసి, "భక్తా మృతం విశ్వజనానుమోదనమ్" అను తనియన్లను అనుసంధానము చేయవలెను. (గమనిక: మరణించినది గార్గ్యగోత్రీకులైన "పరవస్తు" ఇంటిపేరుగల వారైనచో "రమానుజదయాపాత్రం" చెప్పి, తరువాత "కణ్ణినుణ్ శిఱుత్తాంబు", "తిరుప్పల్లాణ్డు"లను చెప్పి, మఱల "కణ్ణినుణ్ శిఱు త్తాంబు" చెప్పి, "భక్తామృతం విశ్వజనానుమోదనమ్" అను తనియన్లతో ముగింపవలెను.)

తరువాత కర్తలు తిరువారాధన చేసిన స్వామితో గూడ నొక వృద్ధభాగవతోత్తమునకు సాష్టాంగదండప్రణామము చేసి, విశేషవేదపారాయణము నను్గ్రహింపవలసిందిగా వారిని ప్రార్థింపగా, ఆ స్వామి లేచి తిరువారాధనకు దగ్గఱగా నిలబడవలెను. అప్పుడు తిరువారాధన చేసిన స్వామివారి దోసిలియందు క్షాళనార్థమై ఉదకమును పోసి, వారు చేతులను కడిగికొన్న పిదప తులసీదళములతోను పుష్పములతోను కూడిన పళ్లెరమును (లేదా బెత్తంతట్టను) వారి చేతి కీయగా, వారు దానిని పట్టుకొని అక్కడనే నిలబడవలయును. అంత గోష్ఠిలోని భాగవ

త్తోమములు *"హరిః ఓమ్/ అగ్న మీళే పురోహితమ్/"* నుండి ప్రారంభించి, *'----రామానుజ యతిపతిం ప్రణమామి మూర్ధ్నా"*వఱకు గల విశేషవేదపారాయణమును చేయవలెను. అప్పుడు తిరువారాధనకైంకర్యపరులు వృద్ధభాగవతోత్తముల హస్తములందున్న పళ్లెరమును తీసికొని, కేశవాదిద్వాదశనామములను చెప్పుచు ఆ పళ్లెరములోని తులసిని, పుష్పములను పెరుమాండ్ల పాదములవద్ద నుంచుచుండవలెను. అంత వృద్ధభాగవతోత్తములు మఱల గోష్ఠిలో యథాస్థానమున కూర్చుండవలెను. అప్పుడు భగవదారాధనపరులు పండ్లు మున్నగు అవసర మైననైవేద్యములను పెరుమాండ్లకు సమర్పింపవలెను.

అప్పుడు స్వాములందఱును *"ఉయర్వఱ ఉయర్"* అను పాశురమునుండి మొదలిడి "తిరువాయ్ మొళి"లోని రెండు పదులను (200 పాశురములను) పారాయణము చేయవలెను. (సూచన: *"కిళరొళి యుళమై"* అను కోయిల్ తిరువాయ్మొళికి అవసరనైవేద్యమును సమర్పించవలెను.) తరువాత స్వాములు *"ముడిచ్చోదియాయ్"*నుండి 20 పాశురములను పఠించిన పిదప తిరువారాధనకైంకర్యపరులు పెరుమాండ్లకు విశేషమైన అరగింపును సమర్పించవలెను. అప్పుడు స్వాములు *"తిరువాయ్మొళి"*లోని 3వ పదిలో 3వ తిరువాయ్మొళి అయిన *"ఒళివిల్ కాలమెల్లాం"* అనెడి కోయిల్ తిరువాయ్మొళిలోని 10 పాశురములను అనుసంధానము చేయవలెను.

తరువాత అందఱును లేచి నిలబడగా, తిరువారాధనకైంకర్యపరులు *"లక్ష్మీ చరణ లాక్షాంక సాక్షాత్ శ్రీవత్సవక్షసే"* అను శ్లోకములచే పెరుమాండ్లకు మంగళాశాసనమును (హారతిని) సమర్పించవలెను. అప్పుడు స్వాములు *"సైత్తనాళ్వరై"*, *"తాళ్ పరప్పి"* అను రెండు చాత్తు పాశురములను పఠించి, *"పల్లాణ్డు పల్లాణ్డు"* అను పాశురమును చదువుచుండగా తిరువారాధనకైంకర్యపరులు పెరుమాండ్లకు మఱల మంగళాశాసనమును సమర్పించవలెను. అటు పైని స్వాములు *"సర్వదేశదశాకాలేషు"* అనెడి శాత్తుముఱ పాశురములను, ఆళ్వారాచార్యులకు సంబంధించిన ముఖ్యమైన కొన్ని స్తోత్రములను అనుసంధానము చేయుచుండగా తిరువారాధన కైంకర్యపరులు గోష్ఠిలోనున్న వారందఱికిని (స్త్రీబాలవృద్ధులతో సహ) పెరుమాళ్ తీర్థ ప్రదానము చేసి, పెరుమాండ్లకు పర్యంకాసనమును సమర్పించి, కోవిలాళ్వార్ల (సంపుటము) తలుపులను మూసివేయవలెను. అప్పుడు కర్తలు గోష్ఠిలోనున్న వృద్ధభాగవతోత్తములకు నమస్కరించుచు వారివారి శ్రీపాదతీర్థములను వేఱొకరిద్వారా సేకరించుకొనవలెను. తరువాత కర్తలు నమస్కారపూర్వకముగా తిరువారాధనకైంకర్యపరులతోగాని,తమ కాచార్యస్వరూపులగు వృద్ధభాగవతోత్తములతోగాని భగవత్తీర్థవినియోగము చేయించుకొని, శ్రీపాదతీర్థమును

స్వీకరింపవలెను. అపైని ఇష్టమున్న బంధువులందఱును శ్రీపాదతీర్థమును ప్రసాదించు స్వామికి నమస్కరించి, వారినుండి శ్రీపాదతీర్థమును స్వీకరింపవలెను. ఆతర్వాత కర్త గోష్ఠికి తాంబూల, సంభావనలను సమర్పించి, వేఱొకరిచే అందఱికిని ప్రసాదవినియోగమును చేయింపవలెను.

(గమనిక: 1. ద్రావిడదివ్యప్రబంధానుసంధానము జరుగుచున్నప్పుడే కర్త గోష్ఠికి యథాశక్తి దక్షిణతో గూడిన తాంబూలమును సమర్పించుకొనవచ్చును. 2. గోష్ఠిలో గల భాగవతోత్తములును, స్త్రీబాలవృద్ధులతో సహ ఇతరులును పెరుమాళ్ తీర్థమును స్వీకరించిన పిదపనే దిట్ట చివఱకు కర్తలు పెరుమాళ్ తీర్థమును స్వీకరింపవలెను. 3. శ్రీపాదతీర్థమును మాత్రము ముందుగా కర్తలు స్వీకరింపవలెను. ఆ తర్వాత ఇష్టమున్నచో, గోష్ఠిలోని ఇతరులు శ్రీపాద తీర్థమిచ్చు స్వామి దగ్గఱకు పోయి, వారికి నమస్కరించి, శ్రీపాదతీర్థమును స్వీకరింపవలెను. 4. పెరుమాండ్లయొక్క సంపుటమును మూయనిదే భాగవతోత్తముల శ్రీపాదతీర్థమును సేకరింపగూడదు - అనగా భగవంతుని కెదురుగా శ్రీపాదతీర్థగ్రహణము చేయగూడదని అర్థము. 5. సపిండీకరణములో అన్వయించుకొనిన స్వాములు కూడ గోష్ఠిలో పెరుమాళ్ తీర్థమును, శ్రీపాదతీర్థమును తీసికొనవచ్చును. కాని పెరుమాండ్ల ప్రసాదమును మాత్రము స్వీకరింపరాదు. 6. తిరుక్కార్తిలో తిరువాయ్మొళి దివ్యప్రబంధమును అనుసంధానము చేయగూడదు. అప్పుడు "రామానుజదయాపాత్రం" మొదలుగా గల తనియన్లను మాత్రము అనుసంధానము చేసి, ఆపైని విశేషవేదపారాయణము చేసి,పెరుమాళ్ళకు అవసరమైనైవేద్యమును సమర్పించి, తిరువాయ్మొళినూత్తందాదిలో 22 పాశురములను మాత్రము సేవించి, మంగళాశాసనము చేసి, 28వ పాశురమును శాత్తుముఱ పాశురముగా చెప్పవలెను. 7. పన్నెండవనాటి రాత్రి శ్రీపాదతీర్థమును సేవించిన తర్వాత కర్తలు 13వనాడు శ్రీపాదతీర్థమును చేర్చుకొనుటకు మాత్రమే అర్హులౌదురు. కాని ఆనాడు ప్రసాదవినియోగములను చేయుటకు పనికిరారు. పన్నెండవనాడు దివ్యప్రబంధానుసంధానము చేయకుండ 13వ నాడే దానిని ఆరంభించినచో, ఇంకను శ్రీపాదతీర్థసేవనము చేయనందున పదమూడవనాడు కర్తలు స్వయముగా శ్రీపాదతీర్థగ్రహణమునకు పనికిరారు. కావున వేఱొకరు శ్రీపాదతీర్థగ్రహణము చేయవలెను. 9. కర్తలయొక్క తల్లికిగూడ పెరుమాళ్ తీర్థమును, శ్రీపాదతీర్థమును ఈయవచ్చును. 10. ఈ కార్యక్రమమునకు కావలసిన వేద, ప్రబంధగ్రంథములను కర్తలు స్వయముగా సంపాదించుకొనవలెను.

# త్రయోదశాహః - ఇయల్ క్రమః

పదమూడవనాడు ప్రొద్దుననే కర్తలు కాలకృత్యములను తీర్చుకొని, ఇంటి నలికించి, ద్వారములను మామిడితోరణములతో నలంకరింపజేసి, తిరువారాధనగృహమును శోధింప జేయించి, మ్రుగ్గులతో నలంకరింపజేసి, స్నానసంధ్యావందనాదులను ముగించుకొని, అవసర మైన నూతనవస్త్రములను తడిపి ఆరవేయించి, దివ్యప్రబంధానుసంధానము చేయుటకై భాగవ తోత్తములను ప్రణామపూర్వకముగా ప్రార్థించి, వారిని తమ గృహమునకు గొనివచ్చి, తమ కిష్టమైన భాగవతోత్తమునిచే తిరువారాధన చేయింపవలెను. తరువాత భాగవతోత్తములు (స్వాములు) భగవత్సన్నిధిలో గోష్ఠిగా కూర్చుండి "రామానుజదయాపాత్రం (లేదా శ్రీశైల దయాపాత్రం)" అను తనియన్లనుండి ఆరంభించి వరుసగా తిరుప్పల్లాణ్డు, తిరుప్పళ్ళి యెళుచ్చి, తిరుప్పావై, కణ్ణినున్ శిఱుత్తామ్బులను సేవాకాలము చేసి, "భక్తామృతం విశ్వ జనానుమోదనమ్" అను తనియన్లను అనుసంధానము చేయవలెను. (గమనిక: 1. మరణించి నది శ్రీవత్సగోత్రికులైనచో పైవాటికి బదులుగా "రమానుజదయాపాత్రం"నుండి ఆరంభించి, వరుసగా తిరుప్పళ్ళియెళుచ్చి, తిరుప్పావై, కణ్ణినున్ శిఱుత్తామ్బులను సేవాకాలము చేసి, "భక్తామృతం విశ్వజనానుమోదనమ్" అను తనియన్లను అనుసంధానము చేయవలెను. 2. మరణించినది గార్గ్యగోత్రికులైన "పరవస్తు" ఇంటిపేరుగలవారైనచో "రమానుజదయాపాత్రం" చెప్పి, తరువాత కణ్ణినున్ శిఱుత్తామ్బు, తిరుప్పళ్ళియెళుచ్చి, తిరుప్పావై, తిరుప్పల్లాణ్డులను చెప్పి, మఱల కణ్ణినున్ శిఱుత్తామ్బు చెప్పి, "భక్తామృతం విశ్వజనానుమోదనమ్" అను తని యన్లతో ముగింపవలెను. 3. మరణించినవా రెవరైనను తిరిక్కార్తిలో మాత్రము పైవానిని వేటినీ అనుసంధానము చేయరాదు. అప్పుడు పైవాటికి బదులుగా వానివాని స్థానములలో వరుసగా వాని తనియన్లను మాత్రము అనుసంధానము చేసి,తిరువారాధనకైంకర్యపరులు పెరుమాళ్ళకు అవసరనైవేద్యమును సమర్పించిన తర్వాత తిరువాయ్మొళినూత్తందాదిలో 24వ పాశురము నుండి మొదలిడి శాత్తుముఱై రెండుపాశురములను విడిచిపెట్టి, మిగిలిన గ్రంథమును పూర్తిగా అనుసంధానము చేయవలెను.)

తరువాత తిరువారాధనకైంకర్యపరులు పండ్లు మున్నగు అవసరమైన నైవేద్యములను పెరుమాండ్లకు సమర్పింపగా, స్వాములు "పుగళునల్లొరువనెన్గో" అనెడి తిరువాయ్మొళి నుండి ఆరంభించి వరుసగా 9వ పది తుదివఱకును, అనగా "మాలైనణ్ణి తొళుదుమినో వినైకడ" అనుదాని వఱకును గల తిరువాయ్మొళి దివ్యప్రబంధమును అనుసంధానము చేయవలెను.

(గమనిక: 1. కోవిల్ తిరువాయ్‌మొళి పాశురములు వచ్చినప్పుడు భగవదారాధనపరులు పెరుమాళ్ళకు అవసరనైవేద్యములను సమర్పించుచుండవలెను. 2. తిరువాయ్‌మొళిని అను సంధానము చేసెడి స్వాములకు కర్తలు యథాశక్తి దక్షిణాతాంబూలముల సమర్పించవలెను.)

ఇట్లు తిరువాయ్‌మొళిలోని 9వపది తుదివఱకును అనుసంధానము చేసిన పిదప తిరువా రాధనకైంకర్యపరులు స్వాములకు చందనము, పూలమాలలు, ([55]ఉన్నచో చెఱుకుగడలు) మన్నఁగువానిని ఈయవలెను. అంత తిరువారాధనకైంకర్యపరులు పెరుమాళ్ళకు సంబంధించి నట్టి అభయహస్తములను ఒక చిన్న సంపుటములో నుంచి, దానినొక వృద్ధభాగవతోత్తముని చేతి కీయవలెను.

(గమనిక: తిరువారాధనకైంకర్యపరులే అందఱికంటె పెద్దవారైనచో, వారే ఈ అభయ హస్తములను తీసికొనవచ్చును. 2. సంపుటము లేనిచో ఒక బెత్తముతట్టలోగాని, ఆకులోగాని అభయహస్తముల నుంచవచ్చును. 3. అభయహస్తములు లేనిచో వాటికి బదులుగా పెరు మాళ్ళకు గట్టిదైన చందమును సమర్పించి, దానిని ఉంచవచ్చును. అదియును లేని పక్షమున తిరువాయ్‌మొళి పుస్తకమునైనను ఉంచవచ్చును.కాని ఎట్టి పరిస్థితిలోను సాలగ్రామమునుగాని, పెరుమాళ్ళ విగ్రహమునుగాని ఉంచరాదు. అభయహస్తమును ధరించినవారు తులసీ, పుష్ప మాలలను నిండుగా ధరింపవచ్చును. వారు శ్రోత్రియులై యుండి స్నానాదులను చేసియుండ వలెను. 4. అభయహస్తములకు ఎండ తగులకుండ వెనుకనుండి ఒక గొడుగును పట్టవలెను. 5. అభయహస్తమునకు మాఱుగా పూర్ణకుంభమును మామిడాకులు, గంధపుష్పములతో నలంక రించి, టెంకాయను ఆ కుంభముపై నుంచుకొని పోవుటగూడ కొన్ని ప్రాంతములలో అచార ములో నున్నది)

ఇట్లు అభయహస్తమును ధరించిన శ్రోత్రియుడు ముందు నడచుచుండగా అతని వెనుక ఇతరస్వాములు ఇరామానుశనూత్తందాదిని అనుసంధానము చేయుచు వెళ్ళుచుండవలెను.

(గమనిక: ఇరామానుశనూత్తందాదిలో "మొళియైక్కడక్కుం" అను 7వ పాశురము వఱకును తిరువారాధన జరిగినచోటనే విన్నపము చేసి, ఆ తరువాత మిగిలినది అనుసంధా నము చేయుచు తిరువీధిలోనికి అభయహస్తములను తీసికొని వెళ్లుట ఆచారములో నున్నది.)

[1] చెఱుకుగడలకు బదులు మోదుగుకొమ్మలకు చిన్న,చిన్న నూత్న వస్త్రములలో తిరుమణిని, శ్రీమార్ణమును, దక్షిణను కట్టి వానిని స్వాముల కీయగా, వారు వానిని తీసికొని వీథిలో సేవా కాలము చేయుట కొన్ని ప్రాంతములలో ఆచారముగా నున్నది.

ఇట్లు స్వాములు సేవాకాలము చేయుచు పోయి, మార్గమధ్యమున గల శ్రీవైష్ణవగృహ ప్రాంగణములందు నిలువగా, ఇదివఱకే నలికి ముగ్గులువేసిన తమ ప్రాంగణములలో నాయా గృహస్థులు ఒక పీటను వేసి, దానిపై తడితువ్వాలును పఱచి, ఒక చెంబుతో ఉదకమును పెరుమాళ్ళకు చూపించి (ఇక్కడ అభయహస్తములే పెరుమాళ్ళని భావింపవలెను), ఆ పెరుమాళ్ళకు పాదప్రక్షాళనము చేయుచున్నట్లుగా భావించి, ఆ ఉదకము నాపీటపై పోసి, పీటపైని జలమును ముందుగా గృహస్థుడు తన తలపై ప్రోక్షించుకొని, పిదప ఇతరకుటుంబసభ్యుల తలలపై ప్రోక్షించవలెను. తరువాత ఆ గృహస్థుడు అచ్చటి భాగవతోత్తముల పాదములను కడిగి, వారికి చందనాదులొసగి గౌరవించి, వచ్చినట్టి పెరుమాళ్ళకు మధురఫలాదుల నారగింపు చేయించి, హారతినిప్పించి, యథాశక్తిగా ఆళ్వార్ ఎంబెరుమానార్ల సంభావనను సమర్పించుకొనవలెను. అట్లే ఆ గ్రామములో ఆలయమున్నయెడల ఆ ఆలయమునకు పోయి. అర్చకస్వాములచే అభయహస్తమును పెరుమాళ్ళసన్నిధిలో వేంచేపుచేయించి, ఆలయములోని పెరుమాళ్ళకు ఫలాదుల నారగింపు చేయించి, మంగళాశాసనమైన పిదప స్వాములందఱును శ్రీశఠారిని మాత్రమే స్వీకరించి, మఱల యథాప్రకారము ఆ అభయహస్తములందుకొని తిరిగివచ్చు దారిలో మఱల వైష్ణవగృహములందు నిలువగా, తద్గృహస్థు లిదివఱకువలెనే పాదప్రక్షాళనాది కార్యక్రమములను చేయవలెను.

ఇట్లు ఆలయమునకు, వైష్ణవగృహములకు వెళ్లివచ్చి, చివఱకు కర్తృగృహమునకు చేరుకొనవలెను. భాగవతగోష్ఠి గృహమునకు చేరుకొనకముందే కర్తల గృహిణులు (లేదా బంధువులు) గృహప్రాంగణమును శోధింపజేయించి, ముగ్గులను పెట్టించి, అక్కడ ఒక పీటను వేయించి, దానిపై ఒక తడి తువ్వాలును పఱచి, ఒక బిందెనిండా, చెంబునిండా నీటిని పెట్టుకొని సిద్ధముగా నుండవలెను. గోష్ఠి గృహమునకు చేరినవెంటనే కనిష్ఠపూర్వకముగా కర్తలు గోష్ఠికి 3సార్లు ప్రదక్షిణము చేయవలెను. అంత తీర్థాదులు సిద్ధముచేసిన కర్తయొక్క బంధువులు చెంబుతో జలమును అభయహస్తములకు (పెరుమాళ్ళకు) చూపించి, పెరుమాళ్ళ పాదప్రక్షాళనము చేసినట్లు మనసులో భావించి, ఆ నీటిని పీటపై పోసి, దానిని ముందుగా తమ తలలపై ప్రోక్షించుకొని, తరువాత కర్తలు, వారి బంధువుల తలలపై ప్రోక్షింపవలెను. తరువాత వారే బిందెలోనున్న నీటిచే స్వాముల పాదప్రక్షాళనము చేయవలెను. తరువాత వారే ఒకతట్టలో ఫలములనుగాని, కొబ్బెరికాయనుగాని, కొబ్బెరికోరునుగాని పెట్టుకొని వచ్చి, దానిని పెరుమాళ్ళకు అరగింపు చేసి, ఆ తర్వాత హారతిని సమర్పించవలెను. అంత ఆకార్యమునకు వచ్చినట్టి కర్తయొక్క బంధువులెవరైనను ఆళ్వార్ ఎమ్బెరుమానార్లకు సంభావన సమర్పించ

దలచినచో, ఒకతట్టలో తాంబూలదక్షిణలను పెట్టుకొని *"వేదాహమేతం పురుషం మహాన్తమ్"*, *"న కర్మణా న ప్రజయా ధనేన"* అను రెండు అనువాకములను చెప్పుచు సమర్పించవలెను. బంధువులందఱిట్లు సంభావన సమర్పించిన పిదప చివఱికి కర్తలు ఎంబెరుమానార్లకు పై రెండు అనువాకములనే చెప్పుచూ సంభావనను సమర్పించుకొనవలెను.

తరువాత భాగవతోత్తములు ఇరామానుశనూత్తందాదిలోని చివఱి 3 పాశురములను - అనగా 106,107,108 పాశురములను - అనుసంధానము చేసి, *"నన్దుమ్ తిరువుడైయోమ్"* అను ఇయల్‌చాత్తు పాశురములను అనుసంధించి, ఇరామానుశనూత్తందాదిలో మొదటిదైన *"పూమన్ను మాదు పొరున్దియ మార్బన్"* - అను పాశురమును అనుసంధానము చేయవలెను. తరువాత స్వాములందఱును *"వేదాహమేతం పురుషం మహాన్తమ్"* అను అనువాకమును చదువుచుండగా కర్త మఱల యథాశక్తిగా పెరుమాళ్ళకు ఇయల్ సంభావనను సమర్పించు కొనవలెను.

(గమనిక: 1. తిరుక్కార్తిలో తిరువీథిలో తిరుగు సమయమున ఇరామానుశనూత్తందాదికి బదులుఉపదేశరత్తినమాలై అనుసంధానము చేయవలెను. 2. తిరుక్కార్తిలో కర్తలు ఎమ్బెరు మానార్ల సంభావను సమర్పించిన పిదప స్వాములు ఉపదేశరత్తినమాలైలోని చివఱి 72,73 పాశురములను పఠించి, *"మన్ను యిరగాళ్ ఇంగే మణవాళమాముని"* అను ఉపదేశరత్తిన మాలైలోని తుది పాశురమును పఠింపవలెను.)

తరువాత ముత్తైదువలు పళ్ళెములో "జ్యోతులు" మున్నగువానిని పెట్టుకొని పెరుమాళ్ల కెదురుగా నిలబడి హారతినిచ్చుచు గోష్ఠిచుట్టును మూడుసార్లు ప్రదక్షిణము చేసి, ఇంటిలోనికి పోవలెను. అప్పుడు స్వాములు "తాళతామరై" అనెడి 10వ పదిలోని మొదటి పాశురమును అనుసంధానము చేయుచు తాము ధరించిన పూలమాలలను ఇంటిమీదికి విసరివేసి, చెఱకు గడల చివఱలను విఱిచి వానిని గూడ ఇంటిమీదికి విసరివేసి ఇంటిలోనికి పోగా, వారి వెనుక కర్తలు ఇంటిలోనికి ప్రవేశింపవలెను.

(గమనిక: 1. తిరుక్కార్తిలో మాత్రము "తాళతామరై"కు బదులుగా "ఎంద్రై తిరువాయ్ మొళిప్పిళ్ళై" అను ఉపదేశరత్తినమాలైలోని మొదటిపాశురమును అనుసంధానము చేయుచు పూలమాలను ఇంటిమీదికి విసరివేసి ఇంటిలోనికి పోవలెను. 2. అట్లే తిరుక్కార్తిలో మాత్రము కర్తలు స్వాముల శ్రీపాదతీర్థమును చేర్చుకొనులోపల స్వాము లొకచోట గోష్ఠిగా కూర్చొని ఉపదేశరత్తినమాలై మఱియొకసారి పూర్తిగా అనుసంధానము చేయవలెను (అప్పుడు చాత్తు కొఱకై చివఱి మూడు పాశురములను వదలిపెట్టవలెను).

ఇంటిలోనికి ప్రవేశించిన పిదప వృద్ధభాగవతోత్తముడు ఆ పెరుమాళ్ళను తిరువారాధన గృహములో వేంచేపుచేయవలెను. అట్లే లోపలికి ప్రవేశించిన పిదప స్వాములందఱును తిరువారాధనగృహము ముందు గోష్ఠిగా కూర్చుండి తిరువాయ్మొళిలోని 10వ పదిలోనున్న తొమ్మిదవ తిరువాయ్మొళివఱకును అనుసంధానము చేసి, ఉపదేశరత్తినమాలైలోని 71 పాశురములను అనుసంధానము చేయవలెను. ఇది జరుగుచుండగనే పెరుమాళ్ళకు పూర్ణతళిహను ఆరగింపు చేయవలెను. ఆరగింపు చేసిన తర్వాత ఇది జరుగుచుండగనే కర్తలు ప్రపన్నముగా గోష్ఠిలోని కొందఱు పెద్దలను వేంచేపుచేసికొని పోయి, వారి శ్రీపాదతీర్థములను చేర్చుకొని, వారికిని, తమ కుటుంబములో నున్న పెద్దలైనవారి ఆచార్యులకును, కర్మ చేయించినట్టి బృహస్పతికిని (వాధ్యారుకు) ఇంకను తమ కిష్టమైన పెద్దలకును యథాశక్తి తాంబూలదక్షిణలను గాని, తడిపి ఆరవేసినట్టి నూత్నవస్త్రములను గాని ఈయవచ్చును. ఈ సేవాకాలము జరుగుచున్నప్పుడే కర్తలు గోష్ఠిలోని స్వాములకు యథాశక్తి తాంబూలదక్షిణలను, తిరుమణి, శ్రీచూర్ణము మొదలైనవానిని వినియోగము చేయవలెను.

సేవాకాలము చేయుట ముగిసిన పిదప కర్తలతోబాటు స్వాములందఱును లేచి నిలఱడగా తిరువారాధనకైంకర్యపరులు *"వైయంతకళియా"* అనెడి పాశురములతోను, "లక్ష్మీచరణలాక్షాంక" అను శ్లోకములతోను పెరుమాళ్ళకు మంగళాశాసనమును (హారతిని) సమర్పించవలెను. తరువాత భాగవతోత్తములు *"యో వా అశ్వస్య మేధ్యస్య శిరో వేద"* నుండి గాని, "సముద్రముదరమస్తరిక్షమ్"నుండిగాని ప్రారంభించి, *"తస్మాదనన్య శరణో భవతీతి మత్వా"* వఱకును గల వేదపారాయణ చాత్తులను విన్నపము చేయుచుండగా తిరువారాధనకైంకర్యపరులు కేశవాదిద్వాదశనామములను చెప్పుచూ పెరుమాళ్ళపాదములయొద్ద తులసీదళములను, పుష్పములను ఉంచుచుండవలెను. అపైని భాగవతోత్తములు *"శిత్తం శిఱుకాలే", "వంగక్కడల్ కడైంద"* అనెడి చివఱి రెండు చాత్తుపాశురములను సేవించి, తిరువాయ్మొళిలోని *"మునియే నాన్ముగనే"*నుండి చివఱివఱకును గల పాశురములను అనుసంధానము చేసి, తిరువాయ్మొళిలోని మొదటిదైన *"ఉయర్వఱ వుయర్"*అను పాశురమును అనుసంధానము చేసి, కణ్ణినున్ శిఱుత్తామ్బులోని 12 పాశురములను అనుసంధానము చేసి, మఱల అదే కణ్ణినున్ శిఱుత్తామ్బులోని మొదటిపాశురమును అనుసంధానము చేయవలెను. (గమనిక: ఇయల్ గోష్ఠిలో అనుసంధానము చేయబడినది గావున ఇక్కడ ఇరామానుశనూత్తందాది చాత్తుపాశురములను మఱల అనుసంధానము చేయనక్కఱ లేదు.)

తరువాత భాగవతోత్తములు *"పల్లాణ్డు పల్లాణ్డు"*అను పాశురమును పలుకుచుండగా తిరువారాధనకైంకర్యపరులు పెరుమాళ్ళకు మంగళాశాసనమును (హారతిని) సమర్పింపవలెను. తరువాత భాగవతోత్తములు *"ఉపదేశరత్తినమాలై"*లోని *"పూరువాశారియర్గళ్"*, *"ఇంద ఉపదేశరత్తినమాలై తన్నై"* "అనెడి చివరి రెండు వాత్తుపాశురములను అనుసంధానము చేయవలెను.

తరువాత భాగవతోత్తములు *"వేదాహమేతం పురుషం మహాన్తమ్"*, *"గృణాహి,ఘృతవతీ సవితరాధిపత్యైః"*అను రెండు అనువాకములను విన్నవించి, *"పెరుమాళ్ నాచ్చియార్ సంభావనై"*అని చెప్పగా తిరువారాధనకైంకర్యపరులు యథాశక్తి దక్షిణతోగూడిన తాంబూలమును పెరుమాళ్ళసన్నిధిలో నుంచవలెను. తదుపరి ఇప్పుడున్న కర్తలయొక్క ఆచార్యులుగాని, లేదా ఒక భాగవతోత్తములుగాని, కర్తలకు పితృసంబంధమైన చరమతనియను ఉపదేశింపవలెను. తరువాత భాగవతోత్తములు *"వేదాహమేతం పురుషం మహాన్తమ్"*అను అనువాకమును విన్నవించి, *"ఆచార్యసంభావనై"*అని చెప్పగా, తిరువారాధనకైంకర్యపరులు దక్షిణతో గూడిన తాంబులమును మరల పెరుమాళ్ళసన్నిధిలో నుంచవలెను. తర్వాత ఉపదేశరత్తినమాలైలోని చివరి పాశురమైన "మన్నుయిర్గాళ్ ఇంగే మణవాళమామునివ" అను పాశురమును విన్నవించవలెను.

(గమనిక: 1. ఇయల్ గోష్ఠిలో ఒకసారి ఆళ్వార్ ఎమ్బెరుమానార్లకు సంభావన నిచ్చియున్నారు గనుక మరల వారికిక్కడ సంభావన సమర్పించ నక్కఱలేదు. 2. పెరుమాళ్ నాచ్చియార్ల సంభావన నిచ్చిన వెంటనే పెరుమాళ్ళదగ్గఱనే ఆచార్యసంభావనను సమర్పించి తర్వాత పితృసంబంధమైన *"ఆచార్యతనియను"*ఉపదేశింపవలసిందని కొందఱి మతము. అట్లైనచో ఆచార్యసంబంధమైన తనియన్ పొందకుండగనే ఆచార్యులకు సంభావన నిచ్చుట జరుగుచున్నది. ఇట్లు చేసిన, *"ఆచార్యసంభావన"*అను పదమునకు అర్థము సరిపోవుట లేదు. అందుచేత ఆచార్యతనియన్ ఉపదేశించిన పిదపనే ఆచార్యసంభావన నిచ్చుట యుక్తమని తోచుచున్నది. దీనిని ఎవరి సంప్రదాయము ప్రకారము వారు చేసికొనవచ్చును. 3. పితృసంబంధమైన చరమతనియను ఉపదేశించిన వారికి కర్తలు యథాశక్తి దక్షిణాతాంబూలములనుగాని, తడిపి ఆరవేసిన నూత్నవస్త్రములనుగాని ఇచ్చుట సాంప్రదాయము.)

తరువాత తిరువారాధనకైంకర్యపరులు స్త్రీబాలవృద్ధులతో సహా గోష్ఠికంతకును భగవత్తీర్థ వినియోగము చేసి, పెరుమాళ్లకు పర్యంకాసనమును సమర్పించి, కోవిలాళ్వార్ల (సంపుటము) యొక్క తలుపులను మూసివేయవలెను.

తర్వాత కర్తలు తిరువారాధనకైంకర్యపరుల ద్వారా ముందుగా పెరుమాళ్ళతీర్థమును స్వీకరించి తరువాత శ్రీపాదతీర్థమును స్వీకరింపవలెను. తర్వాత బంధువులందఱును శ్రీపాద తీర్థము నిచ్చు స్వామిదగ్గరకు వెళ్ళి, అతనికి నమస్కరించి, శ్రీపాదతీర్థమును స్వీకరింప వలెను. అట్లే కర్తలభార్యలుగూడ పెరుమాళ్, శ్రీపాదతీర్థములను స్వీకరించిన పిదప ఇష్ట మున్నచో సమాశ్రయణమైన ఇతరస్త్రీలును శ్రీపాదతీర్థమును స్వీకరింపవచ్చును. (గమనిక: 1. సమాశ్రయణము గాని వారు శ్రీపాదతీర్థమును స్వీకరింపరాదు. 2. శ్రీపాదతీర్థమును వాధూల గోత్రికులు 3 సార్లును, ఇతరులు రెండుసార్లును స్వీకరింపవలెను. 3. పెరుమాళ్ తీర్థమును పెద్దవారు 3 సార్లును, పిల్లలు ఒక సారియు తీసికొనవలెను.)

తరువాత తిరువారాధనకైంకర్యపరులుగాని, ఇతరులుగాని భగవదర్పితచందనమును తులసీదళములను, పుష్పములను, పంచకచ్చాయప్రసాదము మున్నగువాటిని భాగవతోత్త ములకు వినియోగము చేయవలెను. (సూచన: పంచకచ్చాయమనగా కొబ్బెరికోరు, పంచ దార, అరటిపండ్లు, మిగిలినపండ్లు కలిపి చేసిన ప్రసాదము).

తరువాత భాగవతోత్తములందఱును సాపాటునకు కూర్చుండవలెను. భాగవతోత్తము లకు ఆపోశనార్థము పెరుమాళ్ తీర్థమునిచ్చిన పిదప, వారు దానిని స్వీకరించులోగా కర్తలు మఱొకసారి పితృసంబంధమైన చరమతనియను అనుసంధానము చేయువలెను. అప్పుడు భాగవతోత్తములు పెరుమాళ్ తీర్థమును స్వీకరించి తృప్తిగా భుజింపవలెను. భాగవతోత్తములు భోజనము చేయుటకు ప్రారంభించిన పిదప కర్తలు వారిపంక్తిలో కూర్చుండి వారితో భుజింప వచ్చును, లేదా ప్రత్యేకముగానైనను భుజింపవచ్చును. సాపాట్లు పూర్తియైన పిదప కర్తలు భాగవతోత్తములకు చందనతాంబూలాదిసత్కారములను చేయవలెను.ఇట్లు శ్రీవైష్ణవగృహము లందు ఇయల్ కార్యక్రమమును యథాశక్తి అవశ్యముగా పూర్తిచేయవలెను.

(గమనిక: ఇయల్ జరిగిన రోజు లభించిన ఆళ్వార్ ఎమ్బెరుమానార్ల సంభావనను అది జరిగిన సమయములో నున్న గృహస్థులు ఒకవంతు, సమాశ్రయణముగాని, ఉపాకర్మగాని ఐనట్టి బ్రహ్మచారులు అందులో సగమువంతును పంచుకొను ఆచారమున్నది. ఇందు కర్తల కును, దశరాత్రజ్ఞాతులకును భాగము లేదు. లేదేని అందఱును సమ్మతించిన, ఈ సంభావనను ఒక పుణ్యకార్యమునకు వినియోగింపవచ్చును. 2. సపిండీకరణమైన మఱురోజు "కనుము" అగును. "కనుము నాడు ప్రయాణము చేయరాదు" అను ఆచారము ననుసరించి, ఈ కార్యము లకు వచ్చినవారు ఆనాడు ప్రయాణము చేయుట దోషము. తప్పనిసరియైనచో, ఆనాటి సూర్యాస్తమయము తర్వాత ప్రయాణము చేసినయెడల దోషము లేదు. 3. ఈ కార్యములకు

వచ్చినవారు కార్యమైన తర్వాత ఎక్కువసేపు అచ్చట నుండగూడదు. వారచ్చటినుండి నేరుగా (మార్గమధ్యమందున్నవి గదా యని బంధువుల, స్నేహితుల ఇండ్లకు, గ్రామములకు పోకుండా) తమ ఇండ్లకు , లేదా గ్రామములకు పోవలెను. 4. శ్రీపాదతీర్థము స్వీకరింపనిదే సంపూర్ణమైన శుద్ధిగాదు కావున 13వ నాడు కర్తలభార్యలు పెరుమాళ్ళకు నివేదించు తళిహాను చేయగూడదు. కాని శ్రీపాదతీర్థమును తీసికొన్న పిదప వారానాడు భాగవతోత్తములకు వడ్డన చేయవచ్చును. 5. 10వ రోజున కర్తలచే నీయబడిన నూతన వస్త్రములను తడిపి ఆరవేయించు కొని, వానిని కర్తలభార్యలు మొదలైనవారు ఇయల్ గోష్ఠి జరుగు సమయములో ధరింపవలెను.

# శుభస్వీకారము

సపిండీకరణానంతరము శుభము నభిలషించినవారై కర్త లిదివఱకు చెప్పబడిన దివ్యప్రబంధానుసంధానమును, ఇయల్ కార్యక్రమమును చేయుచున్నారు. ఇది చేసినతర్వాతగూడ పరిశిష్టమైన అశుభమును తొలగించుకొనుటకై, దీని తర్వాత కర్తలు శుభకార్యములలో అన్వయించుకొనుటకు వీలగునను ఉద్దేశ్యముతో ప్రస్తుతకాలమున ఇయల్ కార్యక్రమము ముగిసిన పిమ్మట "శుభస్వీకారము"ను చేయుచున్నారు. కాని దీనికి శాస్త్రప్రమాణ మెక్కడను లేదు. ఐనను దీనిని సంవత్సరాంతమున ప్రథమాబ్దికము చేసిన పిమ్మట కర్తలు దీక్షావిసర్జనము చేయు రోజున జరుపుకొను సంప్రదాయము పూర్వకాలమునుండి వచ్చుచున్నది. కావున 13వనాడు ఈ శుభస్వీకారమును ఇష్టమున్న చేసికొనవచ్చును; లేకున్న లేదు. దీని ప్రయోగ మీవిధముగా నున్నది.

*ప్రయోగము:* పదమూడవనాడు ఇయల్ కార్యక్రమము ముగిసిన పైని అందఱును భోజనములు చేసిన పిదప సాయంత్ర మీ శుభస్వీకారకార్యక్రమమును చేయవలసియున్నది. దీనికై ఇంటిలో ఒక స్థలమును శుద్ధి చేసి, అచ్చట పీటలు వేసి, హరిద్రాక్షతలు, తమలపాకులు, పోకచెక్కలు, చందనము, పుష్పములు, కర్తలయొక్క మామగార్లు (లేక బావమఱదులు, లేక తత్సంబంధితులు) కర్తల కిచ్చెడి నూతనవస్త్రములు, మున్నగు సంభారముల నన్నిటిని సిద్ధము చేసికొని, భాగవతోత్తములనింటికి వేంచేపుచేసికొనివచ్చి, ఈ కార్యమును ఆరంభింపవలెను.

అప్పుడు కర్తలు వారి భార్యలతో సహ పీటలపై కూర్చొనవలెను. అప్పుడు వారి (భార్య వైపు) బావమఱదులలో నొకరు కర్తలకు చందన,పుష్పములనిచ్చి, వేదోక్తమైన ఆశీర్వచనములతో నూతనవస్త్రముల నీయవలెను. అంత దంపతు లా నూతనవస్త్రములను ధరించి, అందు పురుషులు మాత్రము కాళ్ళుకడిగికొని ఆచమనము చేసి, మఱల దంపతులు పీటలపై కూర్చొన

వలెను. అప్పుడు వారి (భార్యవైపు) బావమఱదులలో నొకరు భాగవతోత్తములకు హరిద్రాక్ష తల నీయగా వారు వేదమంత్రములచే నా దంపతుల నాశీర్వదింపవలెను. తరువాత బావమఱదు లలో నొకరు భాగవతోత్తములకు తాంబూలసత్కారాదులను చేయవలెను. తరువాత కర్తల అక్కచెల్లెంద్రుగాని, తత్సమానికులుగాని దంపతులకు హారతి నీయవలెను. అప్పుడు కర్తలు హారతితట్టలో హారతిదక్షిణ నుంచగా, హారతి నిచ్చిన స్త్రీలు దానిని సమానముగా పంచుకొన వలెను.

గమనిక: 13వ రోజున ఈ శుభస్వీకారము జరిగినప్పటికీ, కర్తలు 1. యథాప్రకారము సంవత్సరాంతము క్షౌరము చేసికొనకుండా దీక్షను పట్టవలెను. 2. వారు సంవత్సరాంతము ఏ శ్రాద్ధములలోను భోక్తలుగా అన్వయించుకొనుటకు పనికిరారు. 3. దశరాత్రజ్ఞాతులు, మాతా మహులు, మేనమామమేనత్తలు, భార్యవైపు అత్తమామలు, దత్తుడైనచో జనకమాతాపితరులు - ఇట్టి దగ్గరి బంధువులకు సంబంధించిన శ్రాద్ధములలో దప్ప మిగిలిన శ్రాద్ధములలో భోజనము చేయుటగాని, ప్రసాదమును స్వీకరించుటగాని చేయగూడదు. 4. కాని సపిండీకరణానంతరం జరుగు శియల్ కార్యక్రమమునకు సంబంధించిన తదీయారాధనలో, అది శుభదమైనందున, భుజింపవచ్చును. అట్లే శుభకార్యములందు అన్వయించుకొనుట, భుజించుట చేయవచ్చును. 5. సాధ్యమైనంతవఱకు శుభకార్యములను చేయించగూడదు. 6. సంవత్సరాంతమువఱకు తన కుమారులకు ఉపనయన,వివాహాదికార్యములు చేయగూడదు. కాని అన్నప్రాశనమును చేయ వచ్చును. సంవత్సరదీక్షాకాలములో కుమార్తెలకు వివాహము చేసినచో చాల మంచిది. 6. సంవత్సరదీక్షాకాలములో కర్తయే సీమంతము చేసికొనవలసి వచ్చిన, అప్పటినుండి ప్రథమాబ్ది కమువఱకుగల మాసికముల నన్నిటిని "ఆగామి" అని సంకల్పము చెప్పుచు ఆకర్షించుకొని, వాటి నొకేరోజు పూర్తిచేసి, ఆ సీమంతమును చేసికొనవలెను. అప్పుడు సీమంతమైన తర్వాత యథాకాలమున యథాశాస్త్రము మఱల నన్నిమాసికములను పెట్టవలెను. 7. సంవత్సరాంత మున ప్రథమాబ్దికము పెట్టిన పిమ్మట మఱల నీ శుభస్వీకారమును ఇష్టమున్న చేసికొన వచ్చును; లేకున్న లేదు.

# నారాయణబలిః

మృతునికి పుత్రులును, జ్ఞాతులును ఎవ్వరూ లేని పక్షమున, ఇతరబంధువులుగాని, శ్రేయోభిలాషులుగాని పన్నెండవరోజున పదునైదు ఏకోద్దిష్టశ్రాద్ధములను "ఆమరూపషోడశ శ్రాద్ధ"విధిలో చెప్పినట్లుగా చేసి, తదనంతరము స్నానము చేసి, పుణ్యాహవాచనము చేసి, మధ్యాహ్నమందు నారాయణబలిని చేయవలెను. దీనికి ప్రయోగము:

[548]"*హరిరోం తత్సత్ శ్రీగోవిన్దేత్యాద్యస్యాం పుణ్యతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నా రాయణప్రీత్యర్థం ----గోత్రస్య----శర్మణః ప్రేతస్య (అథవా, -----గోత్రాయాః ---- నామ్న్యాః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని ప్రేతత్వవిమోచనార్థం విష్ణులోక ప్రాప్త్యర్థం నారాయణబలిం కర్తుం యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ*" - ఇతి సభాం ప్రార్థ్య, "*తథాస్తు! యోగ్యతాసిద్ధిరస్తు*"- ఇత్యనుజ్ఞాప్య, త్రిః ప్రాణానాయమ్య,

*శ్రీమాన్వేంకటనాథార్యః కవితార్కికకేసరీ।*
*వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది॥*
*గురుభ్యస్తద్గురుభ్యశ్చ నమోవాకమధీమహే।*
*వృణీమహే చ తత్రాద్యౌ దంపతీ జగతాం పతీ॥*
*స్వశేషభూతేన మయా స్వీయైః సర్వ పరిచ్ఛదైః।*
*విధాతుం ప్రీతమాత్మానం దేవః ప్రక్రమతే స్వయమ్॥*

"*హరిరోం తత్సత్ శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్య శ్రీభగవతః మహాపురు షస్య విష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహ కల్పే వైవస్వతమన్వంతరే అష్టావింశతితమే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే*

---

[548] కర్త "*హరిరోం తత్సత్ ----గోత్రస్య ----శర్మణః -- యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ*" - అని పరిషత్తును ప్రార్థించి, "*తథాస్తు! యోగ్యతాసిద్ధిరస్తు*" - అని అనుజ్ఞాతుడై, మూడుసార్లు ప్రాణా యామము చేసి, "*శ్రీమాన్వేంకటనాథార్యః ---దేవః ప్రక్రమతే స్వయమ్॥*" వఱకు చెప్పి, "*హరిరోం తత్సత్ ---నారాయణబలికర్మ కరిష్యే*" - అని సంకల్పించి, ముందుగా పుణ్యాహ వాచనము చేసి,

భారతవర్షే భరతఖండే శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే అస్మిన్ వర్తమానే వ్యావహారికే ప్రభవాది షష్టిసంవత్సరాణాం మధ్యే -----సంవత్సరే ----అయనే ----ఋతౌ ----- మాసే -----పక్షే ----తిథౌ ----వాసరే ---నక్షత్రయుక్తాయాం అస్యాం పుణ్యతిథౌ శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణప్రీత్యర్థం----గోత్రస్య ---శర్మణః ప్రేతస్య (అథవా, -----గోత్రాయాః -----నామ్న్యాః ప్రేతాయాః) అద్య ద్వాదశేఽహని ప్రేతత్వవిమోచనార్థం విష్ణులోకప్రాప్త్యర్థం నారాయణబలికర్మ కరిష్యే" - ఇతి సంకల్ప్య, పుణ్యాహవాచనం కృత్వా,

[549]స్థండిలం కల్పయిత్వా, ప్రాచీః పూర్వముదక్సంస్థం దక్షిణారంభమాలిఖేత్. అథోదీచీః పురస్సంస్థం పశ్చిమారంభమాలిఖేత్. [550]అవాక్కరోభ్యుక్ష్య, తృణం నైఋత్యాం నిరస్య, అప ఉపస్పృశ్య, "ఓం భూర్భువస్సువరోమ్"- ఇతి లౌకికాగ్నిం ప్రతిష్ఠాప్య, ఉత్సృజ్యతేఽభ్యుక్షణతోయశేషమ్. ప్రాక్తోయమన్యం నిదధాయ, ప్రాగాది పరిస్తరణం కృత్వా,

---

[549] అగ్నిప్రతిష్ఠాపనకై చతురశ్రవేదికను(స్థండిలమును) కల్పించి, దానిపై శ్వేతాక్షలను చల్లి, ఒక దర్భను సగమునకు మడచి పట్టుకొని దానితో ఆవేదికపై పడమటినుండి మొదలిడి తూర్పున కంతమగునట్లు వేదియొక్క దక్షిణార్ధమునందును, మధ్యను, ఉత్తరార్ధమువందును వరుసగా నొక్కొక్కరేఖను గీచి, అట్లే ఉత్తరమునుండి మొదలిడి దక్షిణమున కంతమగునట్లు ఒక్కొక్క రేఖను వేదియొక్క పశ్చిమార్ధమందును, మధ్యను, పూర్వార్ధములందును వరుసగా గీచి, ఆ దర్భను వేదిపై నుంచి,

[550] అభ్యుక్షణతోయపాత్రలో కొంచము నీటిని పోసికొని, దానిచే స్థండిలమును ప్రోక్షించి, దర్భను వేదిపైనుండి తీసి నైఋతిక పడవేసి, నీరు ముట్టి, స్థండిలముపై "ఓం భూర్భువస్సువ రోమ్" అని లౌకికాగ్నిని ప్రతిష్ఠించి, అభ్యుక్షణతోయపాత్రలోని నీటిని చల్లి, మఱల వేరే నీటి నందులో పోసి, ఆ పాత్రను అగ్నికి తూర్పువైపున (ముందుంచబోవు పరిస్తరణల కవతల) ఉంచవలెను. తర్వాత అగ్నికి చుట్టును తూర్పునుండి మొదలిడి ప్రదక్షిణముగా దర్భలను వేయవలెను. అనగా ఉత్తరదక్షిణములందు వేయు దర్భలను పూర్వాగ్రములుగను, తూర్పు పడమరలయందు వేయు దర్భలను ఉత్తరాగ్రములుగాను వేసి, ఉత్తరమునందు వేసిన దర్భలను తూర్పుపడమరలందు వేసిన దర్భల కొనల క్రింద నుండునట్లును, దక్షిణమునందు వేసిన దర్భలను తూర్పుపడమరలందు వేసిన దర్భల మొదళ్లపై నుండునట్లును సవరింపవలెను.

[551]అగ్నేరుత్తరతో దర్భాన్ సంస్తీర్య, తేషు దర్వీం, ఆజ్యస్థాలీం, ప్రోక్షణీం, ప్రణీతాం, ఇధ్మం, ఇతరదర్వీం, హవిఃపాత్రం, హవిష్యపాత్రం చ సాదయిత్వా, [552] ప్రోక్షణ్యామవధాయ, ప్రోక్ష్య, తస్యామప ఆనీయ, హస్తయో రంగుష్ఠోపకనిష్ఠికాభ్యాముదగగ్రే గృహీత్వా, ప్రాచీ స్త్రి రుత్పూయ, అభిమన్త్ర్య, ఉత్తానాని పాత్రాణి పర్యావృత్య, విస్రస్యేధ్మం, త్రిః ప్రోక్ష్య, శేష ముదగుత్సిచ్య, [553]అపరేణాగ్నిం పవిత్రాంతర్హితే పాత్రే అప ఆనీయ, ఉదగగ్రాభ్యాం పవిత్రాభ్యాం త్రిరుత్పూయ, సమం ప్రాణైర్హృత్వా , ఉత్తరేణాగ్నిం దర్భేషు సాదయిత్వా, దర్భైః ప్రచ్ఛాద్య, [554]తతః చరునిర్వాపణం కుర్యాత్ - *"నారాయణాత్వా జుష్టం నిర్వపామి"* - ఇతి త్రిః, *"నారాయణాత్వా జుష్టం ప్రోక్ష్యామి"* - ఇతి త్రిః కూర్చేన చరుం ప్రోక్ష్య,

---

[551] అగ్నికి ఉత్తరమున 12 దర్భలను ప్రాగగ్రములుగా పఱచి, వానిపై 1. ప్రధానదర్విని 2. ఆజ్య స్థాలిని, 3. ప్రోక్షణిపాత్రను , 4. ప్రణీతపాత్రను , 5.ఇధ్మకట్టను, 6.ఇతరదర్విని, 7. హవిః పాత్రను, 8. హవిష్యపాత్రను ఒక్కొక్కటిగా తీసికొని పడమటినుండి తూర్పునకు బోర్లించి ఉంచవలెను.

[552] ప్రోక్షణియందొక అయామితపవిత్రము నుంచి, ఉదకముచే ప్రోక్షించి, ఆపాత్రయందు నీటిని పోసి, హస్తములయొక్క బొటనిన ఉంగరపు వ్రేళ్లచేత అయామితమును ఉత్తరాగ్రముగా పట్టు కొని ప్రాక్పమాప్తిగా మూడుసార్లు ఆ ప్రోక్షణిలోని నీటపై గిచి, దోసిలి నా పాత్రపై నాచ్ఛాదించి తీసి అభిమంత్రించి, ప్రయోగపాత్రలను ఊర్ధ్వబిలములుగా నుండునట్లు త్రిప్పిపెట్టి, ఇధ్మకట్టకు కట్టిన దర్భత్రాటిని విడిపించి, ఇధ్మములను, త్రిప్పి పెట్టిన పాత్రలను మూడుసార్లు ప్రోక్షణిలోని నీటిచే ప్రోక్షించి, మిగిలిన ఉదకమును ఉత్తరమునకు పరిహరించి, దానిలో వేఱే నీటిని పోసికొని, ఆ పాత్రను కర్త తనకు ముందు ఉత్తరమునైపు ఉంచుకొనవలెను.

[553] ప్రణీతపాత్రను (పూర్ణజలపాత్రను) వేదికకు ప్రదక్షిణముగా తీసికొనివచ్చి, అగ్నికి పడమట (కర్తకు ముందు) ఉంచుకొని, ప్రోక్షణిలోని ఆయామితమును దానిలో నుంచి, అందులో జల మును నిండుగ నింపి, పూర్వమువలెనే ఉత్తరాగ్రములైన రెండు దర్భలచే ఆనీటిని మూడుసార్లు ప్రాగగ్రముగా గిచి, ఆ పాత్రను ముక్కునూటిగా ఎత్తి పట్టుకొని, అగ్నికి ఉత్తరమున 3 లేక 12 దర్భలను ప్రాగగ్రముగా పరచి, వానిపై ఆ పాత్రనుంచి, దానిని 3 లేదా 8 దర్భలతో కప్పవలెను.

[554] శ్రీమహావిష్ణ్వర్థమై అగ్నిపై చరువును వండి, *"నారాయణాత్వా జుష్టం నిర్వపామి"* - అని 3 సార్లును, *"నారాయణాత్వా జుష్టం ప్రోక్ష్యామి"* - అని మూడుసార్లును చెప్పుచూ కూర్చతో చరు వుపై ఉదకమును ప్రోక్షించి,

[555]అగ్నేరుత్తరతో తండులస్యోపరి హరిద్రాబింబే శ్రీభూమీనీళాసహితం విష్ణుం **పురుష** సూక్తేన, వ్యాహృతిభిః ఆవాహ్య, షోడశోపచారైః సంపూజయేత్ - తత్ప్రకారః-

1. *సహస్రశీర్షా పురుషః। సహస్రాక్షస్సహస్రపాత్। సభూమింవిశ్వతో వృత్వా। అత్యతిష్ఠద్దశాఙ్గులమ్।*
2. *పురుష ఏవేదగం సర్వమ్। యద్భూతం యచ్చ భవ్యమ్। ఉతామృతత్వ స్యేశానః। యదన్నే నాఽతిరోహతి।*
3. *ఓం భూః। పురుషమావాహయామి।*
4. *ఓం భువః। పురుషమావాహయామి।*
5. *ఓగ్ం సువః। పురుషమావాహయామి।*
6. *ఓం మహః। పురుషమావాహయామి।*
7. *ఓం జనః। పురుషమావాహయామి।*
8. *ఓం తపః। పురుషమావాహయామి।*
9. *ఓగ్ం సత్యం। పురుషమావాహయామి।*

ఇతి భగవన్తమావాహ్య,

10. *ఓం పురుషాయ నారాయణాయ నమః - అర్ఘ్యం సమర్పయామి*
11. *ఓం పురుషాయ నారాయణాయ నమః - పాద్యం సమర్పయామి*
12. *ఓం పురుషాయ నారాయణాయ నమః - ఆచమనీయం సమర్పయామి*

ఇత్యర్ఘ్య-పాద్య-ఆచమనీయాని సమర్ప్య, పురుషసూక్తేన అభిషిచ్య,

13. *ఓం పురుషాయ నారాయణాయ నమః - వస్త్రం సమర్పయామి*

---

[555] అగ్నికి ఉత్తరమున ఒక ఆకులో బియ్యమును పఱచి, ఆ బియ్యముపై పసుపుతో శ్రీ-భూమీ-నీళలతో కూడిన విష్ణువుయొక్క మూర్తులను చేసి, లేదా సాలగ్రామమూర్తిని ఆ బియ్యముపై నుంచి, ఆ మూర్తులకు అధోలిఖితక్రమమున ఆవాహనము, షోడశోపచారపూజ చేయవలెను. 1-9 మంత్రములతో విష్ణువును ఆవాహనచేసి, 10-12 మంత్రములతో వరుసగా అర్ఘ్య, పాద్య, ఆచమనీయముల నొసగి, తదుపరి 13-21 మంత్రములతో వరుసగా వస్త్ర-ఉపవీత-గంధ-పుష్ప-ధూప-దీప-ఫల-తామ్బూల-నీరాజనాది సర్వోపచారములు చేసి పూజింపవలెను.

14. ఓం పురుషాయ నారాయణాయ నమః - ఉపవీతం సమర్పయామి

15. ఓం పురుషాయ నారాయణాయ నమః - గంధం సమర్పయామి

16. ఓం పురుషాయ నారాయణాయ నమః - పుష్పైః పూజయామి

17. ఓం పురుషాయ నారాయణాయ నమః - ధూపమాఘ్రాపయామి

18. ఓం పురుషాయ నారాయణాయ నమః - దీపం సమర్పయామి

19. ఓం పురుషాయ నారాయణాయ నమః - సుఫలనైవేద్యం సమర్పయామి

20. ఓం పురుషాయ నారాయణాయ నమః - తామ్బూలం సమర్పయామి

21. ఓం పురుషాయ నారాయణాయ నమః - నీరాజనం సమర్పయామి

ఇతి వస్త్ర-ఉపవీత-గంధ-పుష్ప-ధూప-దీప-ఫల-తామ్బూల-నీరాజనాది సర్వోపచారాన్ దత్వా,

[556] తతః *"అస్మిన్ నారాయణబలిహోమకర్మణి బ్రహ్మాణం త్వాం వృణీమహే"*- ఇతి బ్రాహ్మణాయ ఆసనం దత్వా, *"బ్రహ్మణే నమః। సకలారాధనైః స్వర్చితమ్।"* - ఇతి అక్షతై రభ్యర్చ్య అగ్నేర్దక్షిణతో బ్రహ్మాణం వృణుయాత్.

[557]పవిత్రమాజ్యస్థాల్యాం నిధాయ, ఆజ్యం విలాప్య, ఉదీచోంఽగారాన్నిరూహ్య, తేష్వధిశ్రిత్య, జ్వలతా తృణేనావద్యోత్య, ద్వేదర్భాగ్రం ప్రచ్ఛిద్య, ప్రక్షాళ్య, ప్రత్యస్య, త్రిః పర్యగ్ని

556 అగ్నికి దక్షిణమున *"అస్మిన్ నారాయణబలిహోమకర్మణి బ్రహ్మాణం త్వాం వృణీమహే"*- అని చెప్పుచు ఒక బ్రాహ్మణుని బ్రహ్మస్థానమున దర్భాసనముపై కూర్చుండబెట్టి, *"బ్రహ్మణే నమః। సకలారాధనైః స్వర్చితమ్।"* - అని అతనిని పసుపు అక్షతలతో నర్చించి,

557 ఆయామతపవిత్రమును నేతిపాత్రలోనుంచి, అందులో నేతిని నింపి, అగ్నినుండి ఉత్తరము వైపు కొన్నినిప్పులను వేఱుగా తీసికొని, వానిపై ఆ నేతిపాత్ర నెక్కించి, ఒక దర్భను నిప్పుతో అంటించి, ఆజ్యాల నేతిపాత్రయందు ప్రతిబింబించునట్లుగా దర్భను చూపించి, రెండు దర్భాగ్రములను త్రుంచి, వానిని నీటితో కడిగి నేతిపాత్రలో నుంచి, నేతిపాత్రను జ్వలితదర్భచేత మూడు సార్లు చుట్టి, ఆ దర్భను ఉత్తరమునకు పరిత్యజించి, అగ్నినుండి వేఱుగా తీసికొనిన నిప్పులను తిరిగి అగ్నిలో చేర్చి, ఉత్తరాగ్రాయామతంతో నేతిని తూర్పునుండి మొదలిడి తూర్పునకే అంతమగునట్లు మూడుసార్లు గీచి, ఆయామతము ముడిని విప్పివైచి, నీటిని తాకి, ఆ దర్భల కొనలు తూర్పునకుండునట్లు పట్టుకొని అగ్నియందు వేయవలెను.

కృత్వా ఉదగుద్వాస్య, అంగారానగ్నౌ ప్రత్యూహ్య, ఉదగాగ్రాభ్యాం పవిత్రాభ్యాం పునరా హారమాజ్యం త్రిరుత్పూయ, పవిత్రగ్రంథిం విస్రస్య, అప ఉపస్పృశ్య, ప్రాగగ్రమగ్నౌ ప్రహరతి.

[558]యేన జుహోతి తదగ్నౌ ప్రతితప్య, దర్భైస్సంమృజ్య, పునః ప్రతితప్య, ప్రోక్ష్య, దర్భో నిధాయ, దర్భానద్భిః సంస్పృశ్య, అగ్నౌ ప్రహరతి. [559]శమ్యాః పరిధ్యర్థే. స్థవిష్ఠో మధ్యమః అణీయాన్ ద్రాఘీయాన్ దక్షిణార్ధ్యః, అణిష్ఠో హ్రసిష్ఠ ఉత్తరార్ధ్యః, మధ్యమ ముదగగ్ర మి... ప్రాగగ్రౌ. మధ్యమం పరిధిం హస్తేనోపస్పృశ్య, పురస్తాదూర్ధ్వే ద్వే ఆఘారసమిధావాదధాతి

[560]*1. "ఓం అదితేఽనుమన్యస్వ"* (ఇతి దక్షిణతః ప్రాచీనమ్), *2. ఓం అనుమతేఽ మన్యస్వ* (ఇతి పశ్చాదుదీచీనమ్), *3.ఓం సరస్వతేఽనుమన్యస్వ* (ఇత్యుత్తరతః ప్రాచీనమ్), *4. ఓం దేవసవితః ప్రసువ* (ఇతి సమంతం) - అగ్నిం పరిషిచ్య,

---

[558] ప్రధానదర్విన్ని, ఇతరదర్విని ఒకేసారి కుడి, ఎడమ చేతులలో పట్టుకొని, వాని నగ్నిపై దర్భలతో ప్రాక్సమాప్తిగా తుడిచి, మళ్లీ కాచి, తుడిచిన దర్భాగ్రములచేత నీటిని ప్రోక్షించి, పాత్రకు ఎడమవైపు ఇతరదర్విని(స్రువమును), కుడికి ప్రధానదర్విని (స్రుక్కును) సమ్మార్జనము చేసిన దర్భలను నీటితో తాకి, వాని నగ్నియందు వేయవలెను.

[559] ఇధ్మకట్టలో 15 జానెడు పొడవు గల సమిధలు, 5 పొడవైన సమిధలుండును. ఈ పొడవు సమిధలను అగ్నికి చుట్టును పరిధులుగా నుంచవలెను. వీనిలో అన్నిటికంటె లావుగనుండు సమిధను మధ్యన (అనగా అగ్నికి పశ్చిమమున), సన్నగా పొడవుగా నుండు సమిధను అగ్ని దక్షిణమున మధ్యమసమిధకు తగులునట్లును, అన్నిటికంటె సన్నగను పొట్టిగను ఉండు సమిధను అగ్నికుత్తరము వైపున మధ్యమసమిధకు తగులునట్లును ఉంచవలెను. మధ్యమ సమిధకొన ఉత్తరము వైపునకును, దక్షిణోత్తరములందుంచు పరిధుల కొనలు తూర్పునకు ఉండవలెను. ఇట్లుంచగా మిగిలిన రెండు సమిధలను ఒకేసారి రెండు చేతులందు గ్రహించి, వానితో మధ్యమసమిధను తాకి, వానిని ప్రాగగ్రములుగా అగ్నికి తూర్పున గేటువలె ఉత్తర దక్షిణములందుంచవలెను.

[560]ఆ తర్వాత అగ్నిచుట్టును నీటితో పరిషేచనము చేయవలెను. *"ఓం అదితేఽనుమన్యస్వ"* అని దక్షిణమువైపు పడమటినుండి మొదలిడి తూర్పున కంతమగునట్లు, *"ఓం అనుమతేఽను మన్యస్వ"*- అని పడమటివైపు దక్షిణమునుండి మొదలిడి ఉత్తరమున కంతమగునట్లు, *"ఓం సరస్వతేఽనుమన్యస్వ"*- అని ఉత్తరమువైపు పడమటినుండి మొదలిడి తూర్పున కంతమగు

[561]ఇధ్మమాజ్యేనాభ్యుక్ష్య, "అస్మిన్ నారాయణబలిహోమకర్మణి బ్రహ్మన్ ఇధ్మమాధాస్యే "- ఇతి పృష్ట్వా, "ఆధత్స్వ "- ఇతి ప్రత్యుక్తే, అగ్నౌ ఇధ్మమాధాయ,

## అగ్ని ముఖమ్

[562] అథ చతుర్గృహీతేనాజ్యేన జుహోతి,

1. *ఓం అగ్నయే స్వాహా। అగ్నయ ఇదం నమమ।*
2. *ఓం సోమాయ స్వాహా। సోమాయేదం నమమ।*
3. *ఓం అగ్నయే స్వాహా। అగ్నయ ఇదం నమమ।*
4. *ఓం భూర్భువస్సువస్స్వాహా। ప్రజాపతయ ఇదం నమమ।"*

ఇతి. [563]అవదానధర్మేణ దర్వ్యాముపస్తీర్య, చరుం ద్విరవదాయ (జమదగ్నినా త్రిః), సకృదభిఘార్య, విష్ణోర్నుకమితి పురోనువాక్యామనూచ్య, పరోమాత్రయా ఇత్యన్నేన జుహోతి. తత్ప్రకారః -

***"విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాంసి యో అస్కభాయదుత్తరగం సధస్థం విచక్రమాణ స్త్రేధోరుగాయః। విష్ణోరరాటమసి విష్ణోః పృష్ఠమసి విష్ణోశ్శ్నప్త్రేస్థో విష్ణోస్స్యూరసి విష్ణోర్ధ్రువమసి వైష్ణవమసి విష్ణవేత్వా।"***

---

నట్లు, *"ఓం దేవసవితః ప్రసువ "*- అని ఈశాన్యమునుండి మొదలిడి ఈశాన్యమునకే అంతమగునట్లు ప్రదక్షిణముగా అగ్నిచుట్టును నీటిని ధారగా విడువవలెను.

[561] స్రుక్కులో నేతిని గ్రహించి ఇధ్మకట్టలోని 15 ఇధ్మములను కొంచెము తడిపి, *"అస్మిన్ నారాయణబలిహోమకర్మణి బ్రహ్మన్ ఇధ్మ మాధాస్యే"* - అని బ్రహ్మనడిగి, *"ఆధత్స్వ "* - అని అతనిచే చెప్పించుకొని, ఆ 15 ఇధ్మల నొకేసారి అగ్నిలో నుంచవలెను.

[562]1-4 మన్త్రములతో నాల్గేసి సార్లు స్రుక్కులోనికి స్రువముతో నేతిని వేసికొనుచు హోమం చేసి,

[563] దర్విలో నేయి వేసికొని, దానిలోనికి చరువును రెండుసార్లు తీసికొని (పంచార్షేయులు మూడుసార్లు), దానిని ఒకసారి (పంచార్షేయులు రెండుసార్లు) నేతితో నభిఘరించి, "విష్ణోర్నుకం-----విష్ణవేత్వా" -అను మంత్రమును చెప్పి, తదుపరి "పరోమాత్రయా--విష్ణవ ఇదం నమమ "- వఱకు చెప్పి చరుహోమమును చేసి, తరువాత చరువును శర్కరాజ్యసహితముగా దర్విలోనికి తీసికొని 34-36 పుటలందలి మన్త్రములతో పురుషసూక్తహోమమును చేయవలెను.

"పరో మాత్రయా తనువా వృధాన। న తే మహిత్వమన్వశ్నువన్తి। ఉభే తే విద్మ రజసీ పృథివ్యా। విష్ణో దేవత్వం పరమస్య విత్సే స్వాహా। విష్ణవ ఇదం నమమ।" - ఇతి చరు హోమం కృత్వా, చరుం తర్కారాజ్యసహితం గృహీత్వా పురుషసూక్తహోమం కుర్యాత్. తతః

5. ఓం కేశవాయ స్వాహా। కేశవాయ ఇదం నమమ।
6. ఓం నారాయణాయ స్వాహా। నారాయణాయ ఇదం నమమ।
7. ఓం మాధవాయ స్వాహా। మాధవాయ ఇదం నమమ।
8. ఓం గోవిందాయ స్వాహా। గోవిందాయ ఇదం నమమ।
9. ఓం విష్ణవే స్వాహా। విష్ణవ ఇదం నమమ।
10. ఓం మధుసూదనాయ స్వాహా। మధుసూదనాయ ఇదం నమమ।
11. ఓం త్రివిక్రమాయ స్వాహా। త్రివిక్రమాయ ఇదం నమమ।
12. ఓం వామనాయ స్వాహా। వామనాయ ఇదం నమమ।
13. ఓం శ్రీధరాయ స్వాహా। శ్రీధరాయేదం నమమ।
14. ఓం హృషీకేశాయ స్వాహా। హృషీకేశాయ ఇదం నమమ।
15. ఓం పద్మనాభాయ స్వాహా। పద్మనాభాయ ఇదం నమమ।
16. ఓం దామోదరాయ స్వాహా। దామోదరాయ ఇదం నమమ।

[564]ఇతి ద్వాదశనామహోమం కృత్వా, తదుపరి "ఓ నమో నారాయణాయ" - ఇత్యష్టాక్షరేణ, "ఓం నమో భగవతే వాసుదేవాయ"-ఇతి ద్వాదశాక్షరేణ సూకరిముద్రయా హుత్వా, "హవ్యవాహమభిమాతిషాహమ్। విశ్వాదేవ పృతనా అభిష్య। జ్యోతిష్మంతం దీద్యతం పురంధిమ్। అగ్నిగ్ం స్విష్టకృతమాహువేమ। స్విష్టమగ్నే అభితత్పృణాహి। విశ్వా

[564] తరువాత 5-16 మంత్రములతో ద్వాదశనామహోమము చేసి, ఆపైన "ఓం నమో నారాయణాయ"- అను అష్టాక్షరమంత్రముతోను, "ఓం నమో భగవతే వాసుదేవాయ"- అను ద్వాదశాక్షరమంత్రముతోను సూకరిముద్రతో (అనగా అంగుష్ఠ, మధ్యమ, అనామికలతో చరువును గ్రహించుచూ) చరుహోమమును చేసి, అటుపైని "హవ్యవాహ-- అగ్నయే స్విష్టకృత ఇదం నమమ"- అని స్విష్టకృత్ హోమమును చేయవలెను. తదనంతరము

*దేవ పృతనా అభిష్య/ ఉరున్నః పన్థాం ప్రదిశన్ విభాహి/ జ్యోతిష్మద్ధేహ్యజరన్న ఆయుస్స్వాహా/ అగ్నయే స్విష్టకృత ఇదం నమమ/"* - ఇతి స్విష్టకృతం కృత్వా,

*పరిధ్యంజనం, లేపకార్యమ్:*

[565]ఆజ్యస్థాలీం ఉత్తరతః, ప్రధానదర్వీం దక్షిణతః, ఇతరం మధ్యే, పాత్రాసాదనదర్భానాదాయ దర్వ్యామనక్త్యగ్రం, ఇతరస్యాం మధ్యం, ఆజ్యస్థాల్యాం మూలం, ఏవం త్రిః. ఏకదర్భం ప్రజ్ఞాతం నిధాయ, శేషం నాత్యగ్రం ప్రహరేత్. త్రిరుద్యుత్య, తృణం ప్రహరతి. అప ఉపస్పృశ్య, ఏతత్తే తత్తేతదితి త్రిరంగుళ్యా నిర్దిశ్య, అగ్నిమభిమంత్ర్య, భూమిముపస్పృశేత్. మధ్యమపరిధిం ప్రహృత్య, ఇతరౌ యుగపత్ ప్రహరన్, పరిధీ నభిమంత్ర్య ఆఘారనమిధౌ ప్రహరతి. దర్వ్యా మితరదర్వ్యగ్రమవధాయ

*"వసుభ్యో రుద్రేభ్య ఆదిత్యేభ్యః సగ్గ్స్రావభాగేభ్య ఇదం నమమ"*

- ఇతి సగ్గ్స్రావం హుత్వా, ప్రాణానాయమ్య,

*"----గోత్రస్య ----శర్మణః (అథవా,----గోత్రాయాః---నామ్న్యాః) నారాయణబలి హోమకర్మణి మధ్యే సంభావిత మంత్రతంత్రస్వరవర్ణవిధివిపర్యాసన్యూనాతిరిక్తదోష ప్రాయశ్చిత్తార్థం సర్వప్రాయశ్చిత్తహోమం హోష్యామి"*

-ఇతి సంకల్ప్య ప్రాయశ్చిత్తహోమం కృత్వా, ప్రాణాయామం, పరిషేచనం, ప్రణీతామోక్షణం, బ్రహ్మోద్వాసనం, అగ్న్యుపస్థానాదికం కుర్యాత్.

[566]భగవతే అన్న, పాయస, అపూప, నానావిధవ్యంజన, భక్షణ, ఘృత, గుడసహితం సుఫలం నివేద్య, తాంబూల, నీరాజనాని సమర్పయేత్.

---

[565] ఇచ్చట చెప్పబడిన పరిధ్యంజనము, లేపకార్యము, ప్రాయశ్చిత్తహోమము, ప్రణీతామోక్షణము, బ్రహ్మోద్వాసనము, అగ్న్యుపస్థానము- ఇవన్నియు సపిణ్డీకరణప్రయోగములో చెప్పినట్లుగనే చేయవలెను. వీని వివరములకై ఆ అధ్యాయమును చూడునది.

[566] తదుపరి భగవంతునికి అన్నము, పాయసము, భక్ష్యములు, నానావిధవ్యంజనములు, నేయి, బెల్లము, పండ్లు వీనితో కూడిన నైవేద్యము నొసగి, తాంబూలనీరాజనము నీయవలెను.

## బ్రాహ్మణభోజనమ్

[567]తతః సుప్రక్షాళితపాణిపాదః పంచ, త్రీన్ వా బ్రాహ్మణాన్ వృత్వా, ఏకైకస్య త్రీన్ షడ్వా నామభిః అభ్యర్చ్య, పంచమం తృతీయం వా బ్రాహ్మణం "విశ్వంభరవిష్ణు"ఇతి అభ్యర్చ్య,

[568]భోజనస్థానే ఆసనాదీన్ ప్రదాయ, గంధపుష్పధూపదీపవస్త్రాభిరలంకృత్య, యత్యారాధనవత్ సర్వం కృత్వా, భోజనపాత్రే అన్నపాయసవ్యంజనాపూపాదీని పరివేష్య, హుత శేష మన్నం చ పరివేష్య,

[569]*"పృథివీ తే పాత్రం ద్యౌరపిధానం బ్రహ్మణస్త్వా ముఖే జుహోమి బ్రాహ్మణానాం త్వా ప్రాణాపానయోర్జుహోమ్యక్షితమసి మైషాం క్షేష్ఠా అముత్రాముష్మిన్ లోకే/ ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్/ సమూఢమస్య పాగ్ంసురే/ స్వాహా విష్ణో హవ్యం రక్షస్వ/ ---గోత్రస్య ---శర్మణః నారాయణబలిశ్రాద్ధే కేశవ,నారాయణ, మాధవేభ్యః ఇదమిదమిదం హవ్యమమృతస్వరూపం అతృప్తేర్దత్తం దాస్యమానం చ స్వాహా/ హవ్యం నమః/ నమమ"* - ఇతి ప్రథమస్య,

---

[567] తదుపరి కర్త కాళ్లు, చేతులు కడిగికొని, ఐదుగురిని గాని, ముగ్గురిని గాని బ్రాహ్మణులను వరణము చేయవలెను. ముగ్గురైనచో మొదటి ఇర్వురిని కేశవాది ద్వాదశనామముల యందలి ఆరేసి నామములతో, మూడవ బ్రాహ్మణుని "విశ్వంభర,విష్ణు" నామములతో వరణము చేసి పూజింపవలెను. ఐదుగురైనచో మొదటి నల్వురిని కేశవాది ద్వాదశనామములందలి మూడు మూడేసి నామములతో, ఐదవ బ్రాహ్మణుని "విశ్వంభర,విష్ణు" నామములతో వరణము చేసి పూజింపవలెను.

[568] తదుపరి బ్రాహ్మణుల భోజనస్థానములో ఆసనాదుల నొసగి, వారికి గంధపుష్పధూప దీపవస్త్రములు సమర్పించి, యతుల నారాధన చేయు విధముగా నారాధించి, భోజనపాత్రలలో అన్నపాయసవ్యంజనాపూపాదులను వడ్డించి, హోమము చేయగా మిగిలిన అన్నమును గూడ వారికి వడ్డించి,

[569] *"పృథివీ తే పాత్రం---నారాయణబలిశ్రాద్ధే కేశవ,నారాయణ,మాధవేభ్యః ఇదమిదమిదం హవ్యమమృతస్వరూపం అతృప్తేర్దత్తం దాస్యమానం చ స్వాహా హవ్యం నమః నమమ"* - అని మొదటి బ్రాహ్మణునికి చెప్పి, అన్నము నభిమర్శింప జేసి,

[570]"పృథివీ తే పాత్రం ద్యౌరపిధానం బ్రహ్మణస్త్వా ముఖే జుహోమి బ్రాహ్మణానాం త్వా ప్రాణాపానయోర్జుహోమ్యక్షితమసి మైషాం క్షేష్ఠా అముత్రాముష్మిన్ లోకే। ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్। సమూఢమస్య పాగ్ంసురే। స్వాహా విష్ణో హవ్యం రక్షస్వ। ---గోత్రస్య ---శర్మణః నారాయణబలిశ్రాద్ధే గోవింద, విష్ణు, మధుసూదనేభ్యః ఇదమిదమిదం హవ్యమమృతస్వరూపం ఆతృప్తేర్దత్తం దాస్యమానం చ స్వాహా / హవ్యం నమః। నమమ"- ఇతి ద్వితీయస్య,

[571]"పృథివీ తే పాత్రం ద్యౌరపిధానం బ్రహ్మణస్త్వా ముఖే జుహోమి బ్రాహ్మ-ణానాం త్వా ప్రాణాపానయోర్జుహోమ్యక్షితమసి మైషాం క్షేష్ఠా అముత్రాముష్మిన్ లోకే। ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్। సమూఢమస్య పాగ్ంసురే। స్వాహా విష్ణో హవ్యం రక్షస్వ। -----గోత్రస్య----శర్మణః నారాయణబలిశ్రాద్ధే త్రివిక్రమ,వామన ,శ్రీధరేభ్యః ఇదమిదమిదం హవ్యమమృతస్వరూపం ఆతృప్తేర్దత్తం దాస్యమానం చ స్వాహా। హవ్యం నమః। నమమ" - ఇతి తృతీయస్య,

[572]"పృథివీ తే పాత్రం ద్యౌరపిధానం బ్రహ్మణస్త్వా ముఖే జుహోమి బ్రాహ్మణానాం త్వా ప్రాణాపానయోర్జుహోమ్యక్షితమసి మైషాం క్షేష్ఠా అముత్రాముష్మిన్ లోకే। ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్। సమూఢమస్యపాగ్ంసురే। స్వాహా విష్ణో హవ్యం రక్షస్వ।----గోత్రస్య----శర్మణః నారాయణబలిశ్రాద్ధే హృషీకేశ,పద్మనాభ,దామోద

---

[570] "పృథివీ తే పాత్రం---నారాయణబలిశ్రాద్ధే గోవింద,విష్ణు,మధుసూదనేభ్యః ఇదమిదమిదం హవ్యమమృతస్వరూపం ఆతృప్తేర్దత్తం దాస్యమానం చ స్వాహా హవ్యం నమః నమమ" - అని రెండవ బ్రాహ్మణునికి చెప్పి, అన్నము నభిమర్శింప జేసి,

[571] "పృథివీ తే పాత్రం----నారాయణబలిశ్రాద్ధే త్రివిక్రమ,వామన,శ్రీధరేభ్యః ఇదమిదమిదం హవ్యమమృతస్వరూపం ఆతృప్తేర్దత్తం దాస్యమానం చ స్వాహా హవ్యం నమః నమమ" - అని మూడవ బ్రాహ్మణునికి చెప్పి, అన్నము నభిమర్శింప జేసి,

[572] "పృథివీ తే పాత్రం---నారాయణబలిశ్రాద్ధే హృషీకేశ,పద్మనాభ,దామోదరేభ్యః ఇదమిద మిదం హవ్యమమృతస్వరూపం ఆతృప్తేర్దత్తం దాస్యమానం చ స్వాహా హవ్యం నమః నమమ" -అని నాల్గవ బ్రాహ్మణునికి చెప్పి అన్నము నభిమర్శింపజేసి,

రేభ్యః ఇదమిదమిదం హవ్యమమృతస్వరూపం ఆతృప్తేర్దత్తం దాస్యమానం చ స్వాహా/ హవ్యం నమః/ నమమ"- ఇతి చతుర్థస్య,

[573] "పృథివీ తే పాత్రం ద్యౌరపిధానం బ్రహ్మణస్త్వా ముఖే జుహోమి బ్రాహ్మణానాం త్వా ప్రాణాపానయోర్జుహోమ్యక్షితమసి మైషాం క్షేష్ఠా అముత్రాముష్మిన్ లోకే/ ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్/ సమూఢమస్య పాగ్ం సురే/ స్వాహా విష్ణో హవ్యం రక్షస్వ/ ---గోత్రస్య ---శర్మణః నారాయణబలిశ్రాద్ధే విశ్వంభర,విష్ణవే [illegible]మిదం హవ్యమమృతస్వరూపం ఆతృప్తేర్దత్తం దాస్యమానం చ స్వాహా/ హ[illegible] నమః/ నమమ"- ఇతి పంచమస్య వరణం కృత్వా,

[574](అథవా, యది త్రీన్ బ్రాహ్మణాః నిమంత్రితాః తదా, కేశవ,నారాయ[illegible], గోవింద,విష్ణు,మధుసూదనేభ్యః - ఇతి ప్రథమస్య, త్రివిక్రమ,వామన,శ్రీధర,[illegible], పద్మనాభ,దామోదరేభ్యః- ఇతి ద్వితీయస్య, విశ్వంభర,విష్ణవే - ఇతి తృతీయ[illegible] కుర్యాత్) అన్నాభిమర్శనం కారయిత్వా,

*ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః/*
*త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుక్తే విశ్వభుగవ్యయః//*

-ఇత్యుక్త్వా, సర్వత్ర పరిషేచనం కారయిత్వా, "అమృతోపస్తరణమసి"-ఇత్యాపో[illegible] భగవత్పాదోదకేన కారయిత్వా, పంచప్రాణాహుతీః కారయేత్. తత్ప్రకారః -

---

573 "పృథివీ తే పాత్రం---నారాయణబలిశ్రాద్ధే విశ్వంభర,విష్ణవే ఇదమిదమిదం హవ్యమ[illegible] స్వరూపం ఆతృప్తేర్దత్తం దాస్యమానం చ స్వాహా హవ్యం నమః నమమ"-- అని [illegible] బ్రాహ్మణునికి చెప్పి అన్నము నభిమర్శింపజేసి,

574సూచన: ఒకవేళ ముగ్గురు బ్రాహ్మణులే నిమంత్రితులైనచో, "కేశవ,నారాయణ,మా[illegible] గోవింద,విష్ణు,మధుసూదనేభ్యః"- అని మొదటి బ్రాహ్మణుని, "త్రివిక్రమ,వామన,శ్రీధర, [illegible] కేశ,పద్మనాభ,దామోదరేభ్యః"- అని రెండవ బ్రాహ్మణుని, "విశ్వంభర,విష్ణవే" - అని మూ[illegible] బ్రాహ్మణుని వరణము చేయవలెను. సూచన : స్త్రీలకు ----గోత్రస్య --శర్మణః అని ఉన్నచో[illegible] ---గోత్రాయాః ----నామ్న్యాః అని చెప్పవలెను. తరువాత "ఏకోవిష్ణుర్మహద్భూతం[illegible] అను శ్లోకమును చెప్పి, భగవత్పాదోదకముతో "అమృతోపస్తరణమసి" అని అపోశన[illegible] చేయించి, 7-12 మంత్రములతో ప్రాణాహుతులను చేయింపవలెను.

7. *శ్రద్ధాయా౨ం ప్రాణే నివిష్టో౽మృతం జుహోమి। శివో మా౽౽ విశాప్రదాహాయ। ప్రాణాయ స్వాహా। ప్రాణాయ నారాయణాయేదం నమమ।*

8. *శ్రద్ధాయామపానే నివిష్టో౽మృతం జుహోమి। శివో మా౽౽ విశాప్రదాహాయ। అపానాయ స్వాహా। అపానాయ నారాయణాయేదం నమమ।*

9. *శ్రద్ధాయా౨ం వ్యానే నివిష్టో౽మృతం జుహోమి। శివో మా౽౽ విశాప్రదాహాయ। వ్యానాయ స్వాహా। వ్యానాయ నారాయణాయేదం నమమ।*

10. *శ్రద్ధాయాముదానే నివిష్టో౽మృతం జుహోమి। శివో మా౽౽ విశాప్రదాహాయ। ఉదానాయ స్వాహా। ఉదానాయ నారాయణాయేదం నమమ।*

11. *శ్రద్ధాయాగ్ం సమానే నివిష్టో౽మృతం జుహోమి। శివో మా౽౽ విశాప్రదాహాయ। సమానాయ స్వాహా। సమానాయ నారాయణాయేదం నమమ।*

12. *బ్రహ్మణి మ ఆత్మా౽మృతత్వాయ। శ్రీగోవిన్దాయ నమః।*

[575]హస్తోదకం దత్వా, *"స్వామినః యథాసుఖం జుషధ్వమ్। స్వామినః వసిష్ఠవామ దేవావివ యూయమాగతాః, యుష్మదనుగుణం పదార్థాః న మయా సంపాదితాః। సంపాదితేషు పదార్థేషు భగవన్నివేదితేషు యద్యదభీప్సితం తత్తదానాయ్య రాత్రౌ యథా క్షున్న జాయేత తథా భుక్త్వా వయం సంరక్షణీయాః।"* - ఇతి ప్రార్థ్య,

[576]అనంతరం ఉత్తరాపోశనాత్పూర్వం విశ్వంభరవిష్ణుస్థానబ్రాహ్మణస్యాగ్రే, దక్షిణాగ్రాన్ దర్భాన్ సంస్తీర్య, అక్షతోదకం దత్వా,

---

575 స్వాములకు హస్తోదకము నొసగి, *"స్వామినః యథాసుఖం జుషధ్వమ్------ ---వయం సంరక్షణీయాః"*- అని వారిని ప్రార్థించి,

576 స్వాముల భోజనము ముగిసిన పిమ్మట, ఉత్తరాపోశన మొసగుటకు పూర్వము, విశ్వంభర విష్ణుస్థానములో నున్న బ్రాహ్మణుని ఆకు ముందర దక్షిణాగ్రముగా మూడు దర్భలను పఱచి, వానిపై అక్షతోదకమును విడిచి, *"ఓం భూః స్వధా నమః, ఓం భువః స్వధా నమః, ఓగ్ం సువః స్వధా నమః, ఓం భూర్భువస్సువః స్వధా నమః"*- అని అన్నబలి నొసగి, ఆ బలిపై అక్షతోదకమును విడిచి, "అమృతాపిధానమసి" - అని స్వాములకు ఉత్తరాపోశనము నిచ్చి, వారు కాళ్లు చేతులు కడిగికొని, ఆచమించి వచ్చిన తర్వాత, వారికి సపిండీకరణములో వలెనే తాంబూల

*"ఓం భూః స్వధా నమః, ఓం భువః స్వధా నమః", ఓగ్ం సువః స్వధా నమః, ఓం భూర్భువస్సువః స్వధా నమః"*

- ఇతి బలిం దత్వా, ఉపరి అక్షతోదకం దత్వా, "అమృతాపిధానమసి" - ఇతి సర్వత్ర ఉత్తరాపోశనం దత్వా, బ్రాహ్మణవిసర్జనాంతం కుర్యాత్.

## పిండప్రదానమ్

[577]ప్రాణానాయమ్య, *"అద్య పూర్వోక్తపుణ్యతిథౌ ----గోత్రస్య ----శర్మణః ప్రేతస్య (అథవా, ----గోత్రాయాః ----నామ్న్యాః ప్రేతాయాః) ద్వాదశేఽహని ప్రేతత్వవిమోచనార్థం శ్రీవిష్ణులోకప్రాప్త్యర్థం శ్రీమహావిష్ణుప్రీత్యర్థం అస్మిన్నారాయణబలికర్మణి పిండ ప్రదానం కరిష్యే"* - ఇతి సంకల్ప్య, అగ్నేర్దక్షిణతః ద్వేధా దక్షిణాగ్రాన్ దర్భాన్ సంస్తీర్య, తూష్ణీం అక్షతోదకం విసృజ్య,

*1. కేశవ ఏతం పిండం దదామి,* *2. నారాయణ ఏతం పిండం దదామి,*
*3. మాధవ ఏతం పిండం దదామి* *4. గోవింద ఏతం పిండం దదామి*
*5. విష్ణో ఏతం పిండం దదామి* *6. మధుసూదన ఏతం పిండం దదామి*
*6. త్రివిక్రమ ఏతం పిండం దదామి* *7. వామన ఏతం పిండం దదామి*
*8. శ్రీధర ఏతం పిండం దదామి* *9. హృషీకేశ ఏతం పిండం దదామి*
*10. పద్మనాభ ఏతం పిండం దదామి* *12. దామోదర ఏతం పిండం దదామి*

- ఇతి కేశవాదినామభిః ద్వాదశపిండాన్ దత్వా, తూష్ణీం పునః అక్షతోదకం దత్వా,

---

దక్షిణాదుల నొసగి, ఉపచారీములను పలికి ఆసీమాంతం పంపివేయవలెను. వీని వివరములకు సపిణ్డీకరణాధ్యాయమును తూచునది.

[577]అతర్వాత కర్త ప్రాణాయామము చేసి, *"అద్య పూర్వోక్తపుణ్యతిథౌ ---గోత్రస్య ---శర్మణః ---నారాయణబలికర్మణి పిండప్రదానం కరిష్యే"* - అని సంకల్పించి, అగ్నికి దక్షిణమున రెండుచాళ్లుగా మూడేసి దర్భలను దక్షిణాగ్రముగా పఱచి, వానిపై అమంత్రకముగా అక్షతోదకము విడిచి, ఒక్కొక చాలునందు ఆఱేసి చొప్పున కేశవాదినామములతో మొత్తం 12 పిండములను 1-12 మంత్రములతో నుంచి, మఱల అమంత్రకముగానే అక్షతోదకమును విడిచి, *"విష్ణోర్నుకం"* - అను మంత్రముతో పిండోపస్థానమును చేయవలెను.

"విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాగ్ంసి యో అస్కభా యదుత్తరగ్ం సధస్థం విచక్రమాణ స్త్రేధోరుగాయః/ విష్ణోరరాటమసి విష్ణోః పృష్ఠమసి విష్ణోశ్శ్నప్త్రేస్థో విష్ణోస్స్యూరసి విష్ణోర్ధ్రువమసి వైష్ణవమసి విష్ణవేత్వా/"

- ఇతి పిండోపస్థానం కుర్యాత్.

[578]తతః "కేశవాదీన్ యథాసుఖం యథాస్థానముద్వాసయామి" - ఇతి పిండోపరి అక్షతాన్ వికీర్య, ఉద్వాస్య, అగ్నేరుత్తరతః తండులోపరి హరిద్రాబింబే "శ్రీభూమీనీళా సహిత ఆవాహితం విష్ణుం యథాస్థానం ప్రతిష్ఠాపయామి" - ఇత్యుద్వాస్య, అగ్న్యుప స్థానం కుర్యాత్.

[579] అగ్న్యుపస్థానమ్: "శ్రీవిష్ణవే స్వాహా/ విష్ణవే పరమాత్మన ఇదం నమమ/" - ఇతి ద్వౌ దర్భౌ అగ్నౌ నిసియ, ఉత్థాయ,

"అగ్నే నయ సుపథా రాయే అస్మాన్/ విశ్వాని దేవ వయునాని విద్వాన్/ యుయోధ్య స్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ/ అగ్నయే నమః/"

మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన/
యద్ధుతంతు మయా దేవ పరిపూర్ణం తదస్తు తే//
ప్రాయశ్చిత్తాన్యశేషాణి తపః కర్మాత్మికాని వై/
యాని తేషామశేషాణాం కృష్ణానుస్మరణం పరమ్//

[580]ప్రణమ్య, అభివాద్య,

---

[578]తదుపరి "కేశవాదీన్ యథాసుఖం యథాస్థానముద్వాసయామి"- అని పిండములపై అక్షతలను వేసి వాని నుద్వాసన చేసి, అగ్నికి ఉత్తరమున బియ్యమునందుంచిన హరిద్రాబింబములో ఆవాహన చేసిన విష్ణువును "శ్రీభూమీనీళాసహిత ఆవాహితం విష్ణుం యథాస్థానం ప్రతిష్ఠాప యామి"- అని అక్షతలు వేసి ఉద్వాసన చేసి, అగ్న్యుపస్థానమును చేయవలెను.

[579] అగ్న్యుపస్థానమునకై కర్త "శ్రీవిష్ణవే స్వాహా/ విష్ణవే పరమాత్మన ఇదం నమమ/" - అని రెండు దర్భలను అగ్నియందుంచి, లేచి నిలబడి, "అగ్నే నయ సుపథా రాయే----- అగ్నయే నమః/ మన్త్రహీనం----పరిపూర్ణం తదస్తు తే/ ప్రాయశ్చిత్తాన్యశేషాణి-----కృష్ణానుస్మరణం పరమ్" - అని లేచి నిల బడి చెప్పి ప్రణమించి, గోత్రనామయుతముగా అభివాదము చేసి,

*"కృతం కర్మ భగవానేవ స్వస్మై స్వప్రీతయే స్వయమేవ కారితవాన్"* - **ఇతి కృతం** కర్మ భగవన్నివేదనం కృత్వా, దశదానం భూరిదానం చ యథాశక్తి దత్వా, పిండానప్సు విసృజేత్. తతః స్నాత్వా, పుణ్యాహం కృత్వా, నూత్న యజ్ఞోపవీతం ధారయేత్.



580 *"కృతం కర్మ భగవానేవ స్వస్మై స్వప్రీతయే స్వయమేవ కారితవాన్"* - అని చేసిన కర్మను భగవన్నివేదనము చేసి, బ్రాహ్మణులకు దశదానములు, దక్షిణను శక్తికొలది ఇచ్చి, పిండములను నీటిలో పడవేసి, స్నానము చేసి పుణ్యాహవాచనము చేసి, నూత్న యజ్ఞోపవీతములను ధరింపవలెను.

# ఏకార్చవిధిసంస్కారః

[581]కుండపెంకును ఎఱ్ఱగా వేడిచేసి, అందులో వరిపొట్టువంటి దానిని వేసినచో, ఆ పొట్టు అంటుకొనును. ఇట్లు పరికల్పితమైన పెంకులోని అగ్నిని తుషాగ్ని యందురు. మూడేండ్ల నుండి ఉపనయనమగులోగా బాలుడు మరణించినను, మూడేండ్లనుండి వివాహమగులోగా బాలిక మరణించినను, వారికి తుషాగ్నితో ఏకార్చవిధితో సంస్కారము చేయవలెను. ఇట్టి మృతులకు నిశామరణాది ప్రాయశ్చిత్తములుగాని, నిత్యవిధిలో చెప్పబడు నిత్యతిలోదకదానాదులుగాని లేవు. మూడేండ్లలోగా మరణించిన బాలబాలికలకు ఖననమే కాని దహనసంస్కారము లేదు. ఏకార్చవిధిప్రయోగ మధోలిఖితవిధముగా నున్నది.

*ప్రయోగః*[582] మృతం స్నాత్వా, అలంకృత్య, శ్మశానం నీత్వా, కర్తా స్నాత్వా, ఆర్ద్రవాసః, ధృతోర్ధ్వపుండ్రః, ప్రాచీనావీతి,

*నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ।*
*జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః॥*

ఇత్యుక్త్వా, బ్రాహ్మణాన్ నమస్కృత్య, కృష్ణతిలాన్ వికీర్య, *"అశేషే హే పరిషత్. స్వామినః భవత్పాదమూలే మయా సమర్పితామిమాం సౌవర్ణీం యత్కించిద్దక్షిణాం యథోక్తదక్షిణామివ స్వీకృత్య -----గోత్రం -----శర్మాణం మమ కుమారం ప్రేతం*

---

[581] ఈ ప్రయోగము కంచికామకోటిమఠంవారు తమిళవ్యాఖ్యానంతో ప్రచురించిన "అపర ప్రయోగము"నుండి గ్రహింపబడినది. శ్రీవైష్ణవులిందులోని ఆచరణీయభాగములను గుర్తించి, వాని నాచరింపవలెను.

[582] శవమునకు స్నానము పోసి, అలంకరించి, శ్మశానముకు గొని వచ్చి, కర్త స్నానము చేసి, ఒంటి తడివస్త్రమును ధరించి, శ్రీచూర్ణరహితముగా ఊర్ధ్వపుండ్రములను ధరించి, ప్రాచీనావీతియై, *"నమో బ్రహ్మణ్య దేవాయ-----నమో నమః"*- అని నల్లనువ్వులను సభపై చల్లి, సభకు నమస్కరించి, *"అశేషే హే పరిషత్--- యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ"* అని సభకు నమస్కరించి, *"తథాస్తు, యోగ్యతాసిద్ధిరస్తు"* అని సభానుజ్ఞను పొంది,

(అథవా, -----గోత్రాం ---నామ్నీం మమ కన్యాం ప్రేతాం) తుషాగ్నినా ఏకార్చవిధినా సంస్కర్తుం యోగ్యతాసిద్ధిమనుగ్రహాణ"- ఇతి ప్రార్థ్య, "తథాస్తు, యోగ్యతాసిద్ధిరస్తు"- ఇతి బ్రాహ్మణైరనుజ్ఞాప్య,

[583] ఉపవీతి, ప్రాణానాయమ్య, ప్రాచీనావీతి, "ఓం శ్రీగోవింద, గోవింద, గోవింద - అస్యాం తిథౌ ----గోత్రం ----శర్మాణం కుమారం ప్రేతం (అథవా, -----గోత్రాం ---- నామ్నీం కన్యాం ప్రేతాం) తుషాగ్నినా ఏకార్చవిధినా సంస్కరిష్యామి"- ఇతి సంకల్ప్య,

[584] కపాలమగ్నౌ నిక్షిప్య, తప్తే కపాలే తుషాన్నిక్షిప్య, తస్మాత్ తుషాగ్నిం ఉత్పాద్య, అగ్నిం ప్రతిష్ఠాప్య, విపరీతముల్లిఖ్య, అజ్యదర్వీసంస్కారాంతం కృత్వా, అప్రదక్షిణమగ్నిం పరిషిచ్య, ప్రథమతః దర్వ్యా ద్వాదశగృహీతేనాజ్యేన తూష్ణీం జుహోతి. - "ప్రజాపతయ ఇదం నమమ/"- ఇతి. తతః "ఓం భూర్భువస్సువస్స్వాహా/ప్రజాపతయ ఇదం నమమ/" - ఇతి హుత్వా, అప్రదక్షిణమగ్నిం పరిషిచ్య, శ్మశానదేశం తూష్ణీం సంమృజ్య, తూష్ణీం హిరణ్య శకలం నిధాయ, చితిం కల్పయిత్వా, తదుపరి ప్రేతం (ప్రేతాం) దక్షిణాశిరసం ఉత్తానం శాయ యిత్వా, సూర్యముఖః స్థిత్వా అగ్నిమాదాయ దహేత్.

---

583 ఉపవీతియై ప్రాణాయామము చేసి, ప్రాచీనావీతియై "గోత్రస్య శర్మణః--- సంస్కరిష్యామి" - అని సంకల్పించి,

584 కుండపెంకును ఎఱ్ఱగా వేడిచేసి, అందులో వరిపొట్టును వేసి తుషాగ్నిని పరికల్పించి, స్థండిలముపై ఆ అగ్నిని ప్రతిష్ఠించి, 2వ అధ్యాయములో చెప్పినట్లుగా విపరీతముగా ఉల్లేఖ నమును, ఆజ్యదర్వీసంస్కారములను చేసి, అగ్నిని అప్రదక్షిణముగా పరిషేచించి, దర్విలోకి 12 సార్లు నేతిని తీసికొని అమంత్రకముగా హోమము చేసి, "ప్రజాపతయ ఇదం నమమ"- అని చెప్పి, మఱల 12 సార్లు దర్విలోనికి నేతిని తీసికొని "ఓం భూర్భువస్సువస్స్వాహా/ప్రజాపతయ ఇదం నమమ/" - అని హోమము చేసి, మఱల అగ్నిని అప్రదక్షిణముగా పరిషేచించి, అమంత్ర కముగా దహనదేశము నూడిచి, అమంత్రకముగనే హిరణ్యమునుగాని (ఆజ్యబిందువులను గాని) ఆ ప్రదేశమందుంచి, దక్షిణాగ్రముగా దర్భలను పఱచి, వానిపై చితిని పేర్చి, దక్షిణశిర స్సుగా శవమును వెల్లకిల చితిపై పరుండబెట్టి, సూర్యునివైపు (అనగా ఉదయమందు తూర్పు నకు, మధ్యాహ్నానంతరము పడమటికి) మళ్లి తుషాగ్నిని వక్షమునందుంచి దహింపవలెను.

[585]అనంతరం సూర్యముఖః స్థిత్వా "అస్మాత్త్వమధిజాతోఽస్యయం త్వదధిజాయతామ్/ అగ్నయే వైశ్వానరాయ సువర్గాయ లోకాయ స్వాహా" - ఇతి హుత్వా, స్రుక్స్రువాజ్యపాత్రాణి తదగ్నౌ ప్రహృత్య, అగ్నిమప్రదక్షిణం పరిషిచ్య సర్వే స్నానం కుర్యుః.

[586]అత్ర తిలోదక, పిణ్డబలి, ప్రభూతబలీన్ తూష్ణీం కుర్యాత్. కేచిత్ నారాయణబలిమపి కుర్వన్తి. తృతీయేహ్ని నవకుంభమాదాయ దహనం వ్రజేత్. జలేన పయసావైవ సంప్రోక్ష్య అస్థీని అమన్త్రతః తాని కుంభే సమోప్యాథ పయసా పూరయేద్ఘటమ్. "ఇదంత ఏక"మితి మన్త్రేణ ఘటం సురక్షితం కుర్యాత్.ఆపస్తమ్బీభిః తృతీయవర్షమారభ్య సమన్త్రకసఞ్చయనం కార్యమ్.

[587]నగ్న, వాసోదక, ఏకోత్తరవృద్ధి, నవశ్రాద్ధాని న భవన్తి. అన్యః కర్తా చేత్ యావదాశౌచం ఉదకదానం, పిణ్డదానం కుర్యాత్.

[588]చతుర్థ, పంచమవర్షయోః తుషాగ్నినా దాహః. పితా వా భ్రాతా వా నగ్నం సమన్త్రం సఞ్చయనం చ కృత్వా గ్రామాద్బహిః దర్భస్తమ్బే అష్టమదినే ద్విపంచాశత్ తిలోదకాని

---

585 తరువాత సూర్యునివైపు మళ్ళి, ఆ అగ్నియందు "అస్మాత్ --- లోకాయ స్వాహా"- అని హోమము చేసి, స్రుక్స్రువములను ఆజ్యపాత్రను ఆ అగ్నిలో పడవేసి, అగ్నిని అప్రదక్షిణముగా పరిషేచన చేసి, అందఱును స్నానము చేయవలెను.

586 ఏకాహ్నవిధియందు తిలోదక, పిణ్డబలి, ప్రభూతబలులను అమంత్రకముగా చేయవలెను. కొందఱు నారాయణబలిని కూడ చేయుచున్నారు. 3వరోజు క్రొత్తకుండను తీసికొని దహన దేశమునకు పోయి, నీరు గలిపిన పాలతో అస్థులను ప్రోక్షించి, అమన్త్రకముగనే అస్థులను కుండలో వేసికొని, పాలతో ఆ కుండను నింపి, "ఇదంత ఏకం" - అను మన్త్రముతో దానిని సురక్షితము చేయవలెను. ఆపస్తమ్బసూత్రానుయాయులు 3వ యేడు దాటినవారికి సఞ్చయనమును సమన్త్రకముగనే చేయవలెను.

587 ఇందు నగ్న, వాసోదక, ఏకోత్తరవృద్ధి, నవశ్రాద్ధములు లేవు. ఒకవేళ అన్యులు కర్తలైనచో, వారు ఆశౌచమున్నంతవఱకు ఉదక, పిణ్డదానములు చేయవలెను.

588 4,5 సంవత్సరముల ప్రాయములో మృతులైన బాలబాలికలకు తండ్రిగాని అన్నగాని తుషాగ్నితో సంస్కారమును చేయవలెను. (3వ రోజు) అస్థిసఞ్చయనమును సమంత్రకముగా చేయవలెను. 8వ రోజు దర్భస్తంబమునందు 52 తిలోదకముల నీయవలెను. భూమిపై 8 పిణ్డ

భూమౌ అష్టపిణ్డాన్ బలీన్, నవమదినే ఏకాదశతిలోదకాని ఏకం పిణ్డబలిం, ప్రభూతబలిం, దశమదినే ద్వాదశతిలోదకాని, ఏకం పిణ్డబలిం దత్వా ద్వాదశదినే నారాయణబలిం కుర్యాత్.

[589]జ్ఞాతిః కర్తా చేత్ ప్రథమదినే ద్వాదశతిలోదకాని, త్రీన్ పిణ్డాన్, బలీన్, ద్వితీయదినే త్రింశత్ తిలోదకాని, త్రీన్ పిణ్డాన్, బలీన్, ప్రభూతబలిం, పంచమదినే నారాయణబలిం చ కుర్యాత్. అన్యః కర్తా చేత్ యావదాశౌచం పిణ్డోదకదానం కుర్యాత్. జ్ఞాతిభిరపి పఞ్చసప్తతి తిలోదకాని దాతవ్యాని.

[590]షష్ఠవర్షే తుషాగ్నినా దాహః. పితా వా భ్రాతా వా నగ్నం సమన్త్రం సఞ్చయనం చ కృత్వా గ్రామాద్బహిః. దర్భస్తమ్బే అష్టమదినే ద్విపంచాశత్ తిలోదకాని భూమౌ అష్టపిణ్డాన్ బలీన్, ద్విపంచాశదేకోత్తరవృద్ధిశ్రాద్ధాని, చత్వారి నవశ్రాద్ధాని కుర్యాత్. నవమదినే ఏకాదశతిలోదకాని, ఏకం పిణ్డబలిం, ఏకాదశైకోత్తరవృద్ధిశ్రాద్ధాని, ఏకం నవశ్రాద్ధం కుర్యాత్. దశమదినే ద్వాదశ తిలోదకాని, ఏకం పిణ్డబలిం, ద్వాదశైకోత్తరవృద్ధిశ్రాద్ధాని, ప్రభూతబలిం చ

---

బలుల నొసగవలెను. 9వ రోజు 11 తిలోదకములను, ఒక పిణ్డబలిని, ప్రభూతబలి నొసగి, 10వ రోజు 12 తిలోదకములను, ఒక పిణ్డబలి నొసగి, 12వరోజు నారాయణబలిని వేయవలెను.

[589] ఒకవేళ కర్మ చేయునది జ్ఞాతి యైనచో, అతడు ప్రథమదినమున 12 తిలోదకములను, 3 పిణ్డబలుల నొసగవలెను, రెండవదినమున 30 తిలోదకములను, 3 పిణ్డబలులను, ప్రభూత బలిని ఈయవలెను. ఐదవదినమున నారాయణబలిని చేయవలెను. జ్ఞాతేతరుడు కర్తయైనచో అతడు ఆశౌచమున్నంతవఱకు పిణ్డోదకదానములు చేయవలెను. అప్పుడు జ్ఞాతులును 75 తిలోదకముల నీయవలెను.

[590] 6 సంవత్సరముల ప్రాయములో మృతులైన బాలబాలికలకు తండ్రిగాని అన్నగాని తుషాగ్ని తోడ సంస్కారమును చేయవలెను. (3వ రోజు) అస్థిసఞ్చయనమును సమంత్రకముగా చేయ వలెను. 8వ రోజు దర్భస్తంబమునందు 52 తిలోదకములను, 8 పిణ్డబలులను ఈయవలెను; 52 ఏకోత్తరవృద్ధిశ్రాద్ధములను, 4 నవశ్రాద్ధములను వేయవలెను. 9వ రోజు 11 తిలోదకములను, ఒక పిణ్డబలిని, 11 ఏకోత్తరవృద్ధిశ్రాద్ధములను, ఒక నవశ్రాద్ధమును చేయవలెను. 10వ రోజు 12 తిలోదకములను, ఒక పిణ్డబలిని, 12 ఏకోత్తరవృద్ధిశ్రాద్ధములను, ప్రభూతబలిని ఈయవలెను. 11వ నాడు ఒక నవశ్రాద్ధమును, షోడశశ్రాద్ధమును అమన్త్రకముగ చేసి, 12వ రోజు నారాయణ బలిని వేయవలెను.

కుర్యాత్. ఏకాదశదినే ఏకం నవశ్రాద్ధం మన్త్రవర్జం, తన్త్రతః షోడశశ్రాద్ధం కుర్యాత్. ద్వాదశదినే నారాయణ బలిం చ కుర్యాత్.

[591]జ్ఞాతిః కర్తా చేత్ ప్రథమదినే ద్వాదశతిలోదకాని, త్రీన్ పిణ్డాన్ బలీన్, ద్వాదశైకోత్తర వృద్ధిశ్రాద్ధాని ద్వే నవశ్రాద్ధే కుర్యాత్. ద్వితీయదినే త్రింశత్తిలోదకాని, చతురః పిణ్డాన్ బలీన్, త్రింశ దేకోత్తరవృద్ధిశ్రాద్ధాని, ద్వే నవశ్రాద్ధే కుర్యాత్. తృతీయదినే త్రయస్త్రింశత్తిలోదకాని, త్రీన్ పిణ్డాన్ బలీన్, త్రయస్త్రింశదేకోత్తరవృద్ధిశ్రాద్ధాని, ఏకం నవశ్రాద్ధం, ప్రభూతబలిం చ కుర్యాత్. చతుర్థదినే ఏకం నవశ్రాద్ధం మన్త్రవర్జం, తన్త్రతః షోడశశ్రాద్ధం కుర్యాత్. పంచమదినే నారాయణబలిం చ కుర్యాత్. అన్యః కర్తా చేద్యావదాశౌచం పిణ్డోదకదానం కుర్యాత్. జ్ఞాతిభిరపి పఞ్చసప్తతి తిలోదకాని దాతవ్యాని.

[592]సప్తమవర్షే చ తుషాగ్నినా దాహః. పితా భ్రాతా వా జ్ఞాతిర్వా అష్టమాది దినత్రయే వా దశమదినే వా పఞ్చసప్తతి తిలోదకాని, దశపిణ్డాన్ బలీన్, ఏకోత్తరవృద్ధిశ్రాద్ధాని, వృషోత్స

---

[591] ఒకవేళ కర్మ చేయునది జ్ఞాతి యైనచో, అతడు ప్రథమదినమున 12 తిలోదకములను, 3 పిణ్డబలులను, 12 ఏకోత్తరవృద్ధిశ్రాద్ధములను, రెండు నవశ్రాద్ధములను చేయవలెను. రెండవ రోజు 30 తిలోదకములను, 4 పిణ్డబలులను, 30 ఏకోత్తరవృద్ధిశ్రాద్ధములను, రెండు నవశ్రాద్ధములను చేయవలెను. 3వ దినమున 33 తిలోదకములను, 3 పిణ్డబలులను, 33 ఏకోత్తరవృద్ధిశ్రాద్ధములను, ఒక నవశ్రాద్ధమును, ప్రభూతబలిని చేయవలెను. 4వ దినమున అమన్త్రకముగా ఒక నవ శ్రాద్ధమును ఒక షోడశశ్రాద్ధమును చేయవలెను. 5వ దినమున నారాయణబలిని చేయవలెను. జ్ఞాతేతరుడు కర్తయైనచో అతడు అశౌచమున్నంతవఱకు పిణ్డోదకదానములు చేయవలెను. అప్పుడు జ్ఞాతులును 75 తిలోదకముల నీయవలెను.

[592] 7 సంవత్సరముల బాలబాలికలకు గూడ తుషాగ్నితో సంస్కారము చేయవలెను. తండ్రి గాని, అన్నగాని, లేక జ్ఞాతిగాని 8 నుండి 11 దినములయందు గాని, 10వ దినమందు గాని 75 తిలోదకములను, 10 పిణ్డబలులను, 75 ఏకోత్తరవృద్ధిశ్రాద్ధములను, వృషోత్సర్జనమును, 6 నవ శ్రాద్ధములను, షోడశశ్రాద్ధమును, నారాయణబలిని అమన్త్రకముగా చేయవలెను. ఇట్టి మ్మృతి యందు జ్ఞాతులకు గూడ 10 రోజులు అశౌచము వచ్చుటచేత, వారును పై రీతిగనే కర్మను చేయవలెను. జ్ఞాతేతరుడు కర్తయైనచో అతడు అశౌచమున్నంతవఱకు పిణ్డోదకదానములు చేయవలెను. (అప్పుడు జ్ఞాతులును 75 తిలోదకముల నీయవలెను.)

ర్జనం, నవశ్రాద్ధాని, షోడశశ్రాద్ధాని, నారాయణబలిం చ మన్త్రవర్జం తన్త్రతః కుర్యాత్. జ్ఞాతినా మపి దశాహాశౌచాస్య సత్వాత్. అన్యః కర్తా చేద్యావదాశౌచం పిణ్డోదకదానం కుర్యాత్.

[593]అష్టమవర్షసమాప్తిపర్యన్తం త్రిరాత్రేణైవ పిణ్డోదకసమాప్తి స్మరణాత్. ఏవం వివాహ పర్యన్తం కన్యామరణే పితా భ్రాతా వా అష్టమాది-దినత్రయే వా దశమదినే వా ఉక్తప్రకారేణ కుర్యాత్. నగ్న-సఞ్చయన-తిలోదక-పిణ్డబల్యేకోత్తరవృద్ధి-నవశ్రాద్ధ-వృషోత్సర్జన-షోడశ శ్రాద్ధ-నారాయణబలి-కర్మాణి కర్తవ్యాని. అష్టమవర్షసమాప్తిపర్యన్తం వాసోదక-పాషాణస్థాపన -శాన్తిహోమా న భవన్తి.

[594]నవమవర్షేతు తుషాగ్నినా దాహః. పితా భ్రాతా వా జ్ఞాతిర్వా నగ్న-సఞ్చయన-పాషాణస్థాపన-పూర్వకం ప్రథమదినప్రభృతి దశమదినపర్యన్తం ప్రత్యహం తూష్ణీం వాసోదక-తిలోదకాని, భూమౌ పిణ్డబలీన్, నవశ్రాద్ధాని, ప్రభూతబలిం మన్త్రవర్జం శాన్తిహోమం, ఏకాదశదినే మన్త్రవర్జం వృషోత్సర్జనం మన్త్రవర్జం తన్త్రతః షోడశశ్రాద్ధాని, ద్వాదశదినే మన్త్రవర్జం నారాయణ బలిం చ కుర్యాత్. అన్యః కన్యామరణే యావదాశౌచం ఏవమేవ మన్త్రవర్జం కుర్యాత్.

---

[593] 8 ఏండ్లు పూర్తియగు వఱకు పై విధముగానే సంస్కారమును చేయవలెను. అట్లే వివాహ పర్యంతము కన్యలకు తండ్రిగాని, అన్నగాని 8 మొది 11 దినములయందు గాని, 10వ దిన మందుగాని శాస్త్రవిహితమైనన్ని నగ్న-సఞ్చయన-తిలోదక-పిణ్డబల్యేకోత్తరవృద్ధి-నవశ్రాద్ధ-వృషోత్సర్జన-షోడశ శ్రాద్ధ-నారాయణబలి-కర్మలను చేయవలెను. 8 సంవత్సరములు పూర్తి కాక ముందే మృతులైనవారికి వాసోదక-పాషాణ స్థాపన-శాన్తిహోమములు లేవు.

[594] 9వ ఏట మృతినందినవారికిని తుషాగ్నితోడనే దహనము చేయవలెను. తండ్రిగాని, అన్న గాని, జ్ఞాతిగాని నగ్న-సఞ్చయన-పాషాణస్థాపన-పూర్వకముగా తొలినాటినుండి పదవనాటి వఱకు ప్రతిరోజు చేయవలసిన వాసోదక-తిలోదకములను, పిణ్డబలులను, నవశ్రాద్ధములను, ప్రభూతబలిని అమన్త్రకముగా చేయవలెను. అట్లే 10వ రోజు శాన్తిహోమమును, 11వ రోజు వృషో త్సర్జనమును, షోడశశ్రాద్ధములను, 12వ రోజు నారాయణబలిని అమన్త్రకముగా చేయవలెను. అన్యుడు కర్తయైనచో అతడు అశౌచమున్నంతవఱకు పై కర్మలనే అమన్త్రకముగా చేయవలెను. ఇట్టి నవవర్షముల వారికివలెనే ఉపనయనపర్యన్తం బాలురకు, వివాహపర్యన్తం కన్యలకు తుషా గ్నితో ఏకార్చవిధితో సంస్కారం చేసి అన్ని కర్మలను మన్త్రవర్జముగా చేయవలెను.

ఏవం ఉపనయనపర్యన్తం బాలాయ, వివాహపర్యన్తం కన్యాయాశ్చ తుషాగ్నినా, ఏకార్చ విధినా సంస్కారం నవమవర్షకృత్య ఇవ సర్వాణి కర్మాణి చ మన్త్రవర్జం తన్త్రతః కుర్యాత్.

[595]ఏకార్చవిధిప్రయోగే సర్వాణి కర్మాణి అమన్త్రం కర్తవ్యాని. *"దహనజనిత-క్షుత్తృష్ణా శాన్త్యర్థం వాసోదక-తిలోదకాని కరిష్యే", "ప్రేతశరీర-క్లృప్త్యర్థం పిణ్డబలిప్రదానం కరిష్యే", "దహనజనిత-క్షుత్తృష్ణా-శాన్త్యర్థం ఏకోత్తరవృద్ధిశ్రాద్ధాని కరిష్యే", "నగ్న త్వ నివృత్త్యర్థం నగ్నప్రచ్ఛాదనశ్రాద్ధం కరిష్యే", "ప్రేతత్వనివృత్త్యర్థం నవశ్రాద్ధం కరిష్యే", "ప్రేతత్వనివృత్త్యర్థం వృషోత్సర్జనం కరిష్యే", "పిశాచత్వనివృత్త్యర్థం మహైకోద్దిష్ట శ్రాద్ధం కరిష్యే", "ప్రేతత్వనివృత్త్యర్థం ఆవృత్తాది షోడశశ్రాద్ధాని కరిష్యే", "ప్రేతత్వ నివృత్త్యర్థం, పుణ్యలోకప్రాప్త్యర్థం సపిణ్డీకరణస్థానే నారాయణబలికర్మ కరిష్యే"* - ఇత్యుక్తప్రకారేణ సంకల్పం కృత్వా సర్వాణి మన్త్రవర్జం తన్త్రతః కుర్యాత్. శాన్తికర్మ చ కుర్యాత్.
[596]శాన్తికర్మణి ఉల్లేఖనాది పాత్రాసాదనాన్తే అమన్త్రకం చర్మారోహణం, ఉపవేశనం చ కృత్వా,

---

[595] ఏకార్చవిధియందన్ని కర్మలను అమన్త్రకముగనే చేయవలెను. *"దహనజనిత-క్షుత్తృష్ణా-శాన్త్యర్థం వాసోదక-తిలోదకాని కరిష్యే", "ప్రేతశరీర-క్లృప్త్యర్థం పిణ్డబలిప్రదానం కరిష్యే", "దహనజనిత-క్షుత్తృష్ణా-శాన్త్యర్థం ఏకోత్తరవృద్ధిశ్రాద్ధాని కరిష్యే", "నగ్న త్వనివృత్త్యర్థం నగ్న ప్రచ్ఛాదనశ్రాద్ధం కరిష్యే", "ప్రేతత్వనివృత్త్యర్థం నవశ్రాద్ధం కరిష్యే", "ప్రేతత్వనివృత్త్యర్థం వృషోత్సర్జనం కరిష్యే", "పిశాచత్వనివృత్త్యర్థం మహైకోద్దిష్టశ్రాద్ధం కరిష్యే", "ప్రేతత్వనివృత్త్యర్థం ఆవృత్తాది షోడశశ్రాద్ధాని కరిష్యే", "ప్రేతత్వనివృత్త్యర్థం, పుణ్యలోకప్రాప్త్యర్థం సపిణ్డీకరణస్థానే నారాయణబలికర్మ కరిష్యే"*- అని ఆయా కర్మలకు సంకల్పమును చెప్పుచు అన్ని కర్మలను మన్త్రవర్జముగ తన్త్రముతో చేయవలెను. శాన్తికర్మను కూడ ఇట్లే చేయవలెను.

[596] శాన్తికర్మయందు ఉల్లేఖనాది పాత్రాసాదనాదులను చేసి, అమన్త్రకముగా జ్ఞాతులను వృష చర్మముపై నెక్కించుట, దింపుట, అగ్నిపరిషేచనము అన్నియు చేసి, మేడి స్రుక్కులో నాల్గేసి సార్లు నేతిని తీసికొనుచు రెండుసార్లు అమంత్రకముగా హోమము చేసి, తదుపరి మేడి స్రువ ముతో నేతిని తీసికొని 10 సార్లు హోమమును చేసి, ప్రతిసారి హోమముచేసిన తర్వాత స్రుక్స్రువ ములలో చిక్కిన నేతినొక దొప్పలో చేర్చికొని (ఇదే సంపాతాజ్యము), హోమానంతరము స్రుక్స్రువముల నగ్నిలో పరిహరించి, వృషభముతో తూర్పునకు నడచుట మొదలైనవన్నీ మన్త్రవర్జముగనే చేసి, అనన్తహోమమును కూడ మన్త్రవర్జముగనే చేసి, లాజప్రాశనమును కూడ

పరిషేచనాన్తం కృత్వా, వారణ్యా స్రుచా చతుర్గృహీతవాజ్యేన మన్త్రవర్జం ద్వే అహుతీ హుత్వా, వారణేన స్రువేణ మన్త్రవర్జం దశాహుతీర్హుత్వా, సంపాతం చ కృత్వా, ఉభయం ప్రహృత్య, ప్రాశ్యా గచ్ఛన్తిత్యాదికం మన్త్రవర్జం కృత్వా, అనన్తహోమమపి మన్త్రవర్జం హుత్వా, మన్త్రవర్జం లాజప్రాశనమపి కుర్యాత్. ఏకాదశదినే నవశ్రాద్ధం, వృషోత్సర్జనం కృత్వా, ఏకోద్దిష్టే మాసిశ్రాద్ధ వత్ వరణ-సంకల్ప-పాదప్రక్షాళన-అవాహన-అర్ఘ్యగ్రహణ-అర్ఘ్యదాన-ఉపచార-స్థలశుద్ధ్యా దికం మన్త్రవర్జం కృత్వా, మన్త్రవర్జం ద్వాత్రింశదన్నాహుతీర్హుత్వా, శేషం పిణ్డదానాన్తం కుర్యాత్. ద్వాదశదినే కేశవాద్యర్థే, విష్ణ్వర్థే చ బ్రాహ్మణాన్ వృత్వా, మన్త్రవర్జం సర్వం కుర్యాత్. బ్రహ్మ చారిణోఽపి ద్వాదశవర్షపర్యన్తం సమన్త్రకం నారాయణబలిం కుర్యాత్. ఏవం కృతే పుణ్యలోకే మహీయతే.



మన్త్రవర్జముగనే చేయవలెను. 11వ దినమున నవశ్రాద్ధమును, వృషోత్సర్జనమును మంత్రరహిత ముగనే చేసి, ఏకోద్దిష్టమునందు మాసిశ్రాద్ధములోవలెనే వరణ-సంకల్ప-పాదప్రక్షాళన-అవా హన-అర్ఘ్యగ్రహణ-అర్ఘ్యదాన-ఉపచార-స్థలశుద్ధ్యాదులు అమంత్రకముగనే చేసి, మన్త్రవర్జము గనే 32 అన్నాహుతులను వ్రేల్చి, పిణ్డదానాన్తం చేయవలెను. ద్వాదశదినమందు కేశవాదుల స్థానములో, విష్ణుస్థానములో బ్రాహ్మణులను వరణము చేసి, మంత్రరహితముగ నారాయణ బలిని చేయవలెను. బ్రహ్మచారులకు గూడ ద్వాదశవర్షపర్యన్తం సమన్త్రకముగా నారాయణ బలిని చేయవలెను. ఇట్లుచేసిన మృతులకు పుణ్యలోకప్రాప్తి కలుగును. (గమనిక: ఇక్కడ మంత్రవర్జముగా ననగా సంకల్పమును మాత్రము చెప్పి, మిగిలిన తంత్రమునంతయు అయా మంత్రము లుచ్చరింపకుండగనే చేయవలయును.)

# అనుబంధః

## *అపరకర్మలలో పాటింపవలసిన ముఖ్యవిషయములు*

1. కర్త శిఖా,యజ్ఞోపవీతములను ధరించి, స్నానసంధ్యావందనములను చేసి, పైతృక క్రియల నారంభింపవలెను. గాయత్రీమంత్రమును మనసులోనే ఉచ్చరింపవలెను. పితృ క్రియలను శ్రీమూర్ధరహితముగా నామమును, ఒంటి తడిబట్టను ధరించి చేయవలెను.
2. జ్యేష్ఠపుత్రుడే ప్రధానకర్త. ఒకవేళ జ్యేష్ఠుడు దేశాంతరుడైనచో అతడు వచ్చిన తర్వాత పాషాణస్థాపనతో ఆరంభించి క్రమముగా సపిండీకరణపర్యంతము అన్నికర్మలను అవశ్యముగా చేయవలెను. 10రోజులు ఆశౌచమును పాటించి, 11వ దినమున ఏకోద్దిష్ట మును చేయవలెను. సంవత్సరములోపల సపిండీకరణమును చేయవలెను.
3. ఏకోద్దిష్టశ్రాద్ధమును ముందుగా హోమరూపమున చేసి, తరువాత బ్రాహ్మణభోజన రూపముగా చేయవలెను.
4. 11వ దినమున ఎద్దుతో వృషోత్సర్జనము చేయుట ఉత్తమపక్షము. అది వీలుకానిచో, ఆమ, హిరణ్యరూపకముగానైన చేయవలెను.
5. సపిండీకరణమునందు పిండసంయోజనమునకు ముందుగా శక్తి యున్నచో దశదాన ములు చేయవలెను. కాని వీటన్నిటికంటె ముఖ్యమైనది వైతరణీగోదానము. ప్రేతస్థాన భోక్తకు మిగిలా భోక్తలకంటె రెట్టింపు దక్షిణ నీయవలెను.
6. సపిండీకరణానంతరము సోదకుంభశ్రాద్ధమును చేసి, సాయంకాలము వేద, ప్రబంధాది పారాయణము నారంభించి, మఱురోజు (13వరోజు) శ్రీవైష్ణవులతోగూడి తిరువధ్యయ నోత్సవమును చేసి, అనంతరము శుభస్వీకారము చేసి, వైకుంఠసమారాధనము చేయ వలెను.
7. అనంతరము వర్షాంతము క్రమముగా మాసికాదిశ్రాద్ధములను ప్రతినెలకూ మరణతిథి యందు చేయవలెను. ఊనమాసిక, త్రైపక్షిక, ఊనషాణ్మాసిక, ఊనాబ్దికములను నిర్ణీత దివసములందు అవశ్యముగా చేయవలెను.
8. కర్త దేశకాలముల ననుసరించి యథాశక్తి పరాన్నభోజనాదులను వర్జించి, ఒక సంవత్స రమువఱకు దీక్షావ్రతముతో నుండవలెను. పితృతిథులందు క్షౌరమును చేసికొనరాదు.

9. మాతాపితరులకు గయాశ్రాద్ధమును చేసినను, ప్రత్యాబ్దికశ్రాద్ధమును హోమపూర్వకముగా నవశ్యముగా చేయవలెను.

10. శ్రాద్ధపరిత్యాగమును చేసినవారికి పితృశాపము తగిలి కష్టములు సంభవించును. నరకాదిప్రాప్తికూడ కల్గును. శ్రాద్ధమునకు బదులు కోవెలలో నైవేద్యము చేసినను, ఊరక బ్రాహ్మణభోజనము పెట్టినను శ్రాద్ధఫలము లభింపదు. శ్రాద్ధమును చేసియే తీరవలెను.

11. శ్రాద్ధదినమున ఆశౌచము వచ్చినచో ఆశౌచనివృత్త్యనంతరము శ్రాద్ధమును చేయవలెను. కాని ఊనమాసికములను ఆశౌచమువల్ల సకాలములో చేయలేకున్న వానిని మరల చేయవలసిన అవసరము లేదు.

12. దేశకాలవ్యవహారములవల్ల ప్రత్యాబ్దికమును మృతతిథియందు చేయలేనిచో, తరువాత కృష్ణపక్షైకాదశినాడు గాని, అమావాస్యనాడు గాని చేయవలెను.

13. వాసోదకవస్త్రము: ప్రథమదినమున *"ఇదం త్వా వస్త్రం"* - అను మంత్రముతో ప్రేతకు క్రొత్త వస్త్రమును కప్పుటకు ముందుగానే అందలి ఒకభాగమును ఖండించి యుంచుకొని, మరణాది 10 దినములు వాసోదకము నిచ్చుటకు దానిని వాడుకొనవలెను.

14. అట్లే ఒకటే తీర్థపాత్రను 10దినముల పర్యంత ముపయోగింపవలెను. ఈ పాత్రను 12వ నాడు సపిండీకరణములో ప్రేతస్థానభోక్తకు దానము చేయవలెను.

15. ప్రథమదినమున ప్రేతసంస్కారమునకు కావలసిన సామగ్రి: 1) త్రిమార్గపరిపాలనకు - 1) ఒక కుంభము, 2) 12 చెంబులు, 3) 12 టవళ్లు, 4) తిరుమణి, 5) శ్రీమార్గము, సంస్కారమునకు - 1) 2 కిలోల బియ్యము, 2) పావుకిలో నల్లనువ్వులు, 3) 1కిలో నేయి, 4) 1 కిలో పెసరపప్పు, 5) 2 మీటర్ల పొడవైన తెల్లని బట్ట, 6) జాతి ముక్కలు, 7) మోదుగ కొమ్మ, 8) మేడిపుల్ల (మేక్షణము) 9) మేడి ఆకు, 10) ఇసుక, 11) దొప్పలు, 12) వస్త్రములు, 13) దర్భలు, 14) రెండు కుండలు - ఒకటి చిన్నది, ఒకటి పెద్దది, 15) దక్షిణ 500 రూ॥లు, 15) ఇంధనము, గోమయము మున్నగునవి.

16. అస్థిసంచయనమునకై కావలసిన సామగ్రి: 1) ఒక్క పెద్దములక్కాయ (లేక వంకాయ), 2) 5 (రొట్టెల) తట్టలు, 3) 1.5 కిలోల బియ్యపు పిండి, 4) 1కిలో బియ్యము, 4) పావుకిలో నల్ల నువ్వులు, 5) 6 అరటిపండ్లు, 6) వక్కలు, తమలపాకులు, 7) దర్భ, 8) మేడి ఆకులు, 9) చిల్లర, 10) పావుకిలో నేయి, 11) 1 లీటరు పాలు

17. అపరకార్యములందు ఆచమనము, ప్రాణాయామము, సాత్త్వికత్యాగము, ప్రదక్షిణము, నమస్కారము, శాన్తిహోమము - వీనిని చేయునప్పుడు ఉపవీతిని, మిగతా కార్య

...లు సమస్తము వేయునప్పుడు ప్రాచీనావీతిని ధరింపవలెను. ప్రేతకార్యములందు ఒకే దర్భతో పరిస్తరణమును చేయవలెను. అయామితమునకు, పవిత్రమునకు ఒకే దర్భను వాడవలెను. సంకల్పావాహనలయందు ముందుగా మృతుని గోత్రమును చెప్పి, తరువాత నామమును "శర్మ" - అని అంతము వేయుచు చెప్పవలెను. గోత్రము తెలియనిచో "కాశ్యపగోత్ర"మని చెప్పవలెను. పేరు తెలియనిచో పురుషునికి "నారాయణ" అని, స్త్రీకి "లక్ష్మి" - అని చెప్పవలెను. వారివారి సూత్రప్రకారముగా కర్మలను చేయవలెను. లేదా ఏదోయొక సూత్రానుసారముగా కర్మలను చేయవలెను.

18.పదవనాడు శాన్తిహోమమును గ్రామశ్మశానములకు మధ్య ఒకచెట్టుక్రింద కూర్చొని చేయవలెను. శాన్తిహోమమందు ప్రతిస్వాహాకారము తర్వాత హోమశేషాజ్యమును ఒక దొప్పలో చేర్చుకొని, అంతమున ఆ సంపాతాజ్యమును స్త్రీలకు కనుఱెప్పలపై రాసుకొనుట కీయవలెను.

# ఊనమాసిక, మాసికముల విషయము

మరణాది సంవత్సరాంతములోపల ఊనమాసిక, త్రైపక్షిక, ఊనషాణ్మాసిక, ఊనాబ్దికములని నాలుగు ఊనమాసికములను చేయవలెను. వీటి వివరణము:

ఊనమాసిమును మరణదినమునుండి 27నుండి 30 రోజులలోపల చేయవలెను.

త్రైపక్షికమును మరణాది 41నుండి, 45రోజులలోపల చేయవలెను.

ఊనషాణ్మాసికమును మరణాది 170నుండి 180 రోజులలోపల చేయవలెను.

ఊనాబ్దికమును మరణాది 340నుండి 355రోజులలోపల, లేక 345నుండి 360 రోజులలోపల చేయవలెను.

శుక్రవారము, నందాతిథి (అనగా, పాడ్యమి, షష్ఠి, ఏకాదశి), చతుర్దశి, సినీవాలి, దర్శ, కృత్తిక, ఆశ్లేష, పూర్వఫల్గుని, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, త్రిపుష్కర, ద్విపుష్కరములయందు ఊనమాసికమును చేయరాదు. ద్వితీయ, సప్తమీ, ద్వాదశి తిథులు 1) భానువార, మంగళవార, శనివారములతోను, 2) కృత్తికా, పునర్వసూ, ఉత్తరా, విశాఖా, ఉత్తరాషాఢా, పూర్వాభాద్రా అను త్రిపాదినక్షత్రములతోడను కూడియుండిన వానికి త్రిపుష్కరములని పేరు. అట్లుకాక, ఈ వారములలో, లేదా ఈ నక్షత్రములలో ఏదోయొక దానితో కూడియుండిన వానికి ద్విపుష్కరములని పేరు. ఈవిధముగా చూచినచో సరియైనదినము దొరుకకున్న, చివరిదినమున (అనగా, మరణాది, 30, 45, 180, 360

దినములయందు) ఊనమాసికమును చేయవలెను. ఊనమాసికశ్రాద్ధమును, క్రమముగా వచ్చు మాసికశ్రాద్ధమును అదే దినమందు చేయరాదు.

మరణతిథినుండి క్రమముగా ప్రతిమాసమందు అదే తిథియందు చేయునది మాసికము. ఈ విధముగా 11మాసికములు చేసి, 12వ మాసాంతమున సంవత్సరీకమును చేయవలెను. సపిండీకరణమునకు ముందు చేయు మాసికములను ఏకోద్దిష్టమువలె చేయవలెను. సపిండీ కరణానంతరము చేయు మాసికములను శ్రాద్ధమువలె చేయవలెను. ఆశౌచప్రాప్తివల్ల మాసికమును చేయులేకుండిన, ఆశౌచనివృత్త్యనంతరము చేయవలెను. కాని ఊనమాసిక మున కిట్లు భంగము వాటిల్లిన, దానిని మరల చేయనవసరము లేదు.

## మాసికములకు సంకల్పములు

12వ నాడు సపిండీకరణముచేయ గల్గుటకొఱకై సంవత్సరము పొడవునా వచ్చు 16 మాసికములను 12వ నాటికే ఆకర్షించుకొని షోడశశ్రాద్ధమును చేసినను, ఈ మాసికము లను తత్తత్కాలములలో ప్రత్యక్షముగా పెట్టవలెను. వీనిని పెట్టునప్పుడు చెప్పవలసిన సంక ల్పముల పద్ధతి ఈక్రింద నీయబడినది:

1. షోడశశ్రాద్ధసందర్భముగా ముందుగానే ఆమరూపములో మాసికములను పెట్టుటవల్ల, తర్వాత ప్రత్యక్షముగా పెట్టునప్పుడు వీనికి సంకల్పములను చెప్పునప్పుడు "అనుమాసిక" అను పదమును చేర్చి చెప్పవలెను. "అనుమాసిక" మనగా అనుసరించికొని (రెండవసారి) వచ్చు మాసికమని అర్థము. ఉదాహరణకు, *"-----గోత్రస్య----శర్మణః మమ పితుః ఊనమాసికానుమాసికశ్రాద్ధం కరిష్యే ", "------గోత్రస్య------శర్మణః మమ పితుః ఊనషాణ్మాసికానుమాసికశ్రాద్ధం కరిష్యే ", "----గోత్రస్య-----శర్మణః మమ పితుః ద్వితీయానుమాసికశ్రాద్ధం కరిష్యే ", "---గోత్రస్య---శర్మణః మమ పితుః పంచ మానుమాసికశ్రాద్ధం కరిష్యే "* - మున్నగు విధముగా.

2. ఒకే నెలలో రెండు మృతతిథులు వచ్చినచో మొదటిదానికి మామూలుగా సంకల్పము చెప్పి, రెండవదానికి "అధిక" అను విశేషణమును చేర్చి చెప్పవలెను. ఉదాహరణము: *"---గోత్రస్య---శర్మణః మమ పితుః అధికతృతీయానుమాసికశ్రాద్ధం కరిష్యే "* - ఇత్యాది.

తల్లి మాసికములను పెట్టునపుడు ఈ సంకల్పములలో *"---గోత్రస్య---శర్మణః మమ పితుః "* అనుటకు బదులు *"---గోత్రాయాః---నామ్న్యాః మమ మాతుః"* -- అని చెప్పవలెను.

4. ఒకవేళ ఏకారణముచే నైనను ఒకటి,రెండు మాసికములను చేయలేక విడిచిపెట్టవలసి వచ్చినచో, అట్టి వానిని ఆతర్వాత వచ్చు మాసికముతో గలిపి ఒకేసారి పెట్టవచ్చును. ఇట్టి సందర్భములందు పెట్టలేక "దాటిపోయిన" మాసికములకు సంకల్పములో "అతిపన్న" - అను విశేషణమును చేర్చి చెప్పవలెను. "అతిపన్న" - అనగా "దాటిపోయిన" అని అర్థము. ఉదాహరణకు, అతిపన్నతృతీయ,చతుర్థమాసికములను సకాలములో చేయు పంచమ మాసికముతో చేర్చి చేయునపుడు *"----గోత్రస్య----శర్మణః మమ పితుః అతిపన్న తృతీయ,చతుర్థ, అద్య పంచమానుమాసికశ్రాద్ధం కరిష్యే "* - అని సంకల్పమును చెప్పవలెను.

గమనిక: ఇట్లు ఇతరమాసికములను సకాలములో చేయక తరువాత చేసినను, ద్వితీయ మాసికమును, ఊనషాణ్మాసిక, ఊనాబ్దికములకు ముందు వచ్చు మాసికములను మాత్ర మవశ్యముగా సకాలములోనే చేయవలెను.

## *క్షౌరవిచారము*

1. భార్య గర్భవతిగా నున్నచో మూడవనెల దాటకముందునుండి ప్రసవపర్యంతము భర్త గర్భదీక్షతోనుండవలెను. కాని ఈలోపల అతడు తల్లికి, తండ్రికి, అవ్వకు, తాతకు, జ్యేష్ఠ భ్రాతకు కర్మచేయవలసివచ్చినచో గర్భదీక్షను విడిచి, క్షౌరమును చేయించుకొనవలెను. పైవారు దప్ప ఇతరజ్ఞాతులు మరణించిన అతడు గర్భదీక్షను విడవాడరాదు. మాతృ, మాతామహుల కర్మదీక్షయందు పితృకర్మ ప్రాప్తించిన, క్షౌరమును చేయించుకొన వలెను. పితృదీక్షయందు మాత్రాదుల కర్మ వచ్చినచో క్షౌరమును చేయించుకొనరాదు. మాతామహాదులదీక్షయందు మాతృకర్మ ప్రాప్తించినచో, మాతామహీదీక్షయందు మాతామహకర్మ ప్రాప్తించినను క్షౌరమును చేయించుకొనవలెను. ఇట్లు గౌరవలాఘవ దృష్టితోడ బాధ్యబాధకభావములను తెలిసికొని క్షౌరాదులను చేయించుకొనవలెను.

2. జననాశౌచ, మరణాశౌచములయందు క్షౌరమును చేయించుకొనరాదు. కాని ఈలోగా తండ్రి, తల్లి మరణము కల్గినచో క్షౌరమును చేయించుకొనవచ్చును.

3. తండ్రి, కొడుకు, ఏకోదరులు ఒకేరోజు క్షౌరమును చేయించుకొనరాదు. కాని 10వ రోజు కర్మచేయునప్పుడు ఈనియమమును పాటించరాదు.
4. తండ్రి, తల్లి, సవతితల్లి, తనకంటె పెద్దవారైన దశరాత్రజ్ఞాతుల మరణమునందున, పిన తండ్రి, పెదతండ్రి, అన్న, వదిన, తల్లితండ్రి, తల్లితల్లి, మేనమామ, మేనత్త, అల్లుడు, తండ్రి యొక్క మేనత్త, పినతల్లి, పెదతల్లి, తండ్రితల్లి, తండ్రితండ్రి, సీమంతజయగు చెల్లెలు - వీరు మృతులైనచో క్షౌరమును చేయించుకొనవలెను.
5. పైవారు అనుపనీతులు, అవివాహితులైన క్షౌరమవసరము లేదు.
6. పైవారికి విధ్యుక్తకర్త లేనపుడు తాను కర్మచేసినచో తనకు దహనాంగవపనము లేదు.
7. త్రిరాత్రజ్ఞాతుల మృతియందు వపనావసరము లేదు. 3వ దినమునందిట్టి జ్ఞాతులకు 35 తిలోదకములను విడువవలెను.
8. జీవత్పిత్రుడుసైతము పైవారికి తిలోదకములను విడువవలెను.

## *ఉదకదానము*

ఆశౌచాంతమున మృతజ్ఞాతిప్రేతకు కర్తతోసహ జ్ఞాతులు వాసోదకతిలోదకముల నీయ వలెను. దశరాత్రజ్ఞాతులు 10వ దినమున క్షౌరమును చేయించుకొని, స్నానసంధ్యా వందన ములను చేసి, తడిబట్టను ధరించి వీనిని చేయవలెను. క్షౌరము చేయించుకొనలేని వారును ఇట్లే చేయవలెను. 10వరోజు అనవధానదినమైనచో, ఆవాడు ఆశౌచమును పాటించి మఱు రోజు వాసోదకతిలోదకములను విడువవలెను. అన్యగ్రామస్థులైన జ్ఞాతులు తిలోదకములను మాత్రము విడువవలెను. జ్ఞాతులందరును 10 దినములవరకు శ్రీమార్గరహితముగా నామ మును ధరింపవలెను. శాన్తిహోమానంతరము అందఱును శ్రీమార్గసహితముగా నామ మును ధరింపవలెను.

# ధర్మశాస్త్రవిషయములు

1. మాతాపితరుల ప్రేతకార్యములను జ్యేష్ఠపుత్రుడు 11వ దినపర్యంతము చేయవలెను. 12వరోజ సపిండీకరణమును [597]అగ్నిమంతుడైన పుత్రుడు చేయవలెను. కుటుంబములో అగ్నిమంతుడైన పుత్రుడు లేనిచో, జ్యేష్ఠుడే లౌకికాగ్నితో సపిండీకరణమును చేయవలెను.
2. ఒకవేళ కర్త భార్య రజస్వలగా నున్నచో ఆమె స్నానము చేసిన మఱునాడు (అనగా రజోదర్శనమునుండి 5వ దినమున) సపిండీకరణము చేయవలెను. మరణాది 17 దినములవఱకు శుభాశుభవిచక్షణ లేకుండ సపిండీకరణమును చేయవచ్చును. 17వ దినము దాటిన తర్వాత దివసశుద్ధిని చూచి చేయవలెను. అట్లే, 12వనాడు ఏకాదశియైనచో, ఆనాడు ఏకాదశీవ్రతము (ఉపవాసము) చేసి, మఱునాడు సపిండీకరణమును చేయవలెను.
3. సపిండీకరణమునకు సంవత్సరపర్యంతము అవకాశము గలదు. ఒకవేళ మొదటి రెండురోజులలో జ్యేష్ఠుడు దహనసంస్కారము, అస్థిసంచయనము చేయలేకున్న యెడల, ఇతరపుత్రులుగాని, అన్యులుగాని చేయవచ్చును. జ్యేష్ఠుడు తర్వాత పాషాణస్థాపనాది సకలకర్మలను శాస్త్రోక్తముగా చేయవలెను. మరణవార్త విన్ననాటి నుండి అతడు 10రోజుల ఆశౌచమును పాటింపవలెను. 11రోజుల తర్వాత అతనికి మరణవార్త చేరినచో, ఇతరులు పాషాణస్థాపన, సపిండీకరణాదులను చేసియుండినను జ్యేష్ఠుడు యథాక్రమముగా వానిని మఱల చేయవలెను.
4. నిమంత్రితవిప్రులు కర్మావరణ తర్వాత సాయంసంధ్యావందనమునకు ముందు 10 సార్లు గాయత్రితో నభిమంత్రించిన తీర్థమును తీసికొని, ఆ తర్వాత సాయంసంధ్యా వందనమును చేయవలెను.

---

[597] అనగా వివాహితుడై, జీవించియున్న భార్యగల పుత్రుడు - ఇట్టివానికే ఔపాసనాగ్నియందధికారము కలదు గావున ఇతనికి అగ్నిమంతుడని పేరు. అనగా, ఒకవేళ జ్యేష్ఠుడు అవివాహితుడైనను, మృతభార్యుడైనను అతనికి సపిండీకరణమునం దధికారము లేదు. అట్టి స్థితిలో వివాహితుడై జీవద్భార్యుడైన ఇతరపుత్రుడు సపిండీకరణమును చేయవలెను.

5. అనుపనీతునకు, కన్యకు నారాయణబలియే కాని సపిండీకరణము లేదు.
6. బ్రహ్మచారులకు, వివాహితులకు సపిండీకరణమును చేయవలెను.
7. త్రిరాత్రాశౌచము గల వ్యక్తి సపిండీకరణకర్త యైనచో, అతడు త్రిరాత్రములకు బదులు దశరాత్రము లాశౌచముతో నుండి, 12వ దినమున సపిండీకరణమును చేయవలెను.
8. పక్షిణ్యాశౌచము (పక్షిణి అనగా రెండుపగళ్లకు మధ్య వచ్చు రాత్రి) గల వ్యక్తి గాని, ఆశౌచము లేని బంధువుగాని సపిండీకరణకర్త యైనచో, అతడు త్రిరాత్రము లాశౌచముతో నుండి, 4వ నాడు ఏకోద్దిష్టమును చేసి, 5వ రోజున సపిండీకరణమును చేయవలెను.
9. మృతునికి అనేకభార్యలున్నచో అగ్నిమంతుడైన జీవంతురాలైన జ్యేష్ఠపత్ని పుత్రుడు సపిండీకరణమును చేయవలెను. జ్యేష్ఠభార్యకు అగ్నిమంతుడైన పుత్రుడు లేనిచో క్రమప్రకారము ఇతరభార్యాపుత్రులలో జ్యేష్ఠుడునూ అగ్నిమంతుడునూ ఐన పుత్రుడు చేయవలెను.
10. మృతునికి అనేకజీవితభార్యలున్నచో, వారి అగ్నిసంవర్గము చేసియున్నచో, ఏదైన ఒకభార్య ఔపాసనాగ్నితో సపిండీకరణహోమము చేయువచ్చును. కాని జ్యేష్ఠ భార్య అగ్నితో జేయుట సర్వశ్లాఘ్యము.
11. "అవైష్ణవం హతం శ్రాద్ధమ్" - అని యున్నందున, విష్ణుస్థానమున బ్రాహ్మణుని నిమంత్రింప లేకున్నచో, ఒక ఆకులో కూర్చను విష్ణుస్థానమున ఆవాహన చేసి, దానికి భోజనాదిసర్వోపచారములను సమర్పింపవలెను.
12. మాతాపితరులుగాని వారికి మంగళ, శుక్ర, శని, ఆదివారములు, చతుర్దశి, త్రిపాది, జన్మనక్షత్రములు సపిండీకరణమునకు వర్జ్యములు. మాతాపితరులకైనను 17 రోజులు దాటిన తర్వాత మంగళ, శని, ఆదివారములు, త్రిపాదినక్షత్రములు కూడవు.

## కర్తృత్వనిర్ణయము:

మరణించిన వ్యక్తికి, 1) ఔరసపుత్రుడుగాని, 2) కవలలో కనిష్ఠుడుగాని, 3) అనేక భార్యల పుత్రులున్నచో వారిలో జ్యేష్ఠుడుగాని, 4) దత్తపుత్రుడుండి ఆ తర్వాత ఔరస పుత్రుడు కల్గినచో ఔరసపుత్రుడుగాని కర్మ చేయవలెను. సర్వత్ర జ్యేష్ఠపుత్రునకే కర్మయం దధికారము. జ్యేష్ఠుడు కర్మ చేయుచుండగా అతని తమ్ములును అతని ప్రక్కన నుండి అతనితో బాటు ప్రాచీనావీతాదులను, బ్రాహ్మణప్రదక్షిణప్రణామాదులను చేయుచుండ

నను. ఒకవేళ జ్యేష్ఠుడు లేకున్నచో క్రమముగా 1. పౌత్రుడు, 2. పౌత్రపుత్రుడు, 3. దత్తుడు, 4. దత్తుని పుత్రుడు, 5. ధనహారి దౌహిత్రుడు (ఆస్తి ననుభవించు కూతురియొక్క కొడుకు), 6. దౌహిత్రుడు (ధనహారి గాని కూతురి కొడుకు), 7. జీవపత్నులలో జ్యేష్ఠురాలు కర్మ చేయవలెను. మరణించిన స్త్రీకి పుత్రులు లేకున్న, సపత్ని (సవతి) పుత్రుడున్నచో, అతడు కర్మ చేయవచ్చును. వీరు లేకున్నచో ఈ క్రింది వ్యక్తులకు క్రమముగా కర్మయం దధికారము:

1. భర్త, 2. దుహిత (కూతురు), 3. భ్రాత (తమ్ముడు లేక అన్న) 4. భ్రాతృపుత్రుడు (తమ్ముని లేక అన్న కొడుకు), 5. అసోదరభ్రాత (సవతితల్లివల్ల జన్మించిన అన్న, లేక తమ్ముడు), 6. అసోదరభ్రాతృపుత్రుడు, 7. పిత (తండ్రి), 8. మాత (తల్లి), 9. స్నుషా (కోడలు), 10. పౌత్రి (కొడుకు కూతురు), 11. దౌహిత్రి (కూతురుకూతురు) 12. పౌత్రపత్ని (కొడుకుకొడుకు భార్య) 8. పౌత్రపత్నిభర్త, 9. దత్తదుహితా, 10. భగినీ (అక్క/చెల్లెలు), 11. భాగినేయుడు (అక్క/చెల్లెలు కొడుకు), 12. సపిండుడు (అనగా దశరాత్ర/త్రిరాత్ర/ఏకరాత్ర జ్ఞాతుడు), 13. సమానోదకుడు, 14. మాతృసపిండుడు, 15. తత్సమానోదకుడు, 16. జామాత (అల్లుడు), 17. సఖుడు, 18. ధనహారి 19. రాజ

## *విశేషవిషయములు*

1. ఒక వ్యక్తికి ఇద్దరు భార్యలుండి, అందు రెండవభార్య పురుషసంతతి లేకుండ మరణించినచో ఆమెకు జ్యేష్ఠభార్య జ్యేష్ఠపుత్రుడు కర్మ చేయవలెను. జ్యేష్ఠుడొక్కడే కర్మ చేయవలెను. అతనికి తమ్ములున్నచో వారు ప్రాచీనావీతాదులను చేసికొనుచు ఈ కర్మయందు పాల్గొనవలసిన అవసరము లేదు.
2. ఒక వ్యక్తియొక్క భార్య పురుషసంతానము లేకుండ గతించినచో ఆమెకు భర్తయే కర్మను చేయవలెను. తరువాత అతడు పునర్వివాహము చేసికొని పురుషసంతానమును గన్నచో, అందులో జ్యేష్ఠుడు ఉపనయనానంతరము "మమ సపత్నీ మాతుః *ప్రత్యాబ్దికశ్రాద్ధం కరిష్యే*"- అని సంకల్పము చెప్పుచు ఆమెకు ప్రత్యాబ్దికాదులను పెట్టవలెను. జ్యేష్ఠుడు ఉపనీతుడగువఱకు భర్తకే కర్మాధికారము. ఆ తరువాత జ్యేష్ఠునికే అధికారము.

3. అనేకభార్యలకు పుత్రులున్నచో, తండ్రి గతించినప్పుడు ఆ పుత్రులందరును జ్యేష్ఠ భార్య జ్యేష్ఠపుత్రునితోబాటు ప్రాచీనావీతాదులను చేసికొనుచు కర్మయందు పాల్గొన వలెను.

4. ఒకవేళ అనేకభార్యలకు పురుషసంతానముండి, అందులో ఏదోయొక భార్య మరణించినచో, ఆ మరణించిన స్త్రీయొక్క జ్యేష్ఠపుత్రుడు కర్మచేయుచుండగా, ఆ స్త్రీ యొక్క ఇతరకుమారులు ప్రాచీనావీతాదుల చేయుచుండవలెను గాని ఇతరస్త్రీల కుమారులు ప్రాచీనావీతాదులు చేయునక్కఱ లేదు. అట్లు మరణించిన స్త్రీ కుమారు లకు ఉపనయనము గాకున్నను వారిపేరులోనే "యజమానస్య మాతుః ప్రేతాయాః" - అని సంకల్పము చెప్పుచు కర్మను చేయించవలెను. ఉపనయనానంతరము పైతృక కర్మాధికారము వారికే కలుగును. అంతవఱకును "యజమానస్య..."- అని చెప్పుచు వారిపేరిట కర్మను చేయించవలెను.

5. ఒకవేళ సవతితల్లికి ప్రత్యాబ్దికమును పెట్టు జ్యేష్ఠుడు మరణించినచో, అతని పెద్ద తమ్ముడు, అతడును మరణించినచో అతని తరువాతి వాడును ప్రత్యాబ్దికమును పెట్ట వలెను గాని ప్రత్యాబ్దికమును విడిచిపెట్టకూడదు.

6. ఒక వ్యక్తికి పురుషసంతానము లేక దత్తపుత్రుడున్నచో అతడే కర్మ చేయువలెను. ఒకవేళ దత్తుని స్వీకరించిన తర్వాత ఆ వ్యక్తికే పుత్రుడు కలిగిన (ఇతడే ఔరస పుత్రుడు), అట్లు కలిగిన (ఔరస)పుత్రుడే కర్మ చేయవలెను. అప్పుడు దత్తుడు ప్రాచీనా వీతాదులను కూడ చేయనవసరము లేదు. అతడు జ్ఞాతివలె కర్మలో పాల్గొనవలెను. వేఱొకయింటికి దత్తుడైన వ్యక్తి తన జనకపితరులకు కర్మచేయ నక్కఱలేదు. కనీసం ప్రాచీనావీతాదులను గూడ చేయ నవసరము లేదు.

7. పౌత్రులును, ప్రపౌత్రులును, దౌహిత్రజామాతాదులును కర్మ చేయవలసివచ్చిన వారి తమ్ములు ప్రాచీనావీతాదులను చేయుచు కర్మలో పాల్గొన నక్కఱలేదు.

8. అనేకదౌహిత్రు లున్నపుడు ధనహారిదౌహిత్రునికే ప్రథమాధికారము. ఇతర దౌహి త్రులు వయసులో పెద్దవారైనను, వారుపనీతులై ధనహారిదౌహిత్రుడు ఉపనీతుడు గాకున్నను అతనికే ప్రథమాధికారము. ఇట్టి ధనహారిదౌహిత్రు లనేకులున్నప్పుడు అందులో అందరికంటె జ్యేష్ఠునికే కర్మాధికారము.

9. మొదట కర్మ చేసిన దౌహిత్రుడే జీవితాంతము ప్రత్యాబ్దికములను పెట్టుచుండవలెను. కాని అతడు గతించిన తర్వాత అతని తమ్ముడు ప్రత్యాబ్దికములను పెట్ట నక్కఱలేదు.

10. పుత్రునినుండి దౌహిత్రునివఱకు గల పైతృకకర్మబాధ్యతలు వీరికి శాస్త్రముచేత విధింప బడినవని తెలిసికొనవలెను. వీరు కర్మచేయుచుండగా నేకారణముచేతనైనా సంచయ నము, నిత్యవిధి, సపిండీకరణాదికార్యములు సకాలమునకు చేయలేకున్నయెడల మంచిరోజును చూడకుండగనే వీలైనంత త్వరగా వానిని చేయవలెను. కాని నియత ముగా దశాహ, ఏకాదశాహకార్యముల నాయా రోజులందే చేయవలెను.

11. భార్య మొదలుకొని రాజువఱకు గల వ్యక్తులకు విధింపబడిన బాధ్యతలకు కారుణ్య ములని పేరు. అనగా మరణించిన వ్యక్తియందలి ప్రేమతో, లేక జాలితో చేయు విధులని యర్థము. ఇట్టి కారుణ్యములందు చేయువ్యక్తికే బాధ్యత. అనగా అతని తమ్ము లెవ్వరును ప్రాచీనావీతాదులను చేయుచు వీనిలో పాల్గొన నక్కఱలేదు. కారుణ్య కర్తలు సకాలమునకు సంచయన, నిత్యవిధి, సపిండీకరణాదులను చేయలేనిచో, వానిని వీలైనంతవఱకు మంచిరోజును చూచుకొని ఆరంభించవలెను. కాని నియత ముగా దశాహ,ఏకాదశాహకార్యముల నాయా రోజులందే చేయవలెను.

12. దంపతులు నిస్సంతువులైనప్పుడు భర్త భార్యకును, భార్య భర్తకును కర్మ చేయ వచ్చును.

13. అన్నగాని, తమ్ముడుగాని వివాహితుడు గాకుండ మరణించిన, అతనికి బ్రతికి యున్న వ్యక్తి కర్మను చేయవచ్చును. వివాహితుడై నిస్సంతువుగా మరణించినచో అతని భార్య కధికారము. కాని ఆమె నిరాకరించిన అన్నగాని, తమ్ముడుగాని ఆమె పేరుతో మరణించిన వ్యక్తికి కర్మ చేయవచ్చును. అట్టి పరిస్థితిలో అతడు ఆజన్మాం తము మృతునికి ప్రత్యాబ్దికాదులను చేయుచుండవలెను.

14. స్త్రీలు కర్తలైనప్పుడు వారికి స్వయముగా కర్మాచరణాధికారము లేనందున ఆమె పేరుతో ఆమె భర్తగాని, ఇతరులుగాని ఆమె పేరిట *"యజమానాయాః మాతుః/ పితుః..."* అని సంకల్పించుచూ కర్మను జరిపించవలెను. అట్లే అనుపనీతునకు గూడ కర్మాచరణాధికారము లేనందున, అతనిచే *"యజమానస్య పితుః/మాతుః..."* అని సంకల్పించుచూ కర్మను జరిపించవలెను.

15. మొదటిసారి కర్మచేసినవారే జీవితాంతము ప్రత్యాబ్దికాదులను చేయవలెను. మధ్యలో మార్చగూడదు. తల్లిదండ్రులకు, దత్తతీసికొన్న తల్లిదండ్రులకు, సపత్నిమాతకు మాత్రము ముఖ్యకర్త మరణించినవెనుక అతని తమ్ములు (చివరివానివఱకు) విడువ కుండ ప్రత్యాబ్దికాదులు చేయుచుండవలెను.

# ఇతరవిషయములు

1. శ్రాద్ధమును ఆరంభించి కర్త "పార్వణశ్రాద్ధం కరిష్యే" అని సంకల్పించిన తర్వాత ఆశౌచము వచ్చినను, ఆ శ్రాద్ధమును ముగించి, తదుపరి ఆశౌచమును పాటింప వలెను.
2. "భవతా క్షణః కర్తవ్యః" - అని భోక్తలను వరణము చేసిన పిమ్మట భోక్తలకు ఆశౌచము వచ్చినను, శ్రాద్ధానంతరము బ్రాహ్మణవిసర్జనము చేసిన పిమ్మటనే వారాశౌచమును పాటింపవలెను.
3. వివాహమునందు ఆశౌచము వచ్చినను,శేషహోమపర్యంతము వివాహమును జరుపుకొని, తదుపరి ఆశౌచమును పాటింపవలెను. ఒకవేళ మాతాపితృమరణమువల్ల ఆశౌచము వచ్చిన, ఉత్తరక్రియలను జరిపి, ఆ తర్వాత శేషహోమమును చేయవలెను. వివాహమునందు వధూవరులలో నొకరు మరణించిన, శేషహోమాంతము చేసి, ఆ తర్వాత ఉత్తరక్రియలను చేయవలెను.
4. సన్న్యాసిమరణమువల్ల జ్ఞాతులకు స్నానము మాత్రమే కాని, ఆశౌచము లేదు.
5. అల్లుని మరణమువల్ల మామకు, అత్తకు, బావమరదులకు స్నానము మాత్రమే కాని ఆశౌచము లేదు.
6. రాజదండనమువల్ల మరణించిన వ్యక్తికి, మరణానంతరము ఉత్తరక్రియలను చేయవలెను.
7. జాతిభ్రష్టునికి, పతితునికి, వ్యభిచారికి, దుర్మరణప్రాప్తునకు, ఆత్మహత్యామృతునికి అమంత్రకముగా దహనము చేసి, మూడురోజులు ఆశౌచముతో నుండి, 3 లేక 6 లేక 12 నెలలలోగా నారాయణబలిని చేయవలెను. దుర్మరణము నొందిన వాడనగా, అగ్ని-జల-సర్ప-మృగ-శస్త్ర-యన్త్ర-విష-ప్రమాదములచే మృతుడైనవాడు.ఇట్టి మరణమువల్ల జ్ఞాతులకు ఆశౌచము లేదు. ఆశౌచమును పాటించిన మూడు దినములలో మొదటిరోజు దర్భసంస్కారము, రెండవదినమున సంచయనము, మూడవదినమున ఉదకదానమును, నాల్గవనాడు ఏకోద్దిష్టమును, తదుపరి సపిండీకరణమును చేయవలెను.

మరణాశౌచము గృహమునకును, ద్రవ్యాదులకును వర్తించును. కాని జననాశౌచము వీనికి లేదు.

9. దుర్మృతుడైన వ్యక్తికి ప్రాజాపత్య, తప్త, చాంద్రాయణప్రాయశ్చిత్తముల ప్రతినిధిగా 65 ప్రాజాపత్యకృచ్ఛ్రములను, ప్రతికృచ్ఛ్రమునకు 3రూపాయల దక్షిణ నొసగుచూ చేయవలెను.

## సంస్కారాగ్నిః

1. దంపతులలో నొకరు మరణించిన ఆవ్యక్తికి ఔపాసనాగ్నితో సంస్కారము చేయవలెను.
2. విధురునకు, విధవకు, స్నాతకునికి, కదళీవివాహితునకు ఉత్పన్నాగ్నితో దహన సంస్కారము చేయవలెను.
3. బ్రహ్మచారికి కపాలాగ్నితో సంస్కారము చేయవలెను.
4. మూడేండ్లు దాటిన కొడుకుకు, కూతురునకు, అవివాహితదుహితకు తుషాగ్నితో సంస్కారమును చేయవలెను.
5. సన్యాసి జీవించియుండగా అతని భార్య గతించిన, ఆమెకు ఔపాసనాగ్నితో సంస్కారము చేయవలెను.
6. దహనమును అదిత్యాభిముఖుడై చేయవలెను.
7. దేశాంతరుడైన వ్యక్తినిగురించి 12 సంవత్సరములవరకు సమాచారము తెలియనిచో, అతనికి నారాయణబలిని చేసి, తరువాత కర్మను చేయవలెను. ఇట్టివ్యక్తి వదలివెళ్లిన తిథిమాసములనే మృతతిథిగా తలంచవలెను. ఒకవేళ ఇట్టిదినము తెలియకుండిన, కర్కాటక, కన్యా, మాఘమాసములలో ఏదోయొకదానిని మాసముగాను, కృష్ణపక్షాష్టమి, ఏకాదశి, అమావాస్యలలో నొకదానిని తిథిగాను ఎంచుకొనవలెను. పితృవిషయములో 15 సంవత్సరములకు తదుపరి, 16వ సంవత్సరము దాటకముందొక మోదుగాకులో పితృప్రతికృతిని వ్రాసి, 10రోజులు ఆశౌచమును పాటించి, ఆ తర్వాత కర్మను చేయవలెను.
8. మాతాపితరుల కర్మసమాప్తియగులోగా, అన్యవ్యక్తి మరణించిన, ఆ వ్యక్తికి గూడ తానే కర్తయైన, మాతాపితరుల కర్మను ముగించి, ఆ తర్వాత అన్యవ్యక్తికి సంస్కారమును చేయవలెను.

9. దంపతులిద్దఱు ఏకకాలమున మరణించిన, లేక ఒకరి తర్వాత ఒకరు మరణించిన, వారికి వేఱువేఱుగా మంత్రములను చెప్పి, అదే అగ్నితో ముందు పురుషునికి, తర్వాత స్త్రీకిని హోమముచేసి, అదే చితిలో ఆర్ధతని దహనము చేయవలెను. మంత్రములను వేఱువేఱుగా ఇర్వురికి చెప్పవలెను. ఒకే కుండములో రెండు శిలాస్థాపనములను చేయవలెను. బలి, చితి, సంచయనము ఒకటిగనే చేయవలెను. కాని తిలోదక, పిండ, సోదకుంభ, నవశ్రాద్ధ, ఏకోత్తరవృద్ధిశ్రాద్ధ, షోడశశ్రాద్ధములను ప్రత్యేకముగా చేయవలెను. సపిండీకరణము ఒకటిగా చేయవలెను. నిమిత్తము, వరణము వేఱువేఱుగా చేయవలెను. పితామహపితామహులు ఒకసారిగా మరణించినను వారికిట్లే చేయవలెను.

10. జననాది 37 నెలలనుండి 48 నెలలలోగా మరణించిన వ్యక్తికి తిలోదక, పిండదానములను నారాయణబలితో సహా చేయవలెను. 49వ నెలకుపైన మరణించిన వ్యక్తికి వీనితో బాటు అస్థిసంచయనమును అమంత్రకముగా చేయవలెను

11. జననాది 61వ నెలపైన మరణించిన అనుపనీతుడైన వ్యక్తికి నగ్న, నవ, ఏకోత్తరవృద్ధి శ్రాద్ధములను, వృషోత్సర్జనమును, ఏకోద్దిష్ట (ఆద్య) శ్రాద్ధములను అమంత్రకముగా చేయవలెను.

12. జననాది 85వ నెలపైన మరణించిన అనుపనీతుడైన వ్యక్తికి పైవిధముగా చేసి, షోడశ శ్రాద్ధమును తంత్రముతో చేయవలెను.

13. జననాది 97వ నెలపైన మరణించిన ఉపనీతుడైన వ్యక్తికి పాషాణస్థాపన చేసి, సర్వ క్రియలూ సమంత్రకముగా చేయవలెను.

14. జననాది 48వ నెలపైన మరణించిన అనుపనీతుడైన పురుషునికిగాని, అవివాహితయైన స్త్రీకి గాని, నారాయణబలియే కాని, సపిండీకరణము లేదు.

15. ఉపనీతుడైన పురుషునకుగాని, వివాహితురాలైన స్త్రీకిగాని సపిండీకరణపర్యంతము సకలకర్మలను సమంత్రకముగా చేయవలెను.

## పునర్దహనము

1. జ్యేష్ఠుడు లేని పక్షమున కనిష్ఠుడు దహన,సంచయనములు చేసియున్నచో, జ్యేష్ఠుడు పునర్దహనము చేయనక్కఱలేదు. కాని అస్థిసంచయనమునకు ముందు జ్యేష్ఠుడు వచ్చినచో అతడు అస్థిసంచయనము చేసి, ప్రేతయుక్త ప్రత్యబ్దిక కర్మలలోగాని,

మోదుగుసమిధలతోగాని చేసి సమంత్రకముగా దహనసంస్కారము చేయవలెను. దీనికే దర్భసంస్కారమని పేరు. అన్యపురుషుడు దహనము చేసినను జ్యేష్ఠుడు పై విధముగా పునర్దహనసంస్కారమును చేయవలెను.

2. ఈ పునర్దహనసంస్కారమును శ్మశానములోగాని, లేక పెరటిలో దూరముగా గాని ప్రేతదర్భాకృతికి చేయవలెను. ఇట్టి దర్భప్రేతకు శవస్నానముతో మొదలిడి దహనాంతమువఱకు మంత్రయుక్తముగా పైతృమేధికవిధిగా సంస్కారము చేయవలెను. అట్లే సంచయనవిధానములో చెప్పినట్లుగా వెంటనే సంచయనమును కూడ చేసి, స్నానములను చేసి, వపనమును చేయించుకొని తిరిగి స్నానము చేయవలెను.

3. ఒకవేళ ఇదివఱలో శవమును అమంత్రకముగా దహనము చేసి, సంచయనము చేయక ముందు ఈ దర్భసంస్కారము చేయుట జరిగినచో, ఈ దర్భసంస్కారము వలన ఏర్పడిన భస్మమును చితాభస్మముతో చేర్చి, ఆ ప్రదేశమునం దానాడుగాని మఱునాడుగాని అస్థిసంచయనమును చేయవలెను.

4. ప్రతికృతికి పలాశసమిధలనుగాని, దర్భలనుగాని వాడవలెను. 40 దర్భలు తలకు, 10 దర్భలు గొంతుకు, 20 ఎదకు, 30 దర్భలు పొట్టకు, 20, 20 దర్భలు చేతులకు, ఐదేసి దర్భలు వ్రేళ్లకు, 30,30 దర్భలు కాళ్లకు, ఐదేసి దర్భలు కాళ్లవ్రేళ్లకు, 8 దర్భలు శిశ్నమునకు, 12 దర్భలు వృషణములకు, మొత్తం 360 దర్భలను వాడవలెను. పలాశసమిధలకును ఇదే లెక్క. ఇట్టి ప్రతికృతితో *"----గోత్రం, ----శర్మాణం ప్రేతం అస్మిన్ ప్రతికృతౌ ఆవాహయామి"* - అని ప్రేత నావాహన చేసి, ప్రేతకార్యములను చేయవలెను.

# వివిధదానమంత్రాః

## *గోదానమ్*

*గవామంగేషు తిష్ఠన్తి భువనాని చతుర్దశ।*
*తస్మాదస్యాః ప్రదానేన అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే।*

## భూదానమ్

*సర్వసస్యాశ్రయా భూమిః వరాహేణ సముద్ధృతా/*
*అనంతపుణ్యఫలదా అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే/*

## తిలదానమ్

*తిలాః పాపహరాం నిత్యం విష్ణోర్దేహసముద్భవాః/*
*తిలదానాదసహ్యం మే పాపం నాశయ కేశవ//*

## ఆజ్యదానమ్

*కామధేనోస్సముద్భూతం సర్వక్రతుషు సంస్థితమ్/*
*దేవానామాజ్యమాహారం అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే//*

## హిరణ్యదానమ్

*హిరణ్యగర్భగర్భస్థం హేమబీజం విభావసోః/*
*అనంతపుణ్యఫలదం అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే//*

## వస్త్రదానమ్

*శీతవాతోష్ణసంత్రాణం లజ్జాయా రక్షణం పరమ్/*
*దేహాలఙ్కరణం వస్త్రం అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే//*

## ధాన్యదానమ్

*ధన్యం కరోషి దాతారం ఇహలోకే పరత్ర చ/*
*ప్రాణినాం జీవనం ధాన్యమతశ్శాన్తిం ప్రయచ్ఛ మే//*

## గుడదానమ్

*ఇక్షుదండసముద్భూతం సర్వప్రాణిమనోహరమ్/*
*తస్మాదస్య ప్రదానేన అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే/*

## రజతదానమ్

*రుద్రనేత్రసముద్భూతం రజతం పితృవల్లభమ్।*
*పితృప్రీతికరం నిత్యమతశ్శాన్తిం ప్రయచ్ఛ మే।*

## లవణదానమ్

*రసానామగ్రజం శ్రేష్ఠం లవణం బలవర్ధనమ్।*
*తస్మాదస్య ప్రదానేన అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥*

## జలపాత్ర (ఉదకుంభ) దానమ్

*వారిణా పూరితం కుంభం వాససా పరివేష్టితమ్।*
*తస్మాదస్య ప్రదానేన అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥*

## దీపదానమ్

*పరమాత్మ తనోర్దీప పరమార్థప్రకాశక।*
*ఆత్మానాత్మ వివేకం మే జనయత్త్వత్ప్రసాదతః॥*

## సాలగ్రామదానమ్

*సాలగ్రామశిలా చక్రే భువనాని చతుర్దశ।*
*తస్మాదస్య ప్రదానేన అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥*

## ఛత్రదానమ్

*ఛత్రం వర్షాతపత్రాణం ఘర్మకాలే సుఖప్రదమ్।*
*తస్మాదస్య ప్రదానేన అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే।*

## యష్టిదానమ్

*విశ్వామిత్రాహి పశ్వాదీన్ వారయత్యప్పు కర్దమే।*
*అంధేతమసి వార్ధక్యే యష్టిరిష్టే వసుప్రజాః॥*

## వ్యజనదానమ్

వ్యజనం వాయుదైవత్యం శ్రమకాలే సుఖప్రదమ్।
తస్మాదస్య ప్రదానేన అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥

## పాదరక్షా (ఉపానహ) దానమ్

కణ్టకోద్భిన్నపాషాణవృశ్చికాది నివారణీ।
అత్యుష్ణపాంసుశమనే పాదరక్షే దదిక్రియే॥

## తండులదానమ్

తండులా వైశ్వదేవత్యాః పాకేనాన్నం పచన్తి యే।
తస్మాత్తండులదానేన అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥

## కమ్బళదానమ్

ఊర్ణాచ్ఛాదన ముష్ణామ్య శీతవాతభయాపహమ్।
యస్మాద్దుఃఖనివారంతు అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥

## తామ్బూలదానమ్

తామ్బూలం శ్రీకరం భద్రం విష్ణుప్రీతికరం శుభమ్।
తస్మాదస్య ప్రదానేన అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥

## ఫలదానమ్

ఫలం మనోరథఫలం ప్రదదాతి సదా నృణామ్।
పుత్రపౌత్రాదివృద్ధ్యర్థం అతశ్శాన్తిం ప్రయచ్ఛ మే॥

## దానసంకల్పః

ఇదం హిరణ్యం, వస్త్రం, ధాన్యం, శయ్యాం, పాదరక్షాం --- ఇత్యాది ---గోత్రస్య ---- శర్మణః మమ పితుః ప్రేతస్య (అథవా, మాతుః ప్రేతాయాః) పిండసంయోజనకాలే

*...వ్యాంప్తసమృత్యర్థం - ఇత్యాది నిమిత్తమనుసంధాయ - అథవా దశదానప్రత్యామ్నాయం యత్కించిద్ధిరణ్యం భగవత్ప్రీత్యర్థం ---గోత్రాయ -----శర్మణే శ్రీవైష్ణవాయ తుభ్యమహం సంప్రదదే నమః నమమ- (అథవా, నానాగోత్రేభ్యః శ్రీవైష్ణవేభ్యః తేభ్యః సంప్రదదే నమః నమమ/ అమ్యతః ప్రీయతామ్" - ఇతి సాక్షతజలం భూమౌ విసృజ్య బ్రాహ్మణాయ (బ్రాహ్మణేభ్యః) దానం కుర్యాత్.*

## విశేషవిషయము:

ప్రతిదానమునందును శ్రాద్ధములో యవోదకతిలోదకములను ఇచ్చునప్పుడు తులసీ దళమును వానితో చేర్చి ఈయవలెను. దానముతో తాంబూలదక్షిణలను కూడ ఈయ వలెను.

# శ్రీసూక్తమ్

*హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్/ చన్ద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ/ తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్/ యస్యాం హిరణ్యం విన్దేయం గామశ్వం పురుషానహమ్/ అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాదప్రబోధినీమ్/ శ్రియం దేవీముపహ్వయే శ్రీర్మా దేవీ జుషతామ్/ కాంసోస్మి తాం హిరణ్యప్రాకారామార్ద్రాం జ్వలన్తీం తృప్తాం తర్పయన్తీమ్/ పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియమ్/ చన్ద్రాం ప్రభాసాం యశసా జ్వలన్తీం శ్రియం లోకే దేవజుష్టాముదారామ్/ తాం పద్మినీమీగ్ం శరణమహం ప్రపద్యేఽలక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే/ ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో వనస్పతిస్తవ వృక్షోఽథ బిల్వః/ తస్య ఫలాని తపసా నుదన్తు మాయాన్తరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః/ ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ/ ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్ కీర్తిమృద్ధిం దదాతు మే/ క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీర్నాశయామ్యహమ్/ అభూతిమసమృద్ధిఞ్చ సర్వాన్నిర్ణుద మే గృహాత్/ గన్ధద్వారాం దురాధర్షాం*

నిత్యపుష్టాం కరీషిణీమ్/ ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే
శ్రియమ్/ మనసః కామమాకూతిం వాచస్సత్యమశీమహి/ పశూనాగ్ం రూప
మన్నస్య మయి శ్రీశ్శ్రయతాం యశః/ కర్దమేన ప్రజాభూతా మయి సమ్భవ
కర్దమ/ శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్/ ఆపస్సృజన్తు స్నిగ్ధాని
చిక్లీత వస మే గృహే/ నిచదేవీం మాతరగ్ం శ్రియం వాసయ మే కులే/ ఆర్ద్రాం పుష్క
రిణీం పుష్టిం పింగళాం పద్మమాలినీమ్/ చన్ద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో
మమావహ/ ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీమ్/ సూర్యాం
హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ/ తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ
మనపగామినీమ్/ యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యోశ్వాన్ విన్దేయం
పురుషానహమ్/ పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదళాయతాక్షి/
విశ్వప్రియే విష్ణుమనోఽనుకూలే త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ/ శ్రియై జాతః
శ్రియ ఆనిర్యాయ శ్రియం వయో జనితృభ్యో దధాతు/ శ్రియం వసానా అమృతత్వ
మాయన్ భజన్తి సద్యస్సమిధ మితద్యూన్/ శ్రియ ఏవైనం తచ్ఛ్రియమాదధాతి/
సన్తతమృచా వషట్కృతగ్ం సంధత్తగ్ం సన్ధీయతే ప్రజయా పశుభిః/ య ఏవం
వేద/ మహాదేవ్యై చ విద్మహే విష్ణుపత్న్యై చ ధీమహి తన్నో లక్ష్మీః ప్రచోదయాత్/

# పట్టిక 1: షట్పిండ, సపిండకరణములందు హోమభోక్తలు

| సంఖ్య- | మృతవ్యక్తి | హోమమంత్రము | కర్త, హోమభోక్తలు |
|---|---|---|---|
| 1 | తండ్రి | 1. యన్మే పితుర్మాతా---పితుః పితా వృక్ష్కాం<br>2. యాస్తిష్ఠన్తి--- పితుర్ధదే<br>3. యన్మే పితుః పితామహి | కర్త: కొడుకు, భోక్తలు: తండ్రి యొక్క పితృ, పితృపితామహ, ప్రపితామహులు |
| 2 | తల్లి (విధవ) | 1. యన్మే మాతా --- ఇత్యాది | కర్త:కొడుకు, భోక్తలు: కర్తయొక్క పితృ,పితామహ, ప్రపితామహులు |
| 3 | తల్లి(సుమంగళి) | 1. యన్మే పితుర్మాతా ఇత్యాది | కర్త:కొడుకు, భోక్తలు: కర్తతండ్రియొక్క పితృ, పితామహ, ప్రపితామహులు. |
| 4 | పితామహుడు | 1. యన్మే పితామహస్య మాతా ఇత్యాది | కర్త:పౌత్రుడు, భోక్తలు: పితామహుని పిత్రాదులు |
| 5 | పితామహి (విధవ) | 1. యన్మే పితుర్మాతా ఇత్యాది | కర్త:పౌత్రుడు, హోమభోక్తలు: పితుఃపిత్రాదులు |
| 6 | పితామహి (సుమంగళి) | 1. యన్మే ప్రపితామహస్య మాతా ఇత్యాది | కర్త:పౌత్రుడు, భోక్తలు: పితామహుని పితృ పితామహ ప్రపితామహులు |

| | | | |
|---|---|---|---|
| 7 | ప్రపితామహుడు | 1. యస్మై ప్రపితామహస్య మాతా ఇత్యాది | హోమభోక్తలు: ప్రపితామహుని పిత్రాదులు |
| 8 | ప్రపితామహి (విధవ) | 1. యస్మై పితామహస్య మాతా ఇత్యాది | హోమభోక్తలు: పితామహుని పిత్రాదులు |
| 9 | ప్రపితామహి (సుమంగళి) | 1. యస్మై ప్రపితామహస్య మాతా ఇత్యాది | హోమభోక్తలు: ప్రపితామహుని పిత్రాదులు |
| 10 | సపత్నీమాతా (సవతితల్లి, విధవ) | 1. యస్మై సపత్నీమాతా ఇత్యాది | హోమభోక్తలు: పిత్రాదులు |
| 11 | సపత్నీమాతా (సుమంగళియైన సవతితల్లి) | 1. యస్మై పితుర్మాతా ఇత్యాది | హోమభోక్తలు: తండ్రియొక్క పితృ, పితామహ, ప్రపితామహులు |
| 12 | భర్తా (కర్త: భార్య) | 1. యస్మై యజమానాయాః భర్తుర్మాతా ఇత్యాది | హోమభోక్తలు: భర్తయొక్క పిత్రాదులు |
| 13 | పత్నీ (కర్త:భర్త) | 1.. యస్మై మాతా ఇత్యాది | హోమభోక్తలు: కర్త యొక్క పితృ, పితామహ, ప్రపితామహులు |

# పట్టిక 2: షట్పిండ, సపిండీకరణములందు వరణ, పిండసంయోజన, పాథేయగ్రహీతలు

| సంఖ్య | మృతవ్యక్తి | వరణము | పిండసంయోజన గ్రహీతలు | పాథేయ గ్రహీత |
|---|---|---|---|---|
| 1 | తండ్రి | తండ్రియొక్క పితృ, పితా మహ, ప్రపితా మహులు | తండ్రియొక్క పితృ, పితామహ, ప్రపితామహులు | తండ్రియొక్క ప్రపితా మహుడు |
| 2 | తల్లి (విధవ) | 1వ పట్టికలోవి వాల్గవ కాలం ప్రకారం | పితామహి, ప్రపితామహి, పితుః ప్రపితామహి | తండ్రియొక్క ప్రపితామహి |
| 3 | తల్లి(సుమంగళి) | పితుః పితృ, పితామహ, వృద్ధప్రపితా మహులు | పితామహి ప్రపితామహి పితుః ప్రపితామహి | తండ్రియొక్క ప్రపితామహి |
| 4 | పితామహుడు (తండ్రితండ్రి) | 1వ పట్టికలోవి నాల్గవ కాలం ప్రకారం | పితామహుని పిత్రాదులు | పితామహుని ప్రపితామహుడు |
| 5 | పితామహి (తండ్రి తల్లి, విధవ) | 1వ పట్టికలోవి నాల్గవ కాలం ప్రకారం | తండ్రియొక్క పితామహి, ప్రపితా మహి, వృద్ధప్రపితామహి | తండ్రియొక్క వృద్ధప్రపితామహి |

| | | | | |
|---|---|---|---|---|
| 6 | పితామహి (తండ్రి తల్లి, సుమంగళి) | 1వ పట్టికలోని నాల్గవ కాలం ప్రకారం | పితామహుని మాతృ పితామహి ప్రపితామహి | తండ్రియొక్క ప్రపితామహి |
| 7 | ప్రపితామహుడు | 1వ పట్టికలోని నాల్గవ కాలం ప్రకారం | ప్రపితామహుని పితృ, పితామహ, ప్రపితామహులు | ప్రపితామహుని ప్రపితామహుడు |
| 8 | ప్రపితామహి (విధవ) | 1వ పట్టికలోని నాల్గవ కాలం ప్రకారం | పితుఃప్రపితామహి, పితామహస్య ప్రపితామహి, పితామహస్య ప్రప్రపితామహి | పితామహుని ప్రప్రపితామహి |
| 9 | ప్రపితామహి (సుమంగళి) | 1వ పట్టికలోని నాల్గవ కాలం ప్రకారం | ప్రపితామహుని మాతృ, పితామహి, ప్రపితామహి | ప్రపితామహుని ప్రపితామహి |
| 10 | సపత్నీమాతా (సవతితల్లి, విధవ) | 1వ పట్టికలోని నాల్గవ కాలం ప్రకారం | పితామహి, ప్రపితామహి, వృద్ధప్రపితామహి | వృద్ధప్రపితా మహి |
| 11 | సపత్నీమాతా (సవతి తల్లి, సుమంగళి) | 1వ పట్టికలోని నాల్గవ కాలం ప్రకారం | పితామహి, ప్రపితామహి, వృద్ధప్రపితామహి | వృద్ధ ప్రపితామహి |
| 12 | భర్తా (కర్త: భార్య) | భర్తయొక్క పితృ, పితా మహ, ప్రపితా మహులు | భర్తయొక్క పితృ, పితామహ, ప్రపితా మహులు | భర్తయొక్క ప్రపితామహుడు |
| 13 | పత్నీ (కర్త:భర్త) | 1వ పట్టికలోని నాల్గవ కాలం ప్రకారం | భర్తయొక్క తల్లి, పితామహి, ప్రపితామహి | ప్రపితామహి |

సూచనలు:

1. అన్యులు కర్మ చేసినప్పుడు దర్భను పట్టుకొని యజమానస్య మాతా, యజమానస్య పితా, యజమాన్యాః భర్తా, యజమానస్య పత్నీ - ఇత్యాదిగా సంకల్పించుచు చేయవలెను.
2. సపిండీకరణహోమమందు మృతుని విడిచి, (మృతులైన) ముందటి మూడుతరముల యందలి పురుషవర్గమునకు మాత్రము హోమము చేయవలెను.
3. నిమిత్తుని స్థానములో మృతుని వరణముచేసి, మృతునియొక్క (మృతులైన) మూడు రముల పురుషవర్గమునకు ముగ్గురు బ్రాహ్మణులను వరణము చేయవలెను.
4. నిమిత్తస్థానపిండమును మూడు భాగములు చేసి, 2వ పట్టికలో చూపినట్లుగా పూర్వ తరమునందలి ముగ్గురు వ్యక్తుల పిండములతో సంయోజనము చేయవలెను.
5. సపిండీకరణానంతరము మాసికాదిశ్రాద్ధములందు క్రమముగా కర్తయొక్క పితృ, పితామహ, ప్రపితామహులకు వరణము, హోమము చేయవలెను. పితృశ్రాద్ధములో పితృ, పితామహ, ప్రపితామహులకును, మాతృశ్రాద్ధములో మాతృ, పితామహి, ప్రపితామహికిని వరణ, హోమ, పిండప్రదానములు చేయవలెను. కాని పితామహ, ప్రపితామహులలో ఎవరైన జీవించియే యుండినచో, వారిని మినహాయించి, మూడుతరములకు వీటిని చేయవలెను. సోదకుంభ, సంకల్పశ్రాద్ధములందును ఇట్లే చేయవలెను.
6. పాథేయమును పిండసంయోజనానంతరము నాల్గవతరము వ్యక్తి కీయవలెను. ఉదాహరణము: మృతుడైన పితరుని పితామహ, ప్రపితామహులతో చేర్చి, నాల్గవతరము వాడైన వృద్ధప్రపితామహునికి పాథేయము నీయవలెను.
7. హోమవరణములు పురుషవర్గమునకు మాత్రమే చేయవలెను. పురుషుడు మృతుడైనను, స్త్రీ మృతురాలైననూ హోమము,వరణము పురుషవర్గమునకు మాత్రమే చేయవలెను. కాని ప్రేతనిమిత్తస్థానీయునకు అర్ఘ్యపరికల్పనము చేయునపుడు స్త్రీకి, పురుషునకు యథావసరముగా చేయవలెను. కాని పిత్ర్యర్ఘ్యగ్రహణము పురుషవర్గమునకే చేయవలెను. స్త్రీయైనను, పురుషుడైనను, ప్రేతయొక్క నిమిత్తస్థానార్ఘ్యమును పిత్రర్ఘ్యముతో సంయోజనము చేసి, ఆ సంయుక్తార్ఘ్యముతో తిలలను చేర్చి "మార్జయంతామ్" అని పిండములపై పితృతీర్థముతో విడువవలెను.

# దర్భలు, హోమపాత్రల విచారము

1. ప్రథమాది దశాహస్సు వఱకు చేయు కర్మలలో పవిత్రములను, భుగ్నములను, ఆయామతములను తెల్లుగడ్డితో కట్టవలెను. ఒకవేళ కూర్చము లవసరమైన వానిని బేసిసంఖ్య గల తెల్లుగడ్డి పోచలతో గట్టవలెను. (గమనిక: ఇట్లు చెప్పినను, ఈ కాలములో సామాన్యముగా తెల్లుగడ్డికి బదులు దర్భలనే ఉపయోగించుట చూచుచున్నాము).
2. హోమపాత్రలకు, దర్వులకు మేడి, లేక రావి, లేక మోదుగాకులను వాడవచ్చును. కాని మామిడాకులను మాత్రము వాడకూడదు.
3. దశాహస్సు నాడు జరుగు శాన్తి, ఆనందహోమములందు దర్భలనే వాడవలెను. తెల్లుగడ్డిని వాడగూడదు. శాన్తిహోమ, ఆనన్దహోమములందు ఆయామతములు, పవిత్రములు, భుగ్నములు రెండేసి దర్భలతో కట్టవలెను. కూర్చమును 8, లేక 12, లేక 16 దర్భలతో కట్ట వలెను. హోమపాత్రలకు, దర్వులకు మేడి, లేక రావి, లేక మోదుగాకులను వాడవలెను.
4. అన్ని పుణ్యాహవాచనకార్యములందును ఆయామతములు, పవిత్రములు, భుగ్నములు రెండేసి దర్భలతో కట్టవలెను. కూర్చలను 8, లేక 12, లేక 16 దర్భలతో కట్టవలెను. ప్రతిపుణ్యాహవాచనమునకు వేర్వేరుగా పవిత్రములను, కూర్చలను, ఆయామతములను చేసికొనవలెను. ఒక పుణ్యాహములో వాడిన వానిని మఱొక పుణ్యాహములో వాడగూడదు.
5. శాన్తిహోమమునకు, ఆనన్దహోమమునకు గావలసిన ఆయామతములను, పవిత్రములను, దర్వులను, ఇతరహోమపాత్రలను వేఱువేఱుగనే చేసికొనవలెను. అనగా శాన్తిహోమమునకు వాడిన పాత్రలను ఆనన్దహోమమునకు వాడగూడదని అర్థము.
6. 11వ నాడు జరుగు పుణ్యాహవాచన, వృషోత్సర్జనములలో రెండేసి దర్భలతో పవిత్రములను, ఆయామతములను, భుగ్నములను కట్టుకొనవలెను. కూర్చలను 16, లేక 12, లేక 8 దర్భలతో కట్టుకొనవలెను. ఆనాడు జరుగు ఏకోద్దిష్టమునకు మాత్రము ఆయామతములను, పవిత్రములను, భుగ్నములను ఒక్క తెల్లుగడ్డిపోచతోడనే కట్టుకొనవలెను.కూర్చలను బేసి సంఖ్యగల తెల్లుగడ్డి పోచలతో గట్టుకొనవలెను.

7. విచ్ఛిన్నాపాసనాగ్నిసంధానములో పవిత్రములను, ఆయామతమును రెండేసి దర్భలతో కట్టవలెను. కూర్చము, పరిస్తరణలను 16 దర్భలతో చేయవలెను. హోమపాత్రలు కఱ్ఱతో చేసినవి గాని, చిన్న చిన్న గిన్నెలు గాని, మోదుగ దొప్పలు గాని ఉండవచ్చును. దర్వు లకై మోదుగాకులను వాడవలెను. (గమనిక: 1. విచ్ఛిన్నాపాసనాగ్నిసంధానములో వాడిన పరిస్తరణములను, కూర్చను, పవిత్రములను సపిండీకరణములో వాడుకొన రాదు. 2. సపిండీకరణములో వసు రుద్రాదిత్య బ్రహ్మావాహనకు, ఆత్మసమారోపణ, సాత్త్విక త్యాగములకు విచ్ఛిన్నాపాసనాగ్నిసంధానములో వాడిన పవిత్రములను వాడుకొన వచ్చును.)

8. సపిండీకరణమందు పవిత్రములను 3 దర్భలతో కట్టవలెను. ఖుగ్నమును 3 లేక 5 దర్భ లతో కట్టవలెను. కూర్చను 9 దర్భలతో గట్టవలెను. కాని ప్రేతనిమిత్తునికి మాత్రము పవిత్ర మును, ఖుగ్నమును ఒక దర్భతోనే కట్టవలెను. షట్పాత్రప్రయోగములో రెండుదర్భల పవిత్రమునే వాడవలెను. పరిస్తరణలను పదహారేసి దర్భలతో చేయవలెను. దర్వులు, హోమపాత్రలు, పనస, లేక మోదుగాకులతో చేసినవి వాడవలెను. కాని మామిడాకులు, రావియాకులు, కఱ్ఱ లేక లోహముతో చేసినవి వాడగూడదు.

~~~
~~~

[redacted]

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 28 | 1 | ప్రాయశ్చిత్తమ్ | ప్రాయశ్చిత్తమ్ |
| 29 | 2 | ఓం సువస్స్వాహా | ఓగ్ం సువస్స్వాహా |
| 27 | 7 | కల్పయ | కల్పయ |
| 36 | 19 | ఓం సువస్స్వాహా | ఓగ్ం సువస్స్వాహా |
| 40 | 16 | ఓం సువస్స్వాహా | ఓగ్ం సువస్స్వాహా |
| 55 | 14 | సహస్రాక్షస్ సహస్ర | సహస్రాక్షస్సహస్ర |
| 69 | 15 | ఓగ్ సువః | ఓగ్ం సువః |
| 69 | 15 | ఓగ్ సత్యమ్ | ఓగ్ం సత్యమ్ |
| 146 | 17 | దేవాగ్ | దేవాగ్ం |
| 161 | 1 | లోహితమానడుహం | లోహితమనడుహం |
| 210 | 8 | ద్విజోత్తమాః | ద్విజోత్తమ |
| [redacted]15 | 10 | భుఙ్క్వైశ్వ | భుఙ్క్ష్వ విశ్వ |
| [redacted]30 | 6 | మహ | మహి |
| [redacted]30 | 7 | వస్త్రమ్మూల్యమ్ | వస్త్రామ్మూల్యమ్ |
| [redacted]1 | 7 | ఓం సువస్స్వాహా | ఓగ్ం సువస్స్వాహా |
| [redacted]3 | 2,12 | పఙ్క్త్రాధసే నమః | పఙ్క్తిరాధసే నమః |
| [redacted]2 | 9 | పిత్ రర్ఘ్యపాత్రే | పిత్రర్ఘ్యపాత్రే |
| [redacted]3 | 4 | విహితా | విహితాః |
| [redacted] | 19 | స్వస్వ చ | స్వస్య చ |
| 283 | 13 | ఓం సువస్స్వాహా | ఓగ్ం సువస్స్వాహా |
| 284 | 13 | అగ్నైశ్య | అగ్నై |
| 293 | 8 | ప్రవేస్య | ప్రవేశ్య |
| 297 | 2 | విమాన చ్ఛాయాయం | విమానచ్ఛాయాయాం |
| 298 | 19 | ప్రియతామ్ | ప్రీయతామ్ |
| 299 | 6 | భుఙ్క్వైశ్వ | భుఙ్క్ష్వ విశ్వ |
| 305 | 3 | దగ్ధాశ్ చ | దగ్ధాశ్చ |
| 325 | 13 | త్రిపురుషోద్దే శేన | త్రిపురుషోద్దేశేన |
| 327 | 22 | మాతుః | మాతృ |
| 345 | 8 | మన్యస్ వ | మన్యస్వ |

అంతటను "ఉపవీతి", "ప్రాచీనావీతి" అని [redacted]పదములను "ఉపవీతి", [redacted] - [redacted]కొనగలరు.

ఓం
శ్రీ లక్ష్మీ హయగ్రీవాయ నమః

# అపరప్రయోగచన్ద్రికా


సంకలనకర్త

డా. తిరుమల కృష్ణదేశికాచార్యులు



శ్రీజయలక్ష్మీ పబ్లికేషన్స్

ప్లాట్ నం: 97 & 98c, వెస్టర్న్ హిల్స్, జలవాయు విహార్
రోడ్, కూకట్ పల్లి, హైదరాబాదు- 500072